తెలుగు అకాదమి ప్రచు  (బి ఏ.)-108

# తెలుగు భాషా చరిత్ర-
# తులనాత్మక పరిశీలన

రచయిత్రులు

ఆచార్య నాయని కృష్ణకుమారి, ఎం ఏ.,పిహెచ్.డి.
ప్రొఫెసర్, తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం

డా॥ తమ్మారెడ్డి నిర్మల, ఎం ఏ.,పిహెచ్.డి.
రీడర్, తెలుగుశాఖ, నాగార్జున విశ్వవిద్యాలయం

సంపాదకులు

ఆచార్య తూమాటి దొణప్ప, ఎం.ఏ.,పిహెచ్.డి.
ప్రొఫెసర్, తెలుగు శాఖ, నాగార్జున విశ్వవిద్యాలయం




తెలుగు అకాదమి
హైదరాబాదు
1984

B.A. telugu bhaasaa caritra : tulanaatmaka pariśiilana; *Authors:* Prof. Nayani Krishnakumari & Dr Tammareddy Nirmala; *Editor:* Prof. Tumati Donappa. First Edition, 1984, PP X + 276 + 4.



*First Edition, 1984*
Copies : 1000

Published by TELUGU AKADEMI, Hyderabad-500 029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level of Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



Price : Rs. 15-00




PRINTED IN INDIA
Text at Padmavathi Art Printers, Hyderguda, Hyderabad-500 001.
Cover at Vecon Printers (P) Ltd, Secunderabad-500 017.
Andhra Pradesh

# భూమిక

1968 లో స్థాపన జరిగిన నాటినుంచి ఉన్నతస్థాయిలో బోధన భాషగా తెలుగు కుదురు కొనటంలో తెలుగు అకాడమి నిర్వహిస్తున్న పాత్ర అందరికీ విశదమైనదే. ఎన్నో రకాల ఇబ్బందులను అధిగమిస్తూ అత్యల్ప వ్యవధానంలో విస్తృతంగా పాఠ్య, పఠనీయ, అనువాద, పరామర్శ గ్రంథాలను ప్రచురించి అకాడమి విద్యారంగానికి సముచితమైన సేవ చేయగలిగింది. అకాడమి ప్రచురణలు ఎన్నో పునర్ముద్రణ కూడా పొందినవి. పునరభ్యసన గోష్ఠులద్వారాను, విద్యార్థులు, విద్యాధికులు, ఉపాధ్యాయులు ఆసక్తితో చేస్తున్న సూచనలద్వారాను ఎప్పటికప్పుడు ఈ గ్రంథాలను మెరుగుపరచటంలో కృషి జరుగుతూనే వచ్చింది.

పుస్తకం ప్రకటించటంలో మాకు సహాయపడిన ఆచార్య నాయని కృష్ణకుమారి, ఎం.ఏ., పి.హెచ్‌డి. (ప్రొఫెసర్, తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం), డా॥ తమ్మారెడ్డి నిర్మల, ఎం.ఏ., పిహెచ్.డి. (రీడర్, తెలుగు శాఖ, నాగార్జున విశ్వవిద్యాలయం), ఆచార్య తూమాటి దొణప్ప, ఎం.ఏ., పిహెచ్.డి. (ప్రొఫెసర్, తెలుగు శాఖ, నాగార్జున విశ్వవిద్యాలయం) గార్లకు మా కృతజ్ఞతలు. రేఖాపటాలు గీసిన చిత్రకారులకు, ముద్రాపకులకు, కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మ సిద్ధంచేసిన లిపి పరిణామ పటం బ్లాకు లిచ్చి మాకు తోడ్పడిన తెలుగు భాషాసమితివారికి (ముఖ్యంగా శ్రీ వై. ఆంజనేయులు గారికి) మా కృతజ్ఞతలు.

గ్రంథరచనా కాలానికి తెలుగు మాండలికాల మీద అయిదే పుస్తకాలను అకాడమి ప్రచురించిందని ఈ గ్రంథ రచయితలు పేర్కొన్నారు (చూ. పేజీ 117). నేటికి ప్రచురితమైన మాండలికాల సంఖ్య ఏడు. మరో నాలుగు ముద్రణలో ఉన్నాయని మనవి చేస్తున్నాం.

ఈ పుస్తకాన్ని ఇంతకంటే సమగ్రంగాను, సుందరంగాను తీర్చిదిద్దటానికి సహృదయంతో సూచనలిస్తే మేం కృతజ్ఞతతో స్వీకరించగలం.

# ప్రవేశిక

పట్టపరీక్ష నిమిత్తం తెలుగును ఐచ్ఛిక విషయంగా గ్రహించి చదువుకునే విద్యార్థుల ఉపయోగంకోసం ఈ గ్రంథాన్ని రూపొందించడం జరిగింది. తెలుగు భాషకు సంబంధించిన విషయాలు ఈ పుస్తకంలో పొందుపరచబడ్డాయి. ఆ విషయాలను రెండు భాగాలుగా వింగడించడం జరిగింది. ఇందులో మొదటి భాగాన్ని రచించినవారు ప్రొఫెసర్ నాయని కృష్ణకుమారి. ఇందులో వీరు తెలుగు భాష చరిత్రను వర్ణనాత్మకంగా తెలియజేశారు. అందుకోసం అవసరమైన భాషా సామాన్య లక్షణాలను తొలుతగా వివరించి, ఆ మీదట తెలుగు భాషకు సంబంధించిన నిర్మాణ విశేషాలను చెప్పడానికి వీరు పూనుకున్నారు.

భాషోత్పత్తి, ఆంధ్ర తెనుగు తెలుగు పదాల చరిత్ర వ్యాప్తి, తెలుగు భాష – యుగ విభజన, తెలుగు లిపి పరిణామం, తెలుగు ధ్వనులు – ఉత్పత్తి, తెలుగు వర్ణపరిణామం, ధ్వనుల మార్పు, సంధి, పదనిర్మాణశాస్త్రం, మాండలిక విజ్ఞానం, అర్థవిజ్ఞానం, వాక్యరచన, తెలుగు వ్యాకరణాలపై సంస్కృత ప్రభావం, ద్రావిడ భాషలలో తెలుగుకు కల స్థానం – ఈ అంశాలన్నీ స్పష్టంగా, మొదటి భాగంలో వివరింపబడ్డాయి. ఇందువలన తెలుగు భాషకు సంబంధించిన నిర్మాణ విశేషాలు విద్యార్థి చక్కగా గ్రహించడానికి వీలు కలుగుతుంది.

రెండవ భాగాన్ని రచించినవారు డాక్టర్ టి. నిర్మలగారు. తెలుగు ఏ కుటుంబానికి చెందిన భాషగా నిర్ధారింపబడ్డదో, ఆ ద్రావిడ కుటుంబ భాషలకూ, తెలుగుకూ గల సంబంధాన్ని తులనాత్మకంగా వివరించడానికి నిర్మలగారు పూనుకున్నారు.

ఈ భాగంలో ద్రావిడ పదవ్యాప్తి, ద్రావిడ భాషల పరిగణన, సాజాత్య చర్చ, ద్రావిడ భాషల ఏక కుటుంబత, వాటి ప్రాచీనత, మూల ద్రావిడ భాషా ప్రతిబింబం, ద్రావిడ భాషా లిపులు, వాటి వర్ణపరిణామాలూ, పదనిర్మాణశాస్త్రం వివరింపబడ్డాయి. ఈ భాగంవలన విద్యార్థికి తెలుగు భాషను ద్రావిడ భాషా కుటుంబంతో పోల్చి తులనాత్మకంగా చదివే పద్ధతి అలవడుతుంది.

రచయితలు తమ తమ భాగాలకు సంబంధించిన విషయాలను విశ్లేషిస్తున్నప్పుడు, ప్రసక్త విషయ ప్రాధాన్యాన్ని దృష్టిలో ఉంచుకుని, ఇద్దరూ ఒకే విషయాన్ని చర్చించే అవసరం ఏర్పడడం కనిపిస్తున్నది. అటువంటిచోట్ల

పునరుక్తి అనిపించినా, సందర్భాన్నిబట్టి వాటిని ఆయా స్థలాలలో వివరించడం తప్పనిసరి.

ఈ పుస్తకంవలన విద్యార్థికి (1) ఏ భాషకైనా అన్వయించగల సామాన్య సూత్రాలూ, కొన్ని నిర్ణాయక సూత్రాలూ, (2) తెలుగు భాష యొక్క చారిత్రక పరిణామమూ, వర్ణనాత్మక విశ్లేషణమూ, (3) ద్రావిడ కుటుంబానికి సంబంధించిన సామాన్య నిర్మాణ విశేషాలూ, (4) తెలుగులో ఆ కుటుంబ భాషలకు గల తులనాత్మకతా స్పష్టమౌతాయి.

పై నాలుగు అంశాలలోనూ మౌలిక లక్షణాలను అవగతం చేసుకున్న విద్యార్థి, స్నాతకోత్తర స్థాయిలో భాషాధ్యయనం చేయడంలో సౌలభ్యాన్ని పొందగలడు. అటువంటి ధ్యేయాన్ని ఈ పాఠ్యపుస్తకం సాధిస్తుందనడంలో సందేహమూ లేదు.

# విషయసూచిక

## మొదటి భాగం

### (చారిత్రక విభాగం)



## రెండో భాగం

### (తులనాత్మక విభాగం)

# 1

# భాషోత్పత్తి - వివిధ వాదాలు

## భాషోత్పత్తి

అనేక విధాలయిన జీవజాలంతో నిండిన యీ ప్రపంచంలో మనుష్యుని జంతువునుండి వేరు చేయగలిగిన ముఖ్య విషయాల్లో ఒకటి భాష. భాష్ అనే ధాతువుకు అర్థం మాట్లాడడం. మాట్లాడడ మనేది ఆలోచనాధీనమైన ప్రక్రియ. ఆకలి దాహం నిద్ర వంటివి ప్రేరణవల్ల కలిగేవి. వాటిని నియమించడం మనిషికి సాధ్యం కాదు. ప్రేరణలన్నీ మనిషికీ జంతువుకూ ఒకే విధంగా ఉంటాయి. వీటికి భిన్నంగా ఆలోచనల వలన మనిషి కల్పించుకునే భాషాప్రక్రియ మనుష్య జాతికీ, మనుష్యేతర జాతికీ మధ్య అంతరాన్ని సృష్టించగలుగుతున్నది. పరిసరాల ప్రభావం వల్లా, ఆకలి, దాహం వంటి అసంకల్పిత చర్యల వల్లా, మనోజన్యాలయిన ఉద్రేకం, కోపం, భయం వంటి ప్రతీకార చర్యలవల్లా మనుష్యుని మెదడులో పుట్టే ఆలోచనల్ని బహిర్గతంచేసే ప్రక్రియే భాష.

వ్యక్తి పంచేంద్రియాల సహాయంతో సృష్టిలోని వివిధ వస్తువుల్నీ వాటి గుణాల్నీ గ్రహించ గలుగుతున్నాడు. దీన్ని మనం ''గ్రాహకత" (Perception) అందాం. అలా గ్రహించిన విషయాన్నీ దానికి సంబంధించిన విషయేతరాలనీ కలగలిపి ఒకచోట చేర్చి వాటిని మెదడులో తిరిగి ముద్రించుకునే విధానాన్ని భావుకత (Conception) అందాం.

ఉదాహరణకు 'చదువుకోవడం' అనే విషయాన్ని తీసుకుంటే కేవలం కాగితాలూ వాటి మీద ఉండే అక్షరాలూ మాత్రమే అక్కడ చదువుకోవడం కాదు. వాటికి తోడు విషయ గ్రహణంలో గ్రాహకుడు పొందే కష్ట సుఖాలూ, అధ్యాపకుడి నేర్పరితనం, పరీక్షలు, తరగతిలో గోల, ఇటువంటి విషయాలు, చదువుకోవడానికి సంబంధించినవి, గుదిగొని ప్రత్యక్షమవుతాయి. అప్పుడు వీటన్నిటి సారాంశ స్వరూపమే చదువుకోవడం అనే భావనకు రూపాన్ని ఇవ్వగలుగుతుంది. అందువలన వేర్వేరు భావనలను (Concepts) కలగలపడం, వేరు చేయడం వంటి పనిని గ్రాహకుడు నిర్విరామంగా చేస్తూనే ఉంటాడు. "రాముడు చదువుకుంటున్నాడు'' అనే భావనను ఉదాహర్ణగా గ్రహిస్తే ఇక్కడ రాముడు అనే భావన యొక్క ప్రత్యేకతను స్థాపించడానికి, దాన్ని కృష్ణుడు, వెంకయ్య, లలిత, జయంతి వంటి భావనల నుండి వేరు చేయాలి. అదేవిధంగా చదువుకోవడం అనే భావనను తినడం, పరుగెత్తడం, నవ్వడం, నిద్రపోవడం వంటి క్రియాత్మకమైన భావనలకంటే ప్రత్యేకమైనదిగా గుర్తించాలి. ఈ రకంగా సంశ్లేషణ, విశ్లేషణల చేత నిర్ణయింపబడిన ప్రత్యేక భావనల సమాహారమే రాముడు చదువు

కుంటున్నాడు అనే భావన. మెదడులో ఆయా సమయాల్లో ముద్రించబడే అనేక గ్రహణాల (Percepts) ను ఎప్పటి కప్పుడు గుర్తించగలుగుతూ వాటిని సంశ్లేషణ విశ్లేషణల చేత భావనలు (Concepts)గా మార్చే నిరంతర చర్య ఆలోచన. భాష ఈ తర్కమైన ఆలోచనల వలన ఉత్పన్నమయిన శక్తివంతమైన ప్రక్రియ. ఈ ఆలోచనాశక్తి జంతువులకు లేదు.

మనిషి మెదడులో రూపుదిద్దే భావనలను అతడు రెండు విధాలుగా వెల్లడి చేయగలడు. అవి (1) భాషేతర విధానం (2) భాషా విధానం. భాషేతర విధానం భాషా విధానం కంటే ముందు పుట్టింది.

## భాషేతర విధానం

భాషా విషయాలను చర్చించుకునేటప్పుడు భాషేతర విధానాన్ని పరిశీలించడం ఉచితమా అనే ప్రశ్నకు ఆస్కారముంది. భాషేతర విధానానికిగానీ, భాషా విధానానికిగానీ ధ్యేయం ఒక్కటే. అది భావనను వెల్లడి చేయడం. అదిగాక, ఏ భాషకైనా, అది యెంత పరిణత స్థితిలో ఉన్నా దానితో అంగ విక్షేపం (gesture) జతగూడే ఉంటుంది. ఎవరైనా ఒక ప్రశ్న వేస్తే, వక్త అవునని చెప్పానే తోడుగా తల ముందుకు కదిలిస్తాడు. రమ్మంటూ చేతులు ఊపడం, కోపంతో మాట్లాడుతూ పెదవులు వంకరచేసి ముఖం వికృతం చేసుకోవడం, ఇవన్నీ అంగ విక్షేపాత్మక చర్యలే. ఇవి భాషతో పాటు సరి నడకలు నడుస్తూ ఇంత నాగరక దశలో కూడా దానిని అంటి పెట్టుకునే ఉన్నాయి.

అంతేగాక మనుష్యజాతి చారిత్రక పరిణామాలను గమనిస్తే ప్రాక్ చారిత్రక దశలో మనుష్యుడు నోటినీ ముక్కునూ కేవలం తిండి తినడానికీ గాలి పీల్చడానికీ మాత్రమే ఉపయోగించేవాడు. భాషోత్పాదన ఆ అంగాలకు తరువాత అలవడిన లక్షణం. అందువల్ల తొలినాట భాషేతర విధానమే అభిప్రాయ నివేదనకు ఉపయోగ పడుతుండేది. అదే ఈ నాటికీ భాషకు సహాయకారిగా నిలుస్తూ ఉంది. అందువల్ల ఈ విధానాన్ని గురించి తెలుసుకోవడం అప్రస్తుతం కాకపోగా, దీన్ని విడిచి పెడ్తే భాషాచరిత్ర పరిశీలనం అసమగ్రమనిపించుకోవచ్చు.

భాషేతర విధానం ద్వారా, భావ వ్యక్తీకరణలో బొమ్మలు, రంగులు, వెలుతురు, శబ్దం మొదలైనవి ఉపయోగపడతాయి.

(i) *బొమ్మలు :* ఆది మానవుని గుహా చిత్రాలు, అక్షరాలకు బదులుగా సంకేతాలుగా ముళ్లు వేసిన త్రాళ్లు, చెక్కబద్దల వంటి బొమ్మలు ఆనాడు భావ వ్యక్తీకరణ చేస్తుండేవి. ఈనాడు కూడా రోడ్డు నియమాలు పాటించడానికి బొమ్మలే ఆధారంగా నిలుస్తున్నాయి. పరిగెత్తే పిల్లవాడి బొమ్మ పాఠశాలనూ, రైలుబండి బొమ్మ లెవెల్ క్రాసింగునూ తెలియజేస్తాయి. అక్షరాస్యత పూర్తిగా ఉండి, బాగా అభివృద్ధి చెందిన అమెరికా వంటి దేశాలలో కూడా ఈ బొమ్మలు వాడడం వెనుక బట్టలేదు.

(ii) *రంగులు :* శత్రువుతో సంధి సూచనగా ఎగరవేసే తెల్లని జండా ఆనాడు అభిప్రాయ నివేదనం చేయగలిగింది. రైలు గేటు దగ్గర ఎర్రదీపం ఈనాడు వాహన గమనాన్ని ఆపుతుంది. పచ్చజండా నిలుచున్న రైలు బండిని కదిలిస్తుంది.

(iii) *వెలుతురు :* అడవుల మధ్య రగిల్చిన అగ్నిజ్వాలలు ఆనాటి మానవులకు ప్రత్యేక సమాచారాన్ని అందించేవిగా ఉండేవి. ఈనాడు లైట్‌హౌస్ వెదజల్లే కాంతి రేఖలు తీరస్థ జనావాసాల్ని తెలియజేస్తాయి.

(iv) *శబ్దం :* ప్రాచీన మానవుడు పెట్టిన పొలికేకలలో విజయ గర్వం వెల్లడించబడేది. ఈనాడు ఎడతెగక మోగే సైరన్ మోత కర్మాగారాల ప్రారంభ, విరామ సమయాలను తెలియజేస్తుంది.

పై సందర్భాలలో ఎక్కడా భాష వాడుకలేదు. కాని భావ వ్యక్తీకరణం జరుగుతున్నది. ఈ పద్ధతే కాక, ధ్వని విరహితాలయిన తలయూపు, చేతుల కదలిక, కనుబొమల ఎగురవేత వంటివి కూడా ఎదుటి మనిషికి నిర్దిష్టాభిప్రాయాన్ని అందించేవే. వీటినే అంగ విక్షేపమని పిలుద్దాము. ఆంగిక చాలనం ద్వారా అభిప్రాయాన్ని అందించడమనేది తొలి మనిషిలోనే కాక జంతువుల్లోనూ పక్షుల్లోనూ కనిపిస్తుంది. ముక్కులు రాచుకుంటూ ప్రేమను వెల్లడించుకునే పక్షులు, రకరకాల చేష్టలద్వారా యజమాని పట్ల తమ విశ్వాసాన్ని చాటుకునే శునకాది జంతువులు, ముఖాలు మోటించుకుని, సంకేతాలను అందించుకునే చీమలు నిత్యం మనం చూస్తున్నవే. తిర్యక్కుల్లో కనిపించే ఈ గుణాన్ని మనిషి జంతు దశనుండి తన వెంట తెచ్చుకుని, దానిద్వారా అభిప్రాయ నివేదనం ఈ నాటికీ చేసుకుంటూనే ఉన్నాడు.

శాస్త్రజ్ఞులు ఆంగికచాలనాన్ని శాస్త్రబద్ధంగా వివరించడానికి పూనుకున్నారు. ఒక విషయాన్ని మెదడు గ్రహించగానే ఆ గ్రహణ చర్యతో పాటు సమానంగా బహిరింద్రియాలలో 'చాలక చర్య' (Motor Action) ఆరంభమౌతుంది ఇది కొంతవరకూ అసంకల్పిత చర్య (Involuntary Action). ఉదాహరణకు తప్పు చేసిన పిల్లవాడు తల్లిని ఎదురుగుండా చూడగానే కాళ్ళకు బుద్ధిచెప్పి పరుగెత్తి పోతాడు. ఇక్కడ తల్లిని చూడడం అనేది గ్రహణం. ఆవిడకు పట్టుపడకుండా ఉండాలనే భావం మెదడులో స్థిరపడ్డాక బహిరింద్రియాలయిన కాళ్ళలో చాలక చర్య ఆరంభమవుతుంది. వెంటనే పిల్లవాడు పరిగెత్తి పోతాడు. పారే వాగులో నీటి చల్లదనం అనుభూతం కాగానే అనుకోకుండానే చేతులు నీటిలో మునిగి ఆ నీటిని వెదజల్లడం, తొలి చినుకుల వల్ల భూమి తడిసి మట్టి వాసన చుట్టుకోగా నోరు తెరిచి గట్టిగా ఊపిరి లోపలికి పీల్చుకోవడం, ఇవన్నీ చాలక చర్యలే. ఇదే విధంగా ముఖేంద్రియ భాగాలయిన గొంతు, పెదవులు, నాలుక, దౌడలు, దంతాలు మొదలయినవి మెదడులో గ్రహణం జరిగినపుడు చాలక చర్యలు ఆరంభించడంతోనే భాష యొక్క తొలి

అవస్థకు నాంది-వాచనం జరిగింది. ఇదే భాష తొలి అంగంగా భాసించే అంగ విక్షేపాత్మక భాష (gestural language). దీని తరువాత రూపు చెందిన మరో పద్ధతి చిత్ర-లిపి భాష (Pictographic language). ఇది ఎదుటలేని వారికి భావ వ్యక్తీకరణం చేసే పద్ధతి. మరో విధంగా చెప్పాలంటే ఇది లేఖన పద్ధతి. దీనికీ, సాంప్రదాయకమైన లేఖన శాస్త్రానికీ (Traditional Orthography) చాలా-భేదం ఉంది. లేఖన శాస్త్రం ఏ భాషకైనా కొన్ని వేల సంవత్సరాల తర్వాత ఏర్పడుతుందని శాస్త్రవేత్తల అభిప్రాయం. అంటే వాగ్వ్యవహారం ముందూ దాని లేఖన రూపం తర్వాతా, పరిణామ క్రమంలో ఏర్పడతాయి. ఇది హృదయ గత భావనకు లిఖిత రూపమైన సంకేతమే కాని ధ్వని రూపమైన వాగ్వ్యవహారాన్ని తెలియ జేసేది కాదు. అందుకు భిన్నంగా లేఖన శాస్త్రం (Orthography) వాగ్వ్యవహారంలో ఏ ధ్వనులు భావస్ఫోరకాలై ఆవిష్కృత మౌతాయో ఆ ధ్వనుల్ని అక్షర రూపంలో తెలియ జేస్తుంది. అనగా చిత్రలిపి పద్ధతిలో లేఖనం భావనకు సంకేతం కాగా, లేఖన పద్ధతిలో తీర్చబడిన అక్షరాలు వాగ్వ్యవహారంలోని ధ్వనులకు సంకేతం. చిత్ర లిపి పద్ధతి ముందూ లేఖన పద్ధతి దానికి వెనుకా ఉద్భవించాయనడంలో సామంజస్యం ఉంది. ప్రతి అభి ప్రాయ నివేదనానికీ ఈ రెండు రకాలయిన లేఖన పద్ధతులూ ఉంటాయి. ఇందులో మొదటిది భాషేతర విధానానికి చెందగా, రెండవది భాషా విధానానికి చెందు తుంది.

## భాషా విధానం

భాషేతర పద్ధతి ప్రాచీన మానవుని చేత అనుసరింపబడుతున్న కాలం లోనే చాలక చర్యల ఫలితంగా భాష పుట్టడానికి వీలు ఏర్పడిందని తెలుసు కున్నాము. ముఖ యంత్రాంగాలు ఉత్పాదించే ధ్వని క్రమంగా వర్ణాలుగానూ, పదాలుగానూ ఏర్పడి, పదాల మధ్య ఒక నియతి సృష్టింపబడి, భాషా విధానం రూపు దిద్దుకున్నది. ముఖ యంత్ర సహాయంవల్ల ఒక భాషలో వర్ణాలుగా గుర్తింపబడిన ధ్వనినే శాస్త్రజ్ఞులు భాషా ధ్వనిగా అంగీకరించడం జరిగింది. ఈ రకమైన భాషా నిర్మాణం మానవ సమూహానికంతటికీ ఒకే విధంగా లభించ లేదు. అది భిన్న భిన్న ప్రదేశాలలో రకరకాలుగా కనిపిస్తుంది. ఇంత వైవిధ్యం గల భాషా విధానం మానవ జాతికి లభ్యమైన పద్ధతిని గూర్చి ఇంచు మించు అన్ని జాతుల ప్రాచీన మత విశ్వాసాలలోనూ ఊహలు చెలరేగాయి. మత విశ్వా సాలన్నీ సృష్టిని తీర్చిదిద్దిన వాడు భగవంతుడనీ అతడే భాషను కూడా సృష్టించి మనుష్యునికి ధారాదత్తం చేశాడనీ అభిప్రాయ పడుతున్నాయి. హైందవ సంప్ర దాయాన్ని బట్టి భాషాధి దేవత సరస్వతి. ఆవిడే వాగ్దేవి. తొలి మత గ్రంథా లయిన వేదాలు సృష్టి కర్తకు నాలుగు ముఖాలు. సంస్కృతం దేవతలు మాట్లాడు కునే భాష. అదే విధంగా, మహమ్మదీయులు అరబ్బీ భాషను, క్రైస్తవులు హిబ్రూ భాషను దేవ భాషలుగా పేర్కొన్నారు. ఒక స్వీడిష్ భాషావేత్త 17వ

శతాబ్దంలో కూడా భాష దైవ దత్తమనే అభిప్రాయాన్ని వెలిబుచ్చడం జరిగింది. ఈడెన్ తోటలో ఆదాముతో భగవంతుడు స్వీడిష్ భాషనే వాడినట్లుగా ఆయన వాదించాడు.

రాను రాను భాష పుట్టుకను గూర్చి తాత్త్విక చర్చలు ఎన్నో జరిగాయి. మన దేశంలో నైయాయికులు పదానికి ఈశ్వరదత్తమైన శక్తి ఉన్నదనీ, పదానికీ అర్థానికీ ఉండే ఈ సంబంధం ఈశ్వరేచ్ఛా కల్పితమనీ అభిప్రాయ పడ్డాడు. స్ఫోటవాదులు శబ్దం బ్రహ్మమనీ దానికీ పరబ్రహ్మకూ స్వరూప మొకటే అనీ, పదానికీ అర్థానికీ ఉండే సంబంధం నిత్యమూ అనాద్యమూ అని నిర్ణయించారు. వ్యాకరణవేత్తలు మాత్రం పదానికీ అర్థానికీ మధ్య ఉండే సంబంధం మానవ సంకేత జనితమే అని నిర్ణయించుకున్నారు.

మీమాంసకుల్లో ఒక తెగవారు శబ్దార్థ సంబంధాలను బోధించే అభిధా లక్షణా వ్యంజనా శక్తులతో పాటు తాత్పర్య శక్తిని కూడా నిర్ణయించి దీనికే శబ్దార్థాలను కలిపి ఉంచే శక్తి ఉన్నదని వివరించారు.

భారతదేశంలో ప్రాచీన లాక్షణికుల మతం ఇలా ఉండగా పాశ్చాత్య ప్రపంచంలో ఛార్లెస్ డార్విన్ భాషోత్పత్తికి ఈ క్రింది కారణాన్ని ప్రతి పాదించాడు. ముఖ యంత్రాంగాలు, అంగ విక్షేపాలను అసంకల్పితంగానే అను కరించడం వల్ల భాష ఉద్భవించి ఉంటుందని ఆయన అభిప్రాయం.

గ్రీక్ తాత్త్వికులు, పైథాగరస్, ప్లేటోలు, ఇద్దరూ భాష పుట్టుకకు కారణంగా స్వభావ వాదాన్ని (Theory of inherent necessity) ప్రతి పాదించారు. మనుష్యుడు నాగరకత వైపుకు పయనిస్తున్న కొద్దీ అవసరాన్ని బట్టి సహజంగా, అనాయాసంగా భాషను తనకు తానుగా ఏర్పరచుకొన్నాడన్నది ఈ వాదం యొక్క సారాంశం.

డెమొక్రటిస్, అరిస్టోటల్‌లు ఇద్దరూ అన్వయ వాదాన్ని (Theory of Agreement) ప్రతిపాదించారు. అవసరార్థులయిన ఆదిమ మానవులు గుంపులు గుంపులుగా ఒకచోట చేరి ఈ భావానికి ఈ ధ్వనిరూపమైన సంకేత ముండాలని అన్వయాన్ని స్థిరపరచుకున్నట్లుగా ఈ వాదం ప్రతిపాదిస్తుంది. అయితే కేవలం సమావేశ సమయాల్లో మాత్రమే అటువంటి సంకేతాలు ఎలా రూపు చెందాయన్నది సమాధానం లేని సందేహం.

ఇట్లాగే భాషాధ్వనులకూ, భావాలకూ లంకె ఎట్లాఏర్పడిందనే విషయం మీద ఎన్నో వాదాలు వెలుగులోకి వచ్చాయి.

## వివిధ వాదాలు

1. *బౌ-వౌవాదం:* దీనికి మరో పేరు ధ్వన్యనుకరణ వాదం. మాక్స్ ముల్లర్ ఈ వాదంలో అవ్యాప్తి దోషాన్ని గుర్తించాడు. కుర కుర లాడే బాతులూ, కొక్కరించే కోళ్ళూ ఉన్నచోట మాత్రమే ఈ వాదం పని చేస్తుంది

గాని, వాటిని దాటి అవతలికి పోతే అంతా వ్యర్థమే అని హేళనాత్మకంగా దీనికి పై పేరును స్థిరం చేశాడు. ఈ వాదాన్ని నిలువబెట్టే ప్రముఖాంశం అనుకరణం. సృష్టిలో ప్రతి ప్రాణికీ అనుకరించే గుణం ఉంటుంది. ప్రకృతిలో ఉన్న సహజ ధ్వనుల్ని అనుకరించి మనుష్యుడు భావ ప్రకటన కొరకు భాషను నిర్మించుకున్నా డన్నది ఈ వాదం యొక్క సారాంశం. కాకా అనే పక్షికి, ఒక భాషలో సంకేతం కాకి. మరో భాషలో కాకం. కూ కూ అనే పక్షిని ఆంగ్లంలో కుక్కూ అంటారు. అదే విధంగా భే అనేది భేకం; మే అనేది మేక; మియావ్ అనేది పిల్లి. ఈ అరుపులన్నీ వివిధ భాషల్లో ఆయా జంతువుల కేర్పడిన పేర్లు. అదే విధంగా బౌ, వౌ అనేది కుక్కకు సంకేతం కావచ్చు. ఈ వాదంలో కొన్ని లోపాలున్నాయి.

(1) సృష్టిలో ఉన్న వస్తు చయమంతా ధ్వని పూర్వకమైనది కాదు. గోడ, ఇల్లు, కర్ర, నేల వంటివి ఎన్నో శబ్దాలకు ధ్వనితో సంబంధం లేదు. వీటికి సంబంధించిన సంకేతాలు, ఈ వాదం యొక్క బలంతో పుట్టాయనడం కుదరదు.

(2) సృష్టిలో ఉండేధ్వనులు అందరికీ ఒకేరకంగా వినిపించక పోవచ్చు. ఒకరికి కొక్కొరోకో అని వినిపించే కోడికూత మరొకరికి 'చిచ్చిరీ చీ' అని వినిపించవచ్చు. ఒక్కొక్కరికి ఒక్కో విధంగా వినిపించే ధ్వనుల్ని ఆధారంగా చేసుకుని అందరికీ సమ్మతాలయిన సంకేతాలను ఏర్పరచుకోవడం ఎంతవరకూ సమంజసం ?

*2 పూపూ వాదం :* దీనికి మరో పేరు ఆశ్చర్యార్థక వాదం. ఇది మనస్తత్వ విశ్లేషణం మీద ఆధారపడిన వాదం. సృష్టిలో ఒక్కో వస్తువుకు, ఒక్కో భావానికి, ఒక్కో ధ్వనికి, మనం అన్ని వేళలా వివరించడానికి వీలులేని సంబంధం ఉంటుందని, ఆ ధ్వనే ఆయా వస్తువులకు సంకేతా లేర్పడేటప్పుడు భాషలో ప్రాధాన్యం వహిస్తుందనీ ఈ వాదం సారాంశం. ఉదాహరణకు చకార ధ్వనికీ చెడ్డ తనానికీ,తెలుగులో ఇటువంటి సంబంధం నిర్ణయించవచ్చు. చెడ్డ, చేటు, చెడు, చెట్ట, ఛా, ఛీ, పదాల ఉత్పత్తికి ఈ సంబంధమే కారణం. అదే విధంగా బకార ధ్వనికీ గోళాకార వస్తువులకూ సంబంధాన్ని సూచించవచ్చు. ఈ ధ్వనిని ఉచ్చరించేటప్పుడు పెదవుల్ని రెండింటినీ వలయాకారంలో అతికి, బుగ్గల్ని కొద్దిగా బూరటిల్ల జేసి గాలిని స్ఫోటనం చేయవలసి వస్తుంది. అప్పుడు బుగ్గలు పెదవులు పొందిన ఆకారాన్ని పోలి గుండ్రంగా బూరటిల్ల గలిగే వస్తువుల కన్నిటికీ ఆ ధ్వని సంకేతం అవుతుందని చెప్పడం యుక్తి సహమైన విషయమే. బుట్ట, బూరె, బుంగ, బంతి, బుడ్డి, బుడగ, బోలె, బోడి వంటి తెలుగు పదాలేకాక, బాస్కెట్, బాల్, బాగ్, బౌల్, బన్, బండిల్ వంటి ఆంగ్ల పదాలు కూడా పై పద్ధతివల్ల ఉత్పన్నమైనాయని చెప్పవచ్చు.

ఈ అంశాన్ని వివరిస్తూ జార్జ్ విల్లిస్ అనే భాషావేత్త కొన్ని విచిత్రాంశాలను ప్రతిపాదించాడు. అమాయకులూ నిష్కపటులూ అయిన పసిపిల్లలు కేరింతలు కొడుతూ చేసే 'గి' అనే ధ్వని నుండి Good, God అనే పదాలు ఉద్భవించి ఉంటాయనీ, అట్లాగే నిశ్శబ్దాన్ని సూచిస్తూ పెదవులు బిగించడం వల్ల జనించే మకార ధ్వని, Mute, Mystery, Myme వంటి సంకేతాలు జనించడానికి కారణమైందనీ వివరించాడు. సంస్కృతంలోని మూక శబ్దమూ తెలుగు మూగ శబ్దమూ పై పట్టికలో చేరడానికి అర్హత కలవవుతాయి.

అదే విధంగా ఆశ్చర్యాన్నీ, అసహ్యాన్నీ, కోపాన్నీ సూచించడానికి ఏర్పడ్డ సంకేతాల్లో 'ఫ' కార ధ్వని వినిపిస్తుంది. Fire, Friend, Foul Foe వంటి పదాలు ఆ రకంగా జనించినవే. వీటి మీదుగానే ఈ వాదానికి పూ పూ వాద మనే పేరు స్థిరమైంది.

*3. యోహెహో వాదం :* దీనికీ, పూ పూ వాదానికీ దగ్గర పోలిక లున్నాయి. మనుష్యుడు చేసే పనులకు, ఆయా పనులు చేసే వైఖరిని బట్టి, సంకేతాలేర్పడతాయని ఈ వాద సారాంశం. ఉదాహరణకు బండ్లు లాగేటప్పుడు, బరువులెత్తే టప్పుడు ఊపిరినిబిగించి, నిడివిగా వదలడం కనిపిస్తుంది. అటువంటి బరువైన చేష్టలను వివరించే పదాలను ఉచ్చరించవలసి వచ్చినప్పుడు కూడా అదే విధంగా ఊపిరి వదల వలసి రావడం గమనార్హం. హైలెస్సా, హమ్మయ్య, హాయ్‌రామ్, హాయి వంటి తెలుగులో వాడుకలో ఉన్న పదాలూ, హీవ్, హెవీ, హైట్, హాంగ్, హాపీ వంటి ఆంగ్ల పదాలూ ఇక్కడ ఉదాహరించ దగ్గవి.

*4. డింగ్ డాంగ్ వాదం :* ఇది మాక్స్ముల్లర్ స్వయంగా ప్రతిపాదించిన వాదం. దీనికి నిదానవాద (Pathogenic theory) మని మరొక పేరు కూడా ఉంది. ప్రకృతిలో ఉండే ప్రతి వస్తువులోనూ, అంతర్నిహితంగా ఒక విధమైనలయ (Rhythm)ఉంటుంది. దాని వలన ఆయా వస్తువులు మనుషుల్లో ఒక రకమైన సంచలనాన్ని కలుగజేసే శక్తిని పొంది ఉంటాయి. మనుష్యుడు ఆ సంచలనానికి అనుగుణమైన సంకేతాలనే ఆ వస్తువులకు కల్పించుకుంటాడు. అంటే, జడమూ, చేతనా రహితమూ అయిన రాతి బండలో కూడా ప్రకంపనా లుంటాయని మనం నమ్మితేనే ఈ వాదానికి సార్థక్యం ఉంటుంది. గంటమోగితే దానిలోని ప్రకంపనాలు మనుష్యుడి మనస్సులో డింగ్ డాంగ్ అనే సంకేతాన్ని సృష్టించడం సత్యమయి తేకావచ్చు. కాని గిన్నె బాగా మెరుస్తుంటే, చూచే వాడికి అది 'తళ తళ' అనే సంకేతాన్ని సృష్టించగల ప్రకంపనాన్ని కలిగి ఉంటుంది అని నిర్ణయించడమే ఆలోచించవలసిన విషయం. కనకన, చకచక, భగభగ వంటి ధ్వన్యనుకరణ శబ్దాలూ, పెద్ద పెద్ద కాయలు, మంచి మంచి చీరెలు అనే చోట్ల వచ్చే పునరుక్తులూ, ఈ వాదం వల్ల వివరింపదగిన పదాలు.

*5 సింగ్ సాంగ్ వాదం :* ఈ వాదం, భాషలో ఉండే పదజాలమంతా ఆదికాలపు మంత్రోచ్చారణం మీద ఆధారపడి ఉద్భవించిందని నిర్ణయిస్తుంది.

అయితే ఆ మంత్రాలు ఉద్భవించడానికి అవసరమైన చరిత్ర ఈవాదం స్పష్టం చేయలేదు. దీనికి బలమైన ఉదాహరణల్ని కూడా ప్రతి భాష నుండీ సేకరించడం కష్టం.

*6. టాటా వాదం :* ఇది డార్విన్ అభిప్రాయాన్ని అనుసరించి పుట్టిన వాదం. భాషలో ఉండే పదజాలమంతా ముఖ యంత్రం వలన ఉత్పన్నమౌతున్నది. అయితే ముఖయంత్రాంగాలన్నీ, అంగ విక్షేపాలను, అసంకల్పిత చర్యగా అనుకరించడం వలననే ధ్వన్యాత్మకాలయిన వర్ణాలను, వాటివల్ల పదాలనూ ఉత్పన్నం చేయడానికి సమర్థాలవుతున్నవి అని ఈ వాదం నిర్ణయిస్తుంది. ఉదాహరణకు వక్త ఎదుటి వ్యక్తిని పొమ్మని నిర్దేశించడానికి తన చేతిని, అది ఉన్న స్థానా న్నుండి ముందుకు విసురుగా కదిలిస్తాడు. ఆ కదలికను అనుకరిస్తూ పెదవుల దగ్గర స్ఫోటనం చెందేగాలి పెదవుల్ని విడిచి ముందుకు దూసుకుపోయినప్పుడే 'ఫో' అనే ధ్వని ఉద్భవించి అది భాషాధ్వనిగా మారుతున్నది. అదే, రమ్మన్నప్పుడు, చేతి కదలిక, అది ఉన్న స్థానానికంటే బాగా వెనక్కు కదులుతుంది. 'రా' అన్న ధ్వనిని ఉచ్చరించేటప్పుడు, రకారంతో కూడిన 'అ' కార స్థానం ముఖ యంత్రంలో బాగా వెనకగా ఉంటుంది. దీనిని బట్టి ఉచ్చారణకూ, ఆంగిక చాలనానికీ సంబంధం ఉన్నదనే నిర్ణయించవచ్చు. అందువల్ల ఈ వాదం కొంతలో కొంత యుక్తి సహమైనదిగానే కనిపిస్తుంది.

ఈ విధంగా, పైన పేర్కొన్న వాదాలన్నీ వేటికవి సమగ్రాలు కావు. ఒక్కో వాదం, కొన్ని రకాల పదోత్పత్తికి కారణాలు చెప్తుంది. కాని మొత్తం భాషకంతటికీ సమగ్ర వ్యాఖ్యానం ఇవేమీ చేయలేవు. అయితే భాష అనేది మనుష్యుడికి క్రమానుగతంగా లభించిన అభ్యస్త విషయమే కాని దైవదత్తమైంది కాదు అని ఈ వాదాలన్నీ నిర్ణయించ గలుగుతున్నాయి.

ఇక, భాష యొక్క ప్రాథమిక దశలో అఖండ వాక్యం జనించి, అది ముక్కలు ముక్కలుగా చేయబడి పదాలు ఏర్పడ్డాయా లేక, పదాలే జనించి, అవి అన్వయ క్రమాన్ని ఏర్పాటు చేసుకుని వాక్యంగా రూపు చెందాయా అనే విచికిత్స శాస్త్రవేత్తలలో కొన్నాళ్లు కొనసాగింది. వ్యాకరణ శాస్త్రానికి ప్రథమాచార్యుడైన పాణిని ధాతువాదాన్ని అవలంబించడం జరిగింది. ప్రాతిశాఖ్యాలలో ఇదే అభిప్రాయం కనపడుతుంది. యాస్కాచార్యుడు కూడా భాషనంతటినీ ధాత్వర్థాలను వివక్షించడం వల్లనే వివరించడానికి పూనుకున్నాడు.

ఇప్పటికీ, మనం ఏ భాషను గమనించినా, మధ్యమ పురుష విధ్యర్థక రూపాలు అల్పాక్షరాలతో కూడిన ధాతు రూపాన్నే పొంది ఉండడం కనిపిస్తుంది. అంతేకాక అవి వాక్యాలుగా కూడా వివరింపబడడానికి వీలుంది. ఉదాహరణకు 'విను' అన్నప్పుడు 'విను' అనే ధాతు రూపమూ, 'నీవు నేను చెప్పేది విను' అనే వాక్యార్థమూ రెండూ కనిపిస్తున్నాయి. కాబట్టి ఎదుటి వానితో మాట్లాడడం దగ్గర మొదలైన భాషాప్రక్రియ, తొలుతటి దశలో తక్కువ అక్షరాలతో, ధాతురూపంతో

అభేదంగా ఉండి, వాక్యం బోధించే అర్థాన్నే బోధిస్తూ ఉండి ఉండవచ్చు. మనుష్యుడి బుద్ధి పెరిగిన కొద్దీ వాక్య నిర్మాణంలో క్లిష్టత ఏర్పడి ఎన్నో భాషా భాగాలు ఏర్పడడానికి వీలు కలిగి ఉండవచ్చును.

ఇంత చర్చ అనంతరం, తేలిన సారాంశం ఈ విధంగా ఉంటుంది.

1. భాష దైవదత్తం కాదు.

2. మనుష్యుడు, సృష్టిలో తనకు వినిపించే వివిధ ధ్వనుల్ని అనుకరించడం వల్లా, అతనికి సంబంధించిన మానసిక ప్రకోపనాల శక్తివల్లా, శరీరాంగాలకున్న చాలన శక్తివల్లా, అతనికి క్రమంగా అలవడ్డ ప్రక్రియ భాష.

3. మానవుడు, తన మెదడుకున్న గ్రహణ శక్తినీ, భావనా శక్తినీ కలగలుపుకుని, తిరిగీ భావనలను సంశ్లేష విశ్లేషణ చర్యల చేత ఆలోచనగా మార్చి, ఆ ఆలోచనల్ని బయటికి వెల్లడిస్తున్నప్పుడు ఏర్పడ్డ సాంకేతిక ప్రక్రియే భాష.

4. ఇది ధ్వన్యాత్మకంగా ఉండవచ్చు. ధ్వని రహితంగా ఉండవచ్చు. ధ్వన్యాత్మకంగా ఉన్న దాన్ని భాషా విధానమనీ, ధ్వని రహితంగా ఉన్నదాన్ని భాషేతర విధానమనీ కొందరు వివరించడం కనిపిస్తుంది.

5. ధ్వన్యాత్మకమైన భాష తొలుత అల్ప వర్ణాలతో ధాతు రూపంలో కనిపించినా, వాక్యార్థాన్ని బోధిస్తుండేది. రాను రాను, మనిషి ఆదిమ దశనుండి నాగరక దశను ఎదిగిన కొద్దీ భాషా నిర్మాణంలో క్లిష్టత ఏర్పడడం ప్రారంభమైంది.

## భాషల వర్గీకరణం

రాను రాను భాషలో జరిగే మార్పులూ, అందులో ఏర్పడే క్లిష్టతావీటిని వివరిస్తూ భాషా చరిత్రను నిర్ణయించడం, భాషోత్పత్తిని నిర్దేశించడం అంత సులువైన పనేమీ కాదు. ఈ నాడు అందరం తెలుగు భాష మాట్లాడే వారమే అయినా మన కందరికీ 11 వ శతాబ్దం నాటి తెలుగు ఒకే విధంగా అర్థం కాదు ఆ తెలుగుకూ, ఇప్పటి తెలుగుకూ భేదం ఉండడమే అందుకు కారణం. కాని ఈ భేదం రెండు రకాల తెలుగుల మధ్యా అవగాహనను పూర్తిగా తెంపి వేసేంత తీవ్రమైన భేదం కాదు. అంటే ఈ రెంటికీ మధ్య ఎక్కడా భాషా విషయకమైన అఘాతం ఏర్పడిందని చెప్పడానికి వీలులేదు. అంటే 11 వ శతాబ్దం నుండీ నేటివరకూ ఉన్న తెలుగులో మార్పు, క్రమానుగతంగా, కొంచెం కొంచెంగా సహజంగా సంభవించిన మార్పు. అంతేకాక అది మొత్తం భాషలో అనవగాహత, కల్పించని సరళమైన మార్పు.

ఒక భాషలో ఈ రకంగా క్రమ పద్ధతిలో జరిగే మార్పు ఆ భాష నుండి మరికొన్ని భాషలు పుట్టడానికి కారణం కావచ్చు. ఇట్లు పలు భాషలు రూపొందే పద్ధతిని శాస్త్రవేత్తలు రెండు విధాలుగా వివరించడం జరిగింది.

1. వంశ వృక్ష వాదం (Tree stem theory).

2. తరంగ వాదం (Wave theory).

ఒక వృక్షానికి శాఖోపశాఖలు విస్తరించేటట్లుగా, వృక్షకాండం వంటి మౌలిక భాషనాధారంగా చేసుకుని మరికొన్ని భాషలు శాఖల్లా పెరుగుతాయని వంశవృక్ష వాదం ప్రతిపాదిస్తుంది.

ప్రశాంత సరోవరంలో రాయి విసిరితే తరంగాలు ఏర్పడి ఒడ్డుకు తాకిన విధంగా మౌలిక భాషలో అనేక కారణాల ప్రాబల్యం చేత కొన్ని భాషలు అలలు అలలుగా విజృంభిస్తాయని తరంగ వాదం తీర్మానిస్తుంది.

ఇట్లా ప్రపంచ పరివ్యాప్తంగా ఏర్పడ్డ భాషలు నేటికి దగ్గర దగ్గర మూడు వేలు.

ఇన్ని భాషల్ని, ఒక సామాన్య సూత్రం వల్ల భిన్న వర్గాలుగా ఖచ్చితంగా వేరు చేయడం కుదరని పని. అందుకు బలమైన కారణాలున్నాయి. ప్రతి భాషలో నిర్మాణ విషయంలో రెండు భాగా లుంటాయి. అవి (1) బాహ్య నిర్మాణం (2) ఆంతర నిర్మాణం. భాషలో ఉండే వర్ణాలూ పదాలూ బాహ్య నిర్మాణానికి చెందినవి కాగా, పదానికీ పదానికీ మధ్య గల సంబంధం, వాక్య రచనా ఆంతర నిర్మాణానికి చెందే విషయాలు. ఏ భాషయినా మరో భాష యొక్క ప్రభావం చేత తనలో ఉన్న వర్ణాలలోనూ, పదాలలోనూ వేగంగా మార్పు తెచ్చుకుని, ఆ మార్పుల్ని జీర్ణం చేసుకుంటుంది. కాని ఆంతర నిర్మాణం విషయంలో అటువంటి మార్పుల్ని, ఎంతో అరుదుగా తప్ప, ఆహ్వానించదు. అందువల్లనే భాషలో మరో భాష ప్రభావంవల్ల వచ్చిచేరే వర్ణాలూ పదాలూ కనిపిస్తాయి. కాని వాక్య నిర్మాణం, కారక ప్రక్రియా కనిపించదు. కనిపించినా చాలా అరుదుగా ఉంటాయి.

భాషల్లో ఇతర భాషల ప్రభావం చేత బాహ్య నిర్మాణాన్ని మార్చుకునే లక్షణం ఉండడం వల్ల ఒక భాషను మరో భాషనుండి ఖచ్చితంగా వేరుచేసి నిలబెట్టడం కష్ట సాధ్యమౌతున్నది. ఇక్కడ ఒక భాష తనకంటె విరుద్ధ నిర్మాణ స్వభావం కలిగిన మరో భాషనుండి కూడా బాహ్య నిర్మాణంలో పోలికల్ని తెచ్చుకుంటుంది. ఈ లక్షణం వల్లనే హైందవ భాషావేత్తలు తెలుగు భాషకూ, ఆ మాటకొస్తే, దేశంలో ఉన్న అన్ని భాషలకూ సంస్కృతమే తల్లి భాష అనుకోవడం జరిగింది.

కాబట్టి భాషల్ని వేర్వేరు విభాగాలుగా చేసేముందు వాటి ఆంతర నిర్మాణానికే ప్రాముఖ్యం ఇవ్వవలసి ఉంటుంది.

ఇంతవరకూ ప్రపంచ భాష లన్నిటికీ శాస్త్రీయమైన ఖచ్చితమైన విభాగం జరగలేదనే చెప్పాలి. కొన్ని అమెరికన్ ఇండియన్ భాషలు, ఆఫ్రికాలోని నీగ్రోల భాషలు, ఆస్ట్రేలియా వాసుల భాషలు, ఆసియా ఖండంలోని కొన్ని మారుమూల భాషలు, ఇప్పటికీ శాస్త్రీయ విభాగానికి లోను కాలేదు. యూరప్ ఖండంలోని భాషలూ ఆసియా ఖండంలోని సమీపీన ప్రాగ్భాగ భాషలూ (Near

East languages) మధ్యధరా ప్రాంత భాషలు మాత్రమే శాస్త్రీయ విధానానికి పాల్పడి, తృప్తికరమైన పరిశోధనకు లొంగ గలిగాయి.

ఈ విభాగ విషయం ఇలా ఉండగా కొందరు ప్రపంచ భాషలన్నీ ఒకే ఒక మౌలిక రూపానికి చెందినట్లుగా నిరూపించడానికి తహ తహ లాడారు. ఎస్ పెరాన్‌చో అనే ప్రపంచ భాషను కూడా తయారు చేశారు. కాని ఆ ప్రయత్నాలింత వరకూ పూర్తిగా ఫలవంతం కాలేదు.

ప్రపంచ భాషలన్నిటినీ ఇంతవరకూ మూడు విధాలుగా విభాగం చెయ్యడానికి శాస్త్రజ్ఞులు పూనుకున్నారు. అవి (1) జాత్యాశ్రిత వర్గీకరణం (Geneological Classification) (2) నిర్మాణాశ్రిత వర్గీకరణం (Morphological Classsification) (3) భౌగోళిక వర్గీకరణం (Geographical Classification)

## I. జాత్యాశ్రిత వర్గీకరణం

వంశవృక్ష పద్ధతి ద్వారా వివరించగలిగిన భాషలన్నీ ఈ వర్గీకరణం క్రిందికి రావచ్చు. వీటిలో మౌలిక లక్షణాలలో ఏకత్వం కనిపిస్తుంది. అనగా ఇవి తాము ఒకే కుదురు నుండి జన్మించడం వలన కాదు, మూల భూతాలైన లక్షణాలలో పోలికలు కలిగి ఉంటాయి. అనగా పద ప్రత్యయ సంబంధం, వాక్య రచనా పద్ధతి వంటి ఆంతర నిర్మాణానికి చెందిన విషయాలలో ఇవి ఒకటిగానే ఉంటాయి. ఈ ప్రాతిపదికపైన ప్రపంచ భాషలని పరిశీలించగా ఈ వర్గీకరణం వలన ఏడు కుటుంబాలు ఇంతవరకు తృప్తికరంగా విభజింప బడ్డాయి. అవి

1. ఇండో యూరోపియన్ కుటుంబం.
2. సెమెటిక్ హెమెటిక్ కుటుంబం.
3. యురల్ ఆల్టా కుటుంబం.
4. సీనో టిబెటన్ కుటుంబం.
5. జపనీస్ కొరియన్ కుటుంబం.
6. ద్రావిడ కుటుంబం.
7. మలయా పోలినేషియన్ కుటుంబం.

(1) *ఇండో యూరోపియన్ కుటుంబం :* ఈ కుటుంబానికి చెందిన భాషల్లో చాలా భాషలు యూరప్ ఖండంలో ఎక్కువగాను, ఆసియా ఖండంలో విరళంగాను వ్యాపించి ఉన్నాయి. ప్రపంచ జనాభాలో ఈ భాష మాట్లాడే వాళ్ళ సంఖ్య సగానికిపైనే ఉంది. ఈ కుటుంబాన్ని ఎనిమిది ఉప విభాగాలుగా విభజింప వచ్చు. అవి 1. గ్రీక్, 2. ఇటాలి, 3. కెల్టిక్, 4. జర్మానిక్, 5. స్లావిక్, 6. ఆల్బేనియన్, 7. ఆర్మీనియన్, 8. ఆర్యన్ విభాగాలు. ఇందులో మొదటి ఏడు విభాగాలు యూరప్ ఖండంలోను చివరిదైన ఆర్యన్ విభాగం ఇరాన్, హిందూదేశాలలో వ్యాపించింది.

గ్రీక్, లాటిన్, జర్మన్, ఫ్రెంచ్, స్పానిష్, ఇంగ్లీష్, డేనిష్, స్వీడిష్ భాషలూ, రష్యన్, జెక్, పోలిష్ భాషలూ, పర్షియన్ సంస్కృత భాషలూ—సంస్కృతంనుండి వంశవృక్ష పద్ధతిలో జనించిన ప్రాకృత భాషలూ - బెంగాలి, ఒరియా, మరాఠీ, హిందీ, పంజాబీ, గుజరాతీ, రాజస్థానీ మొదలైన ఉత్తర హిందూ భాషలూ-ఈ కుదురునుండి ఉత్పన్నాలైన భాషలు. భాషానిర్మాణంలో వీటన్నిటిలోను ఏక సూత్రతను భాషావేత్తలు గుర్తించగలిగారు.

(2) *సెమిటో హెమెటిక్ కుటుంబం :* ఈ కుటుంబానికి చెందిన భాషలు మాట్లాడే వారి సంఖ్య ప్రపంచం మొత్తం మీద ఎనిమిది కోట్లు. ఇందులో సెమెటిక్ విభాగము, హెమెటిక్ విభాగము రెండు కలిసి ఉన్నాయి. మధ్యధరా సముద్ర ప్రాంత భూములైన సిరియా సౌదీ అరేబియా ఇరాక్‌లూ — ఉత్తర ఆఫ్రికా భూములైన ఈజిప్టు (ఇప్పటి యునైటెడ్ అరబ్ రిపబ్లిక్) మొరాకో, అల్జీరియా, మొదలైనవి తూర్పు ఆఫ్రికా ప్రదేశాలైన సోమాలీ, ముజాంబిక్ మొదలైన ప్రాంతాలూ—మెడగాస్కర్ ద్వీపంలో కొన్ని ప్రదేశాలు భాషా కుటుంబానికి ఉత్పన్న స్థానాలు. ఈ కుటుంబంలో సెమెటిక్, హెమెటిక్ అనే రెండు ఉప విభాగాలు ఉన్నాయి. సెమెటిక్ భాషకంటే హెమెటిక్ భాషలు బాగా ప్రాచీనమైనవి. ఉత్తర ఆఫ్రికా ఖండమంతా మొదట హెమెటిక్ భాషలే వ్యాపించి ఉండేవి. మధ్య దక్షిణాఫ్రికాలలో కూడా ఇవి స్థిరపడి ఉండేవి. కాగా సౌదీ అరేబియా, ఇరాక్‌లలో వ్యాపించి ఉండిన సెమెటిక్ భాషలు మహమ్మదీయుల రాజకీయ ప్రాబల్యం వల్ల ఎర్ర సముద్రందాటి ఆఫ్రికా ఖండమంతటా స్థానాన్ని సంపాదించుకోవడం జరిగింది. ఈ రెండు విభాగాల లక్షణాలు ఒకటే కావడం వల్ల రెండింటినీ కలిపి దాన్ని సెమెటో హెమెటిక్ కుటుంబంగా శాస్త్రజ్ఞులు వ్యవహరించడం జరిగింది. ఈ కుటుంబాలలో మిక్కిలి ప్రాచీనమైన చరిత్రా, గ్రాంథికతా కలిగిన భాషలు ఎరబిక్ హిబ్రూ భాషలు.

(3) *చైనీయ కుటుంబం :* దీన్నే సీనో టిబెటన్ కుటుంబమని కూడా వ్యవహరిస్తున్నారు. చైనా, టిబెట్, బర్మా, సయామ్, ఇండో చైనాలో ఉత్తర భాగం సిక్కియాంగ్, మంచుకూడో మొదలైన ప్రదేశాలలో ఈ కుటుంబం విస్తరించి ఉంది.అనగా ఆసియా ఖండపు తూర్పు భాగాన వీటికి వ్యాప్తి ఎక్కువ. ఈ కుటుంబ భాషల్లో ఉన్న స్వల్ప భేదాలను బట్టీ భౌగోళిక ప్రాధాన్యతని బట్టీ వీటిని శాస్త్రకారులు మళ్ళీ మూడు విభాగాలుగా చేసుకున్నారు. అవి 1. చైనా విభాగం, 2. టిబెట్ బర్మన్ విభాగము, 3. సయాం విభాగం. ఇవన్నీ విశ్లేషాత్మక లక్షణాన్ని కల్గిన భాషలు వీటిల్లో పదాలు ఏకాచ్కాలు. అనగా సర్వసాధారణంగా ఒక్క పదంలో ఒక్క అచ్చు మాత్రమే కనిపిస్తుంది.

(4) *ఉరల్ అల్టాక్ కుటుంబం :* ఈ కుటుంబం యూరప్ ఖండపు ఉత్తరపు కొసన ఆర్కిటిక్ వలయానికి దగ్గరగా ఉన్న ప్రదేశాలలో విస్తరించి ఉంది. అంటే ఫిన్‌లాండ్, కరేలియా, ఉత్తర నార్వే, స్వీడన్, హంగేరి,

తుర్కీ, సోవియట్ ఆసియా మొదలైన దేశాలలో ఈ కుటుంబ భాషలు ఉన్నాయి. ప్రాచీన భాషావేత్తలు ఈ కుటుంబాన్ని సిథియన్ భాషా కుటుంబమని, తురేనియిన్ కుటుంబమని పిల్చుకొనేవారు. పడమట అట్లాంటిక్ సముద్రం దగ్గరనుండి తూర్పున ఓక్‌హెక్స్ సముద్రంవరకు ఎంతో పెద్దదైన భూభాగం ఈ భాషలకు జన్మస్థానం. ఇంత నిడివికల భూభాగంలో ఉన్న భాషలనన్నిటినీ ఒకే కుటుంబం క్రిందికి తీసుకురావడంలో సామంజస్యం ఉన్నదా అనే విచికిత్స శాస్త్రవేత్తలలో లేకపోలేదు. ఈ కుటుంబ భాషల్లో ఉండే చిన్న చిన్న భేదాల వల్ల వీటిని ఐదు విభాగాలు చేయవలసి వచ్చింది. అవి 1. ఫిన్నోఉగ్రిక్, 2. సమోయత్, 3. తుంగూస్, 4. మంగోలియన్, 5. తుర్కి టార్‌టార్ భాషలు. ఇందలి మొదటి రెండు యూరప్‌ఖండం లోను, తర్వాత మూడు ఆసియాఖండంలోను ఉన్నాయి. వీటిలో ఫిన్నిష్, హంగేరీ, టర్కిష్ భాషలలో బాగా అభివృద్ధి చెందిన సాహిత్యం ఉంది.

(5) *జపాన్ కుటుంబం :* దీన్నే జపాన్ కొరియా కుటుంబం అని వ్యవహరించడం కనిపిస్తుంది. ఆసియా ఖండానికి తూర్పు తీరంలో ఉన్న జపాన్ కొరియా దేశాలలో ప్రముఖంగా కనిపించడం చేత ఈ భాషా కుటుంబానికి ఈ పేరు స్థిరపడింది. ఈ రెండు దేశాలలోనే కాక ఫార్మోజా, మంచుకూవో, కెరోలిన్, మార్షల్ దీవులు, ఇండో చైనా, సయాం, మలయా, బర్మా, ఫిలిప్పీన్స్, ఈస్ట్ ఇండీస్‌లోనూ - చైనాలో కొంత భాగంలోను ఇవి వ్యాప్తిలో ఉన్నాయి. చైనా కుటుంబం విశ్లేషణాత్మక లక్షణాన్ని కలిగి ఉండగా జపాన్ కుటుంబం సంయోగాత్మక లక్షణం కలది.

(6) *మలయా కుటుంబం :* దీన్నే మలయో పోలినేషియన్ కుటుంబమని వ్యవహరిస్తారు. మలయా ద్వీపకల్పంలో ఈ భాషలు ఎక్కువ వ్యాప్తిలో ఉండటం చేత వీటికాపేరు స్థిరపడింది. అక్కడేకాక జావా, సుమత్రా, బోర్నియో, బాలి మొదలైన దీవుల్లోను, ఫిలిప్పీన్స్, న్యూజీలాండ్, సమోవా మొదలైన ప్రదేశాల లోను ఈ కుటుంబానికి చెందిన భాషలు వ్యవహారంలో ఉన్నాయి.

(7) *ద్రావిడ కుటుంబం :* ఈ కుటుంబానికి చెందిన భాషలు భారత దేశపు మధ్యభాగంలో విరళంగాను దక్షిణభాగంలో పూర్ణంగాను, సింహళదేశపు ఉత్తర భాగంలోను వ్యాపించి ఉన్నాయి. ఉత్తర హిందూదేశంలో చుట్టూ ఇండో యూరోపిన్ కుటుంబ భాషలు ఉండగా వాటి మధ్య బ్రాహూయి అనే ద్రావిడ కుటుంబానికి చెందిన భాష ఒక ద్వీపం మాదిరిగా కనిపిస్తుంది. దీనివలన ద్రావిడులు ఉత్తరాన్నుండి దక్షిణానికి వలస వచ్చిన వారనే వాదానికి బలం చేకూరుతున్నది. ఈ కుటుంబంలో ఉండే భాషలు ఇప్పటికి లెక్క తేలినవి ఇరవై రెండు. వీటిల్లో మన భాష తెలుగు కూడా ఒకటి. ఈ భాషలన్నిటినీ శాస్త్రజ్ఞులు మూడు విభాగాలుగా గుర్తించారు. 1. దక్షిణ ద్రావిడ భాషలు, 2. మధ్య ద్రావిడ భాషలు, 3. ఉత్తర ద్రావిడ భాషలు. ఈ భాషలలో ప్రాచీనకాలం నుండి సారస్వతం కలిగిన

భాషలల్లో ముఖ్యమైనవి నాలుగు. అవి 1. తమిళం, 2. మళయాళం, 3. కన్నడం, 4. తెలుగు. వీటిలో తమిళ, మళయాళ, కన్నడాలు దక్షిణ ద్రావిడ భాగానికి చెందగా తెలుగు మధ్య ద్రావిడ విభాగానికి చెందినది. ఈ భాషా కుటుంబం పర్థియు క్తాత్మక లక్షణం కలిగిఉన్నది. పైన వివరంగా పేర్కొన్న ఏడు భాషా కుటుంబాలేకాక కొందరు భాషావేత్తలు వివరించిన మరో నాలుగు కుటుంబాలు కూడా ఉన్నాయి అవి 1. ఆఫ్రికన్ నీగ్రో కుటుంబం, 2. అమెరికన్ ఇండియన్ కుటుంబం, 3. కకేష్యన్ కుటుంబం, 4. బాస్క్ కుటుంబం. ఈ నాలుగు కుటుంబాలు వ్యాపించిన ప్రదేశాలువరుసగా 1. ఆఫ్రికా ఖండపు మధ్య దక్షిణ ప్రదేశాలు, 2. ఉభయ అమెరికా ఖండాలు, 3. సోవియట్ రష్యాకు చెందిన కాక్‌సస్ పర్వత ప్రాంతాలు, 4. స్పెయిన్, ఫ్రాన్స్ దేశాలలో కొంత భాగం. అయితే ఈ నాలుగింటి విషయంలో కుటుంబ వర్గీకరణం నిర్దుష్టంగా జరగలేదు. ఒక్కో కుటుంబంలో భిన్న భిన్న లక్షణాలు కల భాషలని కలబోసుకొని ఉన్నట్లు కనబడుతున్నాయి. అమెరికా, ఆఫ్రికా, స్పెయిన్, ఫ్రాన్స్, కాక్‌సస్ అనే పేర్లు కేవలం భౌగోళికంగా ఏర్పడ్డ పేర్లుగా కనిపిస్తున్నాయి. అందువల్ల ఈ కుటుంబాల వివరాలివ్వడం సులభం కాదు. వీటిని గురించి ఎంతో పరిశోధన జరగవలసి ఉంది.

## II. నిర్మాణాశ్రిత వర్గీకరణం

జాత్యాశ్రిత వర్గీకరణంలో ఆయా కుటుంబాలకు చెందే భాషల్ని వాటి బాహ్య నిర్మాణంలోనూ, అంతర నిర్మాణంలోనూ ఉండే పోలికల్ని స్థూలంగా కనిపెట్టి నిర్ణయిస్తున్నాము. నిర్మాణాశ్రిత వర్గీకరణములో లక్షణం కూడా ఇంచుమించు ఇదే అయినా ఇక్కడ పరిశీలన స్థూలమైంది కాక బాగా నిశితమైన పరిశీలన వాక్యనిర్మాణం, వాక్యంలో ఉండే పదాల పరస్పర సంబంధం వంటి అంశాలపైన ఈ పరిశీలన మిక్కిలి నిశితంగా జరుగుతుంది. అందువల్లనే ఈ వర్గీకరణం, నిర్మాణాత్మకమైన వర్గీకరణమనే నామాన్ని సార్థకంగా ధరించింది. ఏ భాషకైనా ప్రముఖాంశం అనదగ్గ వాక్యం యొక్క నిర్మాణాన్ని బట్టి భాషల్ని రెండు విభాగాలుగా వేరు చేయవచ్చు. అవి 1. స్థిరరూప భాషలు (Inorganic Languages) 2. రూప భేదభాషలు (Organic Languages).

*1 స్థిరరూప భాషలు :* ఈ భాషల్లో ఉండే పదాల రూపం వాక్యంలో స్థిరంగా ఉంటుంది. అనగా ఈ పదాలు, ప్రత్యయాలు చేరడంవల్ల తమ రూపాల్ని మార్చుకోవు. ఇక్కడ పదం కేవలం ఒక ఇటుకరాయి వంటిది. రాళ్ళు ఒకదాని ప్రక్కన ఒకటి పేర్చినట్లు ఈ భాషల్లో పదాలు ఒకదాని పక్కన ఒకటి ఉంటాయి. అంతేకాని ఒక దానిలో ఒకటి చొచ్చుకుపోయి పూర్వపదం చివరి భాగం పరపదం మొదటిభాగం, ఏదో ఒక ప్రత్యయంగా మారిపోయేంత ప్రమాదం ఈ భాషలో కనిపించదు. ఒక పదం వేరువేరు భాషా భాగాలుగా మారాలంటే ఆ పని రూపభేద భాషల్లోలాగా ప్రత్యయాల వల్ల ఇక్కడ జరుగదు. అది క్లిష్టత్వం 1) వాక్యంలో ఉండే పదాలు తమస్థానాన్ని మార్చుకోవడం వల్లా,

2) ఆ పదాలు ఉచ్చరించడంలో వచ్చే తానవైవిధ్యం (Tonic difference) వల్లా మాత్రమే జరుగుతుంది. ఉదాహరణకు చైనా భాషలో 'తాతీన్' అంటే పెద్ద మనుష్యుడు. 'తీన్‌తా' అంటే మనుష్యుడు పెద్దవాడు. ఇక్కడ పదాలలో ప్రత్యయం భాషా భాగాలను మార్చగలిగింది. ఈ లక్షణం తెలుగువంటి సంయోగాత్మక భాషల్లో చాలా అరుదుగా కనిపిస్తుంది. ఉదా:- పండు మామిడి, మామిడి పండు.

తానంలో వచ్చే మార్పువల్ల ఒక్క "తీ" అన్న పదానికి జండా, ధ్యానం, వాట, చీరుట, కమ్మకొనుట వంటి అర్థాలున్నాయి. ప్రత్యయాత్మక భాష అయిన సంస్కృతంలో ఈనాటికీ నానా అర్థాలున్నాయి. 'హరి' అంటే విష్ణువు, సూర్యుడు, నక్క, కప్ప- వీటిల్లో ప్రస్తుతం మనం ఏ విధమైన తాన భేదాన్నీ గుర్తించలేకపోయినా, ఒకప్పుడు అది ఉంటే ఉంటుందనడానికి వీలుంది.

స్థిర రూప భాషలకు చక్కటి ఉదాహరణ చైనా భాష. ఈ తెగకు చెందిన భాషల్లో, పదాలలో పెద్ద మార్పులు ఉండకపోవడం వల్ల పదాల మార్పును గుర్తించి వెల్లడించే వ్యాకరణశాస్త్రం అభివృద్ధి చెందడానికి వీలులేదు. ఈ విభాగానికి చెందిన భాషలను వియోజనాత్మక భాషలు (Isolatory Languages) అంటారు. వియోజనాత్మక భాషలన్నీ సర్వసాధారణంగా ఏకాచ్కాలుగా ఉంటాయి. స్థిరరూప భాషా విభాగానికి పేర్కొనే లక్షణాలే ఈ వియోజనాత్మక భాషా లక్షణాలుకూడా.

*2. రూపభేద భాషలు :* ఈ భాషల లక్షణం స్థిరరూప భాషా లక్షణాలకు విరుద్ధమైనది. ఇక్కడ పదాలన్నీ ప్రత్యయాదులు చేర్చడం వల్ల అంతో ఇంతో రూపంలో భేదాన్ని పొందుతుంటాయి. అందువల్ల ఇవి రూపభేద భాషలు. ఉదాహరణకు 'విను' అన్నది ధాతురూపం. వినెను, వినుచున్నాడు, వినడు, వినగలడు వంటివి ఆయా ప్రత్యయాలు చేరి సంపూర్ణక్రియా రూపాలుగా మారుతున్నాయి. వినికి, వినికిడి, వినుదల, వినుట, విను వంటి రూపభేదాలు నామప్రత్యయాల వల్ల కలుగుతున్నాయి. రూపంలో ఇటువంటి మార్పుల వల్లనే ఇన్ని అర్థాలు ఈ భాషల్లో ఆవిష్కరింపబడడం సంభవిస్తున్నది.

ఈ విభాగానికి చెందిన భాషలని తిరిగి మూడు భాగాలుగా విభజింప వచ్చు. అవి 1. సంశ్లేషణాత్మక భాషలు (Holopharastic Languages), 2. సంయోగాత్మక భాషలు (Agglutinating Languages), 3. ప్రత్యయాత్మక భాషలు (Inflectional Languages)

*1. సంశ్లేషణాత్మక భాషలు:* ఉత్తర దక్షిణ అమెరికా ఖండాలలోని దేశీయుల భాషలన్నీ చాలా వరకు సంశ్లేషణాత్మక లక్షణాలు కలిగినవి. ఈ భాషల్లో (1) వాక్యమంతా ఒకే పదము అన్న భ్రమను కలిగిస్తుంది.

ఉదా॥ గ్రీన్‌లాండ్ భాషలో

Aulisan = చేపలు పట్టడం.

Peartor = అయ త్తమవడం.
Pinne Sampak = త్వరపడు.

ఈ మూడు పదాలను కలిపితే Aulisan artor Sampak 'చేపలు పట్టడానికి త్వరపడుతున్నాడు' అనే వాక్యం ఏర్పడుతుంది. ఇది చూడడానికి ఒకే పదమా అనే భ్రమను కలిగిస్తున్నది.

(ii) పదాలు కలిసినప్పుడు ఆయా పదాల పూర్వ పరభాగాలు జారిపోతాయి. పైన, /Pe/, /Pinne/ అనే భాగాలు జారిపోవడం మనం గమనించవచ్చు.

2. *సంయోగాత్మక భాషలు:* ఈ భాషల్లో ప్రతి పదమూ వాక్యంలో మరో పదంతో సంయోగం చెందుతుంది. మళ్ళీ దేనికది విడిగా కూడా వాడబడుతుంది. అనగా ఇందులో ఏ పదమూ మరో పదంతో సంశ్లేషణాత్మక స్థితిలో కనపడే విధంగా మరీ కలిసిపోయి కనిపించదు. స్వయం స్వరూపాన్ని పోగొట్టుకోదు. పదాలకు అనుబంధాలై కనిపించే ప్రతి అంశానికీ ఒక స్పష్టమైన వివరణను అర్థమూలకంగా చెయ్యడానికిక్కడ వీలుంటుంది.

ఉదాహరణగా టర్కిష్ భాషను గ్రహిస్తే ఈ అంశాన్ని గుర్తించవచ్చు.

Sev - mek = ప్రేమించుట.
Sev - me - mek = ప్రేమించకుండుట.
Sev - il - mek = ప్రేమించబడుట.
Sev - ish - mek = ప్రేమించుకొనుట (పరస్పరం).
Sev - din - mek = ప్రేమింపజేయుట.
Sev - dir - ilmek = ప్రేమింపబడునట్లు చేయుట.
Sev-ish-dir-il-mek = పరస్పరం ప్రేమింపబడునట్లుచేయుట.

ఇట్లా ఎన్నో ఉదాహరణల్ని ఇవ్వడానికి వీలున్నది. అందుకే మాక్స్ ముల్లర్ మహాశయుడు టర్కిష్ భాషను నూటికి నూరుపాళ్ళు సంయోగాత్మక లక్షణం కలిగిన భాషగా పేర్కొన్నాడు. ప్రపంచానికి చెందిన చాలా భాషలు ఈ విభాగానికి చెందుతాయి. ద్రావిడ భాషాకుటుంబం, అందులో సభ్యత్వం వహించిన మన తెలుగూ, సంయోగాత్మక లక్షణం కలిగిన భాషలు.

3 *ప్రత్యయాత్మక భాషలు:* చారిత్రక పరిణామక్రమంలో ఏ భాష అయినా సంయోగాత్మక దశ నుండి ప్రత్యయాత్మక స్థితిని అందుకోగలుగుతుంది. సంయోగాత్మక దశలో పదాలకు చేర్చబడే అనుబంధ పదాలే క్రమంగా వాటికి గల్గ స్వతంత్ర ప్రతిపత్తిని కోల్పోయి ప్రత్యయాలుగా రూపొందుతాయి. అనగా వాటిని ఏ పదాలకూ చేర్చకుండా ప్రత్యేకంగా వాడడానికి వీలుకాదు. ఈ విభాగానికి చెందిన ప్రముఖభాషా కుటుంబాలు ఇండో యూరపియన్ సెమెటిక్ కుటుంబాలు.

ప్రత్యయాన్ని పదానికి చేర్చే విధానంలో మూడు రకాలు కనిపిస్తు న్నాయి. (1) ప్రత్యయాలు పదానికి ముందు చేర్చడం (2) వెనుక చేర్చడం (3) పదశరీరాన్ని ముక్కలుగా విడదీస్తూ ప్రత్యయాలను మధ్య మధ్య చొప్పించడం. ఈ మూడు పద్ధతులకూ క్రమంగా ఉదాహరణలు ఇట్లా ఉంటాయి :

1. సంస్కృతంలో ఆహారం
   ఆంగ్లంలో of a man
2. సంస్కృతంలో రామస్య
   హిందీలో जंगल में
3. అరబిక్‌లో ధాతువు Qtl = to kill.
   దీనికి ప్రత్యయాలు చేరగా వచ్చే రూపాలు :
   Qa ra la = వాడు చంపెను.
   Qatil = వధ

ఇక్కడ పదశరీరంలో చొప్పబడ్డ /a/, /i/ అనేవి ప్రత్యయాలు.

### III. భౌగోళిక వర్గీకరణం

ప్రపంచ పటాన్ని దృష్టిలో ఉంచుకుని ఒక్కో ఖండంలో ఉన్న భాషల్ని ఒక్కో వర్గం క్రింద వేరుచేసే పద్ధతి ఇది. ఇక్కడ భాషలకు సంబం ధించిన జాతికి గానీ, నిర్మాణానికి గానీ ప్రాధాన్యం ఉండదు. కేవలం ఆయా భాషల భౌగోళిక స్థితికి మాత్రమే ఇక్కడ ప్రాముఖ్యం ఉంటుంది. దీన్ని బట్టి ప్రపంచ భాషల్ని అయిదు విభాగాలు చేయవచ్చు.

అవి 1. అమెరికా ఖండ భాషలు 2. ఆఫ్రికా ఖండ భాషలు 3. యూరప్ ఖండ భాషలు 4. ఆసియాఖండ భాషలు 5. ఆస్ట్రేలియాఖండ భాషలు.

భాషా విచికిత్స ఆరంభమైన తొలి రోజుల్లో జిజ్ఞాసువులు ఏర్పాటు చేసుకున్న విభాగమిది. ఒక్కొక్క ఖండంలో జాత్యాశ్రిత, నిర్మాణాశ్రిత విభా గాలు ఒకటికంటె ఎక్కువగా వ్యాపించి ఉండడం మనం ఇప్పటికి గ్రహించేఉన్నాం

భారతదేశభాషలన్నీ ఆసియాఖండ విభాగానికి చెందుతాయి. ఇక్కడ ఇండో యూరపియన్, ద్రావిడ భాషా కుటుంబాలు ప్రముఖంగా వ్యాపించి ఉన్నాయి. చైనా టిబెటన్ కుటుంబం, మలయా కుటుంబ భాషలూ మన దేశపు ఉత్తర, తూర్పు సరిహద్దుల్లోనూ, సెమెటిక్ కుటుంబ భాషలు ఉత్తర భాగాన కొంత కొంత కనిపిస్తున్నాయి.

ఇండో యూరపియన్ కుటుంబంలో ఉప విభాగమైన ఆర్య భాషా వర్గానికి చెందే భాష సంస్కృతం. సంస్కృతం, దాని నుండి ప్రాకృతాలు, వాని నుండి ఉత్తర హిందూస్థాన భాషలూ ఉత్తర దేశమంతా అల్లుకు పోయాయి.

ద్రావిడ భాషల్ని గురించి వెనక స్పష్టం చేయడం జరిగింది.

ఇది మన జీవిత సరణిలో ప్రధాన స్థానాన్ని వహించిన భాష యొక్క పుట్టుకను గూర్చి, విభాగాన్ని గూర్చి ఇప్పటి వరకూ ఏర్పడిన చరిత్ర.

# 2
# ఆంధ్ర, తెనుగు, తెలుగు పదాల చరిత్ర, వ్యాప్తి

ఆంధ్రులు ప్రాచీన కాలంనుంచి నివసించిన ఏక భూఖండం ఆంధ్ర దేశం. దీని విస్తీర్ణం దాదాపు రెండులక్షల డెబ్బైయేడువేల చదరపుకిలో మీటర్లు. ఇందు నివసించే ఆంధ్రుల జనాభా దగ్గర దగ్గర 1979 లెక్కల ప్రకారం 5 కోట్ల ముప్పై లక్షలు. ఈ ప్రదేశం మొత్తం భారత రిపబ్లిక్‌లో ఆంధ్ర ప్రదేశ్ అని వ్యవహరింప బడుతున్నది. ఇది పందొమ్మిదవ శతాబ్దంలో రాజకీయ కారణాలవల్ల మూడు ముక్కలుగా విభాజ్యం కావడం జరిగింది. అందులో ఒకటి సర్కారు ప్రాంతమనీ, రెండవది దత్త మండలమనీ, మూడవది తెలంగాణా ప్రాంతమనీ పిలువబడ్డవి. తెలంగాణా ప్రాంతం అప్పుడు నిజాం పాలన క్రిందికిరాగా మిగిలిన భాగం ఆంగ్లేయుల పాలనలో ఉండేది. అందువల్ల తెలంగాణా ప్రాంతం తెలుగు భాషమీద ఆనాటి పాలకభాష ఉర్దూ అధికారం చేసి దాన్ని ఎక్కువగా ప్రభావితం చేసింది. కోస్తా, రాయలసీమలలోని తెలుగుమీద ఆంగ్లం తన ప్రభావాన్ని అధికంగా చూపించింది. రాజకీయ కారణాలచేత ఈ విధంగా మూడు భాగాలుగా పరిగణించబడిన ఆంధ్రదేశం స్వతంత్రం వచ్చి స్వరాష్ట్ర సాధన జరిగిన తర్వాత కూడా మూడు భాగాలుగానే చూడబడ్డది.

ఈ భిన్నదృష్టి కేవలం పరిపాలనా సౌలభ్యం కొరకు, ఆర్థిక సమన్వయ సాధనకొరకు మాత్రమేకాని, సాంస్కృతికంగానూ, భాషాపరంగానూ గణనీయమైన భేదం ఉన్నందువల్ల మాత్రం కాదు. ఈ మూడు భాగాలనూ పరిపాలన సౌలభ్యంకోసం ఇరవై మూడు మండలాలుగా విభజించడం జరిగింది. ఈ విభజన కేవలం రాజకీయమైన విభజనే కాని భాషాపరమైన విభజన కాదు. అనగా ఈ ఇరవై మూడు మండలాలలో ఉన్న భాషా స్వరూపం, తెలుగు భాషయొక్క ఇరవై మూడు మాండలికాల స్వరూపం అనడం తప్పు. తెలుగు భాషలో అన్ని మాండలిక భేదాలు లేవు.

రాయలసీమలో చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలు నాలుగు; తెలంగాణాలో మహబూబ్‌నగర్, హైదరాబాదు, రంగారెడ్డి, మెదక్, నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, నల్గొండ, ఖమ్మం జిల్లాలు పది; కోస్తాప్రాంతంలో నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలు తొమ్మిది. ఇవన్నీకలిసి వెరసి ఇరవైమూడు మండలాలు కలిగిన విశాలరాష్ట్రం మన ఆంధ్ర రాష్ట్రం.

మన రాష్ట్రానికి ఈశాన్య దిశలో ఒరిస్సా, ఉత్తరాన మధ్యప్రదేశ్ రాష్ట్రం, పశ్చిమాన మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాలూ, దక్షిణంలో తమిళనాడు రాష్ట్రం, తూర్పున బంగాళాఖాతం ఎల్లలుగా ఉన్నాయి. అనగా మన భాష అయిన తెలుగు భాషతో సరిహద్దుల్లో ప్రత్యక్ష సంబంధం కలిగిన పొరుగు భాషలు ఐదు. అవి 1. ఒరియా, 2. హిందీ, 3. (మహారాష్ట్ర) మరాఠీ 4. కన్నడ, 5. తమిళాలు. ఇందులో కన్నడ, తమిళాలు రెండూ మన భాషకు మల్లే ద్రావిడ కుటుంబానికి చెందిన భాషలు. అందువల్ల అవి మనకు సోదరభాషలు. మిగిలిన ఒరియా, హిందీ, మహారాష్ట్ర భాషలు మూడూ ఆర్యకుటుంబానికి చెందిన భాషలు.

మన భాషకు పర్యాయపదాలుగా ఆంధ్ర, తెనుగు, తెలుగు పదాలు కనిపిస్తున్నవి. ఈ మూడింటిలో మిక్కిలి ప్రాచీనమైన పదం ఆంధ్ర పదం. ఈ మూడు పదాలూ ఆయాకాలాల్లో జాతిపరంగా, భాషాపరంగా, దేశపరంగా వాడబడడం జరిగింది.

## ఆంధ్ర పదం

ఆంధ్ర అనే ఈ పదానికి 'అంధ్ర'అనే రూపాంతరం కూడా ఉంది. మొదటి సారిగా ఆంధ్రపదం జాతిని సూచించేదిగా ఐతరేయ బ్రాహ్మణంలో కనిపిస్తుంది. ఇది క్రీ॥ పూర్వపు శతాబ్దాల్లో వెలసిన గ్రంథం కాబట్టి, ఆంధ్ర జాతి ఆనాటికే ఉన్నట్లుగా మనం నిర్ణయించడానికి వీలు కలుగుతుంది. అయితే ఇక్కడ పేర్కొనబడ్డ ఆంధ్రజాతి అనార్యజాతులలో ఒకటి. ఐతరేయ బ్రాహ్మణంలో కథ ఈ విధంగా ఉంది. మిక్కిలి కోపిష్ఠి అయిన విశ్వామిత్రుడికి వందమంది కొడుకులు. ఒకనాడు ఆయన శునశ్శేపుడనే బాలకుణ్ణి తనతో ఇంటికి తెచ్చి తన కొడుకులు వంద మందినీ అతని నాయకత్వాన్ని అంగీకరించమని ఆదేశించాడట. అందుకు వారిలో సగం మంది ఒప్పుకోలేదు. దానికి ముని కోపం తెచ్చుకొని ఆ సగం మందినీ ఆంధ్ర, పుండ్ర, పుళింద, మూతిబా, శబర జాతుల్లో చేరి దస్యులై తిరగవలసిందిగా శపించాడట. పైన పేర్కొన్న ఐదు జాతులూ అనార్యజాతులు. అవి ఐతరేయ బ్రాహ్మణం పుట్టిననాటికి అనగా క్రీస్తు పూర్వపు శతాబ్దుల్లోనే ఉన్న జాతులు. అనార్యులు అంటే అనాగరికులు అనికాక, ఆర్యేతరాలయిన ద్రావిడాది కుటుంబాలకు చెందిన జాతులు అని అర్థం చేసుకోవలసి ఉంటుంది. ఆర్యులయిన విశ్వామిత్ర సంతతి అనార్యజాతులతో కలసిపోవడమనే ఈ శాపకథను ఆర్య, అనార్య జాతుల సమ్మేళనాన్ని సూచించే వృత్తాంతంగా మనం అర్థం చేసుకోవచ్చు.

ఇక్కడ ఇంకో పురాణకథను జ్ఞాపకం చేసుకోవలసిన ఆవశ్యకం ఉంది మనకు. అది కాశీఖండంలో కనిపించే వింధ్య గర్వభంగ కథ. ఒకప్పుడు నేను గొప్ప అంటే నేను గొప్ప అని మేరు పర్వతమూ, వింధ్య పర్వతమూ వైరం పెంచుకోవడం తటస్థించింది. సూర్యచంద్రాది గమనాన్ని అడ్డగిస్తూ వింధ్య పర్వతం శరీరం పెంచగా, కొన్ని దేశాలు చీకట్లోనూ, కొన్ని దేశాలు

వెలుతురుల న్నూ శాశ్వతంగా ఉండిపోయాయి. ఈ ఉపద్రవాన్ని వారించడానికి అగస్త్యమహర్షి వింధ్యుడి దగ్గరకు విచ్చేయడం జరిగింది. ఆయన మీద గౌరవం కొద్దీ వింధ్యుడు తన మేని పెంపు తగ్గించుకొని సాష్టాంగపడ్డాడు. ముని తాను దక్షిణదేశంలో తీర్థయాత్రలు ముగించుకొని వచ్చేవరకూ వింధ్యుణ్ణి అలాగే ఉండ మని శాసించి, పర్వతందాటి దక్షిణానికి వెళ్ళిపోయాడు. తిరిగిరాకుండా ఆయన అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు.

ఈ కథను చారిత్రకంగా అన్వయిస్తే ఇది

1. ఉత్తరాది వారైన ఆర్యజాతికి చెందిన వారు దక్షిణాదికి వలస రావడాన్ని సూచిస్తుంది.

2. ఉత్తర ప్రాంతాన్నీ, దక్షిణ ప్రాంతాన్నీ వేరుచేస్తూ మధ్య అడ్డు గోడగా నిలిచిన వింధ్య పర్వతశ్రేణిలో మార్గాలను ఆర్యులు కనుక్కోవడాన్ని సూచిస్తుంది.

పై రెండు కథలవల్లా మనకు తేలే సారాంశం ఏమిటనగా, 1. ఆర్యులు వింధ్య దాటి దక్షిణ దేశానికి వచ్చారు. 2. అట్లా వచ్చి అక్కడ మొదటినుంచీ కుదురుకుని ఉన్న అనార్య జాతుల్లో కలిసిపోయారు.

ఈ రకంగా ఆర్యులూ, ఆర్యేతర జాతులూ కలిసిపోయాయి. ఆంధ్రజాతి ఐతరేయ బ్రాహ్మణ కథ ననుసరించి, ఆర్య, అనార్య సమ్మిశ్రణంగా కనిపిస్తుంది.

ఐతరేయ బ్రాహ్మణం తరువాత వ్యాస మహాభారతంలోనూ, మనుస్మృతి లోనూ, భరతుని నాట్యశాస్త్రంలోనూ, బ్రహ్మాండ, వాయు పురాణాదుల్లోనూ ఆంధ్ర శబ్దం జాతిపరంగానే వాడబడ్డది.

మనుస్మృతిలో కాలావరస్త్రీకి వైదేహుని వల్ల జనించిన నిషాదులు ఆంధ్రులని వివరింపబడ్డది. నాట్యశాస్త్రంలో బర్బర, కిరాత, ఆంధ్ర, ద్రమిల జాతులకు శౌరసేని మొదలైన ప్రాకృతాలను ఉపయోగించరాదనే నిషేధం కనిపిస్తుంది. మనుస్మృతి వివరణను చూస్తే అది ఐతరేయ బ్రాహ్మణం ఆర్యులకు ఆపాదించిన సాంకర్యాన్ని బలపరుస్తున్నట్టుగా కనిపిస్తుంది. భారతంలో కూడా ఆంధకులనే తెగవారు, పుళిందులు, కిరాతులు, మ్లేచ్ఛులు మొదలైన ఆటవికులతో కలిసి కౌరవ పక్షాన్ని వహించి పాండవులతో యుద్ధం చేసినట్లుగా ఉంది. హరి వంశంలో కంసాస్థానంలో శ్రీకృష్ణుని మీదికి ఆంధ్ర మల్లుడు ఉసికొల్పబడడం కనిపిస్తుంది. భాగవతంలో కిరాత, హూణ, ఆంధ్ర, పుళిందాది జాతులు తమ తమ పాపాల నుండి విముక్తి చెందడానికి హరిని పూజించినట్లుగా ఉంది. ఆంధ్ర శబ్దమే సంస్కృత వాఙ్మయంలో అంధక, ఆంధ్రక అనే రూపాల్లో కూడా కని పిస్తుంది. మత్స్యపురాణంలో అంధకులు అంధకాసురుని సంతతివారని పేర్కొనగా, భాగవతంలో వాళ్ళు యాదవజాతికి చెందిన ఒక తెగవారని చెప్పడం జరిగింది.

ఈ విషయాలన్నిటినీ సమన్వయం చేసుకుని చూస్తే 1. బ్రాహ్మణా లల్లో, పురాణాల్లో మొదట ఆంధ్రశబ్దం జాతిపరంగా వాడబడ్డది. 2. ఈ జాతి

ఆర్యేతర జాతి 3. దీన్ని ఆయా కాలాల్లో, ఆటవిక జాతులైన బర్బర, కిరాత, పుళింద, హూణ, మ్లేచ్ఛాది జాతులతో సమానంగా చూచేవారు. 4. ఆర్యప్రతినిధులైన పాండవులకూ, శ్రీకృష్ణుడికీ ప్రతిరోధులై ఆంధ్రులు కౌరవ పక్షాన చేరి నట్లుగా చెప్పబడ్డది. 5. ఆంధ్ర శబ్దానికి ఆంధ్ర, అంధ, అంధక, అంధ్రక అనే పర్యాయపదాలున్నాయి.

పురాణాలలో ఆంధ్ర ప్రశంస ఇట్లా ఉండగా, చారిత్రకాధారాలు ఆంధ్ర శబ్దాన్ని ఏ విధంగా వివరించాయో పరిశీలిద్దాము.

1. క్రీ॥పూ॥ 3వ శతాబ్దానికిచెందిన గ్రీకురాయబారి మెగస్తనీస్ కథనం ప్రకారం ఆంధ్ర జాతి బలమైన జాతి. వాళ్ళకు చుట్టూ ప్రాకారాలు కలిగి బురుజులతో శోభించే పటిష్ఠమైన 30 పట్టణాలుండేవి. ఒక్కొక్క పట్టణంలో లక్ష కాల్బలం, 2000 అశ్విక బలం, 1000 గజబలం ఉండేవి.

2. అశోకుని ధర్మ శాసనాలలో ఆంధ్రుల ప్రశస్తి ఉంది. 13వ శాసనంలో ఆంధ్రులు తన సామ్రాజ్యంలోని వారనీ, అతని ధర్మబోధనలను అనుసరిస్తున్నవారనీ వివరించబడ్డది.

3. వాయు పురాణంలో రాజవంశాల చారిత్రక వివరాలిస్తూ ఆంధ్ర రాజులైన ఆంధ్ర భృత్యులపేర్లూ, వాళ్ళల్లో ఒక్కొక్కరి పరిపాలనా కాలం పేర్కొనబడ్డాయి. ఆంధ్రభృత్యులకే శాతవాహనులని మరో పేరు. క్రీ॥ పూ॥ రెండవ శతాబ్దిలో సామ్రాజ్యస్థాపన చేసి నాలుగు వందల సంవత్సరాల పాటు మహారాష్ట్రాంధ్ర దేశాలను ఏలినవారు శాతవాహనులు.

ఆంధ్ర జాతి ఏలిన ప్రదేశాలకు ఆంధ్ర దేశమనే పేరు రావడం సహజం. ఆ విధంగా ఆంధ్ర శబ్దానికి జాతి పరంగానే కాక దేశపరంగా కూడా అర్థం కుదురుకోడానికి ఆస్కారం కలిగింది. అందువల్లనే ఎక్కడెక్కడ దేశ పరంగా ఈ పదం వాడబడుతున్నదో అటువంటిచోట్ల, ఈ పదాన్ని ఆంధ్రులేలే దేశం అనే అర్థంలో వివరించి చెప్పడానికి వీలు కలుగుతున్నది.

ఉదాహరణకు, రామాయణంలో సుగ్రీవుడు సీత నన్వేషించడానికి వెదకవలసిన రాజ్యాలలో ఆంధ్ర, చోళ, పాండ్యాది దేశాలను పేర్కొనడం జరిగింది. ఇక్కడ ఆంధ్రదేశమనగా ఆంధ్ర జాతి పరిపాలించే దేశమనే అర్థం, అదే విధంగా భారతంలో సహదేవుడు జయించిన రాజ్యాలలో ఆంధ్రరాజ్యం కూడా ఉంది. భాగవతంలో బలికుమారులు ఆరుగురు. వారిలో ఒకరి పేరు ఆంధ్రుడు, ఆంధ్రుడు స్థాపించిన రాజ్యమే ఆంధ్ర రాజ్యం.

పాళీ గ్రంథాలలో 'అంధకరట్ట' అనే పదం ఉంది. అది ఆంధ్రరాష్ట్ర అనే శబ్దమే. క్రీ॥శ॥ 234 కు చెందిన శివస్కందవర్మ మైదవోలు శాసనంలో "అంధా పధీ యోగామో విరిపరమ్" అన్నచోట అంధా పధీయ మనగా, ఆంధ్రదేశమన్నే అర్థం. క్రీ॥శ॥ 340 కు చెందిన మల్లి దేవ[illegible] దాన శాసనంలో

"ఆంధ్రమండలే ద్వాదశ సహస్రగ్రామ సంపాదిత సప్తార్థ లక్ష విషయాధిపతేః" అన్నచోట ఆంధ్ర మండలమంటే ఆంధ్రదేశమే.

ఇక భాషాపరంగా దీని వాడుక మొదటిసారిగా నన్నయ నందంపూడి శాసనంలో కనిపిస్తుంది. ఇందులో నన్నయ, తన మిత్రుడైన నారాయణభట్టును సంస్కృత, కర్ణాటక, ప్రాకృత, పైశాచిక, ఆంధ్ర భాషలయందు కవి రాజశేఖరుడు అని స్తుతించడం కనిపిస్తుంది. నన్నయ కర్తృకంగా పలువురు భావించే "ఆంధ్ర శబ్ద చింతామణి"లోని ఆంధ్రపదం భాషా వాచకమే. కేతన ఆంధ్ర భాషా భూషణం గురించి వేరే చెప్పనక్కర లేదు. ఇట్లా 11వ శతాబ్దం నుంచీ తర్వాత కవులందరూ ఈ శబ్దాన్ని భాషాపరంగా అవిచ్ఛిన్నంగా వాడడం కనిపిస్తుంది.

## తెనుగు పదం

మన భాషకు పర్యాయ పదాలైన తెనుగు, తెలుగు పదాలలో చారిత్రకంగా తొలుత కనిపించేది తెనుగు పదమే. ఇది భారతంలో మొదట పూర్ణబిందు యుక్తంగానే వాడబడ్డది. భారతంలో "నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుడయ్యె" అన్న చోట పూర్ణబిందు పూర్వకమైన శబ్దాన్ని వాడడం జరిగింది. అయితే అదే భారతంలో 'తెనుఁగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్' అన్నచోట్ల అర్ధ బిందువూ కనిపిస్తుంది. ఇవి ఇక్కడ భాషాపరంగానే వాడటం జరిగింది. ఈయన 'తెలుగు' పదాన్ని వాడలేదు.

పాల్కురికి సోమన, తిక్కన తెనుగు, తెలుగు పదాలను రెంటినీ భాషాపరంగానే వాడారు. తర్వాతి వారందరూ ఆ యిద్దరి మార్గాన్నీ అనుసరించడం కనిపిస్తుంది. ఒక్క ఆముక్తమాల్యదను వ్రాసిన శ్రీ కృష్ణదేవరాయలు మాత్రం "తెలుగదేలయన్న దేశంబు తెలు గేను తెలుగువల్లభుండ తెలుగొకండ" అని తెలుగు పదాన్ని దేశం, జాతి, భాష అనే మూడు అంశాలపరంగా వాడి, తెలుగు మీద తన తాత్పర్యాన్ని చూపించుకున్నాడు.

తెనుగు పదానికి వ్యుత్పత్తిని ఆలోచిస్తూ పండితులూ, జిజ్ఞాసువులూ తమ అభిప్రాయాలను రకరకాలుగా వివరించారు. 1. తెనుగు అన్న పదాన్ని దిక్కును తెలిపేపదంగా నిర్వచించడం: 'తెన్' అంటే దక్షిణదిక్కు అని అర్థం. భారతదేశంలో ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన తెనుగుభాష దక్షిణ ప్రాంతంలో ఉండడంవల్ల దీనికీపేరు వచ్చిందని ఈ వాదాన్ని చేపట్టినవారి అభిప్రాయం. కాని ఇక్కడ దక్షిణ ప్రాంతమంటే ఒక చిన్న సందేహానికి ఆస్కారముంది. 'తెన్' అనే మూలధాతువు మూల ద్రావిడానికి చెందింది. ఆధాతువును ఉపయోగించేవాళ్ళు ద్రావిడులేకావాలి కాని, మరొకరు కావడానికి వీలులేదు. అనగా తమిళాదులకు మాత్రమే ఉపయోగార్హమైన ఈ ధాతువు వల్ల 'తెనుగు' అనగా దక్షిణప్రాంతపు భాష అనే అర్థంరావాలి. కాని చిత్రమేమిటంటే

మిగిలిన ద్రావిడ భాషా ప్రాంతాలకు తెనుగు దక్షిణానలేదు. ఇచ్చితంగా ఉత్తరాన ఉంది. అందుకే తమిళులు, తెలుగువాళ్ళను 'వడుగర్' అనికూడా అంటారు. ఇక్కడ వడక్కు అనేది ఉత్తరదిక్కు అనే అర్థాన్ని సూచించే పదం. అందువల్ల కేవలం ఉత్తర హిందూస్థానీయులను దృష్టిలో ఉంచుకున్నప్పుడు మాత్రమే దక్షిణప్రాంతపు భాష అనే అర్థంలో ఈ తెనుగుపదం దిగ్వాచిగా స్థిరపడింది అని మనం సరిపెట్టుకోవలసివస్తుంది.

2. తెనుగు పదాన్ని గుణవాచక శబ్దంగా నిర్ణయించడం : ఈ విధమైన నిర్ణయం, ఊహించే వ్యక్తియొక్క స్తోమతమీద ఆధారపడి ఉంటుందే కాని, సత్యం మీద కాదు. తేనె+అగు—తెనుగు. అనగా తేనెవలె తియ్యనైన భాష అనడం ఇటువంటిదే.

3. ఈ శబ్దాన్ని ఏదో ఒక సంస్కృత శబ్దానికి వికృతిగా భావించడం: తెనుగు అనే పదం సంస్కృత 'త్రినగ' శబ్ద భవమని కొందరు పండితుల అభిప్రాయం. అయితే ఈ 'త్రినగాలు' అనగా మూడు కొండలు ఏవో, వాని ప్రసిద్ధి ఈ శబ్దార్థాన్ని సాధించేందుకు ఏ రకంగా ఉపయోగపడుతున్నదో ఎవ్వరూ స్పష్టంగా చెప్పడానికి కుదరదు. అందువల్ల త్రినగ శబ్దం తెనుగు శబ్దానికి మాతృక అనడంలో ఉన్న ఔచిత్యం విచారించదగ్గది.

## తెలుగు పదం

పలు విధాల వ్యుత్పత్తులు కలిగిన తెనుగు శబ్దమే 'తెలుఁగు' గా మారిందని కొందరి అభిప్రాయం. ద్రావిడ భాషల్లో న, ల ల పరస్పర వినిమయం ప్రాచీన కాలంలోనే స్థిరపడ్డది.

అయితే 'తెలుగు' పదానికి కూడా, తెనుగు పదానికి భిన్నంగా, స్వతంత్రమైన వ్యుత్పత్తులను పండితులు కల్పించడం జరిగింది. అవి :

*1. తెలుగు త్రిలింగ శబ్ద భవం అనే వాదన :* 13 వ శతాబ్దానికి చెందిన విద్యానాథ పండితుడు, ఆంధ్రదేశంలోని శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వరాలలో ఉన్న మూడు శివలింగాల వల్ల ఈ దేశానికి త్రిలింగదేశమని పేరు వచ్చినట్లు వివరించడం జరిగింది. ఆ తర్వాత 15 వ శతాబ్దిలో వచ్చిన విన్నకోట పెద్దన అనే లాక్షణికుడు ఆంధ్రదేశానికి త్రిలింగ దేశమనే పేరు ఉన్నదనీ, తెలుగు పదం త్రిలింగశబ్ద భవమనీ వివరించాడు. మరో లాక్షణికుడు కాకునూను అప్పకవి కూడా అదే మాట చెప్పాడు.

ప్రాచీనాధారాలను పరికిస్తే బ్రహ్మాండ, స్కాంద పురాణాలలో త్రిలింగ పదం దేశ వాచకం గానే కనిపిస్తుంది. వాయుపురాణంలో 'తిలింగా' అనే పదం జనపదానికి పేరుగా పేర్కొనబడ్డది.

గ్రీక్సు రాయబారిగా మన దేశానికి వచ్చిన టాలెమీ తెలుగు దేశాన్ని 'ట్రిల్లింగాన్' అని పేర్కొనడం జరిగింది.

పుర్లి తామ్రశాసనంలో 'తిరిలింగ వాస్తవ్యాయ' అనే వాడుక కనిపిస్తుంది. వీటన్నిటినీ సమీక్షిస్తూ శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు, ట్రిల్లింగాన్, తిరిలింగ పదాలకూ తెలుగుకూ సంబంధం ఉన్నమాట నిజమేకాని, ఇవేవీ 'త్రిలింగ' అనే సంస్కృత పదానికి వికృతులు కావడానికి వీల్లేదని నిర్ణయించారు.

ఈ పదాలకు దగ్గరగా కలిపించే తిల్లాంగ్, తైలాంగ్ అనే జాతి బర్మా దేశంలో ఉన్నదనీ, క్రమంగా వారే ఆంధ్రదేశానికి వలస వచ్చి తెలుగు వారయినారని మరొక వాదం ఉన్నది.

మహానదికి ఉపనదిఅయిన 'తేలివాహ' నదీ తీరంలో ఉన్న మనుష్యులే ఆంధ్రదేశానికి వలసవచ్చి తెలుగు వారయినారని ఇంకొక వాదం వినిపిస్తుంది. ఇవన్నీ భౌగోళిక విశేషంవల్ల ఏర్పడిన ఉపపత్తులు.

*2. తెలుగు గుణ వాచక పదం :* ఇక, గుణవాచకంగానే తెలుగుపదం ఏర్పడిందనేవారు 1. తిలల వంటి గోవులు సమృద్ధిగా ఉన్న దేశం కాబట్టి తెలుగు దేశమయిందన్నారు. 2. 'తెలి' అనగా స్వచ్ఛమైన భాష కాబట్టి తెలుగు అన్న పేరు వచ్చిందని మరి కొందరన్నారు.

మరికొంత మంది, తెలుగు శబ్దం త్రిలింగ శబ్ద భవం కాదనీ త్రికళింగ శబ్ద భవమనీ వాదించారు. ఆంధ్రదేశానికి పొరుగున ఉన్న దేశం కళింగ దేశం. ఇందులో కొంతభాగం, మధుకళింగ లేక మోదేకళింగ, తలకళింగ, ఉత్కళింగ అని మూడు భాగాలుగా విభాజ్యమై త్రికళింగగా వ్యవహరింపబడ్డదనీ, ఆ త్రికళింగ శబ్దం నుంచే తెలుగు శబ్దం ఉత్పన్నమైనదనీ వీరి వాదన. ఈ వాదం విచార్యమైనది.

మొత్తం తెనుగు, తెలుగు శబ్దాల చర్చలవలన తేలిన సారాంశాన్ని ఈ క్రింది విధంగా అమర్చడానికి వీలుంది :

1. మనకు సాహిత్యాధారాలవల్ల తెలుగు పదం కంటే ముందుగా తెనుగు పదమే లభ్యమౌతున్నది.

2. తెనుగు, తెలుగు ఏకధాతుజన్యాలయిన రెండు రూపాలనడానికి వీలున్నది. కేవలం న,ల ల వినిమయం వలన ఆ రెండురూపాలూ ఏర్పడి ఉండవచ్చు.

3. తెనుగుకూ, త్రినగశబ్దానికీ సంబంధం పండితులచేత ఏ విధంగా కల్పించబడ్డదో, తెలుగుకూ త్రిలింగ శబ్దానికీ, త్రికలింగ శబ్దానికీ పండితులచేత అదే విధంగా కల్పించబడ్డది.

4. దేశంలో శైవమత ప్రాబల్యం ఎక్కువయ్యాకనే త్రిలింగాల ప్రాముఖ్యమూ అందులోనుండి తెలుగు శబ్దం ఉద్భవించి ఉంటుందన్న ఊహ రూపు దిద్దుకోవడం జరిగింది.

5. తెలుగు పదానికి మూలం వీనిలో ఉందేమో అనే అనుమానాన్ని కలిగించే "తిలింగా, తిల్లాంగ్, తైలాంగ్, తలాంగ్" పదాలు విదేశీయుల వ్రాతల్లోనూ, వాయుపురాణంలోనూ కనిపిస్తున్నవి. వీనికీ తెలుగు పదానికీ ఉన్న సంబంధాన్ని నిర్ణయించడానికి ఎవరికీ సాధ్యంకాలేదు. ఇంతేకాక తెలుగు దేశంలో నివసించే తెలగాలు, తెలగాణ్యులు వంటి కులాలకు సంబంధించే పదాల చరిత్రలో తెలుగు పదంయొక్క చరిత్రకూడా ముడిబడి ఉన్నదేమో విచారించవలసి ఉంటుంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో జనం మాట్లాడే తెలుగుభాష పుట్టు పూర్వోత్తరాల కథ ఇది.

—*—

3

# తెలుగు భాష - యుగ విభజన

తెలుగుభాష ఎప్పుడు ప్రత్యేకతను సంతరించుకుని వ్యవహార యోగ్యంగా ఉండడం మొదలైందో ఖచ్చితంగా నిర్ణయించి చెప్పడానికి ఆధారాలు లేవు. మనకు ఇంతవరకూ లభించిన తొలి తెలుగుగ్రంధం మహా భారతం. దీని కాలం 11 వ శతాబ్దపు పూర్వార్ధం. గ్రంధస్థాధారాన్ని బట్టి, క్రీ॥ శ॥ 11వ శతాబ్దం నాటికి తెలుగుభాష వ్యవహారయోగ్యంగా ఉండేదని చెప్పవచ్చు.

తెలుగులో వచ్చిన సాహిత్యగ్రంథాలకంటే ప్రాచీనమైనవి తెలుగు శాసనాలు. మొట్టమొదటి పూర్తి తెలుగుశాసనం క్రీ॥ శ॥ 575 కు చెందింది. ఇది కడప జిల్లా కమలాపురం తాలూకాలోని ఎఱ్ఱగుడిపాడులో దొరికిన ఎఱ్ఱగుడిపాడు శాసనం. దీన్ని వేయించిన రాజులు రేనాటి చోడులు. ఈ కాలానికంటే ముందు, ఆంధ్రదేశాన్ని పాలించిన రాజులూ, ఆంధ్ర రాజులూ ఎన్నో శాసనాలు వేయించిన మాట నిజమే. కాని అవి సంస్కృతంలోనో, ప్రాకృతంలోనో లిఖింపబడ్డవే తప్ప, తెలుగు భాషకు చెందినవి కావు. అందుకు కారణం, ఆ నాటి పాలకులు ఆయా భాషల్ని అభిమానించడమే కాని, తెలుగుకు వ్యవహార యోగ్యత లేనందువల్ల మాత్రం కాదు ఎందుకంటే ఆయా శాసనాల్లో, అప్పటి తెలుగు భాష ఉనికిని గుర్తుచేస్తూ, వ్యక్తుల పేర్లు, గ్రామ నామాలు, తెలుగు భాషలోనే ఉండేవి. గొలశర్మ, దాడెపోజు, గడియనబూమ, గొడవుకామె వంటి వ్యక్తి నామాలూ, వేపూరు, ఒంగోడు, పాండూరు, మూలకూరు, తాంటికొండ మొదలైన స్థల నామాలూ తెలుగు పదాలు.

అలాగే క్రీ॥శ॥ రెండవ శతాబ్దంలో గుంటూరు జిల్లాకు చెందిన అమరావతి శాసనంలో నాగబు అనే పదం కనిపిస్తున్నది ఇక్కడ నాగ శబ్దం సంస్కృతమూ, 'బు' తెలుగు ప్రత్యయమూ. ఈ బు వర్ణం అమహన్న పుంసక ము విభక్తివికారమో, తొలి రూపమో అయి ఉండవచ్చు. ఈ తత్సమ పదం దొరకడం వల్ల మనం కొన్ని నిర్ణయాలు చేయవచ్చు. అవి. (1) క్రీ॥శ॥ రెండవ శతాబ్దంలోనే తెలుగు భాష సంస్కృతం నుండి తత్సమ పదాల్ని తెచ్చుకోగలిగిన స్థితిలో ఉంది. (2) అప్పటికే తెలుగులో పదప్రత్యయ విభాగం ఏర్పడ్డది. ఇంతకు మించి క్రీ.శ. రెండవ శతాబ్దానికి పూర్వం తెలుగు భాష ఉనికిని గురించి సాధికారంగా మనమేమీ చెప్పలేము.

ఇతర భాషా శాసనాలలో తెలుగు మాటలున్నట్లుగా, ఇతర భాషా గ్రంథాలలో కూడా తెలుగు పదాలుండడం మనం గమనించవచ్చు. హాలుడు సంకలనం చేసిన గాథా సప్తశతిలో, ఆ కావ్య భాష అయిన ప్రాకృత భాషకంటే భిన్నమైన మామ, మంచం, అత్త, పొట్ట, పిలుఅ (పిల్ల) వంటి తెలుగు పదాలు కనిపిస్తాయి

ఈ విధంగా నన్నయకు పూర్వం కనిపించే ఆంధ్ర, ఆంధ్రేతర శాసనాల వల్లా, ఇతరభాషా గ్రంథాలవల్లా మనకు విదితమయ్యే తెలుగుభాషను ప్రాఙ్నన్నయభాష అని పిలువవచ్చు ముఖ్యంగా 6 వ శతాబ్దంలో వెలసిన తొలితెలుగు శాసన భాషతో మొదలుబెట్టి 11 వ శతాబ్ది ప్రథమార్ధంవరకూ ఉన్న శాసనాల వరకూ పరిశీలించి, ఆ తెలుగుభాష యొక్క లక్షణాలను వివరించడం భాషా చరిత్రలో ప్రథమఘట్టాన్ని వివరించడం అవుతుంది. అట్లా వివరించడం వలన నన్నయ తన భారతంలో వాడిన భాషకూ, నన్నయకు ముందుకాలంలో ఉండే భాషకూ కొన్ని భేదాలనూ సామ్యాలనూ గుర్తించవచ్చు.

## ప్రాఙ్నన్నయ యుగ లక్షణాలు

I. ధ్వనులు

హల్లులు

పట్టిక - 1

| | | | | |
|---|---|---|---|---|
| ప బ | త ద | ట డ | | క గ |
| | | | చ జ | |
| | స | (ఱ) | | హ |
| మ | న | ణ | | |
| | ల | ళ | | |
| | ర (ఱ) | | | |
| వ | | య | | |

అచ్చులు

ఇ ఈ ఉ ఊ

ఎ ఏ ఒ ఓ

అ ఆ

ఈ ధ్వనులు దేశ్యశబ్దాలలో ఉండేవి. వీటికి తోడుగా తత్సమాలలో ఫ భ, ఢ ఢ, ఠ ఢ, ఖ ఘ, ఛ ఝ, శ, ష లు-హల్లుల్లో కనిపిస్తాయి. దంత్య చ,జలు, ౘ,ౙలు సవర్ణాలుగా కనిపిస్తాయి.

1. నన్నయ భారతంలో ప్రవేశించని 'ఱ'కారం ఈ శాసనాలలో కనిపిస్తుంది గాని, ఇది 7 వ శతాబ్దినాటికే ప్రత్యేకమైన వర్ణత్వాన్ని కోల్పోయి, తెలుగులో (1) అచ్చులమధ్య డకారంగానూ, (2) వర్ణవ్యత్యయంవల్ల పదాది స్థానానికి వచ్చినప్పుడు, సంయుక్తాక్షరంలో రేఫంగానూ, (3) అసంయుక్తంగా ఉన్నప్పుడు, అదే పదాది స్థానానికి వర్ణవ్యత్యయంవల్ల వచ్చి, దకారంగాను మారిపోయింది. అయితే ప్రాఙ్నయ శాసనాలలోనూ, నన్నయనాటి, తరువాతి, శాసనాలలోకూడా, ఈ 'ఱ' కారం, మారిన రూపాలూ, మారని రూపాలూ రెండూ కనిపిస్తాయి. అంతేకాక, సంయుక్తాక్షరంగాను, పదాదియందు అసంయుక్తంగాను కూడా ఇది వాడబడడం కనిపిస్తుంది. ఈ ధ్వని భారత భాషలోనూ, తరువాతి కావ్యభాషలోను పరిహరింపబడ్డది.

2. శాసనాలలో శకటరేఫ వాడుక ఉన్నా దానికీ సాధురేఫకూ మధ్యనున్న ఉచ్చారణ వైవిధ్యాన్ని గుర్తుపట్టగలిగే ఆధారాలు మనకు లేవు క్రీ. శ. 4, 5 శతాబ్దాలనాటికే సాధు, శకటరేఫల మధ్య భేదం నశించిందని చెప్పడానికి ఆధారాలు కనపడతాయి. కాని ఒక లేఖన చిహ్నంగా అది వాడబడడం నన్నయ తరువాతి శాసనాలలోకూడా కనిపిస్తుంది. ఈ భేదాన్ని గుర్తించలేకపోవడంవల్లనే తెలుగు లాక్షణికులు శకటరేఫ ఎక్కువ కాలం నిలువలేదన్న సత్యాన్ని గుర్తించి, దాన్ని బలవంతంగా నిలువబెట్టడంకోసం ఎన్నో పాట్లు పడవలసి వచ్చింది. శకటరేఫ నిర్ణయాలూ, శకట, సాధురేఫల యతి నిషేధాలూవంటివి ఇందువల్లనే లక్షణ గ్రంథాలలో అవతరించడం జరిగింది.

3. మూర్ధన్య అనునాసికమైన ణ కారం ఎప్పుడూ మూల ద్రావిడంలో అచ్చులమధ్య ఉండాలి. అది తెలుగులో నకారంగా మారుతుంది (పనిగొని), కాని ప్రాఙ్నన్నయ శాసన భాషలో ణకార యుక్త రూపాలను కూడా మనం అచ్చుల మధ్య చూడవచ్చు (పణిగొణి).

4. అదేవిధంగా మూలద్రావిడ ళకారం, తెలుగులో లకారంగా, మారింది. కాని ప్రాఙ్నన్నయ శాసనాలలో ళకారం మారని రూపాలనుకూడా మనం చూడవచ్చు (కళరేని-). ఈ సామ్యాన్నిబట్టి మూలద్రావిడ లకారం ఉండవలసిన చోట్లకూడా, విలోమలేఖన పద్ధతి ననుసరించి శాసనాల్లో ళకారాన్ని వ్రాస్తుందేవారు (అయ్యవోళు; కళర్).

5. తాలవ్యాచ్చుతో కూడిన ప్రాచీన ద్రావిడ కకారం తెలుగులో చకారంగా మారుతుంది. ఈ తాలవ్యీకరణం క్రీస్తు పూర్వపు శతాబ్దుల్లో జరిగి ఉంటుందని టి. బరో అనే భాషావేత్త అభిప్రాయం క్రీ శ. 3 వ శతాబ్దంలోనే సంస్కృత శాసనంలో కిరాత > చిలాత గా కనిపిస్తుంది కాని తెలుగు, ప్రాఙ్నన్నయ శాసనాలలో 8వ శతాబ్దం వరకూ లేఖన పద్ధతిలో, కకార యుక్తరూపాలను వాడుతూనే ఉందేవారు (కేయు, కేసిన). అనగా లేఖన సంప్రదాయంలో పూర్వ రూపం నిలిచే ఉందనవలసి వస్తుంది.

6 7 వ శతాబ్ది ముందు తెలుగు శాసనాలలో పదాదిన సరళాలు కల దేశ్య శబ్దాలు లేవు. మూలద్రావిడంలో పదాది సరళాలు లేవు. నన్నయ నాటికి పదాది సరళాలు భాషలో స్థిరపడడం జరిగింది (గాడ్పు, గాదిలి).

ఈ రకంగా ధ్వనుల విషయంలో కొన్ని స్పష్ట లక్షణాలను మనం ప్రాఙ్నన్నయ భాషలో గమనించవచ్చు.

**II** పద ప్రత్యయ సంబంధం

ఈ సంబంధాన్ని వివరించడం అంటేవ్యాకరణ రూపాలను వివరించడమే.

1. (i) ప్రాఙ్నన్నయ శాసన భాషలో ఎన్నో దేశ్య విశేష్య రూపాలు ప్రత్యయ రహితంగా కనపడతాయి ( పాఱ, కుంచ్య, ద్రమ్మ ). తత్సమ శబ్దాలు కూడా ప్రత్యయరహితంగా కనిపిస్తాయి (పాతకు, పండరంగు) మహదేకవచన డుఁ వర్ణంతో పాటు, న్, ఱు, స్టు, ండు ప్రత్యయాలు వాడడం కనిపిస్తుంది (శ్రీమహేంద్రన్, ధనంజయుఱు, సత్యాదిత్యుస్టు, నల్లాతండు) ఇవన్నీ ప్రథమా ఏకవచనంలో పులింగబోధకాలుగా వాడిన ప్రత్యయాలు.

   (ii) ము ప్రత్యయం · దీనికి మ్బు, ంబు లు పర్యాయాలుగా కావ్యభాషలో ఉండగా, శాసనాలలో బిందురహిత బు వర్ణమూ (నాగబు), వు వర్ణమూ (సాసనవు) రెండూ కనిపిస్తాయి.

   (iii) లు ప్రత్యయం· ప్రథమా బహువచనార్థాన్నిస్తూ లు తో పాటు ళ్, ళు, రు కూడా కనిపిస్తుంటాయి (బోళ్, తోటళు, పదురు)

2. ద్వితీయా విభక్తి : ని, ను లతో పాటు మ్, ము లు కూడా వాడబడేవి (తమ్, తము).

3. తృతీయలో మార్పులు లేవు.

4. చతుర్థిలో కావ్యభాషలో ఉన్న కై, కొఱకు లు శాసనాలలో కనిపించవు.
5. పంచమికి ప్రత్యేకమైన ప్రయోగాలేవీ లేవు.
6. షష్ఠి : సంబంధార్థంలో, శాసన భాషలో ప్రత్యేక విభక్తి లేదు. కేవలం ద్వితీయా విభక్త్యంగమే షష్ఠీసూచకంగా ఉంది. చతుర్థి, పంచమీ విభక్త్యర్థాలలో, షష్ఠీ విభక్తి ప్రత్యయంగా పిలువబడే 'కు' ప్రత్యయం వాడుక కనిపిస్తుంది.
7. సప్తమి : కావ్యభాషలో కనిపించే అందు, న ప్రత్యయాలే కాక ఒళన, లోన, లోన అనేవి కూడా వాడబడ్డాయి.

ఇంకా వ్యాకరణాంశాలయిన, సంధి జరిగే పద్ధతీ, సర్వనామ సంఖ్యా కృత్తద్ధితవాచక ప్రణాళికా, సమాపక, అసమాపక క్రియారూప ప్రణాళికా, రూపాలూ, పదబంధాలూ మొదలైన వాటిల్లో శాసనభాషకూ, కావ్యభాషకూ పెద్దగా భేదాలు కనిపించవు.

**III.** వాక్య నిర్మాణాన్ని గురించి మాత్రం కొంత చెప్పుకోవలసిన అవసరం ఉంది ప్రాఙ్నన్నయ భాషలోని వాక్యాలు రెండు రకాలుగా ఉన్నాయి.(1) క్రియ కలిగిన వాక్యాలు. (2) క్రియారహిత వాక్యాలు. క్రియలేని చోట ధాతుజ విశేషణాలను ఉపయోగించి వాక్య నిర్మాణం చేయడం కనిపిస్తుంది (కుండి కాళ్ళ-శ ఇచ్చిన పన్నస-). సంస్కృత వాక్య నిర్మాణ మర్యాద ననుసరించి భారత భాషలో యత్ తత్ ప్రయోగం వలన సంబంధ బోధకంగా చెప్పే వాక్యాలు ఎక్కువగా కనిపిస్తాయి. అటువంటి వాక్యాలకు బదులు, శాసన భాషలో ధాతుజ విశేషణాలు వాడడం కనిపిస్తుంది (దీనికి వక్రబు గంగ ఒడ్డున వేగవిలశాను చింప్పిన వాండు). నన్నయ భారతంలో సంబంధ బోధక సర్వనామాల వాడుకతో పాటు, ధాతుజ విశేషణాల వాడుక కూడా కనిపిస్తుంది.

భారతంలో సంస్కృత ప్రభావం వల్ల తెలుగులో ప్రవేశించిన కర్మణి ప్రయోగాలు చాలా ఎక్కువ. శాసన భాషలో చాలా తక్కువ.

**IV** పదకోశం. ప్రాఙ్నన్నయ శాసన భాషలో తత్సమ తద్భవాల వాడుక బాగానే కనిపిస్తుంది. దానికి తోడు మిశ్ర సమాసాలూ, అరి సమాసాలూ ( త్రికోణ మడువు, సర్వబాద పరియారువు ), మణిప్రవాళ పద్ధతీ (కొఱ్ఱు బోయు తటాకః, రేవశర్మస్యగుడి) కూడా కనిపిస్తాయి కావ్య భాషలో, ముఖ్యంగా నన్నయ భాషలో, మణిప్రవాళ శైలి పరిహరింప బడ్డది.

**V.** లేఖన పద్ధతులు : శాసన భాషలో కనిపించే లేఖన సంప్రదాయం ఇప్పటి మన భాష కంటె భిన్నంగా ఉన్నట్లు మనం గుర్తించగలం. నన్నయ ఆ

సంప్రదాయాన్ని తన భారతంలో పాటించాడో లేదో, ఆయన కాలపు లిఖిత ప్రతి మనకు లభించలేదు గనుక, ఖచ్చితంగా చెప్పడానికి వీలులేదు.

శాసనాలలో (1) పూర్ణ బిందువు బదులు వర్గ పంచమాక్షరాన్ని వాడే వాళ్ళు (కుణ్డి కాళ్ళు) (2) పూర్ణబిందువు వాడితే దాని తరువాతి వర్ణాన్ని ద్విరుక్తం చేయడం (గుంట్ట, అంక్కాడి) కనిపిస్తుంది. లేఖన ప్రమాదం వల్లనో యేమో, వర్గ పంచమాక్షరమూ, పూర్ణబిందువూ రెండూ ఒకేసారి వాడడం కనిపిస్తుంది. (3) (మంచి కొన్డనాంణ్డు) సంయుక్త వర్ణంలో ప్రథమ స్థానాన్ని పొందిన రేఫకు మారుగా వలపల గిలక వాడడం కనిపిస్తుంది. అట్లావాడినప్పుడు ముందున్న అక్షరం ద్విత్వం చేయబడుతుంది (తూప్పున, కార్త్తికాయ).

VI లేఖన పద్ధతులను గురించి చర్చించేటప్పుడు లేఖన దోషాలుగా చెప్పుకోవలసిన అంశాలు కొన్ని ఉన్నాయి. ఇవి అన్ని శాసనాలలోనూ కనిపించే అంశాలే. (1) హ్రస్వ దీర్ఘాలకు భేదం పాటించకపోవడం (సక్షి, సాక్షి-దినికి, దీనికి) (2) శ, స, ష లలో ఒక దాని కొకటి వాడడం (శక్షి, ఈస్వరుడు, సాసనవు) (3) న, ణ లకు కూడా భేదాన్ని పాటించక పోవడం (త్రిణేత్ర, గొణిన, మల్ల అయ్యణ) (4) శకట రేఫను ఒక నియతి లేకుండా వాడడం (తోగొణ్ణవన్ను, రేగొన్టన్నామ గ్రామస్య, మాఱ్పిడుగు రట్టగుళ్ళు) (5) ల, ళ లను నియతి లేకుండా వాడడం (వేగవిళాలు, వేపుగ్గవిలాఖు, సంవత్సరంబుళ్, ఎరికల్, కళర్).

పై విషయాలను అవగాహనం చేసుకోవడం వలన ప్రాఙ్నన్నయ భాషను గురించి మనం కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలు ఏర్పరచుకోవడానికి వీలు కలుగుతుంది. అవి (1) నన్నయకు పూర్వం తెలుగు భాష వ్యవహార యోగ్యంగా ఏర్పడే ఉన్నది. (2) నన్నయభారతభాషకు బీజ ప్రాయాలన దగిన లక్షణాలన్నీ ఈ శాసన భాషలో కనిపిస్తున్నాయి

నన్నయకు ముందు తెలుగుభాష దిక్కులేని ద్రవస్థితిలో ఉండేదని కొందరు భాషా పండితులు అనుకొన్న అభిప్రాయం నిజంకాదు. నన్నయ తనకు ముందు శాసనాలలో కనిపించిన ఙకారాన్ని అది అప్పటికే కొంతవరకు శిథిలమై పోవడం వల్ల పరిహరించడం జరిగింది. ఆయన అచ్చుల మధ్య ణకారాన్నికూడా పరిహరించి 'న' కారమే స్థిరం చేసుకొన్నాడు. వైరి సమాసాలనూ, మణిప్రవాళ శైలినీ స్వీకరించలేదు. తన భారత భాషను శాసనాలు చూపిన మార్గంలోనే పయనించి, అక్కడి కంటె ఎక్కువగా తత్సమ బహుళంగా తీర్చిదిద్దుకున్నాడు నన్నయ, కర్మణి ప్రయోగాలను కూడా ఎక్కువ వాడుకొన్నాడు. పైన చెప్పినవన్నీ నన్నయ భాషకూ, ప్రాఙ్నన్నయ భాషకూ మధ్యనగల సామ్య భేదాలు.

## మధ్యయుగ భాషా లక్షణాలు

అనగా కవిత్రయ భాష తరువాత శ్రీనాథాదుల భాషకూ, ఆ మాటకువస్తే ప్రబంధ, అనంతరప్రబంధ యుగ భాషకూ భాషా నిర్మాణం దృష్ట్యా అనుకోదగ్గ భేదాలను మనము చూపించలేము. ఇంచుమించు నన్నయ భారత భాషలోని లక్షణాలన్నీ అనంతర ప్రబంధయుగం వరకు సాగివచ్చినట్లే మనం భావించడానికి వీలున్నది. కాకపోతే (1) ప్రబంధయుగంలోనూ, అనంతరప్రబంధయుగంలోనూ వ్యాకరణపు కట్టుబాట్లు సడలి కొంతలోకొంత జనంలో ఉన్న వాడుక రూపాలు గ్రంథాల కెక్కడం కనిపిస్తుంది. (2) అనంతరప్రబంధయుగంలో ఉర్దూ, పారశీవంటి అన్య దేశాల వాడుక కూడ ఎక్కువగా కన్పిస్తుంది. (3) విభక్తి ప్రత్యయాల వాడుకలో కొంతవరకు మార్పు గోచరిస్తుంది. (4) నన్నయ భాష కంటె కొత్తవైన పదబంధాల పుట్టుకా, మాండలికాల ఉనికీ ఇక్కడ కనిపిస్తుంది.

న్ననయనాటి నుంచీ దాదాపు పందొమ్మిదవ శతాబ్దపు మధ్యభాగం వరకూ, గ్రంథాలలోని భాషలో పెద్దగా భేదం కనిపించకపోవడానికి కారణం 1. నన్నయ భారతభాషనే ఆధారంగా తీసికొని, దానికంటె భిన్నంగా వాడుకభాషలో ఆయా కాలాల్లో వచ్చిన మార్పుల్ని గ్రంథస్థం చెయ్యడానికి కవులు పూనుకొనకపోవడం. మనం రచనల ఆధారంగా లక్షణ సమన్వయం చేయచూస్తే పెద్దగా భేదకలక్షణాలు కన్పించవు. 2. శాసనభాషను ఆధారంగాచూస్తే కొన్ని శాసనాలు వ్యవహార భాషలోనే ఉన్నా, ఎక్కువ పదాలూ, సమాస భూయిష్ఠమైన రచనా, సంస్కృత పదవిన్యాసం అధికంగాగల ఆడంబరయుతమైనశైలీ వానిలో కనిపిస్తుంది. మొత్తంమీద ఈ ఎనిమిదివందల సంవత్సరాలలో చెప్పుకోదగ్గ భేదక లక్షణాలు కనిపించకపోవడానికి కారణాలివే.

## ఆధునికభాషా లక్షణాలు

1848 లో ఆధునిక సాహిత్య యుగకర్త శ్రీ కందుకూరి వీరేశలింగం జనించారు. గురజాడ, గిడుగు రామమూర్తిపంతులు అయనకు సమకాలికులు. యుగ ప్రభావాన్ననుసరించి విద్యాధికులైన యువకుల మీద ఆంగ్లభాషా ప్రభావం ఎక్కువగా ప్రసరించింది. వీరిలో చాలామంది రవీంద్రుని శాంతినికేతనంలో విద్యను అభ్యసించి వంగభాషలోని పోకడలను అర్థంచేసుకొన్నారు. రవీంద్రుడు, శరత్ వాళ్లను బాగా ఆకర్షించారు. దేశంమొత్తంమీద పరాయివాళ్ళ పాలనలో ఉన్న దేశాన్ని స్వతంత్రం చెయ్యాలనే ఇచ్ఛ ముమ్మరంగా జనించినది. గాంధీజీ తన సత్యాగ్రహోద్యమంతో మొత్తం దేశాన్నంతటినీ ఊర్రూతలూపివేశారు.

ఈరకంగా తీవ్రమైన మార్పును అన్నిరంగాలలో కోరుకొనే జనానికి భాషా రంగంలో కూడా అటువంటి మార్పు రావలనే కాంక్ష ఉద్ధృతంగా జనించింది. నిజానికి భాష, అది మారవలసిన తీరులో ఎప్పటికప్పుడు మారుతూనే ఉంది. జనంలో ప్రాంతాలననుసరించీ, వ్యక్తిగతమైన అలవాట్లనుబట్టీ మాండకాలు ఏర్పడుతూ సునిశ్చితమైన భేదకలక్షణాలను సాధిస్తూనే ఉన్నాయి. కాని పందొమ్మిదవ శతాబ్దం వరకూ అవేవీ గ్రంథాలలో వాడుకోడానికి ఆమోదయోగ్యం కాలేదు. అందువల్ల అప్పటివరకూ ఉన్నభాషకు కావ్యభాష అనీ, గ్రామ్యభాష (ఆనాటి వాడుకభాష) అనీ రెండు రూపాలు ఏర్పడ్డాయి.

ఆధునిక యుగంలో అన్నిరంగాల్లో చెలరేగిన భావవిప్లవం, వాడుకభాషను గ్రంధస్థం చెయ్యాలనే తీవ్రాభిప్రాయంతో భాషారంగంలో కూడా చెలరేగింది. ఈ విప్లవాన్ని ఉజ్జ్వలం చేసి ఏకముఖం చేసినవాడు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు. గురజాడ కూడా తన రచనల్ని 'ముఖ్యంగా కన్యాశుల్కాన్ని మాండలికమైన పాత్రోచిత భాషతో అలంకరించారు తరువాత వాడుకభాష విషయంలో ఎంతో ప్రతిఘటన చెలరేగినా క్రమక్రమంగా, శిష్టవ్యవహారమనే పేరుతో అది గ్రంధస్థం కాజొచ్చింది. అందుకు అనువుగా తెలుగు సాహిత్యంలో కవితాశాఖకంటే, వచనశాఖ కథలుగా, నవలలుగా, నాటకాలుగా, వ్యాసాలుగా బహుముఖాలై విజృంభించి వాడుకభాషకు అవకాశం కల్పించింది. కవిత్వంలో కూడా గణఛ్ఛందోబద్ధమైన పద్యాలను అవతలుంచితే ప్రస్తుతం ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్న వచనకవిత కూడా వాడుకభాషనే స్వీకరించింది. ప్రచార సాధనాలయిన రేడియో, వార్తాప్రతికలు, సినిమా మొదలైనవి కూడా ఈ భాషనే చేపట్టడం జరిగింది. ఇది సర్వసాధారణంగా కృష్ణా గోదావరి జిల్లాల శిష్టుల వాడుకభాషనే పోలి ఉంటుంది దీన్నే ప్రామాణికభాష అని కూడా అంటారు. ఇట్టి వాడుకభాషను, మాండలిక భేదాలను పరిహరించి పరిశీలిస్తే, ఈ క్రింది సామాన్య లక్షణాలను కలిగి ఉంటుంది

## ధ్వనులు

1. గ్రాంధిక భాషలో లేఖన చిహ్నాలుగానే మిగిలిపోయిన అరసున్న, బండి 'ఱ' లు పరిహరింపబడ్డవి. 2. క్రియారూపాల్లో రెండు వ్యాకరణ రూపాల మధ్య వచ్చే (æ) ధ్వని గ్రహింపబడ్డది.

ఉదా వచ్చాడు; చేశాడు

3. అన్యభాషా పదాలు తెలుగులో చొరబడడం వల్ల ఆంగ్ల, ఉర్దు భాషలనుండి f, z వర్ణాలూ, తెలుగు వర్ణసమామ్నాయంలో చేరాయి ఉదా: కాఫీ, బజారు ప్లెజర్ వంటివి

5)

K (ఖ): Y (గ) వర్ణాలు ఈ తెలుగులో కేవలం ఖ, గలు గానే గ్రహింపబడ్డవి.

వ్యాకరణ రూపాలు

1. ప్రథమావిభక్తి అమహన్నపుంసకమువర్ణం పదం చివర అజ్విరహితమై కేవలం అనునాసికంగా మిగిలిపోయింది.

ఉదా: పుస్తకం, గుఱ్ఱం.

బహువచన లు వర్ణం దానికి ముందున్నవర్ణం అద్విరుక్తమో, అసంయుక్తమో అయితే కలిసిపోయి సంయుక్తరూపాలు ఏర్పడి అవే ఈ భాషలో స్థిరపడ్డవి.

పని + లు = పన్లు; చీరె + లు = చీర్లు
కోడి + లు = కోళ్ళు; మేడ + లు = మేళ్ళు.

క్రియారూపాల్లో కూడా ఉత్తమపురుష బహువచన ప్రత్యయమైన 'ము' వర్ణం కేవలానునాసికంగా మిగిలిపోయింది.

ఉదా: చూచాం, వెళ్ళాం.

2. అజంతభాష అయిన తెలుగులో పదాల చివర కనిపించే అచ్చు సాధారణంగా అర్ధమాత్రాకమైన అచ్చు గాబట్టి, సంధి జరిగినప్పుడు అది జారిపోయి పరస్వరం నిలవడమే జరుగుతున్నది. పూర్వ వ్యాకర్తలు ఒక్క ఉత్తునకు మాత్రమే నిత్య సంధిని విధించినా వాడుకలో మిగిలిన అ, ఇలకు కూడా సంధి జరగడమే కనిపిస్తున్నది.

అమ్మ + ఇచ్చింది = అమ్మిచ్చింది
పని + ఉంది = పనుంది మొ॥

3. మాండలిక భేదాలను కూడా గమనిస్తే క్రియారూపాల్లో ఎన్నో రూపభేదాలు సేకరించబడ్డవి.

ఉదా: వచ్చాడు, వచ్చినాడు, అచ్చిండు మొ॥

వాక్య నిర్మాణం

1. క్రియారహిత వాక్యాల వాడుక ఎక్కువైంది.

2. ఆంగ్లంలో ప్రచురంగా ఉన్న సంయుక్తవాక్యాల (Compound entence) వాడుక వాడుకభాషలో లేదు.

3. సామాన్య వాక్యాలూ, సంశ్లిష్ట వాక్యాలూ ఎక్కువగా కనిపిస్తున్నయ్.

4. కర్మణి ప్రయోగాల వాడుక లేదు.

పదకోశం

ఉర్దూ, ఆంగ్లాల నుండి ఎన్నో పదాలు తత్సమాలుగానూ, తద్భవాలుగానూ వచ్చి చేరి వాడుక భాషను పరిపుష్టం చేశాయి. ఆ భాషల్లోని నామపదాలకు, చేయు, కొట్టు వంటి అనుబంధాలు చేరి క్రియా పదాలు ఏర్పడడం జరిగింది- వర్క్ చేయు, తయారు చేయు, లైటు కొట్టు, మస్కా కొట్టు మొ॥

లేఖన చిహ్నాలు

1. తెలుగులో /æ/ వర్ణం వాడుక ఎక్కువగా కనిపిస్తున్నా, దానికి లేఖన చిహ్నం ఏర్పడలేదు. అలాగే /f/ /z/ వర్ణాలకు కూడా.

2. లేఖన చిహ్నాలయిన 'ఱ' 'ఁ' లు పూర్తిగా మరుగున పడిపోవడం జరిగింది.

3. పూర్ణ బిందువు స్థానంలో వర్గ పంచమాక్షరం వాడడం, రేఫకు బదులుగా వలపల గిలక వాడడం పూర్తిగా నశించి పోయింది.

కేవలం స్థూలమైన భేదక లక్షణాలను గమనించగా, ప్రాఙ్నన్నయ, నన్నయ, మధ్యయుగ, ఆధునిక యుగాలకు చెందిన తెలుగు భాషా లక్షణాలివి.

—*—

# 4

# తెలుగు లిపి—పరిణామం

అతి ప్రాచీన కాలంలో కూడా కూత వేటు దూరానికి మించి మనుషు లున్నప్పుడు, వాళ్ళకు వార్తలు పంపించడానికి ఏదో ఒక రకమైన లిఖిత పద్ధతిని మనుష్యులు అవలంబిస్తుండే వాళ్లు కాని ఈ లేఖనం, ఈనాటి మన లేఖనం వంటిది కాదు.

ప్రాచీన పారశీకులు బాణాల వంటి గుర్తులతో ఒక లిపిని వాడుకునే వారు. దీనికి క్యూనిఫారం లిపి అని పేరు.

ఆదిమ కాలంలో, రంగు రంగుల త్రాళ్ళను క్రమ బద్ధంగా ముళ్ళు వేయడం వల్ల గానీ, తాము చెప్పదలచుకున్న భావాని కనుగుణమైన బొమ్మలు గీయడం వలన గానీ, భావ ప్రకటన చేస్తుండేవారు. చిత్రలిపి అనబడే బొమ్మల లిపి ప్రాచీన కాలంలోనే భారత దేశంలో రూపొందిందనీ, దాని నుండే బ్రాహ్మీలిపి పరిణమించిందనీ సర్ కన్నింగ్ హాం అభిప్రాయం. కాని దేవిడ్ డిరెంజర్, జార్జ్ బూలర్ మొదలైన శాస్త్రవేత్తలు బ్రాహ్మీలిపికి, ఫోనీషియన్ లిపి మూలమని వాదించారు. కాని ఈ వాదాన్ని పలువురు లిపి శాస్త్రజ్ఞులు సోపపత్తికంగా ఖండించగలిగారు.

ఇంతకూ బ్రాహ్మీలిపి భారత దేశంలో రెండు వేల సంవత్సరాలకు పూర్వమే ఉన్నట్లు నిరూపింప బడ్డది

బ్రాహ్మీ లిపిని ఎడమ వైపు నుండి కుడి వైపుకు వ్రాసే వారు. అశోకుని కాలం నాటికి అతడు వేయించిన కొన్ని శాసనాలలో, ఈ లిపిలో ఎడమ నుండి కుడికి, తిరిగి కుడి నుండి ఎడమకు, పంక్తి క్రమంలో వ్రాయడం కనిపిస్తుంది. కర్నూలు జిల్లాలోని ఎఱ్ఱగుడి పాడులో దొరికిన అశోకుని లఘుశాసనం ఈ క్రమంలో ఉంది.

బూలర్ అభిప్రాయం ప్రకారం అశోకుని ధర్మ శాసనాలలో వాడిన లిపిలో రెండు భేదాలున్నాయి. అవి (1) ఉత్తరదేశపు శాసనాలలో వాడబడిన బ్రాహ్మీలిపి (2) దక్షిణ దేశపు శాసనాలలో వాడబడిన బ్రాహ్మీలిపి. భట్టిప్రోలు స్తూపంలో ధాతు కరండాల మీద కనిపించిన బ్రాహ్మీలిపిలో ఈ దక్షిణ దేశ భేదాన్ని గుర్తించడం జరిగింది. అందువల్ల భట్టిప్రోలులిపిని పోలిన లిపిని

ద్రావిడ బ్రాహ్మి అని వ్యవహరించారు బ్రాహ్మీలిపి నుండి ఈ ద్రావిడ బ్రాహ్మి క్రీ॥ పూ॥ అయిదవ శతాబ్దం నాటికే విడిపోయి ఉండవచ్చునని బూలర్ అభిప్రాయం. ఈ సమయాన ఉత్తర దేశంలో ప్రచారంలో ఉన్న బ్రాహ్మీలిపిలో కూడా చాలా మార్పులు కలిగాయి ఆ తర్వాత ఉత్తర దేశంలో పరిణతి చెందిన లిపిని నాగర లిపి అని వ్యవహరించారు అదే దేవనాగర లిపి.

అశోకుని కాలంలో బ్రాహ్మీలిపితో పాటు కొంత కొంత ఖరోష్ఠి లిపి కూడా వాడుకలో ఉండేది. దీన్ని ఈ నాటి ఉర్దూ అరబిక్ భాషల వలె కుడి నుండి ఎడమకు వ్రాసేవారు. రానురాను, బ్రాహ్మి చాలవరకు ఖరోష్ఠి నాక్రమించి రాజ్యం చేసింది. అశోకునకు ప్రచార నిమిత్తం ఏకైక భాష ప్రాకృతమైనట్లుగా, ఇంచుమించు ఏకైక లిపి బ్రాహ్మీలిపిగా స్థిరపడ్డది.

ద్రావిడబ్రాహ్మి నుండి దాక్షిణాత్యలిపులెన్నో రూపుదిద్దుకోవడంజరిగింది.

తమిళ దేశంలో ఇది గ్రంథ లిపిగా మారి, నేటి తమిళ లిపికి జన్మనిచ్చింది.

తెలుగు కన్నడ దేశాలలో ఇది మొదటి తెలుగు-కన్నడ లిపిగా ఏర్పడ్డది. దీన్నే వేంగీ లిపి అని పిలిచేవారు. ఈ వేంగీలిపి, దక్షిణ దేశంలోనే కాక, వర్తక సంబంధాల వలన, ఇండోచైనా, మలేషియా, గోవా, ఇండోనీషియాలలోని హిందూరాజ్యాలలో కూడా వాడబడ్డది.

క్రీ॥ శ॥ ఏడవ శతాబ్దం నాటికి తెలుగు దేశాన్ని చాళుక్యులు పరిపాలించారు. వారి కాలంలో ఈ వేంగీలిపి కొంత మారి వేంగీచాళుక్యలిపిగా రూపాంతరం చెందింది. ఇది, 14 వ శతాబ్ది వరకూ తీవ్రమైన మార్పులకు గురి అవుతూ వివిధ శాసనాలలో కనిపిస్తుంది. పదవ శతాబ్ది నుండి 14వ శతాబ్ది వరకూ ఈ లిపికి సంధి కాలమని చెప్పవచ్చు. నన్నయ ఈ లిపిలోనే తన భారత ప్రతిని వ్రాసి ఉంటవచ్చు.

14 వ శతాబ్ది నాటికి వేంగీచాళుక్యలిపి, ఇప్పటి తెలుగు కన్నడ లిపుల తొలి రూపంగా ఏర్పడింది. క్రమంగా ఈ లిపి తెలుగులో సంక్రమితనం సంతరించుకుంది. కన్నడంలో కోణాకారతను తెచ్చుకుంది. ఇదే తెలుగులో పాత తెలుగు లిపి గానూ, కన్నడంలో హళగన్నడలిపిగానూ రెండు విభిన్న మార్గాలను పట్టి పయనించింది. తరువాత హళగన్నడ లిపిలో నుండి నేటి కన్నడ లిపీ, పాత తెలుగు లిపిలో నుండి నేటి తెలుగులిపీ ఆవిష్కరింపబడ్డాయి.

అశోకుని కాలం నుండి 15 వ శతాబ్ది వరకూ ఉన్న శాసనాలను పరిశీలిస్తే ఈ లిపి పరిణామం ఏ విధంగా జరిగి ఇప్పటి అక్షరాకృతులు లభించాయో తెలుస్తుంది. ఈ రకమైన పోలికల్ని వెతికి పట్టుకుని అక్షర రూప పరిణామాన్ని అవగతం చేసుకోవడానికి మల్లంపల్లి వారి పట్టిక బాగా ఉపకరిసుంది.

తెలుగు లిపి పరిణామంలో కొన్ని సామాన్య లక్షణాలను మొత్తం పరిణామ కాలంలో గుర్తించవచ్చు. అవి

1. తొలి కాలంలో అక్షరాల తలల మీద తలకట్టుకు బదులు కేవలం ఒక అడ్డు గీత ఉండేది.

2. మహాప్రాణాల ఒత్తులకు ఈ నాడున్నట్లుగా కాక, బోర్ల వేసిన అర్ధచంద్ర రేఖ ఒకటి అక్షరం క్రింద వ్రాయబడుతుండేది.

3. అక్షరం పై భాగాన్నో లేక, దానికి కుడిపక్కగానో, చుక్కలాగా గుర్తుపెట్టబడే పద్ధతి అనుస్వారాన్ని తెలియజేస్తుండేది. రానురాను అది సున్నగా మారి, అక్షరం పక్కకువచ్చి చేరింది.

4. ఇప్పుడు గ్రాంథిక భాషలో కనిపించే అరసున్న శాసనాలలో లేదు. నన్నయ తరువాతి శాసనాల్లో అనునాసికానికుండే అర్ధోచ్చారణను తెలియజేయడానికి ఒక పద్ధతిని అవలంబించినట్లుగా కొంతవరకు కనిపిస్తుంది. పూర్ణమైన అనునాసికోచ్చారణమైతే సున్నవాడి దానితరువాతి హల్లును ద్విరుక్తం చేసేవాళ్లు (తలిదండ్డ్రిదులు). అది అనునాసికానికి అర్ధోచ్చారణంగా ఉంటే, మీది హల్లుకు ద్విత్వం ఉండేదిగాదు (వాండు). కాని ఈ పద్ధతి సర్వే సర్వత్రా కనిపించదు.

5. అక్షరాల ద్విరుక్తతను సూచించడానికి, ఇప్పుడున్న ఒత్తులకు బదులు, అక్షరం కింద, అదే అక్షరాన్ని వ్రాసేవాళ్ళు.

ప్రాచీన శాసనాలలో వ్యాప్తిలో ఉండిన లేఖన పద్ధతుల్ని గురించి ముందు ప్రకరణాలలో వివరించడం జరిగింది. తెలుగులోనికి మొదట శాసనాల ద్వారా ప్రవేశించిన 'ఱ' కారాన్నీ దాని పరిణామాన్నీ అక్కడ చర్చించడం జరిగింది. అనునాసిక్యానికి లేఖనచిహ్నాలుగా, సున్న, వర్గపంచమాక్షరం వాడడాన్ని వివరించడం జరిగింది.

ఏ భాషలోనైనా దానికుండే లిపి నూటికి నూరు పాళ్ళూ ధ్వని విధేయంగా ఉండదు. కొన్నిచోట్ల లిపిలో (1) ఉచ్చారణలేని లేఖన చిహ్నాలు ఉండవచ్చు (గ్రాంధిక భాషలో శకటరేఫం- ''నీఱు''). (2) ఉన్న ఉచ్చారణను సూచించడానికి తగిన లేఖనచిహ్నాలు లేకుండా ఉండవచ్చు (వచ్చాడు, లాటాకు) 3. అక్షర క్రమం పదాల్లో ఒక రకంగా ఉంటే దాని ఉచ్చారణ మరో విధంగా ఉండవచ్చు (బ్రాహ్మణుడు).

తెలుగులో మనం గుర్తించే వర్ణాలేకాక సవర్ణాలు కూడా ఉన్నాయి. అవి

(1) దంత్యతాలవ్య చజలు

(2) ఞ, ఞ అనే అచ్చులు

(3) శిథిల స్పర్శాలయిన, గ, ఢ లు

(4) అనునాసిక్యగుణం కలిగిన, మ, వ లు

(5) ఇంకా అచ్చుల్లో కనిపించే వివృత ఓష్ఠ్యాచ్చులు ఒ ఓ లు

వీటిని తెలియజేయడానికి ( ఒక్క, మ, వ, లకు తప్ప ) లేఖన చిహ్నాలు లేవు. నిజానికి సవర్ణాలకు లేఖన చిహ్నాలు ఉండవలసిన అవసరంలేదు.

కాని దంత్య తాలవ్య చజలను ప్రత్యేకంగా గుర్తించే లేఖన చిహ్నాలు లేని లోపం గుర్తించి, C. P. Brown, తాలవ్య చజలు మొదటివనీ దంతచజలు రెండవవనీ ఉద్దేశించి, తాలవ్య చజల మీద తెలుగు అంకె ఒకటి (౧)నీ, దంత్య చజల మీద రెండు (౨) నూ వేసే అలవాటు ప్రవేశపెట్టాడు. దాన్ని తరువాతి వైయాకరణులు అంగీకరించి గ్రహించారు. శాసనాల్లో ఈ భేదాన్ని, సూచించ దలచి, దంత్య చకారాన్ని 'త్స'గా వ్రాయడం కనిపిస్తుంది (చింతల మొదత్స-పుత్సుకొని).

అప్పకవి, గురు, ర, ల (ఱ, ళ) లను సూచించడానికి, లఘు ర, ల ల మీద చుక్కపెడితే సరిపోతుందని వివరించాడు. ఈ అంశాన్ని చింతామణి సైతం సూచించింది కాని ఆ పద్ధతిని పాటించిన శాసనమేదీ లేదు.

కాగా, సంస్కృతేతర భాషల ప్రభావంవల్ల తెలుగు ఉచ్చారణ విధానం లోనికి ప్రవేశించిన వర్ణాలు కొన్ని కనిపిస్తున్నాయి. వాటికి కూడా లేఖన చిహ్నాలు తెలుగులో ఏర్పడలేదు. అవి:

1. ఫ వర్ణం . ఇది సంస్కృతం ద్వారా ప్రవేశించిన ఉభయోష్ఠ్య మహాప్రాణ శ్వాస స్పర్శమైన ఫ కంటె భిన్నమైనది. ఈ ఫ దంతౌష్ఠ్య శ్వాస ఊష్మ ధ్వని కలది. కాఫీ, ఫోటో, వంటి నిత్యం వాడుకునే పదాల ద్వారా ఇది తెలుగులో స్థానం సంపాదించుకుంది. దీనికి కూడా ఫ వర్ణాన్నే మనం వాడు కుంటున్నాము. తెలుగులో దీని ప్రత్యేకతను చూపదలచుకుంటే, ప కింద ఒక అడ్డుగీత గానీ, లేదా డిగ్రీ గుర్తు గానీ పెట్టుకోవచ్చు.

2. /z/ : ఇది దంతమూలీయ నాదోష్మం. ఇది కూడా, బజారు, హాజరు, వంటి పదాలవల్ల తెలుగులో కుదురుకున్న వర్ణం. దీనికి కూడా లేఖన చిహ్నం ఏర్పడనందున, తెలుగులో ఉన్న దంతమూలీయ నాద స్పృష్టోష్మమైన /జ/ వర్ణాన్ని వాడుకుంటున్నాము. అంతేకాక, దీన్ని చాలా మంది, తాలవ్యనాద స్పృష్టోష్మంగా ఉచ్చరించడం కద్దు. చిత్రంగా విలోమ పద్ధతిలో ఒక్కొక్క సంస్కృత పదంలో కనిపించే తాలవ్యనాదస్పృష్టోష్మాన్ని దంతమూలీయ నాదోష్మంగా ఉచ్చరించడం కద్దు. ఉదా : నిజం.

మనం వ్రాస్తున్నట్లుగా ఉచ్చారణ లేని లేఖనాలు కొన్ని తెలుగులో కనిపిస్తాయి. అవి

1. జ్ఞ : ఈ సంయుక్త వర్ణానికి గల ఉచ్చారణ జకార యుక్తంగా ఉండాలని లేఖనం తెలియజేస్తుంది. బహుశ తొలిరోజుల్లో జకారయుక్త ఞ కారమే ఉచ్చారణలో ఉండి ఉండవచ్చు. అందువల్లనే నన్నయ ఈ జ్ఞకారానికి చఛ జఝ లతో యతివేయడం జరిగింది. కాని రాను రాను ఈ ఉచ్చారణ గకారయుక్త ఞ కారంగా మారింది. తిక్కన్న ఈ అంశాన్ని గుర్తించడం వల్లనే కాబోలు, దీనికి కఖ గఘ లతో యతి వేయడం సంభవించింది. రాను రాను ఆధునిక కాలాన ఎంతో మంది దీన్ని గకారయుక్త నకారంగా (గ్న) ఉచ్చరించడం మనం గమనించవచ్చు. అయినా లేఖన పద్ధతి మాత్రం, తొలి ఉచ్చారణను సూచించేదిగా, మార్పులేకుండా ఉండిపోయింది.

2. థ . దంత్య మహాప్రాణ శ్వాస స్పర్శమైన ఈ వర్ణం ఉచ్చారణలో వేడు చాలా వరకు జారిపోయినట్లుగా గ్రహించవచ్చు లేఖనచిహ్నం ఉన్నా దీన్ని దంత్య మహాప్రాణనాదస్పర్శమైన గా ఉచ్చరిస్తుండడం మనం గ్రహించ వచ్చు.

3. హ్మ - హ్న - లు : ఈ రెండు సంయుక్తాక్షరాలనూ లేఖనంలో ఇలాగే వ్రాసినా ఉచ్చారణంలో ఇవి వ్యత్యయాన్ని పొంది మ్హ - న్హ - లుగా మారిపోయాయి.

ఉదా : బ్రాహ్మణుడు > బ్రామ్హణుడు
చిహ్నము > చిన్హము.

ఈ వివరాలన్నిటినీ అవగతం చేసుకొన్న మీదట తెలుగు లిపిని చాలా వరకు ధ్వని విధేయమైన లిపిగానే మనం అంగీకరించవచ్చును.

| | అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఏ | ఐ | ఓ | ఔ | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ | ట | ఠ | డ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మౌర్యకాలపు బ్రాహ్మీ లిపి క్రీ.పూ. 3వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| భట్టిప్రోలు ధాతుకరండము మీది బ్రాహ్మీలిపి క్రీ.పూ. 3వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| సాతవాహన కాలపు బ్రాహ్మీ (గు.హా.) లి క్రీ.శ. మొదటి శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఇక్ష్వాకు కాలపు బ్రాహ్మీ లిపి క్రీ.శ. 3వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| గుప్తుల కాలపు లిపి క్రీ.శ. 4వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| శాలంకాయన కాలపు పురాతన తెలుగు-కన్నడ లిపి - క్రీ.శ. 5వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| పల్లవుల కాలపు గ్రంథ-తమిళ లిపులు క్రీ.శ. 7వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 7వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| పూర్వచాళుక్య యుగపు తెలుగుకన్నడలిపి క్రీ.శ. 10వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| రాజరాజ నరేంద్రుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 11వ శతాబ్దము నన్నయ భట్టయుగము - పూర్వకాలము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| కాకతి గణపతి దేవుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 13వ శతాబ్దము తిక్కన యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ప్రోలయ వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ.శ. 14వ శతాబ్దము - ఎఱ్ఱాప్రగడ యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| పెదకోమటి వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ.శ. 15వ శతాబ్దము - శ్రీనాథుని యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| కృష్ణదేవరాయల కాలపు తెలుగు లిపి క్రీ.శ. 16వ శతాబ్దము - పెద్దన యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |

| ౨ | ఢ | ణ | త | థ | ద | ధ | న | ప | ఫ | బ | భ | మ | య | ర | ల | వ | శ | ష | స | హ | ళ | ఱ | క్ష |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మౌర్యకాలపు బ్రాహ్మీ లిపి క్రీ పూ 3 వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| భట్టిప్రోలు ధాతుకరండము మీది బ్రాహ్మీ లిపి – క్రీ పూ 3 వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| సాతవాహన కాలపు బ్రాహ్మీ (గుహా) లిపి క్రీ శ మొదటి శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఇక్ష్వాకు కాలపు బ్రాహ్మీ లిపి క్రీ శ 3 వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| గుప్తుల కాలపు లిపి క్రీ శ 4 వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| శాలంకాయన కాలపు పురాతన తెలుగు-కన్నడ లిపి – క్రీ శ 5 వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| పల్లవుల కాలపు గ్రంధ తమిళ లిపులు క్రీ శ 7 వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| తెలుగు-కన్నడ లిపి క్రీ శ 7 వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| పూర్వచాళుక్యయుగపు తెలుగు-కన్నడ లిపి క్రీ శ 10 వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| రాజరాజనరేంద్రుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ శ 11 వ శతాబ్దము నన్నయభట్టు యుగము - మార్గకాలం | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| కాకతి గణపతిదేవుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ శ 13 వ శతాబ్దము – తిక్కన యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ప్రోలయ వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ శ 14 వ శతాబ్దము – ఎఱ్ఱాప్రగడ యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| పెదకోమటి వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ శ 15 వ శతాబ్దము – శ్రీనాథుని యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| కృష్ణదేవరాయల కాలపు తెలుగు లిపి క్రీ శ 16 వ శతాబ్దము – పెద్దన యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |

# 5

# తెలుగు భాష – ధ్వనుల ఉత్పత్తి

మానవుని ముఖయంత్రం యొక్క మొదటి ప్రయోజనం ఆహారాన్ని శరీరపోషణకు అందించడం. అందుకు అనువుగా ఉండేట్లుగా, అందులోని విడి భాగాలన్నీ అమర్చబడ్డవి దంతాలు నమలడానికీ, నాలుక నలుగుతున్న ఆహారాన్ని దంతాల క్రిందికి వచ్చే విధంగా అటూ ఇటూ కదపడానికీ, ఉపజిహ్వ ఆహారం శ్వాసనాళిక లోపలికి పోకుండా, మూత లాగా పనిచేయడానికీ ఉపయోగపడు తున్నవి అదే విధంగా శ్వాసనాళిక, ముక్కు మనిషి శరీరానికి అవసరమైన గాలిని అందించడానికి ఏర్పడ్డ అంగాలు.




1 Nasal orifice - నాసికా ద్వారము
2. Nasal Cavity - నాసికాంతర్భాగము
3 Wind pipe - శ్వాసనాళిక
4 Vocal Cords - నాదతంత్రులు
5 Larynx-కృకాగ్రం, స్వరపేటిక
6 Epiglottis-ఉపజిహ్వ లేదా కంఠమూలము
7. Pharynx-గళాగ్రభాగము లేదా సప్తపథ
8 Uvula - లంబిక లేదా కొండనాలుక
9 Tongue back - జిహ్వామూలము
6)

10. Tongue Front-జిహ్వామధ్యము
11 Tongue tip - జిహ్వాగ్రము
12 Soft palate - మృదుతాలువు
13 Hard palate - కఠినతాలువు
14 Teeth ridge - దంతమూలము
15 Teeth front - దంతాగ్రము
16 Lips - పెదవులు
17 Oesophigus-ఆహారనాళిక
18 Blade of the Tongue- జిహ్వా పార్శ్వము

ఈ విధమైన ప్రధాన ప్రయోజనంతో పాటు, వీనికి భాషా సృష్టి అనే మరో ప్రయోజనం కూడా అభ్యాసవశాన అలవడినట్లుగా చెప్పవచ్చు. నాసికారంధ్రాల నుండి మనం బయటికి వదిలే గాలి ముఖంలో ఉండే వివిధ భాగాల సహాయం వల్ల భాషకు మూలబీజమైన ధ్వనిని ఉత్పన్నం చేయగలుగుతున్నది. మనుష్యునికే కాక, సృష్టిలో ఉండే ఎన్నో రకాలయిన పశుపక్షులకు గూడా నోటి ద్వారా శబ్దాన్ని వెలువరించే విధానం ఒకటి దత్తమై ఉన్నది. కాని పశుపక్ష్యాదులు చేసే శబ్దాలకూ మనిషి చేసే శబ్దాలకూ మధ్య భేదం ఉన్న విషయం మనకందరికీ తెలిసినదే!

మనుష్యుని ముఖయంత్రంలో ఏయే ధ్వనులు ఎట్లా జనించి భాషా నిర్మాణానికి మూల బీజాలవుతున్నాయో గ్రహించడానికి ముందు, ఆ ముఖ యంత్రంలో అమర్చబడ్డ వాగ్వ్యవహార హేతువులైన వివిధాంగాల క్రమస్వరూపాన్ని గ్రహించడం అవసరం.

చిత్రంలోని 5 వ నెంబరు కల అవయవం స్వరపేటిక (Larynx). ముఖ యంత్రంలో, ధ్వనిని ఉత్పన్నంచేసే శక్తి కలిగిన అవయవమిది. ఇది ఉపజిహ్వ (Epiglottis - 6) క్రిందుగా, శ్వాసనాళిక (Wind Pipe - 3) కు పైభాగాన ఉంటుంది. దీని అంచు రేఖా మాత్రంగా గడ్డం క్రిందుగా ఉండే గొంతు మధ్య భాగంలో ఎత్తుగా ఉండలాగా కనిపిస్తుంటుంది. దీన్నే జనులు గొంతు ముడి అని వ్యవహరిస్తారు. ఇది గుండ్రంగా ఉన్నా అంచుల దగ్గర కొద్దిగా కోలుగా ఉండి, రెండు భాగాలుగా విభజించబడి ఉంటుంది. ఈ భాగాలలో నిలువుగా పేర్చబడ్డ చర్మపుతంత్రులు (Vocal Cords - 4) బిగిసి ఉంటాయి. మనం లోపలికి గాలి పీల్చుకునేటప్పుడు సాధారణంగా ఈ తంత్రుల్లో ఎటువంటి మార్పూ కలుగదు. కాని శ్వాసనాళం నుంచి గాలి బయటికి విసర్జించబడుతున్నప్పుడు మాత్రం, మనం తలుచుకుంటే ఆ ఉచ్ఛ్వాసం ఈ తంత్రుల్లో ప్రకంపనాలను కలిగిస్తుంది. ఈ ప్రకంపనాల వల్లనే మొదటి మెట్టుగా స్వరపేటిక నించి బయటికివచ్చే గాలి నాదయుక్తమవుతుంది. నాదయుక్తమైన ఈ గాలి కొంత ముక్కు నుంచిగానీ, అంతా నోటినుంచిగానీ బయటకు రావడానికి అనువైన యేర్పాట్లు మన ముఖ యంత్రంలో అమర్చబడి ఉన్నాయి. ఇటువంటి ధ్వనుల్నే మనం నాద ధ్వనులు (Voiced Sounds) అని వ్యవహరిస్తాము. స్వరపేటికలోని

నాదతంత్రుల్ని ప్రయత్నపూర్వకంగా ప్రకంపనం చెందించకుండా ఉచ్ఛ్వాసం వెలుపలికి వస్తూ ఏర్పరిచే ధ్వనులు శ్వాసధ్వనులు (Unvoiced Sounds) క్, చ్, ట్, త్, ప్ వంటి, అచ్చులు చేరని పరుషాలను శ్వాసధ్వనులకు చక్కని ఉదాహరణలుగా చెప్పవచ్చును. హల్ మాత్రమైన 'క' కారపు పొల్లును ఉచ్చరించేటప్పుడు ప్రకంపనాలు లేకపోవడం 'గ'కారపు పొల్లును ఉచ్చరించేటప్పుడు ప్రకంపనాలు ఏర్పడడం, మనం అభ్యాసంవల్ల గ్రహించవచ్చు. హల్లుల్లో కొన్ని శ్వాసధ్వనులుగా [కఖ చఛ టఠ తథ పఫ-శషస], మరికొన్ని నాదధ్వనులుగా [గఘ, జఝ, డఢ, దధ, బభ, ఙ, ఞ, ణ, న, మ-యరలవ, హ] ఏర్పడినా ఏ భాషలోనైనా అచ్చులు మాత్రం అన్నీ నాదధ్వనులే, అచ్చుల్ని ప్రాణాలనీ, స్వరాలనీ వ్యవహరిస్తారు స్వరాలకూ వ్యంజనాలకూ (హల్లులకూ) మధ్యనున్న భేదం ఏమిటి అన్ని ప్రశ్నించుకుంటే "స్వయం రాజన్తే నాన్యేన వ్యజ్యత ఇతిస్వరాః" అని సంస్కృత వ్యాకరణ వేత్తలు వివరించారు. అనగా స్వరం, ఇతరాపేక్ష లేక, స్వయంగా ప్రకాశించేది అని అర్థం అంటే ఒక అచ్చును ఉచ్చరించడానికి మరే ధ్వని యొక్క విశేష సహాయము అక్కరలేదని అర్థం. దీనికి భిన్నంగా వ్యంజనం అచ్చుల సహాయంవల్ల చక్కగా వ్యక్తం కాగలదు. "పరేణ స్వరేణ వ్యజ్యత ఇతివ్యంజనం," అని వ్యంజనానికి నిర్వచనం ఇవ్వబడింది. వ్యంజనాన్ని "ప్రాణి" అనీ, శరీరమని కూడా అందుకే వ్యవహరించడం జరిగింది

అచ్చుల నిర్మాణ క్రమాన్ని శాస్త్రీయంగా ఈ కింది విధంగా వివరించవచ్చు.

ఉచ్ఛ్వాసం శ్వాసనాళిక నుంచి బయటికి వస్తూ స్వరపేటికలోని నాదతంత్రుల్ని కదిలిస్తుంది. అట్లా కదిలించడం మొదలుపెట్టిన తర్వాత ఆ ప్రకంపనం ఒకానొక నియతాచ్చు ఏర్పడేవరకూ ఆగదు. అట్లా ఏర్పడబోయే ప్రకంపనాల్లో మనం గుర్తు పెట్టుకోవడానికి వీలయిన ఒరిపిడి (Friction) కనిపించదు. ఈ లక్షణాలను గమనించడంవల్లనే Daniel Jones అనే భాషావేత్త 'A Vowel is a voiced sound accompanied by a free passage of air through mouth and not producing audiable friction" అనే నిర్వచనాన్ని ఇచ్చాడు. దీనివల్ల అచ్చులన్నీ నాదాత్మక గుణం కలిగిన వర్ణాలనే విషయం వివరించబడుతున్నది.

ఇకపైన చెప్పినట్లుగా శ్వాస, నాద, లక్షణాలు కేవలం హల్లులకు మాత్రమే పరిమితాలు అంతేకాక, ఇవి నోటిలో వివిధ భాగాలలో ఒరిపిడి, నిరోధం వంటి లక్షణాలు పొందడంవలన జనిస్తాయి అచ్చులకూ హల్లులకూ

మధ్యగల ముఖ్యమైన భేదక లక్షణాలను ఈ క్రింది విధంగా అమర్చవచ్చును.

అచ్చులు: 1. ఇవి నాదాత్మకమైన ధ్వనులు.

2. నోటిలోగాని ముక్కు లోపలగాని నిరోధం లేదా ఒరపిడి చెందకుండా జనించేవి

3. ఇతర ధ్వనుల అపేక్ష లేకుండా స్వయంగా ప్రకాశించేవి.

హల్లులు : 1. ఇవి నాదాత్మకమైన ధ్వనులుగా గానీ శ్వాస ధ్వనులుగా గానీ ఏర్పడవచ్చును.

2. నోటిలో వివిధ భాగాలలో ఒరిపిడి, నిరోధం మొదలైన లక్షణాలను కలిగి ఉంటాయి.

3. సాధారణంగా అక్షర నిర్మాణంలో అచ్చుల సాహచర్యాన్ని అపేక్షిస్తుంటాయి.

ధ్వనుల్ని గుర్తించడంలో శ్వాస, నాదభేదం చాలా ప్రధానమైన భేదంగా భాషావేత్తల చేత పరిగణింపబడుతున్నది.

ఇక రెండవ రకమైన పద్ధతి సాధారణంగా భాషలో నియతాలయిన ధ్వనుల నన్నిటినీ, అవి పుట్టిన స్థానాలను బట్టీ, అవి జనించడానికి కారణమైన కరణాలను బట్టీ కొన్ని విభాగాలుగా గుర్తించడానికి వీలు కలుగుతుంది. ముఖ యంత్రంలో (1) క్రింది పెదవిని, (2) పై వరుస దంతాలనూ, (3) దంతపంక్తి నుంచి గొంతులో చివరివరకూ కప్పులాగా ఆవరించుకున్న తాలువునూ, భాషావేత్తలు కొన్ని స్థానాలుగా (points of articulation) విభజించారు నాలుకకు చెందిన వివిధ భాగాలను కరణాలుగా (Articulators) విభజించారు.

స్థానాలు : 1. పై పెదవి (Upper lip 16)

2. పై వరస దంతాలు (Teeth 15)

3. పై దంత పంక్తికి మీదుగా ఉన్న గట్టి చిగుళ్ళ వరుస (Alveolar Ridge 14)

4. కఠిన తాలువు (Hard palate 13)

5. మృదుతాలువు (Soft Palate 12)

6. లంబిక (Uvula 8)

కరణాలు: 1. క్రింది పెదవి (Lower Lip 16)

2. నాలుక కొన (Tip of the Tongue 11)

3. జిహ్వా మధ్యము (Front of the Tongue 10)
4. జిహ్వా పార్శ్వము (Blade of the Tongue 11)
5. జిహ్వా మూలము (Back of the Tongue 9)

పైన చెప్పిన స్థానాలకూ కరణాలకూ మధ్య వేటికి, ఏవి సంబంధించినవో గమనించడం అవసరం. ఆ సంబంధం ఈ క్రింది విధంగా ఉంటుంది.

| | స్థానం | కరణం | ధ్వని నామం |
|---|---|---|---|
| 1. | పై పెదవి | క్రింది పెదవి | ఓష్ఠ్యము |
| 2. | ముందుదంతపంక్తికి వెనుక భాగం | నాలుక కొన | దంత్యము |
| 3. | దంతమూలం | నాలుక కొన | దంతమూలీయము |
| 4. | మూర్ధము | పైకి మడిచిన నాలుక కొనయొక్క క్రింది భాగము | మూర్ధన్యము |
| 5. | కఠినతాలువు | నాలుక మధ్యభాగమునకు చెందిన రెండు ప్రక్కలు | తాలవ్యము |
| 6 | మృదుతాలువు | జిహ్వామూలం | కంఠ్యము |

ఇట్టివి మరికొన్ని విభాగాలను కొన్ని భాషలలో అదనంగా చూపించవచ్చును ఈ విధంగా వాని స్థాన కరణాలను గుర్తించడం వల్ల భాషావేత్త ధ్వనులను వేరుచేసి చూపించగలడు.

ఇక మూడవ పద్ధతి, ఉచ్ఛ్వాసం బయటికి ప్రసరించే తీరునుబట్టి (Mode of articulation) వివరించదగ్గది. శ్వాస ఆయా స్థానకరణాలతో సంయోజనం చెందే పద్ధతిలో (1) ఆగిపోవడం (2) ఒరపిడి చెందడం (3) తక్కువ ఒరపిడికి లోనుకావడం (4) నాసికా ద్వారాన కొంత వెలువడడం (5) జిహ్వకు ప్రక్కల నుండి జారిపోవడం (6) నిర్విరామంగా కంపనాన్ని చెందడం- మొదలైన రీతుల్ని అవలంబిస్తుంది ఈ రీతినే ప్రయత్నం లేదా ప్రయతనము (Mode of articulation) అని వ్యవహరిస్తారు.

ప్రయత్న భేదాల వల్ల జనించే ధ్వనుల్ని ఈ క్రింది విధంగా అమర్చవచ్చును. (1) స్పర్శములు (Stops or Plosives), 2. స్పృష్టోష్మములు (Affricates), (3) ఊష్మములు (Fricatives), (4) అనునాసికములు

(Nasals), 5. పార్శ్వికములు (Laterals), (6) కంపితములు (Trills), (7) శిథిల స్పర్శములు (Flaps), (8) అంతస్థములు (Semi Vowels).

1 స్పర్శాలు . తెలుగులో కటతప వర్గాలలోని మొదటి నాలుగు వర్ణాలూ స్పర్శ ధ్వనులు ఈ ప్రయత్నంలో స్థానకరణాలు రెండూ గాఢమైన సంయోజనాన్ని చెందుతాయి. ఉచ్ఛ్వాసం ఒక లిప్తపాటు కలిసిపోయిన స్థాన కరణాలకు వెనుక స్తంభించి స్ఫోటనం చెందుతుంది అందువలన ఇవి స్పర్శములు.

2 స్పృష్టోష్మాలు · తెలుగులో చ, జ లు స్పృష్టోష్మాలు. ఈ ధ్వనులను ఉచ్చరించడంలో కూడా స్థానకరణాలకు సంయోజనం కన్పిస్తుంది కాని ఆ సంయోజనం స్పర్శ వర్ణాలలో వలె మిక్కిలి గాఢమైంది కాదు ఈ ధ్వనులు స్తంభన కాలంలో స్పర్శ లక్షణాన్నీ, స్ఫోటన కాలంలో ఊష్మ లక్షణాన్నీ కలవిగా ఉంటాయి. అందువల్లనే వీటిని స్పృష్టోష్మాలన్నారు.

3 ఊష్మాలు తెలుగులో స, ష, శ, హ లు ఊష్మ ధ్వనులు. ఇక్కడ స్థాన కరణాల సంయోజనంలో స్పర్శ లక్షణం లేదు ఒరపిడి ప్రధానంగా కనిపిస్తుంది. అనగా స్థానకరణాల మధ్య ఏర్పడిన ఖాళీనుండి ఉచ్ఛ్వాసం రాపిడిని సృష్టిస్తూ దూసుకుని పోతుంది. అందువలన ఇవి ఊష్మ ధ్వనులు.

4 అనునాసికములు : తెలుగులో మ, న, ణ, ఞ, ఙ లు అనునాసికాలు ఈ ప్రయత్నంలో స్థానకరణాల సంయోజనం స్పర్శ ప్రయత్నంలో వలె గాఢ మయినదే అయినా, ఉచ్ఛ్వాసంలో అధికభాగం ముక్కు రంధ్రాల నుండి బయటికి వస్తుంది ముక్కునుంచి కూడా ఉచ్ఛ్వాసం రావడంవల్ల ఇవి అనునాసికములు.

5. పార్శ్వికములు తెలుగులో ల, ళ లు పార్శ్విక ధ్వనులు. ఈ ప్రయత్నంలో కూడా స్థాన కరణాల సంయోజనం ఉంది. కాని, కరణమైన నాలుక అమరిన విధానంవల్ల ఉచ్ఛ్వాసం, నాలుక ప్రక్క భాగాలనుండి జారిపోవడం జరిగినప్పుడు ఈ ధ్వనులు ఉత్పన్నమౌతాయి. అందువలన ఇవి పార్శ్వికధ్వనులు.

6. కంపితములు తెలుగులో 'ర' వర్ణం కంపితధ్వని. ఈ ప్రయత్నం చాలావరకూ పార్శ్విక ప్రయత్నాన్ని పోలేదిగానే ఉంటుంది. కాని నియత స్థానాన్ని స్పృశించిన కరణం (నాలుక కొస) వర్ణ జనన పర్యంతం విడవకుండా కంపనాన్ని కలిగి ఉంటుంది. అభ్యాసం వల్ల 'ర' వర్ణోచ్చారణంలో 'కరణం' ఏ విధంగా కంపిస్తుందో మనం గుర్తించవచ్చు అందువల్ల దీన్ని కంపితం అని వ్యవహరిస్తారు.

7. శిథిల స్పర్శములు : తెలుగులో అచ్చులమధ్య వచ్చే 'డ' వర్ణం శిథిల స్పర్శం. ఇక్కడ స్థాన కరణాల సంయోజనం స్పర్శ లక్షణాన్ని కలిగి వుంటుంది. కాని స్పర్శాలలో వలె ఇది గాఢమైనది కాక కొంత శైథిల్యాన్ని కలిగి ఉంటుంది

8. అంతస్థములు. తెలుగులో వ, వలు రెండూ అంతస్థములు. ప్రాచీన వైయాకరణులు య, ర, ల,వ లు నాలుగింటినీ అంతస్థాలుగా పేర్కొనియున్నారు. యవర్ణ ఇకారంతోనూ వ వర్ణ ఉకారంతోనూ ఉచ్చారణలో అధిక సామ్యం కలిగిఉంటాయి. కాని య, వలు, ఇ, ఉ ల వలె ఘోషవంతాలు కావు.

పై మూడు పద్ధతుల్లో చేసిన విభాగం అందులోని భేదాలు ఏ భాషలోనైనా సాధారణంగా మనకు కనిపించే హల్లులను వివరించి చెప్పడానికి చాలి ఉంటుంది.

హల్లుల లాగానే అచ్చుల్ని కూడా భాషావేత్తలు మూడు పద్ధతుల్లో వివరించడానికి ప్రయత్నించారు. అవి (1) అచ్చులు జనించే స్థానాల పూర్వాపౌర్వ్యాలనుబట్టి (2) అచ్చుల్ని ఉచ్చరించేటప్పుడు నాలుక కుదురుకున్న ఎత్తుల్లోని హెచ్చు తగ్గుల్ని బట్టి (3) అచ్చుల్ని ఉచ్చరించేటప్పుడు పెదిమలు పొందే ఆకారాన్ని బట్టి.

1 స్థానాల పూర్వాపౌర్వ్యం ఈ విభాగం వల్ల అచ్చుల్ని మూడు విభాగాలుగా చేయవచ్చు. అవి

(1) పూర్వాచ్చు (Front Vowel)
(2) మధ్యాచ్చు (Central Vowel)
(3) పశ్చిమాచ్చు (Back Vowel) తెలుగులో ఇ, ఎలు పూర్వాచ్చులు అ,ఒ, ఉ లు పశ్చిమాచ్చులు. తెలుగులో మధ్యాచ్చులు లేవు.

2 ఉచ్చారణలో నాలుక స్థితి అచ్చుల్ని ఉచ్చరించేటప్పుడు నాలుక గ్రహించిన స్థితినిబట్టి కూడా మూడు రకాలుగా వీనిని విభజించవచ్చును. అవి 1. ఉచ్చస్వరం (High Vowel) 2. మాధ్యమిక స్వరం (Mid Vowel) 3. నిమ్నస్వరం (Low Vowel). తెలుగులో ఇ, ఉలు ఉచ్చ స్వరాలు. ఎ ఒ లు మాధ్యమిక స్వరాలు, అ నిమ్నస్వరం.

3 పెదవుల స్థితి : అచ్చుల్ని ఉచ్చరించే టప్పుడు పెదవులు పొందిన స్థితిని బట్టి కూడా వీటిని రెండు రకాలుగా విభజింపవచ్చును. అవి

1. వలయితాచ్చు (Rounded Vowel)
2. నిర్వలయితాచ్చు (Unrounded Vowel)

తెలుగులో అ, ఇ, ఎ లు నిర్వలయితాచ్చులు. ఒ, ఉలు వలయిచ్చులు.

తెలుగు భాషలో ఇ, ఎ, అ, ఒ, ఉ, లు అయిదూ ప్రధానమైన అచ్చులు. వీటి దీర్ఘ భేదాలు కూడా ఇక్కడ ప్రత్యేక వర్ణాలుగా పరిగణింపబడు తున్నవి. ఇవికాక ఐ ఔ లు రెండూ సంయుక్తాచ్చులు. ఎక్కువగా సంధివశాన రాటాకు, కొట్టారు వంటి చోట్ల ఞ అనే అచ్చు వినిపిస్తుంది. మేక మేడ వంటి అఖండ పదాల్లో ఈ అచ్చు వినిపిస్తుంది. దీనికి తెలుగులో లేఖన చిహ్నంలేదు. ఇది గ్రాంథిక భాషలో గుర్తింపు పొందలేదు. ఇవేకాక, కొంత నిశితంగా వినడం అలవాటు చేసుకుంటే మరికొన్ని అచ్చులుకూడా తెలుగులోఉన్నట్లు తెలుసుకోగలం.

ప్రాచీన వ్యాకరణవేత్తలు అచ్చుల్ని తాలవ్యాచ్చులనీ, కంఠ్యాచ్చులనీ, ఓష్ఠ్యాచ్చులనీ విభాగం చేయడం కనిపిస్తుంది. ఇ, ఈ, ఎ, ఏలు తాలవ్యాచ్చులు కాగా, ఉ ఊ ఒ ఓ లు ఓష్ఠ్యాచ్చులూ, అ ఆలు కంఠ్యాచ్చులుగా అక్కడ వివరింపబడ్డాయి.

3. వర్ణాలయిన అచ్చుల హల్లుల షట్టుపూర్వోత్తరాలు తెలుసుకున్నట్లుగానే, భాషలో వర్ణాలవలెనే వ్యవహరించే ఊనిక స్వరం అనే అంశాలను కూడా భాషాజిజ్ఞాసువు తెలుసుకోవలసి ఉంటుంది. ఇవి కూడా వర్ణాలే, కాని సాంప్రదాయికమైన లేఖన వ్యాపారంలో వీటికి లేఖల చిహ్నాలు లేవు. అందువల్ల సంప్రదాయబద్ధ భాష మాతృభాషగా కలవానికి ఊనిక కాని స్వరం కాని ఎక్కడెక్కడ ప్రవర్తించి యే విధమైన అర్థ భేదాలను కొని తేగలదో ఎటువంటి కష్టమూ లేకుండానే అవగతమౌతుంది. ఊనికను ఆంగ్లంలో (Stress Accent అని వ్యవహరిస్తారు. స్వరవైవిధ్యాన్ని (Pitch Accent)అనీ (Tonic Accent) అనీ వ్యవహరిస్తారు.

ద్రావిడ భాషలన్నీ ఊనిక ప్రధానంగా విలసిల్లే భాషలు. తెలుగులో ఊనిక సర్వసాధారణంగా మొదటి వర్ణం మీద ఉంటుంది. అది తొలిగిపోదు. అందువల్ల తెలుగు పదంలోని మొదటి వర్ణం మార్పుకు లొంగని బలమైన వర్ణంగా స్థిరంగా ఉంటుంది. పదంలోని తరువాతి అచ్చులు ఊనిక లేకపోవడం వలన సులువుగా మార్పుకు లొంగేవిగా ఉంటాయి. ద్రావిడ కుటుంబానికి చెందిన తమిళ, మలయాళ భాషలు హలంతాలయిన భాషలు క్రమ పరిణామం చేత కన్నడం, తెలుగు భాషలు అజంతత్వాన్ని చేపట్టాయి. అనగా తెలుగులో పదం చివర ఉండే అచ్చు పరిణామవశాన వచ్చి చేరిన అచ్చు. అందువలన అది అంత బలమైనదిగా ఉండక సులువుగా జారిపోయే గుణాన్ని కలిగి ఉంటుంది. అందువల్లనే తెలుగులో పరరూప సంధి ప్రచురంగా కనిపిస్తుంది. ఈ ఊనిక నశించడంవల్లనే వర్ణ సమీకరణం, వర్ణవ్యత్యయంవంటి ధ్వనుల మార్పులు తెలుగులో కనిపిస్తున్నాయి.

స్వరం : స్వరోచ్చారణలో ఉండే వైవిధ్యం వలన వాక్యగతమైన అర్థంలో మార్పులు రావడం మనం తెలుగులో చూడవచ్చును.

ఉదాహరణకు : అలాగే → అంతే

అలాగే! → అట్లాగా !

ఇక్కడ రెండవ పదం చివర నుండే స్వరోచ్చారణలో వైవిధ్యం ఆశ్చర్యార్థకాన్నీ ప్రశ్నార్థకాన్నీ తెచ్చిపెడుతున్నది. అర్థ భేదన సామర్థ్యాన్ని కలిగిఉంది కాబట్టి ఇక్కడ స్వరాన్ని వర్ణ విశేషంగానే మనం గుర్తించకతప్పదు. ఈ ఊనిక, స్వరాలను, భాషావేత్తలు గౌణ వర్ణాలు. (Secondary Phonemes)గా పేర్కొన్నారు.

## పట్టిక - 2

| స్థానములు / ప్రయత్నములు | | ద్వ్యోష్ఠ్యములు Bilabials | దంతోష్ఠ్యములు Labio dentals | దంత్యములు Dentals | దంతమూలీయములు Alveolars | మూర్ధన్యములు Cerebrals or Retroflex | తాలవ్యములు Palatals | కంఠ్యములు Velars | కంఠమూలీయములు Glottals |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | అల్పప్రాణ మహాప్రాణ | | అల్పప్రాణ మహాప్రాణ | | అల్పప్రాణ మహాప్రాణ | అల్పప్రాణ మహాప్రాణ | అల్పప్రాణ మహాప్రాణ | అల్పప్రాణ మహాప్రాణ |
| స్పర్శములు Stops | శ్వా | ప p ఫ ph | | త t థ th | | ట ṭ ఠ ṭh | | క k ఖ kh | |
| | నా | బ b భ bh | | ద d ధ dh | | డ ḍ ఢ ḍh | | గ g ఘ gh | |
| స్పృష్టోష్మములు Affricates | శ్వా | | | (త్స) | | | చ č ఛ čh | | |
| | నా | | | (ద్జ) | | | జ ǰ ఝ ǰh | | |
| ఊష్మములు Fricatives | శ్వా | | ఫ़ f | | స s | ష ṣ | శ ś | హ h | |
| | నా | | | | | | | | |
| అనునాసికములు Nasals | నా | మ m | | | న n | ణ ṇ | ఞ ñ | ఙ ṅ | |
| పార్శ్వికములు Laterals | నా | | | | ల l | ళ ḷ | | | |
| కంపితములు Trills | నా | | | | (ఱ)r̠ | (ఌ)l̠ | | | |
| తాడితస్పర్శములు Flaps | నా | | | | ర r | (ఢ)ṛ | | | |
| అంతస్థములు Semi Vowels | నా | వ w | | | | | య y | | |

పై విధంగా పరిశీలించి స్థానకరణ ప్రయత్నాలను బట్టి వర్ణాల ఉచ్చారణను నిర్ణయించి వానిని ధ్వని విధేయలిపిలో (Phonetic Script) గుర్తించవలసిన అవసరం భాషావేత్తకు ఉన్నది. ఒక భాషలోని వర్ణాలకు చెందిన సరియైన ఉచ్చారణను అవగతం చేసుకోవడానికి ధ్వనివిధేయ లిపి వీలును కలిగిస్తుంది. తెలుగుభాషలో, వాడుకలో ఉన్న ధ్వనుల్ని రెండో పట్టికలో సూచించినట్లు ధ్వని విధేయ లిపిలో పొందుపరచవచ్చును.

పట్టిక - 3

అచ్చులు

| | నిర్వలయిత (Unrounded) | | వలయిత (rounded) |
|---|---|---|---|
| | అగ్రాచ్చులు Front Vowels | మధ్యాచ్చులు Central Vowels | అంత్యాచ్చులు Back Vowels |
| ఉచ్చస్వరము High Vowel | ఇ ఈ | | ఉ ఊ |
| మధ్య స్వరము Mid Vowel | ఎ ఏ | | ఒ ఓ |
| నిమ్నస్వరము Low Vowel | | | అ ఆ |

పైన చూపిన అచ్చుల విభాగం అమెరికన్ విభాగ పద్ధతికి చెందినవి. అంతర్జాతీయ ధ్వని వివరణ పట్టిక (I P A , International Phonetic Chart) ననుసరించి, అచ్చుల విభాగం ఈ విధంగా ఉంటుంది.

## అచ్చులు

| | పూర్వాచ్చు Front Vowel | మధ్యాచ్చు Central Vowels | పశ్చిమాచ్చు Back Vowel |
|---|---|---|---|
| వివృతాచ్చు Closed Vowel | ఇ ఈ ı ī | | ఉ ఊ u ū |
| అర్ధ వివృతాచ్చు Half Closed | ఎ ఏ e ē | | ఒ ఓ o ō |
| అర్ధ సంవృతాచ్చు Half Open | ఎ ఏ æ ǣ | | |
| సంవృతాచ్చు Open Vowel | | | అ ఆ a ā |

—

# 6

# మూల ద్రావిడ వర్ణాలు – తెలుగులో పరిణమించిన తీరు

మొదటి అధ్యాయంలో ద్రావిడ భాషా కుటుంబాన్ని గురించీ, వ్యాప్తిని గురించీ చదువుకున్నాం.

ఈ కుటుంబ భాషల్ని, అవి వ్యాప్తిచెందిన ప్రదేశాన్ని బట్టి వాటిలో గల నిర్మాణ విశేషాలను బట్టీ మూడు విభాగాలు చేయవచ్చు. అవి

(1) దక్షిణ ద్రావిడ భాషలు : ఇవి మొత్తం ఏడు. 1 తమిళం 2. మలయాళం 3. తోడ 4 కోట 5. కన్నడం 6. కొడగు 7. తుళు.

(2) మధ్య ద్రావిడ భాషలు : ఇవి మొత్తం పన్నెండు 1. తెలుగు 2. కుయి 3. కువి 4. గోండి 5. కోలామి 6. నాయకి 7. పర్జి 8. గదబ 9. ఒల్లారి 10. కొండ 11. పెంగొ 12. మండ.

(3) ఉత్తర ద్రావిడ భాషలు : ఇవి మూడు. 1. కూడుఖ్, 2 మాల్తో 3. బ్రాహుయీ.

తెలుగు భాష వ్యాప్తిని బట్టి దక్షిణ ద్రావిడ విభాగానికి చెందవలసిన భాష. కాని నిర్మాణ విశేషాలను పరిశీలిస్తే, దీనికీ, గోండి, కొండ, మండ, పెంగొ, కుయి భాషలతో ఎన్నో సామ్యాలు కనిపిస్తాయి. అందువలన నిర్మాణాన్నిబట్టి దీన్ని మధ్య ద్రావిడ విభాగంలో చేర్చవలసి వస్తుంది

ఈ భాషల కన్నిటికీ మూలమని చెప్పబడేది మూల ద్రావిడ భాష (Proto Dravidian). దీన్ని విన్నవారుగానీ, లేఖనంలో చూచిన వారుగానీ ఎవరూ లేరు. ప్రస్తుతం వ్యవహారంలో ఉన్న ఈ ఇరవై రెండు భాషల స్వరూపాన్ని బట్టి, వీటికి మూలమైన భాష ఈ రకంగా ఉండవచ్చునన్న అంచనా వలన ఈ మూల ద్రావిడ భాష పునర్నిర్మించబడ్డది. అందువలన దీన్ని పునర్నిర్మిత భాషగా (Reconstructed Languages) మనం వ్యవహరించక తప్పదు.

అట్లా పునర్నిర్మితమైన ఈ మౌలిక ద్రావిడ భాషా వర్ణాలను ఈ కింది విధంగా అమర్చుకోవచ్చు.

హల్లులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప | త | త̲ | ట | చ | క |
| | | | ఴ | | |
| మ | న | | ణ | ఞ | |
| | | ల | ళ | | |
| | | ర | | | |
| వ | | | | | య |

ఇవి పదహారు హల్లులు.

అచ్చులు

ఇ ఈ          ఉ ఊ

ఎ ఏ          ఒ ఓ

అ ఆ

ఇవి పది అచ్చులు. వెరసి మూలద్రావిడ వర్ణాల సంఖ్య ఇరవై యారు. ఆ భాషలో ఆయా వర్ణాల వ్యాప్తి ఈ విధంగా ఉంటుంది.

1. సరళాలు ప్రత్యేక వర్ణాలు కావు. అవి కేవలం సవర్ణాలు మాత్రమే.

2. పదాదిన ఞ, ట, ఴ, ణ, ళ, హ అనే వర్ణాలు లేవు.

3. పదాదిన, సంయుక్త వర్ణాలూ, ద్విరుక్త వర్ణాలూ లేవు.

ఇక తెలుగులో, తత్సమాలవలన ప్రవేశించిన మహాప్రాణాలూ, శ,ష వర్ణాలూ కాక, కేవల దేశ్య వర్ణమాలను ఏర్పాటు చేస్తే ఈ క్రింది పట్టిక ఏర్పడుతుంది.




ఇక్కడ కనిపించే మొత్తం వర్ణాల సంఖ్య 30. పై రెండు పట్టికలనూ పరిశీలించి కొన్ని భేదసామ్యాలను మనం క్రోడీకరించవచ్చు.

1. మూల ద్రావిడంలో కేవలం సవర్ణాలుగా ఉన్న సరళాలు, పరిణామ వశాన తెలుగులో ప్రత్యేక వర్ణత్వాన్ని కలిగి ఉన్నాయి. ఇవి పదాదిన కనిపిస్తాయి.

| | | | |
|---|---|---|---|
| ఉదా॥ | పడి | తగ్గు | కసి |
| | బడి | దగ్గు | గసి |
| | | | చూలు |
| | | | జూలు |

తెలుగులో సరళాలు ప్రత్యేక వర్ణాలుగా ఏర్పడ్డానికి సంస్కృతాది అన్యభాషల ప్రభావం కొంతవరకూ కారణం అయి ఉండవచ్చు. అందుకే, తెలుగులో ఎక్కువ పదాలు సాధారణంగా తొలుత పరుషాదిగా ఉండి, తరువాత అవే సరళాదిగా కనిపిస్తుంటాయి

| | | |
|---|---|---|
| పుక్కి | తూఱు | కడప |
| బుక్కి | దూఱు | గడప |
| | | చప్పున |
| | | జప్పున |

2. చ,జ లకు మూల ద్రావిడంలో లేని దంత్య తాలవ్య భేదం తెలుగులో ఉంది. కాని ఈ భేదం అంతటా కనిపించక కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో మాత్రమే కనిపించడం చేత దంత్య తాలవ్య చజలు సవర్ణాలు.

2 (౧). మూల ద్రావిడంలోని పదాది చ కారం తెలుగులో కొన్ని చోట్ల లోపిస్తుంది.

*చుప్పు>ఉప్పు

3. మూలద్రావిడంలో లేని దంతమూలీయ ఊష్మ ధ్వని /స/ తెలుగులో క్రమంగా ఏర్పడ్డది. ఇది మూల ద్రావిడ /చ/ కారం నుండి ఏర్పడినట్లుగా నిర్ధారించవచ్చు.

*చుటి>సుడి

అందుకు ఉప బలకంగా, తెలుగు భాషలో ఇప్పటికీ ఒకే పదానికి లభించే చ కార, స కారయుత రూపాలను చూపించవచ్చు.

| | | |
|---|---|---|
| ఉదా॥ | చాగు | సాగు |
| | చలుపు | సలుపు |
| | చోర | సొర |

3 (a). మూలద్రావిడంలోని పదాది త కారం తెలుగులో కొన్ని చోట్ల /ట/ కారంగా మారుతుంది. కాని యీ మార్పు విరళమైనది.

తెంకాయ>టెంకాయ

4. మూల ద్రావిడంలో లేని /హ/ కారం తెలుగులో ఉంది. ఇది మూల ద్రావిడ /ప/ వర్ణం నుండి పరిణామం చెందిన వర్ణం. ఈ పరిణామం తొలుత కన్నడంలో జరిగి, అక్కడ నుండి తెలుగులో కూడా ప్రవేశించింది. అందువల్లనే కన్నడ ప్రభావం వల్ల తెలుగులోకి ప్రవేశించిన /హ/ కార యుత రూపాలతో పాటు సరాసరి మూల ద్రావిడం నుండి వచ్చిన /ప/ కార యుత రూపాలు కూడా తెలుగులో ఉన్నాయి.

కన్నడం తెలుగు

ఉదా॥ 1. *పేర్ > హెచ్చు > హెచ్చు
*పేర్ > పెచ్చు

2. *పొన్ > హొన్ను > — హొన్ను
*పొన్ > పొన్ను

5 మూల ద్రావిడంలో ప్రత్యేక వర్ణంగా గణింపబడిన /ఞ/ కారం తెలుగులో (i) '(న) కారంగా పరిణమించింది.

ఉదా॥ * ఞాఞ్చల్>నాగలి
* ఞెరిప్పు>నిప్పు

(ii) అంతేకాక /ఞ/ కారం ఆ వర్గాక్షరంతో కూడినప్పుడు ఆనునాసిక్య ధ్వనిని సూచించే సవర్ణంగా ఏర్పడ్డది.

6. మూల ద్రావిడ /ణ/ కారం తెలుగులో /న/ కారంగా మారింది.

*అణ్ణ > అన్న
*కణ్ > కన్ను

7. మూల ద్రావిడంలో పదాదిన ఉండే /న/ కారం తెలుగులో కొన్ని చోట్ల లోపిస్తుంది.

*నీంతు > ఈదు
*నీ > ఈవు

8. మూల ద్రావిడంలో రేఫాది పదాలు లేవు తెలుగులో వర్ణ వ్యత్యయం వల్ల రేఫం పదాది స్థానానికి వస్తుంది.

*ఇరణ్టు > రెండు

9. మూల ద్రావిడ /ళ/ కారం తెలుగులో /ల/ కారంగా మారుతుంది. ఈ రెండు భాషల్లోనూ /ళ/ కారాది పదాలు లేవు తెలుగులో కనిపించి లకారాది పదాలు వర్ణ వ్యత్యయం వల్ల ఏర్పడినవే

*కళ్ > కల్లు
*ఉళ్ > లో
*చేళ్ > తేలు

10. తెలుగులో కావ్యభాషలోనూ, ప్రాచీన శాసనాల్లోనూ, మనకు కనిపించే బండి ఱ నేటి వ్యవహారంలో వర్ణంగా లేదు. అనగా శకట, సాధు రేఫలకు, ఉచ్చారణలో అద్విరుక్తంగా ఉన్నప్పుడు భేదం కనిపించదు. ద్విరు

క్తంగా ఉన్నప్పుడు, ఆ ధ్వనికి శకట రేఫాన్ని లేఖన చిహ్నంగా వాడినా, దానికీ ద్విరుక్త సాధు రేఫానికీ మధ్య ఉచ్చారణలో భేదం ఉన్నట్లుగా గుర్తించడం కష్టం. ఆ భేదాన్ని గుర్తించడానికి ఎటువంటి కొలమానమూ లేదు. ఈ భేదం స్పష్టంగా చూపించలేకపోవడం వల్లనే చాలా ప్రాచీనకాలంలోనే, శాసనాల్లో సాధు, శకట రేఫలు ఒకదాని కొకటి వాడడం జరిగింది. కావ్యభాషలో, ఈ రెంటినీ వేరు వేరుగా నిలబెట్టడానికి లాక్షణికులు ఎన్నో ప్రయత్నాలు చేశారు. ప్రస్తుతానికి ఒకే రేఫానికి మరొక లేఖన చిహ్నంగా మాత్రమే బండి ఱ వాడబడుతున్నది.

11. మూల ద్రావిడంలోని ఈ మూర్ధన్య ద్విరుక్త రేఫం, తెలుగులో ట కారంగా మారుతుంది.

*మాఱ్ఱ > మాట (DED 3960)

12. మూల ద్రావిడంలోని అచ్చుల మధ్యగల దంత మూలీయ /త్/ కారమే తెలుగులో శకట రేఫగా మారిందని పండితులు సూచించారు.

ఉదా॥ కుత్ > కుఱ్ఱ (DED 1537)

13. మూలద్రావిడంలోని మూర్ధన్య నాదోష్మ ధ్వని కలిగిన /ఴ/ వర్ణం తెలుగు శాసనభాషలో అనియతంగా కనిపిస్తుంది. కావ్యభాషలో దీనికి ప్రవేశం కలగలేదు. తెలుగుభాష పరిణామక్రమంలో ఈ ధ్వని వర్ణేతరాలుగా రూపాంతరం చెందింది. (1) అచ్చులమధ్య డ కారంగా మారింది

*ఏఴు > ఏడు (DED. 772)

(2) పదాదిన సంయుక్తంగా, వర్ణవ్యత్యయం వల్ల ఏర్పడినప్పుడు, రేఫంగా మారింది.

ప్ఴోలు > ప్రోలు (DED 3721, 3723)

(3) పదాదిన అసంయుక్తంగా, వర్ణ వ్యత్యయం వల్ల వచ్చినప్పుడు డ కారంగా మారింది.

*ఎఴ్>డె (DED 772, 3236)

సంయుక్తంగా పదాదిన కనిపించే రేఫం పరిణామవశాన జారి పోయింది.

*కొఴ్>క్ఴొ>క్రొత్త>కొత్త (DED 1787)

తెలుగులో నిండు సున్న అనునాసిక్యాన్ని సూచించే లేఖన చిహ్నం. భాషావిజ్ఞాన దృష్టితో చూస్తే నిండుసున్న, అరసున్న రెండూ

వర్ణాలు కావు. కాని తెలుగు వ్యాకరణకారులు వీటిని వర్ణమాలలో గుర్తించడం జరిగింది ఏ వర్గానికి సంబంధించిన అనునాసికాన్ని ఆ వర్గ పంచమాక్షరంతో సూచించడమే తొలి పద్ధతి. రాను రాను వర్గ పంచమాక్షరాలన్నిటినీ తెలియ జేసే ఏకైక లేఖనచిహ్నంగా నిండుసున్న వాడబడటం భాషలో మొదలైంది. అనునాసిక్యాన్ని పూర్తిగా ఉన్నట్లు సూచించవలసి వచ్చినప్పుడు, కేవలం నిండు సున్నను వాడడమే కాక దాని తరువాతి హల్లును ద్విత్వం చేయడం లేఖన సంప్ర దాయంగా స్థాపింపబడ్డది.

మందు > మంద్దు

అది పూర్ణంగా ఉచ్చరింపబడనిచోట తరువాతి హల్లును అద్విరుక్తం గానే ఉంచేసేవాళ్లు.

వాండు > వాండు

తరువాత, తరువాత పూర్ణంగా ఉచ్చరించని అనునాసిక్యాన్ని సూచించ డానికి అరసున్న లేఖన సంప్రదాయంలో జొరబడ్డది. ఇటువంటి చిహ్నం మిగిలిన ద్రావిడభాషల్లో లేదు.

అచ్చులు : మూల ద్రావిడంలోనూ, తెలుగులోనూ అచ్చుల సంఖ్య పదే. దీర్ఘం అక్కడా ఇక్కడా వర్ణమే.

తెలుగులో /అ/ కార /ఎ/ కారాల మధ్య గల మరొక తాలవ్యాచ్చు. దాని దీర్ఘమూ సవర్ణాలుగా కనిపిస్తాయి. ఇవి, సంధిగతంగానూ, పదగతంగానూ, కనిపిస్తాయి.

ఉదా॥ (1) తాటాకు
వచ్చాడు
(2) మెడ
పెద్ద
మేక
తీగ

అదే విధంగా ఎ, ఏ, ఒ, ఓ ల కంటే వివృత (Open vowel) స్వరాలయిన ఎ ఏ ఒ ఓ లు తెలుగులో సవర్ణాలు. రెండచ్చులు కల పదాలలో రెండో అచ్చు అత్వమైె దానికి ముందు ఎ ఏ ఒ ఓ లు అంటే, అవి క్రమంగా ఎ ఏ ఒ ఓ లుగా వినిపిస్తాయి.

ఉదా॥ 1. మెట్టు
మెట్ట

2. మేకు
మేక
3. గొడుగు
గొడవ
4. గోడు
గోడ

1. మూలద్రావిడంలో పదాదిన ఉండే ఇ, ఉ లు తెలుగులో ఎ, ఒలుగా పరిణమిస్తాయి.

ఉదా॥ 1 *ఇర్ > ఎర్ > రె(ండు)
2. *ఉళ్ > ఒళ్ > లో(న)

2. మూలద్రావిడంలో పదాదిన అచ్చు ఉండి రెండవస్థానంలో డ, ఱ, ళ, ల, ర లలో ఏ హల్లయినా ఉంటే, తెలుగులో వర్ణ వ్యత్యయం పొంది, ఆ హల్లు పదాది స్థానానికి వస్తుంది.

ఉదా॥ 1. *అట > డాగు
2. *పుఱల్ > ప్రోలు
3. *ఉళ్ > లో
4. *ఇల్ > లే(త)
5. *ఇర్ > రె(ండు)

3. మూలద్రావిడంలో తాలవ్యాచ్చుతో కూడిన పదాది క కారం తెలుగులో చ కారంగా మారుతుంది. దీన్నే తాలవ్యీకరణం అని పిలుస్తారు.

ఉదా॥ కివి > చెవి
కిళి > చిలుక

ఈ విధంగా మూలద్రావిడ వర్ణాలు క్రమ పరిణామానికి లోబడి తెలుగు భాషలోనికి ఆవిష్కరింపబడడం జరిగింది.

—*—

# 7

# తెలుగులో ధ్వనుల మార్పు

భాష మార్పును కోరే సాధనం. ఇక్కడే కలిగే మార్పులు ఒక క్రమ పరిణామానికి లోబడి ఉండేవిగా కనిపిస్తాయి. ఈ మార్పుల్ని మొదట స్థూలంగా రెండు రకాలుగా విభజించుకోవచ్చు. అవి (1) భాషా ధ్వనులలో కలిగే మార్పులు (Phonetic changes), (2) భాషలోని అర్థంలో వచ్చే మార్పులు (Semantic changes). ఇందులో మొదటిదాన్ని ధ్వని పరిణామం, లేక ధ్వనుల మార్పనీ, రెండవదాన్ని అర్థపరిణామమనీ పిలవవచ్చు.

సజీవమైన భాషను పరిశీలిస్తే అందులోని ధ్వని పరిణామం రెండు పద్ధతుల్లో కలుగుతున్నట్లుగా కనిపిస్తుంది. (1) ఆంతర కారణాలవల్లనైన మార్పు, (2) బాహిర కారణాలవల్లనైన మార్పు.

(1) ఒక భాషలో ఉండే శబ్దజాలాన్ని స్పష్టంగా ఉచ్చరించటానికి నిర్దుష్టమైన ముఖయంత్ర నిర్మాణం ముఖ్యం. ఉచ్చారణాంగాలలో వినికిడిలోపం వంటి ఏ లోపం ఉన్నా వాటిసహాయం వల్ల జనించే ధ్వనిలో కూడా లోపం కనిపిస్తుంది. ఇటువంటి లోపాలు వైయక్తికలోపాలు. ఇంతేకాక, జనుల ముఖయంత్ర నిర్మాణంలో వాళ్లు నివసించే శీతోష్ణస్థితిగతుల పైనా, భౌగోళిక పరిస్థితులపైనా, అలసతవలనా, అనవధానతవలనా, కొన్ని తేడాలు రావడం కూడా జరిగవచ్చు. కొండప్రాంతాల్లో నివసించే మనుషుల నాలుక మొద్దువారి ఉంటుందనీ, సాగర తీరవాసుల స్వరపేటిక నిశితంగా ఉంటుందనీ విజ్ఞుల అంచనా. ఈ విభేదమే వాళ్ళు ఉచ్చరించే ధ్వనుల్లో కూడా భేదాలు తెచ్చి పెడుతుంటుంది. ఇటువంటి భేదాలు మాండలిక భాషాపరిగణనంలో సముచితపాత్రను నిర్వహించగలవు. భాషలో ఉండే ధ్వనుల్లో అంతర్గతంగా మార్పుల్ని కొనితెచ్చే యిటువంటి కారణాలు అంతర కారణాలు. (2) బాహిర కారణాల్లో ప్రముఖంగా చెప్పుకునే అంశాలు మూడు. (1) సుఖాపేక్ష (2) సామ్యం (3) ఆదాన ప్రక్రియ.

భాషాప్రక్రియ ఒకరినుండి మరొకరికి అనుకరణవల్ల లభించేదే కాని జన్మసిద్ధంగా వచ్చేదికాదు. అయితే ఒకరిని చూసి మరొకరు నేర్చుకునే ఈ పద్ధతిలో కూడా కొన్ని దశల్ని మనం గమనించవచ్చు. అవి (1) ఎదుటి మనిషి ఉచ్చారణ వినేవాడి చెవుల్లో ప్రవేశించే దశ, (2) అలా ప్రవేశించిన ధ్వని

మెదడులో ఉండే జ్ఞానగ్రాహకాలైన నాడులచేత ఒక ముద్ర (Percept)గా ముద్రించబడే దశ, (3) ఆ ముద్ర, తిరిగి ఆ వ్యక్తి మనస్సు అవగతం చేసుకునే విధంగా (Concept) రూపొందే దశ. (4) ఆ ముద్రలు మెదడు అరల్లోనే విడివిడిగా భద్రంగా ఉండి అవసరం వచ్చినపుడు తిరిగి ధ్వనిరూపాన వెలువడగలిగే దశ. ఇవన్నీ ఏ దశ కాదశలో నిర్దుష్టంగా ఉన్నపుడే ఒక వ్యక్తి తాను విన్న ధ్వనిని విన్నట్లుగానే తిరిగి వెలువరించగలడు. కాని మనిషిలో ఉండే సుఖాపేక్ష అతడు ఉచ్చరించే ధ్వనుల్లో అతడు విన్న ధ్వనులకంటె భిన్నమైన మార్పుల్ని కొనితెస్తూ ఉంటుంది. జీవితంలో అతడు అన్ని రంగాల్లో ఆశించే సౌలభ్యమే భాషోచ్చారణా విషయంలో కూడా ఆశించటం జరుగుతున్నది. అందువల్ల సంయుక్తోచ్చారణను ద్విత్వం చేయడం, సజాతీయ వర్ణాలు రెండు పక్కపక్కన వస్తే అందులో ఒకదాన్ని విజాత్యంగా మార్చడం, కొన్ని ధ్వనుల్ని లోపింపజేయడం కొన్నిటిని ఆగమాలుగా కొన్నిటిని ఆదేశాలుగా గ్రహించటం, ఇటువంటి మార్పుల నెన్నిటినో అతడు కేవలం సుఖాపేక్షవల్లనే చేయడానికి పూనుకుంటున్నాడు. ఈ సుఖాపేక్షతోపాటు అతనికి ఈ భాషాధ్వనుల్ని గ్రహించే సందర్భంలో కొంత నిర్లక్ష్యం ఉండటం కూడా జరుగుతున్నది. ఈ నిర్లక్ష్యం భాషను నేర్చుకోవడంలో కనిపించే నిర్లక్ష్యం కాదు. కాని ఎదుటివాడు మాట్లాడే భాష తన మాతృభాష కాబట్టి దానిని వాక్యాంతం వరకూ విననక్కర లేదనే నిర్లక్ష్యం. అంటే ఒక వ్యక్తి ఒక వాక్యాన్ని ఉచ్చరిస్తున్నప్పుడు దాన్ని వినేవాడు ఆ భాష మాతృభాషగా కలవాడైతే, ఆ వాక్యం పూర్తికాకముందే అతడు దాన్ని అవగతం చేసుకోగలడు. ఈ శక్తి అతనికి పరాయిభాషల్ని వినేటప్పుడు ఉండదు. అనగా తన మాతృభాషలోని ఒక వాక్యపు చివరిభాగం తన చెవిలో పొరవారించకముందే దాన్ని తన పద్ధతి ననుసరించి పూరించుకుని మెదడులో ముద్రించుకోగలుగుతాడు. ఇటువంటి ముద్రలు ఉచ్చరింపబడ్డ ముద్రలకంటె భిన్నమైన ధ్వనిరూపాల్ని కలిగి ఉండటం పొసగవచ్చు.

రెండవ అంశం సామ్యం (Anology). ఈ అంశం భాషలో ధ్వని పరిణామంలోనూ, అర్థపరిణామంలోనూ సమానంగా పనిచేస్తుందని విజ్ఞుల అభిప్రాయం. ఒక పద స్వరూపంలో ఎటువంటి ఎగుడు దిగుడులైనా ఉంటే వాటిని సరిపెట్టే ప్రయత్నంలో ఇది చక్కగా తన ప్రభావాన్ని చూపిస్తుంది. గణితంలో సమీకరణానికి (Equation) ఉన్నంత ఖచ్చితమైన తత్వం ఒక్కోసారి ఈ సామ్యానికి కనిపిస్తుంది భాషను నేర్చుకుంటున్న వయస్సులో ఉండి, ఒక క్రమ పద్ధతిలో దాన్ని అమర్చుకుంటున్న చిన్న పిల్లల భాషను పరిశీలిస్తే ఈ సామ్యానికిగల ఖచ్చితమైన తత్త్వాన్ని స్పష్టంగా మనం చూడగలం.

ఉదా : పీత+లు>పీతలు
పువ్వు+లు>పువ్వులు

కుర్చీ+లు>కుర్చీలు. కాబట్టి వీళ్ళు కత్తి+లు అనవలసివస్తే కత్తులు అని కాక కత్తిలు అనటం వినిపిస్తుంది. అదేవిధంగా-

పిల్లలొచ్చారు
మనుషులొచ్చారు
గేదలొచ్చారు అనడంకూడా అసమంజసంకాదు.

No it is not అన్న ఒక చిన్న పిల్ల మాటలకు ఎంతో ఉద్రేకంతో మరో పిల్ల Yet it is అని జవాబు చెప్పవచ్చు. ఈ విధమైన వింత రూపాల ఏర్పాటుకు కారణం సామ్యమే.

ఈ సామ్యంవల్ల (i) లోకనిరుక్తి (Folk Etymology) (ii) నాగరీకరణం (Hyper Correction) వంటి ధ్వని భేదాలు రూపుదిద్దుకుంటాయి.

(i) లోకనిరుక్తి (Folk Etymology). ఒక పదాన్నో పదభాగాన్నో గుర్తులో ఉంచుకుని దాని ఛాయలో సామ్యంవలన కొత్త పదాలను సృష్టించుకోవడం జరగవచ్చు.

ఆరుద్రకార్తె > ఆరెద్దలకార్తె
c కుసుమ > శ్రీ కుసుమ.

(ii) నాగరీకరణం (Hyper Correction) నాగరకుల భాషకు కొన్ని నిర్ణీత లక్షణాలున్నాయనే గుర్తింపువలన వాటి సామ్యాన్ని భావించి తన భాషలో కొన్ని పదాలు సృష్టించుకోవడం కనిపిస్తుంది.

ఎగతాళి > వెగతాళి
తాంబాళం> స్తాంబాళం.

ఈ సామ్యంవల్ల జరిగే మార్పు కేవలం ఒక్క ధ్వనికి జరిగేదిగా ఉండక పూర్తిగా ఒక ధాతువుకు జరిగేదిగా (Paradigmal) ఉంటుంది.

మూడవ అంశం ఆదాన ప్రక్రియ. ఆదాన ప్రక్రియ (Borrowing) ఇతర భాషలనుండి మాటల్ని యథాతథంగా ఎరువు తెచ్చుకోవటంవలన ఆ ధ్వనులు ఉపయోగ బాహుళ్యంచేత స్వభాషా పదాల్లోనికి కూడా ప్రవేశించటం జరుగవచ్చు. ఉదాహరణకు, తెలుగు పదాల్లో పరుష సరళాలకూ మహాప్రాణాలకూ లక్షణంలేదు. అది అన్య భాషా సంపర్కం వల్ల తెలుగులోకి ప్రవేశించింది.

అంతటితో ఊరుకోక అది దేశ్య పదాల్లోకి కూడా జొరబడటం మనం చూడ వచ్చు. ఉదా : ముప్పై, నలభై

ఈ విధంగా మూడు ముఖ్యమైన బాహిరమైన కారణాలు ధ్వనుల్లో భేదాల్ని కలుగజేయడానికి సమర్థాలవుతున్నాయి.

మొత్తం ధ్వని భేదాలనన్నిటినీ మనం తిరిగి సాంప్రదాయిక (Acquisitional Change) భేదమనీ, ఉపయోగాత్మక భేదమనీ (Utilisational) వింగడించవచ్చును. ధ్వనుల మార్పులో ఒక క్రమ పద్ధతిని మనం సాంప్రదాయిక భేదంలో చూడగలం. ఎరువు మాటలవల్లా, సామ్యంవల్లా కలిగే మార్పుల్ని మనం ఉపయోగాత్మక భేదం కిందనే జమకట్టవలసి ఉంటుంది. ఇవి క్రమ పరిణతంగా ఉండక కేవలం బుద్బుదప్రాయంగా (Sporadic) ఉద్భ విస్తూ నశిస్తూ కనిపించవచ్చు.

ఉదా॥ స్కూల్ అనే యింగ్లీషు పదం, హిందీలో సకూల్‌గానూ తెలుగులో ఇస్కూల్‌గానూ ప్రవేశించింది. ఆంగ్ల పద్ధతిలో స్కూళ్ళు ప్రవేశించాక ఆ మాటకూడా ఉపయోగాత్మకంగా దేశభాషల్లోకి జొరబడవలసి వచ్చింది. పదాదిన సంయుక్తాక్షరాన్ని ఉచ్చరించటంలో కలిగే కష్టాల్ని నివారించటంకోసం కొన్ని చోట్ల ఆద్యాగమమూ (Prothesis), మరికొన్ని చోట్ల మధ్యాగమమూ (Epenthesis) రావడం జరిగింది. ఈ రకమైన మార్పులతో ఒకే పదం రెండు తద్భవ రూపాలను గ్రహించటం కేవలం ఉపయోగాత్మకమైన మార్పు వలననే. ఈ రకమైన తద్భవ రూపాలు ఆయా భాషల్లో సర్వేసర్వత్రా స్థిరంగా నిలిచిపోకుండా కేవలం మాండలిక భేదాలుగా ఉండి క్రమేణా నశించిపోవడం కూడా సంభవమే.

ధ్వని భేదాలన్నిటినీ, అవి ఏర్పడిన పద్ధతులను బట్టి చూస్తే తిరిగి ఆరు విధాలుగా విభజించడానికి వీలుంది. ఆయా ధ్వనులకు సంభవించే పరిణామాలను బట్టి ఈ విభాగం ఏర్పడుతుంది. అవి

(1) లోపం (Elision) (2) ఆగమం (addition) (3) ఆదేశం (Phonetic Shift) (4) వినిమయం (Exchange) (5) ఒకే ధ్వని రెండు రకాలుగా మారడం (Diaphonization)(6) రెండు ధ్వనులు ఒకటిగా మారడం (Monophonization).

I. లోపం : ఒక పద్య స్వరూపంలో ఆదియందుగాని, మధ్యంలో గాని, అంతమందు గాని ధ్వనిలోపం కలుగవచ్చు.

(i) ఆదిలోపం (Procope) :

హెచ్చు > ఎచ్చు

క్రొత్త > కొత్త

(ii) మధ్యలోపం (Syncope)

కినుక > కిన్క

ఏడుగడ > ఏడ్గడ

(iii) అంత్యలోపం (Apocope)

వారలను > వారల్

రామునిచేత > రామునిచే

II ఆగమం పద స్వరూపంలో ఆది మధ్యాంతాలలో కొత్త ధ్వనులు చేరవచ్చును.

(i) ఆద్యాగమం (Prothesis)

ఎన్ను > వెన్ను

రథము > అరదము

స్కూలు > ఇస్కూలు

(ii) మధ్యాగమం (Epenthesis) దీనినే స్వరభక్తి (Anaptyxis) అని కూడా పిలుస్తారు.

రక్తం > రగతం

జుల్స్ > జులుస్.

(iii) అంతాగమం (Epithesis)

నడవడి > నడవడిక

పులక > పులకము

III ఆదేశం ఒక ధ్వనికి ఏ కారణం వల్లనైనా లోపం కలుగగా దానికి బదులుగా మరొక ధ్వని చోటుచేసుకోవడం ఆదేశం. దీన్ని కొన్ని కారణాలుగా విభజించవచ్చు.

(i) లోపదీర్ఘత (Compensatory length) ఇక్కడ ఒక ధ్వని లోపించి, దాన్ని పూరింపటానికై దీర్ఘం వస్తుంది.

మొగము > మోము

నియమము > నీమము

(ii) అనునాసిక్యం (Nasalization) దీర్ఘానికి లోపం కలిగి, తత్పూరణార్థమై సంపూర్ణ అనునాసిక్యం వస్తుంది.

పేడ > పెండ

మీద > మింద

(iii) ద్విరుక్తి (Doubling) : దీర్ఘలోపం కలిగి దాన్ని పూరించడానికి ప్రక్కనున్న హల్లు ద్విరుక్తం అవుతుంది.

ఊయెల > ఉయ్యేల

దూడ > దుడ్డె

పదగతమైన ధ్వనుల్లో ఎటువంటి లోపమూ జరుగకపోయినా, ఒక ధ్వని స్థానంలో మరొక ధ్వని చోటు చేసుకోవడం కూడా ఆదేశమే. ఈ రకమైన ఆదేశాన్ని కూడా కొన్ని విభాగాలు చేయవచ్చు.

(i) (a) నాదత (Voicing) : శ్వాస లక్షణానికి బదులుగా నాదత ఆపాదింపబడవచ్చు.

కడప > గడప

పట్టబుర్ర > బట్టబుర్ర

(i) (b) శ్వాసత (Unvoicing) :

అపద్ధం > అబద్ధం

(ii) తాలవ్యీకరణం (Palatalization): తాలవ్యాచ్చులతో కూడిన 'క' వర్ణానికి 'చ' వర్ణం ఆదేశం అవడం తెలుగులో ఒక దశలో జరిగింది.

*కేసిన > చేసిన

*కెవి > చెవి

*కెయి > చెయి

(iii) ఒక ప్రత్యేక ధ్వనికి మారుగా మరొక ప్రత్యేక ధ్వని ఆదేశం కావచ్చును.

1. న > ల నెనగ > నెలగ
   తెనుగు > తెలుగు
2. ణ > డ ముణుగు > ముడుకు
3. ణ > న తొణుకు > తొనుగు
4. శ > స ఆశ > ఆస
5. ష > స వేషం > వేసం
6. య > జ యముడు > జముడు
7. గ > వ పగలు > పవలు
8. బ > వ కబురు > కవుర

ఇట్లా ఎన్నో ధ్వని భేదాల్ని సంగ్రహించటానికి వీలుంది.

(IV) వినిమయం (Exchange) రెండు ధ్వనులు పరస్పరం తార్మారు చెందటం కూడా భాషలో కనిపిస్తుంది. దీన్నే వర్ణ వ్యత్యయం (Metathesis) అంటారు.

మొలతాడు > మొదతాలు
బర్లు > బఱ్రలు

(V) ఒకే ధ్వని రెండు రకములుగా మారడం (Diaphonziation) : దీన్నే వర్ణవిభేదనం (Dissimilation) అని కూడా పిలవవచ్చును.

ఉండడం > ఉండటం

(VI) రెండు ధ్వనులు ఒకటిగా మారటం (Monophonization) : దీన్ని వర్ణ సమీకరణం (Assimilation) అని కూడా పిలువవచ్చు.

చల్ది > చద్ది
అగ్ని > అగ్గి

ఈ విధంగా ఇన్ని మౌలికమైన పద్ధతుల్లో ఏ భాషలోనైనా ధ్వనుల భేదాన్ని పరిశీలకులు గుర్తించవచ్చు. వ్యవహారంలో ఉన్న ప్రతి వాడుకా ఒక క్రమానికి లోబడి, కొన్ని మౌలిక సూత్రాలకు వశమై ఏర్పడుతుంది గనక దాన్ని గ్రహించక తప్పదనే స్థిరాభిప్రాయం కలుగుతుంది. జనుల దృక్పథంలో ఇటువంటి మార్పు కలగడం భాషాధ్యయనానికి అవశ్యమూ కావలసిన విషయం.



# 8
# సంధి

తెలుగు అజంత భాష. దీనికి మూల భాష అయిన మూలద్రావిడం హలంత భాషగా గుర్తింపబడ్డది. తెలుగు భాషకు అజంతత్వం పరిణామ వశాన వచ్చిన లక్షణం. అందువలన పదాంతంలో ఉండే అచ్చు సాధారణంగా బలహీన మైందిగా, అర్థమాత్రాకంగా ఉంటుంది. ఇందుకు భిన్నంగా పదాదిన ఉండే అచ్చు ఊనికతో కూడి, తేలికగా మార్పుకు లోనవకుండా స్థిరంగా ఉంటుంది ఈ రెండు లక్షణాలనూ, మనం తెలుగులో సంధి స్వరూపాన్ని గురించి ముచ్చటించుకునేటప్పుడు తప్పక జ్ఞాపకముంచుకోవాలి.

సంధి అన్న పదానికి తెలుగు వ్యాకర్తలు కేవలం రెండచ్చుల మధ్య జరిగే పరిణామంగా నిర్వచనాన్ని ఇచ్చారు. పూర్వ పరస్వరంబులకు పరస్వరం బేకాదేశమగుట సంధి అని చిన్నసూరి నిర్వచించాడు. తెలుగులో మనం సంధి అంటున్నది, సంస్కృత వ్యాకరణకారులు చెప్పిన సంహిత కంటే భిన్నమైనది. అక్కడ కేవలం వర్ణసంయోగాన్ని సంహిత అన్నారు. ఆ వర్ణం అచ్చు కావచ్చు, హల్లు కావచ్చు. కాని తెలుగులో సంధి నిర్వచనం మాత్రం పూర్వ పర పదాంతాద్యచ్చులకు మాత్రమే సంబంధించింది.

వ్యాకరణజ్ఞులు సౌలభ్యం కోసం పూర్వ పదాంత, పరపదాద్యచ్చులు రెంటికీ మారుగా, పర పదాద్యచ్చు రావడమనే నిర్వచనాన్ని ఇచ్చినా, నిజానికి జరుగుతున్నదేమంటే, పూర్వ పదాంతాచ్చు మీద, పర పదాద్యచ్చు తన ప్రభావాన్ని నెరపి, దాన్ని త్రోసివేసి ఆ స్థానాన్ని తాను ఆక్రమించుకుంటున్నది. దీన్నే పరరూప సంధి అని పిలుస్తారు.

తెలుగులో రెండచ్చులు అవ్యవహితంగా తారసిల్లినప్పుడు, మూడు రకాలయిన కార్యాలు జరుగడానికి వీలుంది.

1. పరరూప సంధి : పైన నిర్వచించిన సంధి యిది. ఇది తెలుగు పదాలలో నూటికి తొంభై పాళ్ళు కనిపిస్తుంది.

2. పూర్వరూపసంధి : అనగా పరపదాద్యచ్చు మీద పూర్వాచ్చు తన ప్రభావం చూపి, స్థిరంగా దాని స్థానాన్ని తాను ఆక్రమించడం.

మా + అమ్మ > మామ్మ
మీ + ఇల్లు > మీల్లు

ఇటువంటి రూపాలు ప్రాచీన గ్రాంధిక భాషలో లేవు క్వచిత్తుగా వ్యవహారంలో వినిపిస్తాయి.

3 సంధ్యభావం రెండచ్చులు అవ్యవహితంగా ఉన్నా, రెంటి మధ్యా సంధి జరుగకపోవడం. సంధి జరగకపోతే, సంస్కృతంలో అవి ప్రకృతి భావంతో అలాగే ఉండిపోవచ్చును. కాని తెలుగులోఅలా ఉండిపోవడం కుదరదు ప్రకృతి భావ నివారణకై ఆ రెండచ్చుల మధ్యా కొన్ని వర్ణాలు చేరబడతాయి.

చిన్నయసూరి, "సంధిలేనిచోట స్వరంబు కంటె పరంబయిన స్వర మునకు యడాగమంబగు'' అని ప్రకృతి భావ నివారణకు ఒక్క యవర్ణాన్ని మాత్రమే పేర్కొన్నాడు (మా యిల్లు) అంతేకాని రెండు అచ్చుల మధ్య వచ్చే ను వర్ణాన్ని ప్రకృతి భావ నివారణకై వచ్చిన ఆగమమేనని ఆయన స్పష్టంగా చెప్పలేదు కాని తెలుగు పదాల్లో నుగాగమం వచ్చిన సందర్భాలను గుర్తించి, అటువంటి చోట్ల సాధారణంగా పూర్వపదాలన్నీ ద్రుత ప్రకృతికాలని గుర్తించాడు. ద్రుతం చివర కలిగిన పదం ద్రుతప్రకృతికమనీ, సంధి కాని చోట్ల పూర్వపదం ద్రుతప్రకృతికమైతే ప్రకృతి భావ నివారణకై పదం చివర ఉండే ద్రుతమే ఉపయోగపడుతుందనీ ఉద్దేశించి నుగాగమాన్ని కిత్తుగా చెప్పడం జరిగింది. యడాగమం దీనికంటే భిన్నంగా పరపదాదికి వేరే టిత్తు (వచ్చుచున్నాడు)

ద్రుతప్రకృతికాలుగా నిర్దేశించడానికి వీలులేని పదాలు పూర్వపదాలుగా ఉన్నప్పుడు కూడా ప్రకృతి భావ నివారణకై ను వర్ణం రావడం కనిపించింది. అప్పుడు ఆ ను వర్ణాన్ని కూడా కిత్తుగానే నిర్ణయించి నుగాగమంగా చెప్పాడు (రాజు నాజ్ఞ).

చెప్పడం ఏ రకంగా చెప్పినా తెలుగులో ప్రకృతి భావ నివారణకై /య/ వర్ణం చేసిన పనే ను వర్ణం కూడా చేస్తున్నట్లు మనం గ్రహించవచ్చు. అయితే ఈ రెండు వర్ణాలతో పాటు /వ/ వర్ణం కూడా తెలుగులో సంధిని ఆపే వర్ణంగా పని చేస్తున్నది (మావూరు). కాని దీన్ని ప్రాచీన వ్యాకర్తలు అంగీకరించలేదు దీనికి కావ్యభాషలో ప్రవేశం లభించలేదు పైపెచ్చు ఇటువంటి రూపాలను వ్యవహారం నుండి గ్రహించి గ్రంథాలలో వాడితే అవి అప్రయోగాలుగా నిరసింపబడడం జరిగింది

ఇవేకాక, సంధిని ఆపడానికి, టుగాగమం (కలకుటమ్మ), రుగాగమం (బీదరాలు), హకారాగమం (పదిహేను) వంటి కొన్ని ఆగమాలు కూడా తెలుగులో కనిపిస్తున్నయ్. వీటిని వ్యాకర్తలు సంధిని నిలపడానికి వచ్చిన

ఆగమాలుగా స్పష్టం చేయలేదు. కాని చిన్నయసూరి ఈ రూపప్రక్రియను సంధి పరిచ్ఛేదంలోనే సాధించడానికి పూనుకోవడం గమనార్హం. అందువల్ల, ఈ ఆగమాలన్నీ సంధి పరిచ్ఛేదానికి సంబంధించినవేననీ, సంధిని ఆపడమే వీటి ప్రయోజనమనీ చిన్నయసూరి ఉద్దేశించినట్లు స్పష్టమౌతున్నది.

తెలుగు పదాలలో దీర్ఘాచ్చులతో అంతమయ్యే పదాలు చాలా తక్కువ. ఒకవేళ దీర్ఘాంతంగా ఒక పదం ఏర్పడిందంటే, ఆ దీర్ఘం ఇతరత్రా విశేషార్థం ఇవ్వడం కోసమని మనం సులువుగా గుర్తించవచ్చు. ప్రత్యేక ప్రయోజనం కోసం వస్తుంది కాబట్టి అది ఇతర పదాంత హ్రస్వాచ్చువలె జారిపోయేదిగా ఉండదు అందువల్లనే దీర్ఘాచ్చులకు సంధి లేదు అనే నిర్ణాయక సూత్రం జనించింది. కాని గ్రాంథిక భాషలో పాటింపబడని యీ సంధి (చల్లగా నుండెను- ఏమాయాట?) వ్యావహారికంలో (1) పాటింపబడడం (చల్లగుండె) (2) ప్రకృతి భావంతో ఉండడం (ఏమా ఆట) కూడా కనిపిస్తుంది.

దీర్ఘాచ్చులు పోగా, తెలుగులో పూర్వ పదాంతంలో అ, ఇ, ఉ లు కనిపిస్తాయి. ఒకారాంత పదాలు లేవు. ఎకారాంత పదాలు, ఒకటో, రెండో అన్నట్లుగా, చాలా తక్కువగా ఉంటాయి. అ, ఇ, ఉ లలో కూడా. ఉదంత పదాలు ఎక్కువ. ఇ, ఉ లు అంతమందు కల పదాలు తక్కువ.

చిన్నయసూరి ఉత్తునకు నిత్య సంధిని విధించి, ఇ, ఉ లకు సంధిని వైకల్పికమో, బహుళమో చేయడం జరిగింది. అయితే చిన్నయసూరి ఇత్తునకు చెప్పిన వైకల్పిక రూపాలనూ (ఏమి యంటివి, ఏమంటివి), అత్తునకు చెప్పిన బహుళ రూపాలనూ వ్యవహారంలో మనం సంధి చేసి (అమ్మొచ్చింది) వాడుకుంటుంటాము అంటే, సాధారణంగా ఉత్తునకు సంధి జరిగినట్లుగానే, అ,ఇ లకు కూడా సంధి జరుగుతున్నట్లే ఇట్లా తెలుగులో పరరూప సంధి జరగడానికి కారణం పూర్వ పదాంతాచ్చు బలమైనది కాకపోవడమూ పరపదాద్యచ్చు ఊనికను కలిగి స్థిరంగా ఉండే లక్షణం కలది కావడమూ అని మనం గుర్తుంచుకోవాలి

హల్సంధి : తెలుగు వ్యాకర్తలు, హల్సంధిని గురించి చెప్పలేదు. తెలుగు అజంత భాష కావడంవల్ల, ఒక హల్లుకు మరో హల్లు పరమవడం అయ్యే సన్నివేశం కలగదని వారు భావించడం చాలా సమంజసం. గ్రాంథిక భాషకు అన్వయిస్తే ఈ తీర్మానం సరిగా సరిపోతుంది. కాని తెలుగు వ్యావహారిక భాషకు ఇది పట్టదు. అక్కడి ఉదాహరణలు పరిశీలిస్తే, హల్సంధికి అవకాశం ఉన్నట్లుగా మనకు స్పష్టమౌతుంది. ఇందుకుకూడా అచ్సంధికి చెప్పిన కారణాలలో ఒకటి చక్కగా సరిపోతుంది. అది, పూర్వ పదాంతాచ్చు బలహీనమైనది కావడంవల్ల.

దాన్ని, అత్సంధి జరిగేటప్పుడు పర పదాద్యచ్చు ఆక్రమించినట్లే, దానికి హలాది అయిన పరపదం పరమైనప్పుడు ఆ హల్లు యొక్క బలిమివలన, అచ్చు జారిపోయి పూర్వ పదాంతంలో కూడా హల్లే మిగులుతుంది. అప్పుడు హల్సంధి జరగడానికి తగిన సన్నివేశం ఏర్పడ్డట్టే కదా! (నాకు + కాదు → నాక్ + (ఉ>ϕ) కాదు → నాక్కాదు).

ఈ విధంగా తెలుగులో ఏర్పడిన హల్సంధి స్వరూపం మనం గమనించ దగ్గది. దీన్ని గూర్చి ప్రాచీన వైయాకరణు లెవరూ ఆలోచించినట్లు కనపడదు.

తెలుగులో పరపదాది హల్లు యొక్క ప్రభావమే పూర్వ పదాంత్య హల్లు మీద ఉంటుంది.

ఉదాహరణలు :

I. స్పర్శాలు : I (ప, బ లు)

1. ప + ప → ప్ప
వేప + పుల్ల → వేప్పుల్ల

2. బ + బ → బ్బ
బాబు + బాబు → బాబ్బాబు

3. ప + బ → బ్బ
తీపి + బూంది → తీబ్బూంది

4. బ + ప → ప్ప
బేబి + పిన్ని → బేప్పిన్ని

(II) (త, ద లు)

1. త + త → త్త
జాతి + తక్కువ → జాత్తక్కువ

2. ద + ద → ద్ద
సూది + దారం → సూద్దారం

3. త + ద → ద్ద
నూతి + దాక → నూద్దాక

4. ద + త → త్త
పది + తక్కువ → పత్తక్కువ

(iii) (ట, డ లు)
వీటి వాడుక విరళం.
(iv) (క, గ లు)

1. క + క → క్క
నీకు + కాదు → నీక్కాదు
2. గ + గ → గ్గ
వాగు + గట్టు → వాగ్గట్టు
3. క + గ → గ్గ
నాకు + గాజులు → నాగ్గాజులు
4. గ + క → క్క
పొగ + కంపు → పొక్కంపు

స్పృష్టోష్మాలయిన చ, జ ల విషయంలో కూడా పై సూత్రాలే వర్తిస్తాయి కాని వాటి వాడుక విరళం.

II. అనునాసికాలు :

1. ఒకే రకమైన అనునాసికాలు పరమైతే పూర్వాచ్చు జారిపోతుంది.

(a) భూమి + మీద = భూమ్మీద
(b) నాన + నన్ను = నాన్నన్ను

2. ఒక అనునాసికానికి మరో అనునాసికం పరమైతే పూర్వాచ్చు లోపించదు. కాబట్టి అటువంటి చోట్ల హల్సంధి ప్రసక్తి లేదు.

(a) భూమి + నుంచి = భూమి నుంచి
(b) నాన + మాట = నాన మాట

III. పార్శ్వికాలు :

1. ల, ర లకు, ఏ పార్శ్వికం పరమైనా పూర్వాచ్చు లోపించి హల్సంధికి అవకాశం ఏర్పడుతుంది.

(a) పాలు + లేవు = పాల్లేవు
పేరు + రాదు = పేర్రాదు
(b) కూర + లోకి = కూర్లోకి
కూలి + రాదు = కూల్రాదు

2. ల, ర లకు ఊష్మం పరమైనప్పుడు కూడా అచ్చు లోపిస్తుంది.

(a) పాల + సీసా = పాల్సీసా
(b) చెరి + సగం = చెర్సగం

3. ల, ర లకు మరే హల్లు పరమైనా, అచ్చుకు లోపం జరగడం, జరగకపోవడం కూడా సంభవించవచ్చు.

(a) కల + కాదు → కలకాదు

మరి + కదులు → మరికదులు

(b) కమల + తోటి → కమల్తోటి

ఎవరి + తప్పు → ఎవర్తప్పు

IV ఊష్మాలు

తెలుగు మాటల చివర కనిపించేది /స/ వర్ణం. దానికి సవర్ణాది పదాలతో సంహిత ఏర్పడే అవకాశాలు చాలా విరళం. ఇతర హల్లులు పరమైనపుడు పూర్వాచ్చు జారిపోకపోవడం కనపడుతుంది. ఒక్క చ, జ ల విషయంలో అచ్చు జారిపోతుంది.

(a) మసి + పట్టింది → మసిపట్టింది

(b) మసి + చుక్క → మస్చుక్క

V. అంతస్థలు

సంధ్యభావానికి మధ్యలో వచ్చే వర్ణాలు, తెలుగులో య, వ లు. కాబట్టి ఇవి పదాంతంలో ఉండగా, ఏ హల్లు పరమైనా, వీటిలో ఉండే అచ్చు జారిపోవడం కానీ, హల్సంధి జరిగే అవకాశం కలగడం కానీ ఉండదు.

తెలుగు వ్యవహార భాషలో ఉన్న హల్సంధిని స్థూలంగా వివరించడం జరిగింది.

సమస్వరత : ద్రావిడ భాషలన్నిటిలో ఈ సమస్వరత (Vowel harmony) అనే లక్షణం ఉంది. దీన్నే "స్వర సమీకరణం" అని కూడా అంటారు. విభిన్న స్థాన కరణాలకు చెందిన అచ్చులు రెండు, ఒకదానికొకటి అవ్యవహితంగా, దగ్గరగా వచ్చినప్పుడు, అందులో ఏది బలీయంగా ఉంటుందో అది రెండవదాన్ని తనలాగే మార్చుకుంటుంది.

(1) కరి + లు → కరులు

ఇక్కడ పూర్వ పదాంత్యంలో ఉన్న తాలవ్యాచ్చును, దానికి పరమైన 'ఒష్ఠ్యేతరాచ్చు ప్రభావితం చేసి, తనవలె తాలవ్యేతరాచ్చుగా మార్చింది.

(2) కత్తి + కు → కత్తికి

ఇక్కడ పూర్వపదాంత్యంలో ఉన్న తాలవ్యాచ్చు, దానికి పరమైన తాలవ్యేతరాచ్చును ప్రభావితం చేసి, దాన్ని తనవలె మార్చింది.

ఈ సమస్వరత యొక్క ప్రభావం పక్కన ఉన్న అచ్చుకేకాక, తరువాతి అచ్చుల మీద కూడా ప్రసరించడానికి అవకాశం ఉంది. పదాది అచ్చు ఊనిక కలిగి ఉంటుంది గనుక అది మారదు

(3) కలిమి + లు = కలుములు
తొమ్మిది + లు = తొమ్ముదులు

ఇది సమస్వరత స్వరూపం.

10)

# 9(అ)

# పద నిర్మాణ శాస్త్రం–నామధాతువులు

వెనుక ప్రకరణాల్లో భాషాధ్వనులైన వర్ణాలను గురించి చర్చించి, వర్ణాలు స్వయంగా అర్ధవంతాలైన అంశాలుకావని నిర్ధారించడం జరిగింది. అవి భాషలోని అర్థానికి సంబంధించిన అంశాన్నిగానీ, వాక్య నిర్మాణ పద్ధతిని గురించి గానీ ఏమీ వెల్లడించలేవు. అవి కేవలం ఆ భాషకు సంబంధించిన పదాలను నిర్మించటానికి మాత్రమే సహాయపడే కొలతబద్దలు. అనగా వర్ణాలను నిర్ణీతమైన ఒక పద్ధతిలో కూర్చటం వలన పదాలు ఏర్పడుతున్నాయి. దీన్నిబట్టి ఆధునిక భాషావేత్తలు అర్థభేదన సమర్థమైన కనిష్ఠాంశాన్ని వర్ణమనీ, అర్ధబోధన సమర్థమైన కనిష్ఠాంశాన్ని పదాంశమని నిర్వచించడం జరిగింది. ప్రాచీన లాక్షణికులు కూడా పదానికుండవలసిన అర్థబోధన సామర్థ్యాన్ని దృష్టిలో ఉంచుకునేదాన్ని శక్తమ్ పదమ్ అని నిర్వచించారు.

యాస్కుడు తన నిరుక్తంలో పదచర్చ చేసి పదాలను నాలుగు విధాలని వింగడించాడు. అవి (1) నామాలు (2) ఆఖ్యాతాలు (3) ఉపసర్గలు (4) నిపాతాలు. ఇందులో నామవాచకాలనూ ఆఖ్యాతాలైన క్రియలనూ ఒక విభాగంగానూ, మిగిలిన వాటిని మరో విభాగంగానూ వేరు చేయవచ్చును నిపాతాలు యాస్కుని నిర్వచనంలో స్వయమర్థబోధకాలైన స్వతంత్ర ఉచ్చారణాంశాలు. అయితే అవి అవ్యుత్పత్తికాలని ఆయన మతం. ఇందులో మొదటి విధానికి స్వతంత్ర ప్రయోగార్హత ఉంది. రెండవ విభాగానికి లేదు. అందుకని మొదటి విభాగంలోని పదాలను స్వతంత్ర పదాలనీ, రెండవ విభాగంలోని పదాలను అస్వతంత్ర పదాలు లేదా అనుబంధ పదాలు అనీ పిలవవచ్చు. అనుబంధ పదాలు అని యెందుకంటున్నామంటే ఇవి స్వతంత్ర ప్రయోగార్హత కలిగిన నామధాతువులకో, క్రియాధాతువులకో చేరినపుడు మాత్రమే అర్థదాయకాలు కాగలుగుతున్నందు వలన. తెలుగులో సంస్కృతంలో ఉన్నట్లుగా నిపాతాలూ ఉపసర్గలూ లేవు కనుక నామ క్రియా ధాతువులకు చేరే ప్రత్యయాలనూ, ఉపమావాచకాలయిన 'వలె', 'వంటి' మొదలైన వాటినీ మనం అస్వతంత్ర పదాలు లేదా అనుబంధ పదాలు అని గ్రహించవలసి ఉంటుంది.

అయితే ప్రాచీన వ్యాకర్తలు మాత్రం ప్రత్యయాలను పదాలుగా వ్యవహరించలేదు. మీదు మిక్కిలి వాటికి 'అపదాలు' అనే సంకేతనామాన్ని యిచ్చి సూత్ర రచన చేశారు.

ఆంధ్ర శబ్ద చింతామణిలో పద పరిచ్ఛేదం లేదు. పదానికి నిర్వచనం కూడా ఆ వ్యాకరణ గ్రంధంలో మనకు లభించదు. బాలవ్యాకరణం చింతామణిని అనుసరించటంవలన, అక్కడా అంతే జరిగింది. కాని ప్రౌఢవ్యాకరణకారుడు మాత్రం 'పదములవి నామములు, క్రియలు, అవ్యయంబులని త్రివిధంబులు' అని వివరించటం జరిగింది. ఈయన కూడా ప్రత్యయాలను పదాలుగా వ్యవహరించ లేదు

తెలుగు మీద ఆంగ్లభాషాప్రభావం ప్రసరించిన వెనుక రచింపబడిన తెలుగు వ్యాకరణ గ్రంథాలలో ఆంగ్ల వ్యాకరణ ప్రభావం స్పష్టంగా కనిపించేట్లు పద విభజన జరిగింది సంగ్రహాంధ్ర వ్యాకరణంలో ఉన్న "పదములవి పదు నొకండు విధములు" అనే విభజన అటువంటిదే. వీటిలో నామాలు, క్రియలు, అవ్యయాలు మాత్రమేగాక సముచ్చయం, ఉపపదం వంటి విభజన ఉంది. ఇక్కడ సముచ్చయమూ, ఉపపదమూ కూడా పదాలే.

దీన్నిబట్టి పదానికి ఉండవలసిన ముఖ్యలక్షణం అర్థవత్వమేనని గ్రహింపవచ్చును. ఈ లక్షణాన్ని విపులీకరిస్తూ ప్రౌఢవ్యాకర్త పదానికి ప్రయోగార్హత, అనన్వితత్వం, ఏకత్వం ఉండాలని ఉద్ఘోషించాడు. అన్ని వాదాల సారాంశాన్నిబట్టి చూస్తే స్వతంత్రంగానో అనుబంధించబడినప్పుడో ఏది అర్థాన్ని ఇవ్వడంలో సామర్థ్యం కలిగి ఉంటుందో అదే పదమని స్పష్టమవుతున్నది.

అర్థవంతమైన పదం, ఒక వాక్యంలోని మిగిలిన పదాలకు సంబంధించిన అర్థాలతో పొందికను కలిగి ఉంటుంది. అందువల్లనే యోగ్యత, ఆకాంక్ష ఆసత్తి కలిగిన పదాలను వివరిస్తూ వాటివలన వాక్యం ఏర్పడుతుందని ప్రౌఢ వ్యాకర్త నిర్వచించటం జరిగింది.

శ్రోతకు దేన్ని అవగతమయ్యేట్లు పదం చేయగలుగుతున్నదో దాన్ని సాంప్రదాయకమైన పద్ధతిలో అరం అంటున్నాము. కాని, ఒక పదం ఎల్లవేళలా అందించే అర్థం నిశ్చయంగా ఒకే విధంగా ఉండకపోవచ్చును. ఆ అర్థస్ఫురణ, అర్థానికుండే విభిన్నచ్ఛాయలు, ఆ పదం ఉపయోగింపబడే సన్నివేశాన్ని బట్టి, సందర్భాన్నిబట్టి నిశ్చయింపబడుతుండటం మనం చూడవచ్చును. అంతేకాక, వాక్యంలో (1) ఒక్కొక్క పదానికి నిర్ణయింపబడిన స్థానాన్నిబట్టి కూడా ఆ పదం యొక్క అర్థం మారవచ్చు.

ఉదా : 1. పండు మామిడి 2. మామిడి పండు. ఈ రెండు ప్రయోగాలలో మొదటి పండుకు రెండవ పండుకు గల అర్థాలు ఒక రకమైనవి కావు. (2) ఒక పదానికున్న నిర్ణీతస్థానాన్ని మార్చితే ఆ పదం ఆ వాక్యంలో అర్థబోధనాశక్తి కోల్పోయి అర్థరహితంగా మారిపోవచ్చును. ఉదాహరణకు ఈ రెండు వాక్యాలనూ గమనించండి.

(1) నేను అన్నం తింటుండగా గంట కొట్టారు.

(2) నేను గంట తింటుండగా అన్నం కొట్టారు.

ఇక్కడ స్థానభ్రంశం వలన రెండవ వాక్యంలోని గంట అనే మాటకు అర్థబోధనా సామర్థ్యం నశించింది. దీనినిబట్టి ఒక పదానికి సంబంధించిన అర్థం గ్రహించటానికి ఆ పదానికి వాక్యంలో ఉండే స్థానం, సన్నివేశం ముఖ్యాంశాలని నిర్ణయింపక తప్పదు.

ఇట్టి చరిత్ర కలిగిన పదాలలో బృహద్ విభాగానికి చెందినవి నామ వాచకాలు. తెలుగు నామవాచకాలకూ, సంస్కృత నామవాచకాలకూ ఒక ప్రధాన భేదం కనిపిస్తుంది. సంస్కృత నామాలలో ప్రథమావిభక్తిలో చాలా వాటికి ప్రత్యయాలు చేరతాయి. కేవలం స్త్రీవాచకాలూ, హలంత శబ్దాలూ మాత్రమే సాధారణంగా ప్రత్యయరహితంగా ప్రథమావిభక్తి ఏకవచనంలో ఉండటం కనిపిస్తుంది. ప్రత్యయరహితమై 'ధాతుభిన్నమైనదానిని 'ప్రాతిపదిక' అని సంస్కృత వ్యాకరణకారులు వ్యవహరించటం జరిగింది. తెలుగులో ఇంచు మించు నామవాచకాలన్నీ ప్రథమావిభక్తిలో ప్రత్యయ రహితాలుగానే ఉంటాయి. అమ్మ, అక్క, అయ్య, ఎద్దు, తాత, నక్క - ఇటువంటివన్నీ లింగ విపక్షను పాటించకుండా ప్రత్యయరహితాలుగా ఏర్పడిన రూపాలు. సంస్కృత వ్యాకరణ ప్రభావం మన వ్యాకరణకారులమీద ప్రసరించటంవలన వారు వీటిని స్త్రీసమాలుగా వ్యవహరించటం జరిగింది.

ఇక ఈ నామపదాలకున్న లింగబోధకత విషయంలో కూడా తెలుగుకీ సంస్కృతానికీ చాలా వ్యత్యాసముంటుంది. సంస్కృతంలో నామవాచకానికి లింగం అర్థంతో ప్రమేయం లేకుండా శబ్దాశ్రయంగా ఉంటుంది. అనగా ఒకే అర్థాన్నిచ్చే విభిన్న నామవాచకాలు వేరువేరు లింగాలకు చేరిన పదాలు కావచ్చు ఉదాహరణకు భార్యా శబ్దం స్త్రీ లింగం. దారాః శబ్దం పులింగం. కళత్రమ్ అనే శబ్దం నపుంసక లింగం. ఈ మూడులింగాలూ యిక్కడ స్త్రీ వాచకతను కలిగి ఉన్నాయి.

తెలుగులో లింగం అర్థాశ్రయమైనది. ఉదాహరణకు తల్లి స్త్రీలింగం తండ్రి పుంలింగం, ఎండ్రి నపుంసక లింగం. లింగాన్ని బోధించే ప్రత్యయాలు

నామానికి అనుసంధింపబడాలన్న నియమం తెలుగులో లేదు. ఒక్క ప్రథమా విభక్తిలోనూ, అందునా తత్సమ పదాల విషయంలో మాత్రమే నామ విభక్తులు లింగబోధకాలుగా కనపడుతున్నాయి. తెలుగులో లింగ వివక్షను తెలియజేసే ప్రత్యయం నామ విభక్తి ప్రత్యయంకాక, క్రియావిభక్తి ప్రత్యయంగా ఉంటుంది.

ఉదా : నాన్న వచ్చాడు, అమ్మ వచ్చింది, చెట్టు మొలిచింది, చిలుక పలికింది. ఇక్కడ 'ది' అనే ప్రత్యయం ఏకవచనంలో స్త్రీ తిర్యగ్జడాదులకూ, 'డు' అనే ప్రత్యయం మహదేక వచనానికీ సూచకాలు. బహువచనంలో ''మను ష్యులు వచ్చారు'' ''స్త్రీలు పడుకున్నారు'' ''కుక్కలు అన్నం తిన్నవి'' అన్నచోట "రు'' స్త్రీ, పుం వాచకాలను, 'వి' తిర్యగ్జడాలను తెలియజేసే లింగ బోధక ప్రత్యయాలు. ఇక్కడ ఒక విశేషాన్ని మనం గమనించవచ్చు. పుం లింగానికీ నపుంసక లింగానికీ నిర్దిష్టమైన క్రియాప్రత్యయాలు లింగబోధకతను సూచిస్తూ కనిపిస్తున్నాయి. స్త్రీలింగానికి మాత్రం ఏకవచన రూపాలు నపుంసక ఏకవచన రూపాలతోనూ, బహువచన రూపాలు పుంలింగ బహువచన రూపాల తోనూ సరిపోలుతూ కనిపిస్తున్నాయి. గ్రాంథిక భాషలో ప్రథమ పురుష ఏక వచన భూతకాలిక క్రియారూపాలకూ, తద్ధర్మ క్రియారూపాలకూ లింగబోధక శక్తిలేదు. ఉదాహరణకు—

భూతకాలము ''ఆమె వచ్చెను'', ''వాడు వచ్చెను'', "అదివచ్చెను''

తద్ధర్మకాలము : "అమె వచ్చును'' , ''వాడు వచ్చును'' , ''అది వచ్చును''. ఇక్కడ లింగబోధకత క్రియాప్రత్యయానికి లేదు.

''తండ్రి అన్నము తినెను" - ''తల్లి వంట చేసెను'' - "కుక్క మొరిగెను'' అను మూడు వాక్యములలో తల్లి, తండ్రి, కుక్క అనే పదాలలో కానీ, చేసెను, తినెను, మొరిగెను అనే పదాలలోగానీ లింగబోధకత లేదు. అనగా తెలుగులో కొన్ని సందర్భాలలో ఇంగ్లీషు భాషలో ఉన్నట్లుగా లింగబోధకతను సూచించని వాక్యాలు కూడా ఉన్నాయి.

లింగాన్ని బోధించటానికి తెలుగులో మరో పద్ధతి అవలంబించబడ్డది అడ, మగ అనే అర్థాలుగల మాటల్ని నామాలకు ముందుగానో వెనుకగానో సంధానించటం ద్వారా లింగబోధకతను సాధించవచ్చు. స్త్రీ, పుం వాచకాలకే కాక తిర్యక్ వాచకాలకు కూడా అడ మగ భేదాలను ఈ పద్ధతిలో తెలియజేయవచ్చు నామానికి ముందు చేర్చే లింగబోధక పదాలు : ఆడ మనిషి - మగ మనిషి, ఆడ కుక్క, - మగ కుక్క. తరువాత చేర్చేవి· (A) అట కాడు - ఆటకత్తె (B) మాయలాడు - మాయలాడి (C) రామన్న - రామక్క

తిర్యక్కులకు: కోడిపుంజు — కోడిపెట్ట. తిర్యక్కులలో స్త్రీవాచకాలకు, పుంవాచకాలకు ప్రత్యేకమైన పదాలుండటం చాలా తక్కువ. ఆవు, ఎద్దు, బర్రె, దున్నవంటి రూపాలు చాలా తక్కువ. సంఖ్యలో ఉండటం మనం గమనించవచ్చు

వచనం : సంస్కృతంలో మూడు వచనాలుండగా తెలుగులో రెండు వచనాలు మాత్రమే ఉన్నాయి అవి ఏకబహువచనాలు. ఏక వచనాన్ని సూచించటానికి ప్రత్యేకంగా ఏ ప్రత్యయం లేదు. బహువచన సూచకాలైన 'లు' 'రు'లు నామాలకు అనుసంధింపబడటం కనిపిస్తుంది. ఉదాహరణ : తల్లులు-బాలురు. అంతేకాక, బహువచన ప్రత్యయాన్ని నామానికి చేర్చకుండానే దాని ముందు సంఖ్యనో సమూహాన్నో సూచించే పదం వాడటం వలన బహువచన బోధకతను కలిగించే వీలు తెలుగు భాషలో ఉన్నది. ఉదాహరణ· "వంద విస్తరి", "వెయ్యి గడప". అదే విధంగా సమూహార్థాన్నిచ్చే పదాలు నామానికి తరువాత చేర్చటంవల్ల కూడా బహువచన బోధకత కలుగుతుంది 'కోతిమూక, గొర్రెమంద. వచన బోధకత నామాలకు చేరే ప్రత్యయాలకు ఉన్నట్లుగానే, ఆ నామాలు కర్తృస్థానంలో కల క్రియలకు చేరే ప్రత్యయాలకు కూడా ఉంటుంది. ఉదాహరణ : పిల్లవాడు అన్నం తిన్నాడు, పిల్లలు నిద్రపోతున్నారు, కుక్క మొరిగింది, పువ్వులు వికసించినవి. గ్రాంథికంలో భూత తద్ధర్మకాలాలకు చెందిన అమహత్తులకు మాత్రం బహువచన బోధకత క్రియా ప్రత్యయాలకు లేని రూపాలు కూడా ఉన్నాయి.

ఉదాహరణ : చిలుకలు పలికెను, ఆవులు వచ్చెను.

విభక్తులు : సంస్కృతభాషకు గల సప్తవిభక్తి ప్రణాళికను అనుసరిస్తూ ప్రాచీన వ్యాకర్తలు తెలుగులో కూడా ఏడు రకాల విభక్తులున్నట్లు నిర్ధారించారు. నిజానికి తెలుగు విభక్తి ప్రత్యయాలకూ, సంస్కృత విభక్తి ప్రత్యయాలకూ చాలా భేదం ఉంది. ప్రత్యయాత్మక భాషగా చెప్పబడుతున్న సంస్కృతంలో నామప్రత్యయాలు కేవలం అనుబంధ పదాలు మాత్రమే. తెలుగు ప్రత్యయాలు స్వతంత్ర పదాలుగా కూడా వాడబడటం మనం చూడవచ్చు. స్వతంత్ర ప్రయోగార్హత లేకుండా కేవలం ప్రత్యయాలుగా తెలుగులో వాడబడేవి (1) ప్రథమ-డు,ము,వు,లు, (2)ద్వితీయ-ను, (3)షష్ఠి-కు,యొక్క, (4)సప్తమి-న.

ప్రత్యయాలుగా వాడబడుతున్న స్వతంత్ర పదరూపాలు: ఉదాహరణ : (1) తృతీయ-చేత, తోడ, (2) వలన, కంటె, పట్టి, (3) లోపల- షష్ఠి (4) సప్తమి-అందు. చతుర్థిలోని కొఱకు, కై, పంచమి-కంటె, షష్ఠి-కు, విభక్తుల పుట్టుక ఒకటే.

ఇవి కాక స్వతంత్ర పదాలను ఎన్నోవాటిని విభక్తి ప్రత్యయాలుగా వాడటం, ప్రాచీన కావ్య భాషలోనూ, వాడుక భాషలోనూ కనిపిస్తుంది. నిజానికి ఈ ఏడు విధాలైన విభక్తులలో షష్ఠీ విభక్తి ప్రత్యయమైన 'యొక్క' తప్ప మిగిలినవన్నీ నామవాచకాలకు క్రియతో అన్వయాన్ని కలిగించేవి. అందువలన అవి కారకాలు.

షష్ఠీ విభక్తి ప్రత్యయాలలోని 'కు', 'లోపల' విభక్తుల తత్త్వం, అదే విభక్తిప్రత్యయమైన 'యొక్క' కంటె భిన్నంగా కనిపిస్తుంది. పై రెండూ క్రియాన్వయాన్ని కలిగించేవి కాగా 'యొక్క' సంబంధాన్ని సూచించేదిగా ఉంది. ఉదా : వానియొక్క మాట. 'కు' ప్రత్యయం అటు క్రియాన్వయాన్ని కలిగించేదిగానూ ఇటు సంబంధాన్ని సూచించేదిగానూ కూడా కనిపిస్తుంది. ఉదాహరణ :

(1) ఆ మాట నాకు చెప్పాడు (క్రియాన్వయం)

(2) వాడు నాకు తమ్ముడు (సంబంధం)

తెలుగు వ్యాకరణాలలో ఉండే కారకపరిచ్ఛేదాన్ని నిశితంగా పరిశీలిస్తే సంస్కృతానుసారియై తెలుగుకు విధించబడిన సప్తవిధ ప్రణాళిక అతివ్యాప్తి దోషానికి పాల్పడుతున్నదని తెల్లమవుతున్నది. ఇక్కడ ఒక విభక్తికి మరియొక విభక్తి వచ్చేందుకు వీలుకల్పించే సూత్రాలుఎన్నో కన్పిస్తాయి. ద్వితీయకు ప్రథమ- తృతీయకు ప్రథమ - తృతీయకు పంచమి - పంచమికి సప్తమి - చతుర్థికి షష్ఠి ఈ విధంగా ఒక విభక్తి స్థానంలో మరో విభక్తి కప్పగంతులువేస్తూ కనిపిస్తుంది. బాలవ్యాకర్త వీటికన్నిటికీ సూత్రాలు రచించి, చివరికి ప్రాణం విసిగి కాబోలు ఒకానొకచో ఒక విభక్తికి మరియొక విభక్తియునగు అని నిర్ణయించటం జరిగింది. 'విభక్తి పరిణామంబు గ్రాహ్యంబు' అని ప్రౌఢ వ్యాకర్త సూత్రింప వలసివచ్చింది. ఈ ఏడు రకాలేకాక తెలుగులో ''ఔపవిభక్తికాలు'' అనే మరో ఉపజాతి కనిపిస్తుంది. ఉపవిభక్తి అనగా విభక్తికి దగ్గరగా అని అర్థం. నామవాచకానికి ప్రథమైక వచనేతర విభక్తులు ఏకవచనంలో పరంగా ఉన్నపుడు కొన్ని ప్రత్యేక శబ్దాలపై ఆగమాదేశాలుగా వచ్చేవి ఔప విభక్తికాలు. అవి తెలుగులో ఇ, టి, తి వర్ణాలు. కాబట్టి వీటిని విభక్తులుగా చెప్పటానికి వీలులేదు. ఇవి కేవలం తెలుగు పదాలకు మాత్రమే అనుసంధింపబడేవి ఇవి క్రియాన్వయం కలిగించే కారక ప్రత్యయాలు కావు. కేవలం సంబంధాన్ని మాత్రం సూచించేవి. ఇవి కొన్ని చోట్ల ఆగమాలుగానూ, ఆదేశాలుగానూ రావటం జరుగుతుంది. అంతేకాక, ఒకే పదానికి ఔపవిభక్తికరూపం, ఔపవిభక్తికం కాని రూపం కూడా ఉండవచ్చు. వీటినే ఆధునిక భాషావేత్తలు సహాయక పదాలు అని కూడా

వ్యవహరిస్తారు (Stem formative morphs) ఈ ఔపవిభక్తులలోని 'ఇ' కి ద్వితీయాది విభక్తులలో ఏకవచనంలో ప్రత్యయానికి ముందు సంబంధబోధకమై చేరే 'ఇ'తో అభేదాన్ని సాధించవచ్చును. పోగా 'టి' 'తి' వర్ణాలలో కూడా ఈ సంబంధ బోధకతను తెలియజేసే 'ఇ' అంతర్గతంగా ఉంది. ఇక్కడ టకార తకారాలు చారిత్రక పరిణామాల బట్టి మౌలిక రూపాలనుండిగానీ, సామ్యం వల్ల గానీ, తెలుగులోకి జొరబడిన పరిశిష్టాంశాలు. ఇవేకాక పట్ ప వర్ణాలు సమాసాలలో ఈ ఔప విభక్తికాలు చేసే పనినే చేస్తున్నాయి

ఉదా :- 1. పాపటేడు (2) అంపశయ్య.

తద్ధితములు ఏ భాషలోనైనా ప్రాథమిక దశలో మనకు లభించే మౌలిక రూపాలు స్వల్పంగా ఉంటాయి. అవి నామ ధాతు రూపంలోగానీ, క్రియాధాతు రూపంలో గానీ తొలుతగా భాషలో ఏర్పడి, కాలం గడుస్తున్నకొద్దీ పరిణామవశాన మార్పులూ చేర్పులూ చేసుకుంటూ బహుళ పదజాలావిర్భావానికి కారణభూతాలవుతాయి. ఒక క్రియాధాతువు నుండి జనించిన నామపదానికి కృదంతమనీ, నామ ధాతువు నుండి జనించిన నామానికి తద్ధితాంతమనీ నామకరణం చేయటం జరిగింది. క్రియాధాతు జన్యమైన నామాన్ని ప్రాథమిక రూపంగానూ (Primary form), దాని నుండి పరిణామవశాన వచ్చే మరొక రూపాన్ని ద్వితీయ రూపంగానూ (Secondary form) వింగడించటం జరిగింది. అనగా కృద్రూపాలు ప్రాథమిక రూపాలు కాగా తద్ధిత రూపాలు రెండవ విడతకు చెందిన రూపాలు. చిన్నయసూరి, 'ధాతువునకు విహితంబైన దుఙ్భిన్న ప్రత్యయంబు కృత్తనాబడు' అనీ, విభక్త్యంతములైన శబ్దముల మీది భావార్థమతు బర్థాదులందు ప్రయోగించు ప్రత్యయంబులు తద్ధితములనీ నిర్వచించటం జరిగింది కృత్ప్రత్యయాలూ, తద్ధితప్రత్యయాలూ చాలావరకు ఒకటిగానే ఉంటాయి, టికము, తనము, కాడు, కత్తె, మారి వంటి కొన్ని తద్ధిత ప్రత్యయాలు మాత్రం తమ ప్రత్యేకతను నిలుపబెట్టుకోవడం కనిపిస్తుంటుంది.

భాషలో తద్ధితరూపాల పెరుగుదల పరిణామక్రమాన ఎక్కువగా కనిపిస్తున్నా తద్ధితప్రత్యయాల సంఖ్య పెరగలేదు అనగా కొత్తగా ఏ ప్రత్యయాలూ తద్ధితరూపాల్ని తయారుచేయడానికి భాషలో సృష్టి కాలేదు. కృత్ప్రత్యయాల విషయంలోనూ అంతే.

తద్ధిత ప్రత్యయాలుగా తొలుత వాడబడి, క్రమేణ అవి స్వతంత్ర పదాలుగా మారటం మనం తెలుగుభాషలో చూడవచ్చు. ఉదా: కొలది-పోతు మొదలైనవి.

సర్వనామాలు : నామపదాలకు పర్యాయాలుగా వాడబడే సర్వనామాలను నామాలలో అంతర్భాగంగానే గ్రహించవచ్చు. సర్వాదీని సర్వనామాని అన్న పాణినీయ సూత్రాధారంగా సంస్కృతంలో ఏర్పడిన పదం సర్వనామం. తెలుగుభాషలోకి అది ఒక పారిభాషిక పదంగా వచ్చేసింది. అయితే బాల వ్యాకరణంలో చిన్నయసూరి అన్ని ప్రభృతులు సర్వనామములు అని అన్నిని సర్వనామాల పట్టికలో తొలుత చేర్చడంద్వారా ఔచిత్యాన్ని పాటించాడు. సంస్కృత సర్వశబ్దానికి సమానార్థకమైన శబ్దం అన్ని. తమిళంలోని సర్వనామం సంస్కృతానుసారి కావటం యిష్టంలేక 'పొదుపెయర్' అనగా సామాన్య నామము అనే అర్థం వచ్చే పేరును గ్రహించింది. నామానికి ప్రత్యామ్నాయంగా వాడబడే సామాన్య నామమే సర్వనామం.

ఇవి ఉత్తమ, మధ్యమ, ప్రథమ పురుషలని మూడు విభాగాలకు లోనవుతాయి. చిన్నతనం నుండీ తన్నుత్తమ, ఎదుట మధ్యమ, ఎక్కడో ప్రథమ అనే కొండగుర్తులతో సర్వనామ పాఠాలను అందరూ వల్లెవేసి ఉంటారు.

| | | |
|---|---|---|
| నేను | నీవు | వాడు |
| మేము | మీరు | వారు |
| మనము | | అది |
| | | అవి |

అనేవేకాక

| | |
|---|---|
| తను | |
| తాను | తారు |
| తాము | తమరు |

అనే సార్వనామిక రూపాల వాడుక తెలుగులో ఉంది. ఈ సర్వనామాలను ఆత్మార్థకాలని చెప్పవచ్చు. ఇవిఉత్తమ, ప్రథమ పురుషల్లో

తను
తాను
తార్లు

అని, మధ్యమపురుషలో కేవలం బహువచనం మాత్రమే కలిగి

తాము
తార్లు
తమరు

అనీ వాడబడుతుంటాయి. బహువచనరూపమైన తారు నేడు కేవలం గ్రాంథిక భాషలో మిగిలి ఉంది కాని, వాడుకలో లేదు. ఈ ఆత్మార్థకం ఉత్తమపురుషలో కూడా వాడుకభాషల్లో లేదు.

సర్వనామాలలో ప్రథమ పురుషకు సంబంధించిన వాడు, అది, అవి అన్న సర్వనామరూపాలకు తప్ప మిగిలినవాటికి లింగబోధకత లేదు. అనగా నేను-నీవు-తను అనేవీ వాటి బహువచన రూపాలూ ఏ లింగానికైనా సమానంగా వాడబడతాయి.

ఉత్తమపురుషలో నేను, మేము అనే ఏక, బహువచన రూపాలతో పాటు 'మనము' అనే రూపం ఒకటి విశిష్టంగా కనిపిస్తుంది. ఈ సర్వనామం ఉద్దేశించిన ఎదుటి వ్యక్తితోపాటు ఉత్తమపురుషలో ఉన్న వక్తను కూడా కలుపుకుని తయారైన బహువచన రూపం.

ప్రథమ పురుషలో మహత్, మహతీ అమహద్రూపాలను చెప్పేటప్పుడు మాత్రం సర్వనామాలలో సర్దుబాటుతనం కనిపిస్తుంది. మహద్వాచక ఏక బహువచనాలకూ, అమహదేకవచన బహువచనాలకూ నిర్దిష్టమైన సార్వనామిక రూపాలున్నాయి. మహతీవాచకం విషయంలో మహతీ ఏకవచనమూ అమహదేకవచనమూ ఒకటే.

(కాకి) అది కాకా అన్నది

(దుర్గ) అది గైగై మన్నది

అట్లాగే మహద్బహువచనమూ, మహతీ బహువచనమూ ఒకటే.

(మగవాళ్ళు) వాళ్ళు పరిగెత్తారు

(స్త్రీలు) వాళ్ళు కూలబడ్డారు

అనగా మహతీ ఏకవచనం అమహదేకవచనం వలెనూ, బహువచనం మహద్ బహువచనంవలెనూ రూపొందింపబడ్డాయి. కావ్యభాషలో మహతీవాచక ఏకవచన సర్వనామం, అది ఎంత గౌరవం కల స్త్రీనైనా అది, దానిని అని వ్యవహరించటం కనిపిస్తుంది. వాడుకలో ఈ సర్వనామం తక్కువజాతి స్త్రీలకూ, నిందార్థంలోనూ వాడబడుతుంది. పరిణామవశాన ఆకె, ఆపె, ఆమె, ఆవిడ, ఆబిడ, ఆయన వంటి స్వతంత్ర పదాలు సార్వనామిక రూపాలై వాడుకలో స్థిరపడటం జరిగింది. అటువంటిదే పుంలింగాన్ని బోధించే "ఆయన" కూడా. వీటిల్లోనుండి ఆమె అనే రూపం మహతీ ఏకవచన సార్వనామిక రూపంగా స్థిరపడ్డది. బహువచనం మహద్బహువచనంతో సమానమే.

ఇట్లా మూడు పురుషలకు చెందిన సామాన్య నామాలే కాక స్థల (అందు, ఇందు etc.), కాల(అప్పుడు, ఇప్పుడు), ప్రకార (అట్టి, ఇట్టి), పరిణామ (అంత, ఇంత), నిర్దేశ (ఆ, ఈ), ప్రశ్నార్థక (ఎవరు, ఏమి) సర్వనామాలు.

అనిర్దిష్టార్థకాలైన కొన్ని - పెక్కు - పలు వంటివి ఈ సర్వనామాల జాబితాలో చేరుతున్నాయి

తెలుగు భాషలో సార్వనామిక పరిశిష్ట రూపాలు క్రియాప్రత్యయాలుగా స్థిరపడటం మనం చూడవచ్చు.

సంఖ్యావాచకాలు సంస్కృత వ్యాకరణ పద్ధతి ననుసరించి సంఖ్యా వాచకాలను కూడా మన వ్యాకర్తలు సర్వనామాలలో చేర్చడం జరిగింది. నిజానికి సంఖ్యావాచక శబ్దాలలోగాని అనిర్దిష్టార్థక శబ్దాలలోగాని సర్వనామలక్షణమైన సామాన్య నామత్వ లక్షణం అన్ని చోట్లా లేదు.

ఉదా : మూడు గుర్రాలు, ఆ ఊరు

గతానుగతికంగా సంస్కృత వ్యాకర్తలు చేసిన నియమాన్నే మనమూ గ్రహించటం వలన వీటిని సర్వనామాలుగా వ్యవహరించటం జరుగుతున్నది.

సంఖ్యావాచకాలను సర్వనామాలనటం కంటె విశేషాలనటం సబబు. వాక్యంలో సంఖ్యావాచకం ఏదో ఒక పదాన్ని విశేషించి చెప్పటానికి మాత్రమే ఉపయోగపడుతుంది. "అక్కడున్న పుస్తకాలు నాలుగు.'' ఈ వాక్యంలో పుస్తక పదం వాడకుండా కేవలం సంఖ్యావాచకమైన 'నాలుగు' ను సార్థకంగా ఉపయోగించటం కుదరదు. ఏ పదాన్నీ లపేక్షించకుండా ఒక సంఖ్యావాచకం స్వతంత్రంగా వాక్యంలో అర్థాన్నిస్తూ ఉండలేదు. ఒక నామవాచకం గానీ, లేదా దాని స్థానంలో సర్వనామంగానీ సంఖ్యావాచకంతో తోడుగా ప్రయోగింపబడక తప్పదు.

1. నాలుగు పుస్తకాలు కొన్నాను
2. అవి నాలుగే కొన్నాను.

అది ఎప్పుడూ ఒక నామాన్నో, సర్వనామాన్నో విశేషించి చెప్పడానికి మాత్రమే ఉపయోగింపబడాలి.

వాక్య నిర్మాణంలో అవి వాడిన తీరునుబట్టి సంఖ్యావాచకాలకు విశేషణ రూపాలతోబాటు విశేష్య రూపాలు సిద్ధిస్తున్నాయి కాని నిజానికి విశేష్యరూపాలు కూడా విశేషణాలు చేసే పనిని చేస్తూ ఉండటం మనం గమనించవచ్చు.

1. నాకున్న పుస్తకాలు నాలుగు.
2. నాకు నాలుగు పుస్తకాలున్నవి.

ఇక్కడ నిర్మాణపరంగా మొదటిది విశేష్యంగానూ రెండవది విశేషణం గానూ కనిపిస్తుంది.

సంఖ్యావాచకాల్లో సమూహాన్నుండి విశ్లేషించి ప్రత్యేకతను సూచించే సంఖ్యావిశేషణ రూపాలు వేరుగా ఉంటాయి. అటువంటి రూపాలను వాక్యంలో వాడవలసి వచ్చినపుడు వాడుక భాషలో ఓ- అవి అనేవాటిని సంఖ్యావాచకాలకు అనుసంధించవలసి వస్తుంది. ఆ విషయం ముచ్చటిస్తూనే సూరి సంఖ్యకు పూరణార్థము నుదవగాగమంబగు అని సూత్రించటం జరిగింది. కావ్యభాషలో 'అగు' ధాతువే వీటికి అనుబంధంగా రావటం కనిపిస్తుంది. దాని పరిణామ రూపాలే అవు, అవ, ఓ అనేవి.

విశేషణాలుగా సంఖ్యావాచకాలు వాడేటప్పుడు వాటికి, విశేష్యానికి సంబంధించిన మహదమహద్భేదాలను బట్టి వేరు రూపాలు రావటం తెలుగులో కనిపిస్తుంది.

ఉదా : మహత్తు : ఇద్దరు మనుష్యులు
అమహత్తు : రెండు గుఱ్ఱాలు

ప్రత్యేక రూపాలలో మాత్రం విశేషణాలకు మహదమహద్భేదంవల్ల వేరు వేరు రూపాలు రావు.

ఉదా : వాడు రెండో మనిషి
అది రెండో గుఱ్ఱం

మహద్వాచకాలకు సంఖ్యావిశేషణ రూపాలు గురు లేదా మంది అనేవి చేర్చడంవల్ల ఏర్పడుతున్నాయి.

ఏడుగురు పిల్లలు
పదిమంది మనుషులు

ఈ 'గురు' కావ్యభాషలో 'వురు'గా కూడా కనిపిస్తుంది.

1. వేవురు 2. నలువురు.

ఇక సంఖ్యల్ని ఒకట్ల స్థానం దాటించి పదులూ, వందల స్థానాల్లో పేర్చవలసి వచ్చినపుడు, తెలుగులో సంస్కృతం కంటె భిన్నంగా, హెచ్చు స్థానంలో ఉన్న సంఖ్యల్ని క్రమంగా అమర్చవలసి ఉంటుంది.

1 2 3
ఉదా : నాలుగువందల నలభై ఒకటి

సంస్కృతంలో ఈ క్రమం పూర్తిగా భిన్నం.

ఉదా : ఏక చత్వారింశ దుత్తర చతుశ్శతం.

తెలుగులో సంఖ్యావాచకాలన్నీ ఔపవిభక్తికాలు. వీటికి చేరే ప్రత్యయాలు టి, ంటి అనేవి.

విశేషణాలు : ఈ పదం కూడా సంస్కృత వ్యాకరణాన్ని అనుసరించి తెలుగులోనికి జొరబడిన పదమే. ఇది విశేష్యమైన నామపదం. గుణాదికాలను విశేషించి చెప్తుంది కాబట్టి విశేషంగా వ్యవహరింపబడుతున్నది. ఈ విశేషణాలు ఉద్దేశ్య విశేషణమనీ, విధేయ విశేషణమని రెండు రకాలు.

ఉదా : నల్లనివాడు, అల్లరివాడు

అన్నచోట మొదట వాడబడిన 'నల్లని' ఉద్దేశ్యవిశేషణం, రెండవ 'అల్లరి' విధేయ విశేషణం. ఎవరి గుణాలను ఉద్దేశించి చెప్తామో అది ఉద్దేశ్యము. ఏ గుణాలను విశేషించి ఉద్దేశ్యానికి విధేయంగా చెప్తామో అది విధేయవిశేషణం. ప్రౌఢ వ్యాకర్త విశేషణాలను ఆరు రకాలుగా వింగడించటం జరిగింది. అవి, జాతి క్రియా, గుణ, ద్రవ్య, సంఖ్యా, సంజ్ఞాప్రయుక్తాలైన విశేషణాలు. ఇవి జాత్యాది విశేషాలను తెలిపేవి. ప్రౌఢవ్యాకర్త ఈ రకమైన విభజనం చేయడం కేవలం పాశ్చాత్య వ్యాకరణ ప్రభావం వల్లనే. విశేషణం సమాసంలో సాధారణంగా పూర్వపదంగా ఉంటుంది. అక్కడ విశేషణాలుగా వాడబడేవి త్రికము, స్త్రీ సమము, ముగంతము, ధాతుజ విశేషణము అనేవి. ఇవి పూర్వపదాలుగా ఉంటాయి. కాని తెలుగులో ఒక్కొక్కచోట అందుకు వ్యతిరేకంగా విశేషణాలు ఉత్తరపదాలుగా కూడా ఉన్నాయి. అందువల్లనే ప్రౌఢవ్యాకర్త అటువంటివాటిని చూపిస్తూ తమ్మిగుట్టలు, చిలుకమొకరి ఇత్యాదులు విశేష్య పూర్వపద కర్మధారయాలని వివరించటం జరిగింది. విశేష్య విశేషణాల సమాసం, సమానాధికరణం అయితే కర్మధారయమనీ వ్యధికరణమైతే తత్పురుషమనీ పిలువబడుతుంది. విశేషణం సంఖ్య అయితే ఆ సమాసం ద్విగువనిపించుకుంటుంది. బహువ్రీహి సమాసం కూడా వివరణాత్మకంగా చెప్పేటప్పుడు విశేషణాలకు సంబంధించినదే.

ఉదా : 'ముక్కంటి' అన్నచోట 'మూడు కన్నులు' కల అనే వివరణ /వాడు/ను విశేషించి చెప్పడమే చేస్తుంది. ఒక్క ద్వంద్వం మాత్రం విశేషణాలతో సంబంధం లేని సమాసం. ఒకే నామపదానికి ఎన్నైనా విశేషణాలుండవచ్చు. అవి సందర్భ యోగ్య పదాల వలన వ్యవహితాలు కూడా కావచ్చును.

తెలుగు విశేషణాల స్వరూపాన్ని చూస్తే కొన్ని రకాలుగా విభజింపవచ్చు. నిజానికి తెలుగులో ప్రత్యేకంగా విశేషణాలు అని పలికించుకునే పదాలు లేవు. అదే విధంగా నామవాచకానికి సంబంధించిన లింగ, విభక్తి వచనాలు విశేష

పదాలే. అందువలననే (1) ఒకే పదం సందర్భానుసారంగా, విశేషణంగానూ, విశేష్యంగానూ కూడా వాడబడటం సాధ్యమౌతున్నది.

ఉదా : మామిడిపండు—పండు మామిడి

ఇక్కడ పదంలో ఎటువంటి మార్పు ఉండదు. ఇటువంటివి వాడుక భాషలో అంత ఎక్కువ కాదు.

(2) విశేషణంగా వాడేది నామపదమే అయినా విశేషణ విశేష్యాల సంబంధాన్ని తెలియజేసే (అ) (ఇ) ప్రత్యయాలలో ఒకటి దానికి చేరటం వలన అది విశేషణంగా మార్పు చెందటం మరో పద్ధతి.

ఉదా॥ ఊరు + బావి ⟶ ఊరిబావి

ఊరు + కుక్క ⟶ ఊరకుక్క

ఔపవిభక్తికాలయిన ఇ, టి, తి వర్ణాలు సంబంధ బోధకాలు కావటం వలన నామపదానికి అవి చేరి, వాటికి విశేషణ ధర్మాన్ని కలిగిస్తుంటాయి.

(3) ఔపవిభక్తికాలతోపాటు 'పు' వర్ణం కూడా సంబంధబోధకమైనదే. మువర్ణకాంత పదాలకు 'పు', 'ంపు' లు చేరటం వలన అవి విశేషణాలుగా మారుతున్నాయి. అదే విధంగా బిందుపూర్వక 'బు' వర్ణమూ మువర్ణ ద్విత్వమూ కూడా విశేషణ రూపాలు కల్పించటంలో సమర్థాలే. అయితే యీ రెండూ, బిందుపూర్వకపు వర్ణమూ చాలావరకూ కావ్యభాషకు పరిమితాలు.

(4) పదాలకు 'అయిన' అనే భూతకాలిక అసమాపకరూపం చేర్చటం వల్ల విశేషణ రూపాలేర్పడతాయి. ఉదా॥ చురుకైన పిల్ల. సంఖ్యావాచకాలకయితే అగు ⟶ అవు ⟶ అవ అనేవి చేరి విశేషణ రూపాలను కలిగిస్తాయి. ఇందులో /అగు/ కావ్యభాషకు పరిమితమైంది. /అవ/ నుండి యేర్పడిన /ఓ/ అనే అనుబంధం వాడుకలో ఎక్కువగా ఉంది.

ఉదా॥ పదోసారి — తొమ్మిదో మనిషి.

(5) ధాతువుల యొక్క వివిధ కాలాలకు సంబంధించిన రూపాలు విశేషణాలుగా పని చేస్తాయి. అవి యేకాలానికి సంబంధించినవైతే అ కాలపు ధాతుజ విశేషణాలుగా వ్యవహరింపబడతాయి.

ఉదా॥ వస్తున్న మనిషి - తిన్నతిండి - రాని చుట్టం

(6) త్రికమైన ఆ ఈ ఏ లూ, సర్వనామాంగాలూ కూడా 'విశేషణాలుగా పనిచేస్తాయి. తర తమ భావాలు జాత్యాది విశేషణాలను వివరించేటప్పుడు ఒక వస్తువును, అటువంటిదే అయిన వస్తుసమూహాన్నుండి వేరుచేసి ఉత్తమంగా

నిలువబెట్టే విధంగా విశేషణాలను వాడటం తెలుగులో ఉంది. ఉదా॥ వాడు ఈ కాలపు పిల్లల్లో తెలివైనవాడు ఇది ఒక విధంగా సంస్కృతంలో 'తనుప్' ప్రత్యయం చేరే ''బుద్ధిమత్తను'' వంటి రూపాలతో సమానం. అలాగే నిర్ధారణార్థంలో కంటె, కన్న వర్ణకాలు వచ్చి, సంస్కృతంలో 'తరప్' ప్రత్యయం సాధించే అర్థాన్ని సాధిస్తున్నది.

ఉదా॥ అందరికన్నా - (అందరికంటె) రాముడు గొప్పవాడు.

పోలికలు పోల్చేటప్పుడు ఉపమానమే విశేషణంగా ఉంటుంది. అప్పుడు ఆ ఉపమానం సంస్కృత సమాసాల్లో ఉత్తరపదంగానూ (ఉదా॥ ముఖ పద్మము), తెలుగు సమాహల్లో పూర్వపదంగా కూడానూ ఉంటుంది.

ఉదా॥ చిగురుకేలు

ఈ విధంగా తెలుగు విశేషణాలు ప్రత్యేకమైన భాషాభాగంగా భాషలో తొలుత ఏర్పడినవి కావు. నామపదాలే విశేషణాలుగా కించిత్ ప్రక్రియా విధానంలో వాడబడుతున్నాయి. అందుకే ప్రౌఢవ్యాకర్త వీనిని ఒక విభాగంగా చెప్పలేదు. ఆయన భాషలో, నామాలనీ, క్రియలనీ, అవ్యయాలనీ మాత్రమే ప్రముఖ విభాగాలుగా పేర్కొనటం జరిగింది. విశేషణ విభాగం నామ విభాగంలో అంతర్గతంగా ఉండేదే.

# 9(ఆ)

## పదనిర్మాణశాస్త్రం – క్రియాధాతువులు

తెలుగు క్రియల స్వరూపాన్ని తెలుగు వ్యాకరణాలలో, క్రియా పరిచ్ఛేదంలో వివరించడం జరిగింది క్రియ అన్న పదం సంస్కృతం నుండి తెచ్చుకున్న పారిభాషిక పదం. క్రియ అన్న పదానికి వాక్యపదీయంలో వివరణ చెప్తూ "అప్రధానాలయిన అవయవాలచేత ఉపలక్షితమై బుద్ధిచేత ఏకత్వాన్ని సాధించగలిగే పరిణామాన్ని ఏది పొందుతుందో అదే క్రియ'' అని వివరించడం జరిగింది. 'నడుస్తున్నాడు' అన్న పదం క్రియ. నడవడంవల్ల కాళ్ళు చేతులు మొదలైన శరీరావయవాల చాలనం, గమ్యం చేరడమనే, బుద్ధిచేత ఉద్దేశింపబడిన పరిణామానికి అప్రధానమైనవిగానే మనం భావించవచ్చు. కాని ఈ చాలనంవల్లనే గమ్యాగమనం అనే పరిణామసిద్ధి కలుగుతుంది. అందువల్ల నడుస్తున్నాడు అన్న పదంలోని అప్రధానమైన అవయవచాలన చర్యను మనం పూర్తిగా త్రోసిపుచ్చడానికి వీలులేదు. కాబట్టి ఈ మొత్తమంతా కలిసిన దానినే మనం 'క్రియ' అని వ్యవహరించవలసి ఉంటుంది.

నైరుక్తుల అభిప్రాయం ప్రకారం క్రియ అంటే ఆఖ్యాతం. ఆఖ్యాతం భావప్రధానమై ఉంటుంది. మళ్ళీ ఇక్కడ భావ వివరణ ఇస్తూ, "నామపదానికి సంబంధించిన వాచ్యార్థాన్ని ఆశ్రయించిఉన్న క్రియారూపమైన వ్యంగ్యమే భావము'' అని అర్థం చెప్పారు.

పాణినీయంలో ధాతుశబ్దం వివరించబడ్డది. ధాతువంటే క్రియార్థకాలైన 'భూ' మొదలైన శబ్దాలు లక్ష్యాలుగా నిలుస్తాయి. ఇవి ఒకటి లేదా రెండు అచ్చులతో కూడి ఉంటాయి. ధాతువుకు సమానార్థకంగా ప్రాచీన సంస్కృత వ్యాకరణాలలో ఆఖ్యాతమనే పదం వాడబడ్డది. తెలుగు వ్యాకరణాలలో క్రియా శబ్దం వాడబడ్డది. కన్నడంలో ఆఖ్యాత శబ్దాన్నే వాడుకుని, లాక్షణికులు, ఆఖ్యాత ప్రకరణమని క్రియా పరిచ్ఛేదాన్ని పేర్కొన్నారు. తమిళం క్రియనూ, ఆఖ్యాతాన్నీ కాదని వినై అనే దేశిపదాన్ని గ్రహించింది. వినై అంటే పని (Action) అని అర్థం. ఒక చర్యను తెలియజేసే క్రియ వినైగా మారిపోయింది.

వ్యవహారంలో, కాల, పురుష, వచన, లింగ బోధకతను సూచిస్తూ పనిని తెలియజేసే పదాన్ని క్రియ అని మనం స్థూలంగా గుర్తించవచ్చు. ఇటువంటి వ్యవహార రూపాలకు ఆయా అర్థాలను సూచించడానికి చేరిన ప్రత్యయాంగాలను విదిల్చివేస్తే, చిట్టచివరకు, ఇక ఏదీ తగ్గించడానికి వీలులేవన్నట్లుగా మిగిలిపోయిన రూపం ధాతువు. ఇది ఏకాచ్కంగా కానీ, ద్వ్యచ్కంగా గానీ, ఉండవచ్చు. ధాతువు అంటే మౌలికరూపం అని అర్థం. తెలుగులో చేస్తున్నాడు, చేశారు, చెయ్యలేదు, చేయగలవు వంటి అనేక క్రియారూపాలకు మౌలికరూపం /చేయు/. దీన్నే ధాతువు అనవచ్చు

ఈ అభిప్రాయం ఇలా ఉండగా ఇటువంటి మౌలిక రూపాలన్నీ తప్పనిసరిగా ఏదో ఒక క్రియను, అంటే ఒక పనిని సూచించేవిగా ఉండవలసిందేనా అనే ప్రశ్న ఉత్పన్నమైంది. ఏ పనినీ సూచించకుండా, కేవలం సంజ్ఞల్ని తెలియజేసేవీ, విశేషించి చెప్పేవీ అయిన మౌలిక రూపాలు కూడా భాషలో కనిపిస్తున్నాయి. చీమ, చలిచీమ, కాలు, తెలి, నల్ల, నలు, ఒను వంటివన్నీ ఇటువంటి పదాలు. వీటికి క్రియాపరమైన వ్యుత్పత్తిని చెప్పడానికి కుదరదు. మరి ఇవీ మౌలికపదాలే గనుక వీటిని కూడా ధాతువు లనవచ్చునా అంటే అనవచ్చును అని కొందరభిప్రాయపడ్డారు. దీనివల్ల ధాతువు అనే పదాన్ని రెండు రకాల విభాగాలకు లోను చేయవచ్చు. అవి (1) క్రియా ధాతువులు (2) నామ ధాతువులు. ఏమాత్రమూ విడదీయడానికి వీలుకాని మౌలిక రూపాలలో కొన్ని క్రియావాచకాలూ, మరికొన్ని నామవాచక, విశేషణాలూగా భాసిస్తాయి.

ఈ ప్రకరణంలో, ధాతు, క్రియాధాతు శబ్దాలు రెండూ మౌలిక రూపాలకు అభిన్నంగా వాడబడుతున్నాయి.

వెనక ప్రకరణాల్లో మూలద్రావిడభాష హలంతభాష అనీ, తెలుగు పరిణామ క్రమాన అజంతభాషగా పరిణమించిన భాష అనీ వివరించడం జరిగింది. తెలుగు క్రియాధాతువులు అచ్చుతో అంతమయ్యేవిగా ఉంటాయి.

మూలద్రావిడ భాషను ప్రసక్తిలోనికి తెచ్చుకోకుండా ఈ ధాతు రూపాలను గమనిస్తే ఇవి సాధారణంగా (1) రెండచ్చులు కలవి (అను, తిను-ఆడు, కాయు - పెట్టు), (2) మూడచ్చులు కలవి (అలుగు, మునుగు-ఈల్చుగు, మూలుగు) గా కనిపిస్తాయి. మూడచ్చుల కంటే ఎక్కువ అచ్చులు ఒక క్రియా ధాతువులో ఉంటే సాధారణంగా ఆ రూపం, (1) ఒక నామరూపానికి సహాయక క్రియ చేరగా ఏర్పడిన రూపమో (పనిచేయు, భయపడు) (2) ధాతువు మీద

12)

ధాతువు చేరిన రూపమో (కూర్చుండు, తెచ్చుకొను) (3) అసమాపక క్రియా రూపాలమీద మరో క్రియాధాతువు చేరగా ఏర్పడిన రూపమో (మండిపడు, కూడ గట్టు) (4) అన్యభాషాపదాలను తెలుగులో క్రియాపదాలుగా తయారుచేసుకునే మార్గంలో ఇంచుగాగమం ఆయా పదాలకు చేరే రూపమో (అనుభవించు, తమాయించు) (5) దేశ్యాలయిన నామ, విశేషణ రూపాలనుండి క్రియారూపాలను సాధించడానికై ఇంచుగాగమం చేరే రూపమో (వెంబడించు, అందగించు) (6) ప్రేరణ, కర్మణి రూపాలను తయారుచేసుకోడానికి వివిధాగమాలు ధాతువుకు చేరే రూపమో (రప్పించు, తగలబడు) అయి ఉంటుంది.

క్రియాధాతువుల్లో రెండచ్చులు కల రూపాలు ప్రాథమికరూపాలు. అనగా మూలద్రావిడంలో ఉండేవిగా మనం పునర్నిర్మించుకునే మౌలిక రూపాలకు దగ్గరి రూపాలు.

మూడచ్చులు కల రూపాలు, ప్రాథమిక రూపాలకు కు, గు, చు, యు, అనే అనుబంధాలు చేరగా ఏర్పడిన రెండవ తరపు (Secondary) రూపాలు (*అత్ > అతుకు; *కిర్ > కరుగు; *అట్ > అడచు *మెఱ > మెఱయు). ఇక్కడి కు, గు, చు, యు, లు రెండవ తరపు క్రియారూపాల్ని తయారుచేయడానికి ఉపయోగపడే వికరణ ప్రత్యయాలు(Thematic suffixes).

తెలుగు క్రియారూపాలు రెండు రకాలు. 1. సమాపక క్రియలు 2. అసమాపక క్రియలు.

సమాపక క్రియలు : ఇవి సాధారణంగా కాల, పురుష, లింగ, వచన బోధకతను కలిగి ఉంటాయి. క్రియా ధాతువుకు చేరే వివిధాలయిన క్రియా ప్రత్యయాలు, క్రియారూపానికి పై అర్థాలను సంక్రమింపచేస్తాయి. క్రియా ధాతువుల చివరచేరి క్రియారూపాలను తయారుచేసే ఈ ప్రత్యయాలను తిఙ్ అనే ప్రత్యాహార సంజ్ఞచేత సంస్కృత వ్యాకరణాలు సూచించాయి. ఆ పరిభాషనే గ్రహించి తెలుగు వ్యాకరణాలలో, క్రియారూపాలను తిఙంతాలు అని వ్యవహరించడం జరిగింది.

వ్యాకరణకారుల మతంలో క్రియాప్రత్యయాలు, క్రమంగా, ఏక బహు వచనాల్లో, ప్రథమ, మధ్యమ, ఉత్తమ పురుషల్లో డుఙ్, రు - వు, రు - ను, ము అనేవి.

కాని తెలుగు క్రియను భాషా దృష్టితో పరిశీలిస్తే, ఒక్క భూత (వచ్చెను), తద్ధర్మ (వచ్చును) కాలాల మహత్, అమహత్ ఏక వచనాల్లో తప్ప మిగిలిన రూపాల్లో, వాడు, వారు - నీవు, మీరు - నేను, మేము - అనే

సర్వనామాల పరిశిష్టరూపాలయిన డుఙ్, రు - వు రు - ను ము లు మాత్రమే ప్రత్యయాలుగా కుదురుకున్నాయి. తచ్ఛబ్ద వకారానికీ, నీ, మీ, నే, మే ల లోని తొలి హల్లులకూ లోపం కలుగగా మిగిలిన అజాది అయిన రూపాలు ఈ ప్రత్యయాలు. ఇవి సార్వనామిక పరిశిష్ట రూపాలు కావడంవల్లనే వీటికి లింగ, వచన, పురుష బోధకత కలగడం సంభవించింది. వీటిలో కాలబోధకతను కలిగించే లక్షణం లేదు. వీటికీ ధాతు రూపానికీ మధ్య చేరే కొన్ని ప్రత్యయాలు కాలబోధక ప్రత్యయాలు. అవి, భూతంలో, /ఇ, తి/ , వర్తమానంలో /చు, తు/ , తద్ధర్మంలో /తు, దు/ ప్రత్యయాలు తొలిదశలో తద్ధర్మ రూపమే భవిష్యదర్థాన్ని ఇస్తూ ఉండడం మనకు కావ్యభాషలో కనిపిస్తుంది రాను రాను :లజి అనుబంధాన్ని చేర్చి భవిష్యత్తును నిర్మించుకునే పద్ధతి ఒకటి ప్రచురంగా ఏర్పడ్డది.

వ్యతిరేకార్థకం : తెలుగులో వ్యతిరేకార్థాన్నిచ్చే ప్రత్యయం /అ/. (1) తద్ధర్మంలో, ధాతురూపానికి /అ/ చేర్చి, క్రియాపత్యయాలు చేర్చడంవలన వ్యతిరేకార్థత సాధింపబడుతున్నది.

ఉదా॥ చదవడు - చదవవు - చదవను

చదవరు - చదవరు - చదవము

భూతార్థంలో (2) /లేదు/ అనే వ్యతిరేకార్థక రూపాన్ని ధాతువుకు చేర్చడం వలన వ్యతిరేక క్రియారూపం సాధింపబడుతున్నది.

వాడు, నీవు, నేను } > చదవలేదు    వారు, మీరు, మేము } > చదవలేదు

(3) వర్తమానంలో (i) కావ్యభాషలో ధాతువుకు /ట/ చేర్చి భావనామంగా చేసి, దానికి /లేదు/ అనుబంధంగా చేర్చడం వల్ల వ్యతిరేకార్థత సాధింపబడుతున్నది.

వాడు, వారు / నీవు, మీరు / నేను, మేము } > చదువుట లేదు

(ii) వ్యవహారంలో /అటం/, /అడం/ లు చేర్చడంవల్ల వ్యతిరేకార్థత కలుగుతున్నది.

వాడు, వాళ్ళు / నీవు, మీరు / నేను, మేము } > చదవటం లేదు/చదవడం లేదు

చివరి రెండు ఆకరాలలోని వ్యతిరేక క్రియారూపానికి లింగ, వచన, పురుష బోధకత లేదు.

అసమాపక క్రియారూపాలు : వీటిని సంస్కృత పరిభాషనే ఉపయోగించి చిన్నయసూరి క్త్వార్థక, శతృ, తుము, ఆనంతర్య, చేదాద్యర్థకాలనగా, ప్రౌఢవ్యాకర్త, ఇప్రత్యయాంత, చున్నంత, అన్నంత, డున్నంత, ఇవన్నంతాలయిన అవ్యయాలన్నాడు.

వాచ్యంగా చెప్పకపోయినా చిన్నయసూరి దృష్టిలో అసమాపక క్రియలన్నీ భావనామాల వంటివి. వీటిలో క్త్వార్థకాలూ, వ్యతిరేక అసమాపక రూపాలూ కళలు. శతృ తుమానంతర్య చేదాద్యర్థకాలు ద్రుతప్రకృతికాలు.

ధాతుజ విశేషణాలు ధాతురూపం తద్ధర్మకాలబోధకంగా యథాతథంగా, విశేషణంగా వాడబడడం తెలుగులో ఉంది (వండువాడు-చూచువాడు). గ్రాంధికభాషలో ఎడి, ఎడు అనుబంధాలు చేరే రూపాలవల్ల వండెడివాడు, వండెడువాడు అనే ధాతుజ విశేషణాలు ఏర్పడతాయి. దీనికి సమానంగా వ్యవహారంలో, వండేవాడు, వండేటివాడు అనే రూపాలు కనిపిస్తున్నాయి.

వర్తమానంలో, శత్రర్థకరూపానికి /ఉన్న/ అనుబంధంగా చేరిన రూపాలూ (వచ్చుచున్న, చేయుచున్న), భూతంలో చేదర్థకరూపాలూ (వచ్చిన, చేసిన), భవిష్యత్తులో కల, పోవు అనుబంధాలుగా చేరిన రూపాలూ (రాగల, చేయబోవు) ధాతుజ విశేషణాలుగా ఏర్పడుతున్నాయి. వీటికి సమానంగా వ్యవహారంలో (వర్తమానం-వస్తున్న, చేస్తున్న; భవిష్యత్తు-వచ్చే, చేయబొయ్యే) వంటి రూపాలు కనిపిస్తాయి.

వ్యతిరేకార్థంలో, ధాతువుకు వ్యతిరేక ప్రత్యయం /అ/, దానిపైన /ని/ వర్ణకం చేరి, వండని, చేయని వంటి రూపాలు ధాతుజ విశేషణాలుగా ఏర్పడుతున్నాయి. ఈ ని వర్ణకాన్ని చిన్నయసూరి నిజీ గా వ్యవహరించి, ముందున్న ధాతుగత ఉకారానికి లోపం సాధించడం జరిగింది. ఈ నిజ్యంతం సార్వకాలిక రూపం, అనగా ఇది భూత, తద్ధర్మ, వర్తమానాలను మూడింటినీ బోధిస్తుంది.

చెప్పినవాడు<br>చెప్పుచున్నవాడు } > చెప్పనివాడు<br>చెప్పువాడు

విధ్యర్థకం ఇది సంస్కృతంలో లిజ్ అనే లకారం చేత సూచింప బడుతుంది. అక్కడ "లూట్" అనే లకారం వాడబడుతుంది. కాని చిన్నయసూరి విధ్యర్థానికి, లిజ్‌ను కాదని లూట్‌ను వాడుతున్నాడు ఇది ఆయన స్వతంత్రించి చేసిన మార్పు. అట్లాగే సంస్కృతంలో లేని తద్ధర్మాద్యర్థాలకు 'లాట్' అనే లకారాన్ని తెలుగులో విధించాడు. సంస్కృతంలో 'లాట్' సూచిస్తుంది. విధ్యర్థమంటే కేవలం ఒక విధిని నియమించే ఆజ్ఞార్థమేకాక, ఆశీస్సు, శాపం, సంప్రార్థన అనేవి కూడా ఉన్నాయి. ఇవన్నీ సాధారణంగా భవిష్యత్తును సూచించేవి.

ప్రార్థన, విధి - ఇవి రెండూ కేవలం మధ్యమ పురుషలో మాత్రమే వాడుక కలవి. శాపమూ, ఆశీస్సూ ప్రథమ పురుషకు కూడా వ్యాపించవచ్చు.

మధ్యమ పురుష ఏకవచనంలో ప్రత్యయ రహితమైన ధాతురూపాల వాడుక విరివిగా కనిపిస్తుంది (విను, చెయ్యి, చూడు, తే). గ్రాంథిక భాషలో ఈ ధాతురూపాల వాడుకతో పాటు /ము/ వర్ణకం చేరిన రూపాలు కూడా కనిపిస్తాయి (వినుము-చేయుము-చూడుము-తెమ్ము). బహువచనంలో గ్రాంథిక భాషలో డుజ్ వర్ణకం చేరుతుంది. అదే వ్యవహారంలో /ండి/ వర్ణకంగా మారుతుంది.

భాషలో ప్రత్యయ రహితాలయిన ఏకవచన విధ్యర్థక క్రియలే తొలుతగా ఆవిర్భవించి ఉంటాయని శాస్త్రజ్ఞుల నమ్మిక.

వ్యతిరేక విధిరూపాలు సాధించటానికి (I) /కుజీ/ అనుబంధం ధాతువుకు చేర్చవచ్చు (చేయకు - వండకండి) లేదా (II) ధాతువుకు వ్యతిరేక ప్రత్యయమైన /అ/ చేరిన తరువాత వలదు/వద్దు అనే వ్యతిరేక రూపం చేర్చి సాధించవచ్చు (చేయవలదు - వండవద్దు).

ప్రేరణార్థకాలు : తెలుగులో (1) ధాతువుకు చు ( చూచు ), పు ( చూపు ), ఇంచు ( పాడించు ) ప్రత్యయాలు చేర్చడంవల్ల ప్రేరణార్థకాలు ఏర్పడతాయి.

(2) ధాతువుయొక్క అన్నంత రూపాల మీద చేయు ధాతువును అనుబంధంగా చేర్చి ప్రేరణార్థాన్ని కల్పించడం గ్రాంథిక భాషలో కనిపిస్తుంది (దాయం జేయు, కొలువం జేయు).

(3) ఒక్కొక్కసారి, ఒక ప్రేరణ ప్రత్యయం మీద మరొకటి (ఇయ్యకొలుపు; ఇయ్య కొలిపించు) కనిపిస్తుంది.

కర్మార్థకాలు : కర్మార్థకాలు తెలుగుకు సహజమైనవికావు. అన్యభాషా సంపర్క ప్రభావం వలన, ముఖ్యంగా సంస్కృత ప్రభావం వలన ఈ తీరు ప్రయోగాలు తెలుగులోకి జొరబడడం జరిగింది.

నన్నయకు ముందున్న శాసన భాషలోనే విరళంగా ఇవి కనిపిస్తాయి. నన్నయ కర్మణి ప్రయోగాలను తన భారతంలో విరివిగానె వాడడం కనిపిస్తుంది.

కర్మణి రూపాలు అన్నంత క్రియా రూపానికి పడు ధాతువును చేర్చడం వల్ల ఏర్పడతాయి (చేయఁబడెను - పిలువఁబడెను). ఈ రూపాలు కూడా సకర్మక క్రియల మీదే ఏర్పడతాయి. ఉండు, వచ్చు. నిద్రించు, నడుచు వంటి అకర్మకరూపాల మీద ఉండఁ బడెను, రాఁ బడెను, నిద్రించఁ బడెను, నడువఁ బడెను — వంటి కర్మణి రూపాలు తెలుగు భాషకు పూర్తిగా అసహజ రూపాలు.

అయితే సకర్మక రూపాలకు కూడా ఈ కర్మణి ప్రక్రియ తెలుగులో విరళంగానే కనిపిస్తుంది. కర్మకు ప్రాధాన్యాన్ని వివక్షించవలసి వచ్చినప్పుడు పడుధాతువును ఉపయోగించి, కర్మణి ప్రయోగాన్ని తయారు చేసే బదులు, ఇతర మార్గాలలో ఆ ప్రాధాన్యాన్ని చెప్పడం కనిపిస్తుంది.

(1) ప్రధానత్వాన్ని పొందే కర్మను ద్వితీయావిభక్తిలో ఉంచకుండా, ప్రథమావిభక్తిలో నిలిపి దాని ప్రాధాన్యాన్ని సూచించడం.

ఉదా॥ మంచి ఇల్లు కట్టారు.

(2) కర్మను కర్తృ స్థానంలో స్థాపించడం.

ఉదా॥ రూపాయకి కిలో చొప్పున వంకాయ లమ్ముతున్నయ్.

కృదంతాలు : ముందు ప్రకరణాలలో తద్ధితాంతాలు ఏర్పడడం గురించి వివరించడం జరిగింది. కృత్తు, తద్ధితం, అనే ఈ పరిభాష కూడా సంస్కృతం నుండి మనం గ్రహించిందే. ''ధాతువుకు విహితంబగు డుఙ్భిన్న ప్రత్యయంబు కృత్తనాఁ బడు'' అని చిన్నయసూరి క్రియాప్రత్యయాలయిన డుఙ్ రు, వురు, నుము ల కంటే వీటిని భిన్నంగా నిర్దేశించడం జరిగింది. చాలా తెలుగు వ్యాకరణాలలో కృదంతాలకూ, తద్ధితాంతాలకూ ప్రత్యేక ప్రకరణాలు వ్రాయడం జరగలేదు. చిన్నయసూరి వీటిని వేరు వేరుగా నిర్దేశించాడు. ఇవి భావార్థంలో విధింపబడే ప్రత్యయాలు.

మూలధాతు రూపం తెలుగులో పరిణామవశాత్తూ ను, గు, చు, యు అనే ప్రత్యయాలను చేర్చుకుని మూడచ్చుల నిడివివరకూ పెరుగుతుందని వెనక తెలుసుకున్నాం. ఈ క్రియా ధాతువుల నుండి నామరూపాలు ఏర్పడడానికై క, త, పు, వు, ము, మి వంటి కృత్ప్రత్యయాలు అనుబంధింపబడ్డాయి.

| | | | |
|---|---|---|---|
| *కోర్ | > | కోరిక, కోరికె, కోర్కె | (DED 1648) |
| *కల్ | > | కలిమి, కల్మి | (DED. 1093) |
| *నట్ | > | నడత | (DED 2957) |
| *కాయ్ | > | కాపు | (DED. 1192) |
| *చా | > | చావు | (DED. 2002) |
| *పామ్బ్ | > | పాము | (DED 3361) |

కృత్ప్రత్యయాలు చేరేటప్పుడు క్రియాధాతువుకు, పరిణామవశాన చేరిన క, గ, చ, య, వ అనే ఆగమాలకు లోపం కలుగుతుందని చిన్నయసూరి నిర్దేశించాడు. ఆయన వ్యాకరణ సౌలభ్యం కోసం పరిణమించిన రూపాన్ని గ్రహించి వాటికి కృత్తులు చేరే ప్రక్రియను సాధింపబూనుకున్నాడు. అట్లాకాక చారిత్రకంగా పరిశీలిస్తే ధాతురూపాలకే కృత్ప్రత్యయాలు చేరుతున్నట్లుగా వివరించవచ్చు.

క్రియా విశేషణాలు ఇవి క్రియను విశేషించి చెప్పే భాషాంగాలు.

(1) ఎందు, ఎప్పుడు వంటి దేశకాల వాచకాలయిన నామాలు,

(2) అగు ధాతువుయొక్క అన్నంతరూపం (కాన్) చేర్చడంవలన, క్రియను విశేషించి చెప్పే నామరూపాలు (చల్లగా, మెల్లగా),

3. కొన్ని అన్నంత క్రియారూపాలూ,

4. అన్ని అసమాపక క్రియారూపాలూ (చేసి వచ్చి: మాట్లాడకుండి), క్రియావిశేషణాలుగా వర్తిస్తాయి.

ఈ పదానికి తోడు 'అవ్యయం' అనే మరొక శబ్దం తెలుగు వ్యాకరణాలలో సంస్కృత ప్రభావం వల్లనే చోటు చేసుకుంది. చిన్నయసూరి ప్రత్యేకించి అవ్యయాలను గురించి చెప్పకపోయినా, అక్కడక్కడా అవ్యయ శబ్దాన్ని వాడుకున్నాడు (ఎల్లశబ్దము ద్రుతాంతంబైన అవ్యయము).

ప్రౌఢ వ్యాకర్త అవ్యయము లనగా విభక్తి వచన శూన్యాలని చెప్తూ అవి ప్రతి పదోక్తాలనీ, లాక్షణికాలనీ రెండు రకాలుగా వివరించాడు. ధాతువు

నుండి పుట్టిన అసమాపక క్రియారూపాలన్నీ లాక్షణికాలయిన అవ్యయాలు. అనగా క్రియావిశేషణాలైన అసమాపక క్రియలను అవ్యయాలు అని పిలువవచ్చు.

పాణినీయంలో అవ్యయాలంటే (i) చరిత్ర తెలియని కొన్ని పదాలూ (ii) అన్ని వచనాలూ విభక్తులూ చేరక కొన్ని రూపాలు మాత్రమే ఉండే (చిరం - చిరేణ-చిరాయ) వంటి పదాలూ (iii) కొన్ని తద్ధితంతాలూ (అర్థాత్, బహుశః) (iv) కొన్ని కృదంతాలూ (కూడా) మాత్రమే. అయితే ఇవన్నీ క్రియను విశేషించి చెప్పేవిగా ఉంటాయి.

తెలుగులో ఈ లక్షణాలు పట్టేవే అవ్యయాలుగా నిర్దేశించడం కష్టమేమో కాని అవ్యయాలన్నీ క్రియావిశేషణాలని నిర్వచించుకుంటే సరిపోతుంది.

# 10 (అ)

# పదసంపద

ఒక భాషకు చెందిన భాషాంశాలను రెండు భాగాలుగా విభజించడానికి వీలుంటుంది అవి (1) తమ పుట్టుకను ఎంతో వెనక్కి తీసుకుపోవడానికి వీలు కలిగించే దేశ్యమైన అంశాలు, (2) దేశ్యాంశాల కంటే భిన్నంగా ఇతర భాషల నుండి పలు కారణాల వలన భాషలో జొరబడిన అన్యదేశ్యాంశాలు.

ఆంధ్ర శబ్ద చింతామణి సంస్కృత ప్రాకృతాల్ని ఆన్యభాషలుగా గ్రహించింది. పదజాలాన్ని ఉద్దేశించి తెలుగులో "తజ్జా, సమాచ, దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి" అని నాలుగు భేదాలను గుర్తించింది. దీన్నే కేతన తన ఆంధ్ర భాషాభూషణంలో "తత్సమంబు నాగ తద్భవంబన, నచ్చ తెనుగు నాగ మరియు దేశ్యమనగ గ్రామ్యభాష నాగ గల వైదు తెరగులు" అని అయిదు విభాగాలుగా పెంచాడు. ఇక్కడ ఈయన చెప్పిన అచ్చ తెనుగులో సంస్కృత భవాలు, ప్రాకృత సమాలూ, ప్రాకృత భవాలూ, దేశ్యాలూ ఇన్నీ కలిసి సహ జీవనం చేస్తాయి. ఈ అచ్చతెనుగు కావ్యాలలో ఉపయోగించే భాషగా కేతన ఉద్దేశించి ఉండవచ్చు. అదే విధంగా దేశ్యంలో కూడా సంస్కృత భవ, ప్రాకృత సమ, భవాలూ, దేశీయ పదాలూ ఉంటాయి పెద్దన్న ఈ విషయంలో మరికొంత వివరణ నిస్తూ తన కావ్యాలంకార చూడామణిలో, ఈ అయిదు విభాగాలనూ, (1) తత్సమం (2) తద్భవం (3) సహజాంధ్ర దేశ్యభవం (4) దేశ్యోద్భవం (5) గ్రామ్యం అని విపుల వివరణకు లోనుచేయడం జరిగింది.

కేతన చెప్పిన అచ్చతెనుగే పెద్దన పేర్కొన్న సహజాంధ్ర దేశ్యం. పెద్దన పేర్కొన్న దేశ్యం. ఇతర దేశాల నుండి (రాష్ట్రాల నుండి) వచ్చిన పద సంపద అని మనం గ్రహించవలసి ఉంటుంది. ఆ విధంగా పెద్దన మతంలో దేశ్యమనే పదం అన్యదేశ్య పదాలకు అన్వయింపబడే పదంగా మారిపోయింది.

ఇక గ్రామ్యమనే పదానికి వ్యాకరణ వేత్తల అభిప్రాయం ప్రకారం, నియమాలు సూచింపబడని భాష అనీ, అపభ్రంశమనీ అర్థం.

అప్పకవి చింతామణిని వ్యాఖ్యానిస్తూ, సహజాంధ్రదేశ భవము, అన్య దేశజాంధ్రము అని వివరించాడు.

13)

చిన్నయసూరి ఈ అన్ని వివరణల్లో ఉన్న సందిగ్ధతనూ, అస్పష్టతనూ దూరం చేయడానికి సంకల్పించాడు. సంస్కృత ప్రాకృత తుల్యమైన భాష తత్సమమనీ, సంస్కృత ప్రాకృత భవమైన భాష తద్భవమనీ, త్రిలింగదేశ వ్యవహార సిద్ధమైన భాష దేశ్యమనీ, లక్షణ విరుద్ధమైన భాష గ్రామ్యమనీ స్పష్ట వివరణను అందించాడు. కాని ప్రాకృత సమాన్ని తత్సమమనే పేరుతో పిలవడంలో చిక్కు లేకపోలేదు. నిజానికి ప్రాకృత సమాలన్నీ సంస్కృత భవాలవుతాయి. తెలుగులో సంస్కృత భవాలను తద్భవాలని, అవే రూపాలను, కేవలం ప్రాకృత సమాలు కావడంవల్ల తత్సమాలనడం తిరిగి సందిగ్ధతకు దారితీస్తుంది.

ఉదా॥ సంస్కృతం /అగ్ని/ ప్రాకృతంలో /అగ్గి/ అవుతుంది.

ప్రాకృత సమంగా /అగ్గి/ అనే రూపమూ, సంస్కృత భవంగా అదే అగ్గి అనే రూపమూ, రెండూ తెలుగులోనికి వచ్చాయని వాదించడానికి వీలు కలుగుతుంది. అంటే ఒకే /అగ్గి/ తత్సమంగానూ, తద్భవంగానూ వ్యవహరింపబడే ప్రమాదముంది. కేతనాదుల మతంలో తత్- శబ్దం సంస్కృతానికి మాత్రమే పరిమితమై ఉన్నా, చిన్నయసూరి దాన్ని సంస్కృత ప్రాకృతాలకు రెంటికీ అన్వయింపజేశాడు.

సంస్కృతం నుండీ, ప్రాకృతం నుండీ, తెలుగు భాషలోనికి సమాలుగానూ, భవాలుగానూ, భాషాంశాలు ఎలా వచ్చాయో, సంస్కృత ప్రాకృతేతర భాషల నుండి కూడా అలాగే వచ్చాయి.

భాష పెరుగుతున్న తీరును బట్టి ఈనాడు మనం, ఒకప్పుడు ఒక రూఢిలో ఉపయోగించిన తత్సమ, తద్భవ పదాల అర్థాన్ని విస్తృతం చేయకతప్పదు. 'తత్' అంటే సంస్కృతమో, ప్రాకృతమో అని మాత్రమే కాక, మనం ఏ భాషా పదాలు తెలుగులోనికి జొరబడుతున్నాయని గుర్తిస్తున్నామో ఆ భాషలు అని గ్రహించవలసి ఉంటుంది.

అందువల్ల రాజకీయంగా ఉర్దూ, ఇంగ్లీషు భాషల నుండీ, భౌగోళికంగా హిందీ, ఒరియా, మరాఠీ వంటి ద్రావిడ కుటుంబేతర భాషల నుండీ, అరవం, కన్నడం వంటి స్వకుటుంబ భాషల నుండీ తెలుగులోనికి వచ్చిన పదాలను, అవి వచ్చిన పద్ధతిని బట్టి తత్సమాలుగానో, తద్భవాలుగానో నిర్ణయించవలసి ఉంటుంది.

కాబట్టి తత్సమాలూ తద్భవాలూ కూడా దేశ్యపదాలకంటె భిన్నమై, వేరు వేరు భాషల నుండి వచ్చిచేరిన అన్యదేశ్యాలుగా వ్యవహృతం కావలసి ఉంటుంది. అప్పుడు ప్రాచీనులు చెప్పినట్లుగా, తద్భవాలను, దేశ్యపదజాలంలోనికి

అందుకని ఏ భాషనైనా అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాల పాలబడకుండా రెండు స్థూల విభాగాలు చేయవచ్చును అవి (1) దేశ్యాంశాలు, (2) అన్యదేశ్యాంశాలు. అవి యేర్పడే తీరునుబట్టి అన్య దేశ్యాంశాలను తత్సమాలనో, తద్భవాలనో వివరించవచ్చు. తత్సమాలు తాము పుట్టిన భాషకు సంబంధించిన మౌలిక లక్షణాలను యథాతథంగా కాపాడుకుంటూ, తాము ప్రవేశించిన భాషలో కొత్త నిర్మాణాంశాలకూ, కొత్త భాషాసూత్రాలకూ వీలును కలిగిస్తాయి స్వతహాగా తెలుగులో లేని మహాప్రాణత్వం శ, ష ల ప్రవేశం, సమ్మిళిత ప్రయోగం, యత్ తత్ ప్రయోగం వంటివి సంస్కృత భాష నుండి తత్సమాల ఆవిర్భావం వలన తెలుగులో పాతుకుపోయిన అంశాలే

తద్భవాలు, తాము పుట్టిన భాషయొక్క మౌలిక లక్షణాలకంటే, తాము ప్రవేశించే భాషయొక్క నియమాలను గౌరవించి తదనుగుణంగా మార్పులు పొందుతూ అవిష్కరింపబడతాయి అందువల్లనే ప్రాచీన వ్యాకర్తలు తద్భవాలను దేశ్య పదాలతో సమమైనవిగా స్వీకరించడం జరిగింది. అనగా తద్భవాలలోని భాషాంశాలు ప్రతిదేయ భాషలోని దేశ్యాలవంటే భిన్నమైన ధ్వని క్రమాన్ని (Ph netic pattern) కలిగి ఉండవు.

తత్సమ తద్భవాలకంటే భిన్నంగా, ఒక భాషకు, దానికి సంబంధించిన మూలభాషనుండి (Proto Language) దిగుమతి అయ్యే దేశ్యమైన భాషా సామగ్రి ఉంటుంది. అది ఆ భాషకు స్వంతమైనది. ఈ సామగ్రితోనే, ఆ భాషకు సంబంధించిన మూల సూత్రాల వ్యాప్తి ఉంటుంది ఈ మూల సూత్రాలే భాషలో జొరబడే తద్భవాలను నియమించి, వాటిపై స్వకీయమైన ముద్రను రచించి, వాటిని తమలో చేర్చుకుంటాయి.

ఈ రకంగా ఏ భాషలోనైనా విజాత్యమైన (Non native) భాగమంతా ఏదో ఒక దశలో, వేరువేరు కారణాలవలన ఇతర భాషలనుంచి ప్రవేశించిందే నన్న విషయం స్పష్టంకదా! ఇట్లా ఒక భాషలోనికి ఇతర భాషా పదాలు రావడాన్ని ఆధునిక పరిభాషలో ఆదాన ప్రక్రియ (Borrowing) అని నామకరణం చేయడం జరిగింది. ఈ యెరవు మాటలు తాము ప్రవేశించిన భాషకు సంబంధించిన వర్ణ, పద, వాక్య, అర్థ సంబంధమైన మార్పుల్ని సందర్భానుసారంగా పొందడం సంభవిస్తుంది. ఎరవు మాటలు ఏయే పరిస్థితులలో, ఏయే మార్గాల ననుసరించి భాషలో ప్రవేశించాయో తెలియజెప్పే మార్గదర్శక సూత్రాలను ఈ ఆదాన ప్రక్రియ కలిగి ఉంటుంది. ఈ ప్రక్రియను మూడు స్పష్ట విభాగాలు చేయవచ్చు. (1) సన్నిహితాదానం (Intimate borrowing), (2) సాంస్కృతికాదానం

(Cultural borrowing), (3) మాండలికాదానం .(Dialect borrowing) దీన్ని భౌగోళికాదానమని కూడా వ్యవహరిస్తారు.

ఆదాన ప్రక్రియ రెండు భాషల మధ్యనో, మాండలికాల మధ్యనో సక్రమంగా జరగడానికి కొన్ని ప్రత్యేక పరిస్థితులవసరం. అవి (1) రెండూ ఎక్కువ పోలికలు కలిగి ఉండకూడదు. (2) రెండింటి మధ్యా పరస్పరావగాహన శక్తి (Mutual intelligibility) నూటికి నూరుపాళ్ళు క్షుణ్ణంగా ఉండకూడదు (3) అట్లాగని రెండూ ఒకదానికొకటి పూర్తిగా భిన్నాలై అర్థం కాని స్థితిలో ఉండకూడదు. ఈ రెండు స్థితులకూ మధ్యస్థమైన స్థితే ఆదాన ప్రక్రియకు అనువైన స్థితి

ఈ స్థితి రెండు రకాలుగా ఏర్పడుతుంది. (1) రెండింటి మధ్యా సమాన వ్యవహారపరిధి (Common Core) ఉండడం వలన, (2) ఒకే ప్రదేశంలో ఏకకాలికంగా రెండేసి భాషలు వ్యవహరింపబడడం వలన (Bilingualism). పదాదానం జరగాలంటే భాషావ్యవహర్తకు తాను ఎరవు తెచ్చుకునే పదాల అర్థం క్షుణ్ణంగా తెలిసి ఉండడమేకాక, ఆ పదాలను తానెందుకు గ్రహించవలెనో ఆ ఉద్దేశ్యం కూడా (Overt or Convert) స్పష్టంగా తెలిసి ఉండాలి.

ఈ ఉద్దేశ్యాలు రెండు రకాలుగా ఉండవచ్చు. అవి (1) అట్లా తెచ్చుకోవడం జీవన వ్యవహారంలో తప్పనిసరిగా అవసరమైన చర్యగా భావించడం (Need filling motive). (2) తాము గౌరవించే వ్యక్తినో, సమూహాన్నో, తమ కిష్టమైన వారినో అనుకరించాలనే వాంఛా, దానివలన తమ అంతస్తును పెంచుకోవాలనే ఉద్దేశ్యమూ (Prestige motive). ఇందులో మొదటిది సాంస్కృతిక, సన్నిహితాదానాలలో ఎక్కువగా కనిపిస్తే, రెండవది మాండలికాదానంలో కనిపిస్తుంది.

సన్నిహితాదానం : ఒకే భౌగోళిక ప్రదేశంలో ( Geographical area) రాజకీయ కారణాలవలన, ఆ ప్రదేశానికి సంబంధించిన భాషతోపాటు ఇతర భాషలు వ్యవహరింపబడవలసి వచ్చినప్పుడు, ఆ భాషలలోని పదాలు స్థానిక భాషలోనికి ప్రవేశించి ఆదాన ప్రక్రియకు లోనుకావడం సంభవిస్తుంది. కేవలం రాజకీయ కారణాల వలన మాత్రమే ఒక భాషాప్రాంతంలో స్థిరపడిన పాలక భాష, పాలిత భాషకు పదాదానం చేస్తుంది. తాను పాలిత భాషకు ఆదానం చేసినంత విరివిగా, తనలోనికి పాలిత భాషనుండి భాషాంశాలను గ్రహించదు. ఇక్కడ ఆదాన ప్రక్రియ ప్రాయికంగా ఒక వైపే ఉండి, పాలక భాషనుండి

పాలిత భాషలోనికి మాత్రమే భాషాంశాలు ప్రవేశం పొందుతాయి. కాబట్టి ఇక్కడ పరస్పరాదాన ప్రసక్తి ఉండదు. ఈ ఆదానం జరిగేచోట సాధారణంగా పాలిత భాష ఒక భౌగోళిక ప్రదేశంలో కుదురుకుని ఉన్న భాషగానూ, పాలక భాష ఎక్కడనుండో వచ్చి కొత్త ప్రదేశంలో అధికారం నెరిపే భాషగానూ ఉంటుంది.

రాజకీయపరమైన ఈ సన్నిహితాదానంయొక్క వేగం కొన్ని అంశాల మీద ఆధారపడి ఉంటుంది. (1) పాలితులు, తమవలె జయింపబడని ఇతర భాషా ప్రాంతాలతో సంబంధం కలిగి ఉంటే, అటువంటిచోట్ల పాలక భాషనుండి ఆదానం మెల్లిగా జరుగుతుంది.(2)పాలకులవ్యాప్తి,అధికార ప్రకటనా ఉద్ధృతంగాలేనప్పుడు కూడా ఆదాన ప్రక్రియ మెల్లిగా జరుగుతుంది. (3) సంస్కృతి పరంగా పాలకులు పాలితులకంటే అధికులైనట్లయితే, అటువంటి చోట్ల ఆదాన ప్రక్రియ వేగంగా జరుగుతుంది. అంతస్తు కలదిగా నిర్ణయింపబడ్డ భాషనుండి అంతస్తు తక్కువ భాష, భాషాంశాలను ఎరవు తెచ్చుకోవడం సహజం. అంతస్తు కల భాష, క్వాచిత్కంగా పదాలు ఎరవు తెచ్చుకోవడం మినహా, ఇతర భాషాంశాలలో ఎటువంటి మార్పునూ ఆహ్వానించదు.

సాంస్కృతికాదానం : ఈ ఆదాన ప్రక్రియ రెండు వేరు వేరు భాషా ప్రాంతాలకు సంబంధించింది. ఒక భాషా ప్రాంతానికి సంబంధించిన వ్యక్తి తన పొరుగు భాషలో పుష్కలంగా ఉన్న సంస్కృతి పరమైన పదజాలాన్ని తన అవసరం కొద్దీ గ్రహించడం సహజం. మతం, న్యాయం, పరిపాలన, నాగరక వేష రచన, కళలు, యాంత్రికత, మొదలైన అంశాలన్నీ సంస్కృతికి సంబంధించిన అంశాలు. వీటికి సంబంధించిన భాషాంశాలు ఇరుగు పొరుగు భాషలలో పరస్పరమూ మార్పిడి పొందే అవకాశం కలిగి ఉంటాయి. ఆ విధంగా ఈ ఆదానం సన్నిహితాదానం వలె ఏక ముఖమైనది కాక పరస్పరాదానంగా పరిణమిస్తుంది. ఇరుగుపొరుగు భాషలయిన (1) తమిళం నుండి కూటు, సాంబారు, తిరుచూర్ణం, పిళ్ళై వంటి పదాలూ, (2) కన్నడం నుండి హోళిగలు, బేడలు, హంగుహోయలు, చిత్రాన్నం వంటి పదాలూ, (3) మరాటీ నుండి లోటా, గడంచ, పీట వంటి పదాలూ, (4) ఒరియా నుండి భోగట్టా, పన్నె (Comb) బుగత, కంబారి (పాలేరు) వంటి పదాలూ, (5) హిందీ నుండి రొట్టె, కసం, ఖుశాలు, కుల్లా వంటి పదాలూ తెలుగులో వాడబడడం చూడవచ్చు అదే విధంగా ఒకప్పుడు పాలక భాషలయినా, తరువాత దేశ్యభాషా ప్రవాహంలో పెనవేసుకుపోయిన ఉర్దూ, ఆంగ్ల భాషలనుండి కూడా తెలుగులోనికి సాంస్కృతికాదానం జరిగింది. సాంస్కృతికాంశాలైన లాంతరు, రోడ్డు, రైలు, లాయర్లు,

డాక్టరు వంటి ఆంగ్ల పదాలూ; కుడతా, కమీజు, కాగితం, కలం వంటి ఉర్దూ పదాలూ తెలుగులో కోకొల్లలుగా కనపడతాయి. ఆ విధంగానే అరబిక్, పర్షియన్, పోర్చుగీస్, ఫ్రెంచ్ పదాల ఉనికి కూడా తెలుగులో కనపడుతుంది. ఈ ఆదాన ప్రక్రియ బలమైన సాంస్కృతికమైన కారణాన్ని ఆధారంగా చేసుకుని మాత్రమే జరిగే ప్రక్రియ.

మాండలికాదానం : సాంస్కృతికాదానం లాగే ఇది కూడా పరస్పరం జరిగే ప్రక్రియే కాని దాని లాగా ఇది రెండు వేరు వేరు భాషల మధ్య కాక, ఒకే భాషలో అంతర్గతంగా జరిగే ప్రక్రియ.

పసి నిసుగు, తన్ను జాగ్రత్తగా కాపాడుకుంటూ పెంచే వ్యక్తినుండే మాట్లాడడం నేర్చుకుంటుంది. సాధారణంగా ఆ వ్యక్తి తల్లే అయి ఉంటుంది. తల్లి భాషను అనుకరిస్తూ, మాట్లాడడానికి మొదలు పెట్టిన శిశువు పూర్తిగా తల్లి భాషను యథాతథంగా ఆవిష్కరించలేకపోవచ్చును. అనగా, తాను నేర్చుకుంటున్న తల్లి భాషతోపాటు, తాను వింటున్న చుట్టూ ఉన్న ఇతరుల భాషా రూపాలనుకూడా తన భాషలో కలుపుకునే ప్రయత్నం చేస్తుంది. ఆ విధంగా తప్పులు చేస్తూ, సరిదిద్దుకుంటూ ఉండగానే శిశువు యొక్క భాషా వ్యవహారం స్థిరపడి ఒక నిశ్చిత రూపాన్ని సంతరించుకోవడం జరగవచ్చు. పువ్వు పువ్వు నుండీ సీతాకోక చిలుక తేనెను సమకూర్చుకున్నట్లుగా, శిశువు తనచుట్టూ ఉన్న వ్యక్తి వ్యవహారాల్ల నుండి తన భాషా వ్యవహారాన్ని ఏర్పరచుకుంటుంది. అయితే, సాధారణంగా తాను గ్రహించే భాషావ్యవహారాలు, తన సామాజిక విభాగానికి (Social group) లొంగేవిగా ఉండేట్లుగానే శిశువు జాగ్రత్త పడుతుంది.

ఈ విధంగా వ్యక్తులలో తమ చిన్ననాటినుండీ ఆరంభమై, ఒక నిర్దిష్టరూపాన్ని పొందిన వ్యక్తిగత భాషా వ్యవహారాలను ఒక భౌగోళిక ప్రదేశానికి పరిమితం చేసి అధ్యయనం చేస్తే అవన్నీ, ఆ ప్రదేశానికి అనుసంధింపబడి, ఏకసూత్రతను కలిగి ఉంటాయి. ధ్వనుల మార్పులో గాని, సామ్యంవల్ల (analogic) కలిగే మార్పులు గాని, అర్థపరిణామాలుగానీ, లేదా సంస్కృతి ప్రదానంగా ఆ భాషా వ్యవహారాలలో ప్రవేశించే ఎరవు మాటల తీరు గానీ అన్నీ ఆ భౌగోళిక ప్రదేశానికి అనుసంధింపబడి, మరొక భౌగోళిక ప్రదేశంలోని భాషా వ్యవహారాలతో భేదాన్ని కలిగి ఉంటాయి ఇటువంటి ప్రత్యేక లక్షణ లక్షితమైన భాషా వ్యవహారాల సమాహారాన్ని, ఆ భౌగోళిక ప్రదేశానికి పరిమితం చేసి, దాన్ని మాండలికంగా పేర్కొంటున్నాము. అట్లా ఒకే భాష కొన్ని మండలాలలో విభిన్నతలను సంతరించుకుని మాండలికాలుగా ఏర్పడుతుందన్న

విషయం మనకు తెలుసు. అయితే ఒక మాండలిక భాషకు సంబంధించిన భాషా వ్యవహారాలను పరిశీలిస్తే, వాటిల్లో కలిగిన మార్పులను మనం గుర్తుపట్టగలం గాని, ఆ మార్పులు ఎట్లా, ఏ కాలంలో జరిగాయో గుర్తుపట్టడానికి వీలుండదు. ఒక్కొక్కసారి, పక్కనున్న భౌగోళిక ప్రదేశంలోని భాషావ్యవహారం, ఈ భాషా వ్యవహారాన్ని తరుముకుని, లోపలికి చొచ్చుకువచ్చినట్లో, లేదా, ఈ వ్యవహారమే, పక్కనున్న వ్యవహారాలలోనికి విస్తరించి ఆక్రమించుకున్నట్లో మాత్రమే మనం గ్రహించగలం. ఈ మార్పులన్నీ మాండలికాదానం వలననే జరుగుతున్నాయని మాత్రం మనం స్పష్టంగా చెప్పవచ్చు.

భాషలో వచ్చే మార్పులు మూడు రకాలుగా స్పష్టంగా కనిపిస్తాయి. అవి (1) ధ్వనులలో మార్పు (Phonetic change), (2) సామ్యంవల్లా అర్థ పరిణామాలవల్లా వచ్చే మార్పు (Analogic Semantic change), (3) ఆదాన ప్రక్రియవల్ల (Borrowing) వచ్చే మార్పు. ఒక మాండలికానికీ, మరో మాండలికానికీ మధ్య జరిగే ఆదాన ప్రక్రియవల్ల, ఒక భాషా వ్యవహారానికి కట్టుబడిన ఒక భాషారూపం (Speech form), తనను స్వీకరించే వాళ్ళున్నంత వరకూ (Adoptors) మరో భాషావ్యవహార ప్రాంతంలోనికి ఎంత వేగంగానైనా చొచ్చుకునిపోవచ్చును. తనను స్వీకరించేవాళ్ళు లేనప్పుడో, దీనికి ప్రతిగా విరోధిరూపాలు (Rival forms) తయారై ఎదుర్కొన్నప్పుడో, లేక ఇది చొచ్చుకుపోదలచిన భౌగోళిక ప్రదేశం పురాతన భాషా వ్యవహారాలతో క్రిక్కిరిసిన పరిశిష్టప్రాంతంగా (Relic area) ఉన్నప్పుడో, ఈ మాండలికాదానం యొక్క వేగమూ, విస్తృతీ కుంటుపడుతుంది.

ఈ మూడురకాలైన ఆదాన ప్రక్రియలకంటే భిన్నమైన మరొక ఆదానం, ప్రాచీన భాషాదానం (Learned borrowing). ప్రాచీన కావ్యాలకూ, గ్రాంథికతకూ సంబంధించిన భాషపై మోజు స్థల, కాల విచక్షణ లేకుండా వ్యాపించి ఉండడం మనం గమనించవచ్చు. ఈ ఆదానం ఎక్కువగా అక్షరాస్యులలోనూ, అదీ అక్షరాస్య సమూహాల నుద్దేశించి ఆవిష్కరింపబడే భాషారూపాలలోనూ ఎక్కువగా కనిపిస్తుంది.

ఇతర భాషలకు చెందిన భాషాంశాలు తత్సమ తద్భవాలుగా ఒక భాషలోనికి ఆదాన ప్రక్రియ వలన రావడమే కాకుండా ఒక్కొక్కసారి ఇతర భాషా పదాలను తమ భాషలోనికి అనువదించుకుని కొత్తరకం పదాలను జనులు తయారు చేసుకోవడం కనిపిస్తుంది. వీటిని అనూదితాదానాలు (Loan translations) అనవచ్చు.

ఉదా॥

| ఇంగ్లీషు | తెలుగు |
| --- | --- |
| Tablet | గోళీ |
| Capsule | గొట్టం |
| Wireless system | నిస్తంత్రీ విధానం |
| Black Money | నల్లడబ్బు |

ఇంకొక పద్ధతి ఆగత సంకర పదం (Loan blend). ఇది మన ప్రాచీన కావ్య భాషలో కొందరు కవులు అవలంబించిన మణి ప్రవాళ పద్ధతిని పోలినట్లుగా ఉంటుంది. సాధారణంగా సమాసరూపంలో చోరబడే ఈ ఆదానంలో ఒక భాగం ఎరువు తెచ్చుకున్న భాగం కాగా, మరొకటి దేశ్యమైన భాగంగా కనిపించి, కొత్త రూపాలు ఆవిష్కరింపబడడం జరుగుతుంది.

ఉదా॥ గాసు నూనె
రైలు పట్టాలు
కరంటు దీపం
సూటు వాలా
మాట కారి - మొదలైనవి.

ఆగత పరివృత్తి (Loan shift) : కొన్ని పదాలు కేవలం అలాగే ఒక భాషలోకి ఆదాన ప్రక్రియవల్ల వచ్చినా వాటికి మూల భాషలో ఉండే అర్థం ప్రతిదేయ భాషలో మారిపోవడం జరుగుతుంది. అటువంటి ఆదాన పదాలు ఆగత పరివృత్తి ద్వారా వచ్చినవి. ఉదా॥ రైలు (Rail) ఇంగ్లీషులో పట్టాలకు వాడిన పదం. తెలుగులో ఆ పట్టాల మీద నడిచే బండికి వాడబడుతూంది.

తెలుగుభాషలోకి ఆదాన ప్రక్రియద్వారా, ఉత్తర హిందూస్థాన భాషలైన ఒరియా, హిందీ, మరాఠీ, ఉర్దూ భాషలకు సంబంధించిన పదాలెన్నో ప్రవేశించడం జరిగింది. ఒరియా, హిందీ, మరాఠీలు హింద్వార్య కుటుంబానికి చెందిన భాషలు. ఉర్దూ ద్వారా, అరబిక్, పర్షియన్ భాషా పదాలెన్నో తెలుగులో ప్రవేశాన్ని పొందాయి. సోదర ద్రావిడ భాషలైన తమిళ, కన్నడాలు ఆంధ్ర దేశపు సరిహద్దులలో ఉన్న కారణం చేత తెలుగుకు ఎన్నో తమ భాషాపదాలను ఎరువివ్వడం జరిగింది. ఒకప్పుడు పాలకభాషలుగా ప్రకాశించిన ఉర్దూ, ఇంగ్లీషు భాషా పదాలూ, కొద్దిగా పోర్చుగీస్, ఫ్రెంచ్ పదాలూ కూడా తెలుగులో ప్రకాశించాయి. ఇంగ్లీషు పాలకులూ, మహమ్మదీయులూ భారత జీవనంలో ప్రవేశ

పెట్టిన సాంస్కృతికాంశాల ఆధిక్యం, ఉర్దూ, ఇంగ్లీషు భాషల నుండి తెలుగుభాష లోనికి సాంస్కృతికాదానాన్ని కూడా సాధించింది.

ఈ రకంగా (1) ఒకే భాషలో ఏర్పడిన మాండలికమైన భాషాంశాల నుండీ, (2) స్వకుటుంబానికి చెంది యిరుగుపొరుగు సంబంధాలు కలిగిన సోదర భాషలనుండీ, (3) భిన్నకుటుంబాలకు చెందిన పొరుగుభాషల నుండీ, (4) ఎటు వంటి సరిహద్దు సంబంధాలు లేకపోయినా పాలక భాషలుగా స్థిరపడిన భాషల నుండీ, తెలుగు భాషలోనికి ఆదాన ప్రక్రియ విరివిగా జరగడం సంభవించింది.

ఆదాన ప్రక్రియవలన ఏ భాష అయినా తన భాషాంశాల వ్యాప్తిని పెంచుకుంటుంది.

# 10 (ఆ)

# సమాసరచన

సమాసమనే పదం సంస్కృత వ్యాకరణ ప్రభావం వల్లనే తెలుగు లోనికి ప్రవేశించింది. చింతామణిలో సమాస శబ్దానికి నిర్వచనం లేదు. చిన్నయ సూరి 'సమర్థంబులగు పదంబు లేక పదంబగుట సమాసము' అని చెప్పి— 'సమర్థము' అన్న పదానికి వివరణ ఇవ్వాలన్న తలపుతో, పృథక్ప్రసిద్ధార్థంబు లగు పదంబుల కేకార్థభావము సామర్థ్యము అనీ, పృథగ్భూతంబులగు పదంబుల కేకార్థంబున వృత్తి సామర్థ్యంబు అనీ వివరించాడు ఈ క్లిష్టతరమైనవివరణలవల్ల తేలిన విషయమేమిటంటే, ప్రత్యేకార్థాలు కలిగిన పదాలు, ఒకే అర్థాన్ని బోధించె సామర్థ్యాన్ని ప్రకటిస్తూ, కలిసిపోగా ఏర్పడిన రూపాన్నే సమాసం అని వ్యవహరించ వచ్చునని తమిళంలో, వ్యాకర్తలు సమాస పదాన్ని స్వీకరించకుండా, "కూర్పు" అనే అర్థాన్నిచ్చే తొగై అనే పదంతో సూచించడం జరిగింది.

ప్రౌఢవ్యాకర్త దీన్నే మరో రకంగా వివరించడం జరిగింది "సంయోగ దశయందు కలిగెడు విభక్తి లోపాత్మక పద స్వరూప సంగ్రహము" అని, ఆయన యిచ్చిన వివరణ దీనివలన సమాస రచన జరిగేటప్పుడు, ముఖ్యంగా సాధ్య, మిశ్ర సమాసాల్లో వాటిల్లె విభక్తి లోపాన్ని ప్రచురంగా ఎత్తి చూపడం జరిగింది. కాని, తెలుగు మాటలతో కూడిన సమాసాల్లో విభక్తి లోపం జరగక పోవడాన్ని ఇది ప్రస్తావించదు. చిన్నయ సూరి, విభక్తి లోపాన్ని చెప్పాలని అనుకున్నా, సమాస నిర్వచనం చేసేటప్పుడు చెప్పక, తరువాత ప్రసంగ వశాన సమాస విభక్తికి లోపంబగు— అని మళ్ళీ "లట్టునకు గాదు" అని సవరించు కున్నాడు సమాసానికి, ఏమైనా ఈ లక్షణం ఆనుషంగిక లక్షణం మాత్రమే.

ఇక సమాసాలను వివరిస్తూ, వాటి లక్షణాలు "ప్రాయికంబుగా సంస్కృతోక్తంబయగు" అని చెప్పి, సంస్కృతంలో ప్రచురాలైన తత్పురుష, బహువ్రీహి ద్వంద్వాలనే తెలుగు సమాసాలుగా స్థిరీకృతం చేశాడు. మళ్ళీ సంస్కృత లక్షణంబు దొడరని యుపమాన పూర్వపద కర్మధారయంబును గలదని యెఱుంగునది— అని చిగురుకేలు, జుంటిమోవి మొదలైన ఉదాహరణల్ని చూపిస్తూ తెలుగు సమాసాలను సూచించాడు.

తెలుగులో సమాసం ఏర్పడే విధానాన్ని సంస్కృత నిరపేక్షంగా చూస్తే క్రొత్త పద్ధతిలో ఉంటుంది.

(1) తెలుగులో సమాసాలన్నిటిలోనూ పూర్వపదం విశేషణంగానూ పరపదం విశేష్యంగానూ పని చేస్తాయి.

(2) విశేషణానికి, సంస్కృతంలో వచ్చేటట్లుగా, విశేష్యానికి గల లింగ విభక్తి వచనాలు రావు.

ఉదా॥ మంచి రాముడు - మంచి సీత - మంచి పుస్తకం

(3) విశేషణ విశేష్యాల మధ్య సంబంధ బోధక ప్రత్యయాల ఉనికి ఉండడం కనిపిస్తుంది.

ఉదా॥ ఊరి బావి, నీటి మూట, నూతి నీరు, జనపనార, తమలపాకు, ముద్దుటుంగరము మొదలగునవి.

(4) పూర్వ ఉత్తర పదాలు సంయోజనం చెందేటప్పుడు పూర్వపదం లోని కొంతభాగం లోపించడం జరుగుతుంది. ఆ భాగం సాధారణంగా, ప్రత్యయాదులు చేరడం వలన ఏర్పడిన భాగమై, ఆ ప్రత్యయాదులు జారిపోయి కేవలం మౌలిక ధాతురూపం నిలిచి ఉండడం సంభవిస్తుంది.

ఉదా॥ లే(త)రెమ్మ-క్రొంజిగురు-ముక్కాలు-పందొమ్మిది- etc.

(5) ఇటువంటివన్నీ గమనించి, చిన్నయసూరి ప్రాతాది సూత్రాలూ, ప్రౌఢ వ్యాకర్త "ఆచ్ఛిక సమాసంబులం దఱచుగ వర్ణలోప ఆగమాదేశ వికారంబులు పెక్కు గానంబడియెడి" అనే సూత్రమూ రచించవలసి వచ్చింది.

(6) సంస్కృతంలో కనిపించే సమాసాంత కార్యాల వంటివి సమాస మధ్య వికారాలు తెలుగులో కనిపిస్తాయి

1. ముక్కంటి 2. ముక్కాడి 3 నలుగాలి వానన్ మొ.

(7) తెలుగులో సంస్కృత లక్షణానికి సరిపడే బహుప్రీహిలేదు. కాని పైన చెప్పిన సమాసాంత కార్యాలు జరిగే సమాసాలలో కొంతలో కొంత బహువ్రీహి లక్షణం కనిపిస్తుంది.

(8) ద్వంద్వం తెలుగులో సమాసం కాదు అన్నదమ్ములు అన్న దానిని ఉభయ పదార్థ ప్రధానంగా చేసి ద్వంద్వం అనడం కంటె, ఆ ఉభయార్థ ప్రాధాన్యం కల, సముచ్చయ పదాలతో కూడిన వేరు వేరు పదాలుగానే వ్యస్తంగా భావించవచ్చు

అన్నా. తమ్ముడూ నడుస్తున్నారు.

అన్నదమ్ములు నడుస్తున్నారు.

ఇక్కడ కనిపించే ఒకే విశిష్ట లక్షణం బహువచన ప్రత్యయాన్ని రెండవ పదానికి అంటగట్టి బహువచనార్థాన్ని మొత్తానికి సాధించడం.

(9) క్రియారూపాలను విశేషణాలుగా చేసి క్రియాజన్య విశేషణాలను వాడడం తెలుగులో చాలా ఎక్కువగా కనిపిస్తుంది. క్రియారహిత వాక్యాలను నిర్మించడంలోనూ, యత్ తత్ ప్రయోగాన్ని పరిహరించడంలోనూ ఈ నిర్మాణం బాగా ఉపయోగపడుతుంది.

1. చెప్పిన వాడు వాడే.
2. వచ్చిన వాడు ఫల్గుణుడు.

(10) తెలుగులో విశేషణాలుగా వాడబడేవి ప్రత్యేక భాషాభాగాలు కాదు. త్రికము, ముగంతము, ధాతుజ విశేషణం, స్త్రీసమం వంటివి, ఇతర విశేష్యాలూ. అన్నీ ఆయా సందర్భాలను బట్టి విశేషణాలుగా వాడబడి సమాస రచనకు తోడ్పడుతుంటాయి.

(11) విశేషణ విశేష్యాల మధ్య ఇ, అ, టి, తి, ప, పు, టు, దు, రు, మొదలైన సంబంధ బోధక ప్రత్యయాలు అనుసంధింపబడుతుంటాయి.

(12) తెలుగు గ్రాంథిక భాషలో వాడబడే, అవ్యయీభావ సమాసాలు, బహువ్రీహి, ద్వంద్వం, కేవలం సంస్కృతం నుండి తెలుగులోనికి దిగుమతి అయిన ఆదానాంశాలు.

(13) తత్పురుష, కర్మధారయ, ద్విగు సమాసాలకు పేర్లు సంస్కృత పరిభాషకు సంబంధించినవైనా, మౌలికంగా ఇవి విశేషణ విశేష్యాల సంయోజనం వలన జనించిన సమాసాలే.

ఇది తెలుగు సమాసాల చరిత్ర.

# 10 (ఇ)

# నవీన పద నిర్మాణ ప్రక్రియ

ఆదాన ప్రక్రియను గురించి విపులంగా గ్రహించిన తరువాత, ఆదాన ప్రక్రియ వలన కాకుండా, ఇతర పద్ధతుల ద్వారా, భాషలో సరిక్రొత్త పదజాలం ఎలా ఉత్పన్నమౌతుందో ఆ వైనం తెలుసుకోవలసి ఉంటుంది. సామ్యంవల్లా, అర్థపరిణామాలవల్లా వచ్చే మార్పు, సరికొత్త పదాల సృష్టికి తోడ్పడుతుంది. అటువంటి వాటిలో

(1) పదారోపం (Meta analysis) ఒకటి. ఈ మార్పును ధ్వని భేదం మీద ఆధారపడినట్లుగా చెప్పడం కంటే సామ్యం (Analogy) మీద ఆధారపడి ఉందనడం సమంజసం. ఒక పదానికి సాధారణంగా ధ్వన్యాత్మకమైన ఒక రూపం స్థిరపడి ఉంటుంది. దాని స్థానాన్ని భాషా ప్రయోక్త, తానెరిగిన సామ్యం కల మరొక రూపం చేత ఆరోపాన్ని పొందిస్తే అది పదారోపమై మరొక కొత్త రూపం జనించడానికి వీలును కలిగిస్తుంది. ఈ ఆరోపాన్ని పొందించడానికి సామాన్య పరిస్థితి సరిపోదు. ఒక్కొకసారి సాధారణ పద స్వరూపానికి భిన్నమైన పద్ధతిలో ఆలంకారికంగానో, సమాసరూపంలోనో కొన్ని పదాలు తయారవడం జరుగుతుంది. వాటి నిర్మాణంలో ఒక సూత్ర బద్ధత ఉండవచ్చు. కాని అవి కొత్తగా రూపుచెందడం చేత, సామాన్యుని వ్యవహారంలో అంత సులువుగా ఇమడలేవు. అటువంటప్పుడు భాషా వ్యవహర్త, వాటి స్థానంలో, తానెరిగిన, ఆ పదాలతో సామ్యంకల పదాలనో, పదభాగాలనో అనుసంధించి, ఆ వ్యవహారాన్ని భాషలో నిలువబెట్టడం జరుగుతుంది. ఇటువంటి మార్పుకు నాగరక భాషలోకన్నా జానపద భాషలో ప్రాచుర్యం హెచ్చుగా ఉంటుంది.

ఉదాహరణకు, ఉల్ఫా అనే అరబ్బీ పదానికి కానుక అని అర్థం. ఇది తెలుగులోనికి ఆదాన పద్ధతిలోనే ప్రవేశించింది. సాహిత్య భాషలో 'ఉలుపా' అని ఉంది. 'తన కులుపా చాలదని...' ప్రభా. కాని జానపద వ్యవహారంలో ఈ పదం, ఉలపావులు - ఉలపాయలు అనే రూపాలను పొందింది. వక్త, తన భాషా వ్యవహారంలో ఉన్న పావులు, పాయలు అనే పదాల సామ్యాన్ని బట్టి,

'ఉలపాలు' అని ఏర్పడవలసిన రూపాన్ని ఉలపావులు, ఉలపాయలు అనే రూపాలుగా తీర్చుకోవడం జరిగింది.

ఇటువంటివే,

స్వాతివాన > చేటవాన
ముక్కాలిపీట > మొక్కలపీట
వింజామర > ఇంజామణి

వంటి కొత్తపదాలు.

(2) సమ్మిశ్రణ ప్రక్రియ (Contamination) : ప్రయోక్తకు, ఇంచుమించు ఒకే అర్థం కల కొన్ని పదాలు, తన భాషా వ్యవహారంలో స్థిరపడి, అతడు వాటిని కలగలుపు చేయడం వల్ల, కొత్తపదాలు జనించడానికి వీలు కలుగుతుంది. ఉదాహరణకు,

సందుకాయ పెట్టె
పేపరు కాగితం
మెడకంరం

మొదలైనవి. సందూక్ అనేది పెట్టె అనే అర్థంలో, తెలుగులోకి జొరబడిన ఆదానపదం. దానికి పెట్టె అనే పదం కూడా చేరి, మధ్యలో పదాలోపానికి కూడా లోనై, ఈ కొత్త పదం ఆవిర్భవించింది. అయితే కేవలం పెట్టె అనే సామాన్యార్థంలో కాకుండా, పేటీ విశేషానికి ఇది అన్వయింపబడింది. అదే విధంగా పేపరు కాగితం అనేది న్యూస్‌పేపరుకు మాత్రమే అన్వయిస్తుంది. మెడకంరం అనేది ఉడికిన కోడికూరలో ఉండే కోడి మెడ తునకకు మాత్రమే అన్వయిస్తుంది.

(3) నాగరీకరణం (Hyper Standardization or Hyper Correction) : ఇది ఎక్కువగా జానపదభాషలో సంభవించే మార్పు. తెలుగు భాషయొక్క మౌలికసూత్రాల ననుసరించి, తెలుగులో (1) పదాది సంయుక్తాక్షరాలుండవు. (2) పదాదిన తాలవ్యాచ్చులయిన ఇ, ఎ లతో కూడి వ కారం క్వచిత్తుగా కనిపిస్తుంది, (3) మహాప్రాణత్వం ఉండదు. ఈ లక్షణాలలో, 1, 3 లక్షణాలు తత్సమాలద్వారా తెలుగు భాషలోనికి ప్రవేశించిన లక్షణాలు. రెండవ లక్షణం, పరిణామవశాన తెలుగు నాగరకభాషలో కుదురుకున్న లక్షణం. జానపదులు, మూలసూత్రాల ననుసరించి భాషను వ్యవహరిస్తూ, నాగరకుల భాషలో ఉన్న పై మూడు లక్షణాలనూ చూచి, తమ భాషను కూడా నాగరకభాషగా మార్చాలనే స్పృహను పెంపొందించుకుంటారు. అటువంటి చోట్ల, వాళ్ళు చేసిన మార్పులవల్ల పదాలకు కొత్త రూపాలు ఏర్పడతాయి

ఉదాహరణకు,

పదాది సంయుక్తతను కలిగించడం-

తాంబాళం > స్తాంబాళం
తాళి > స్థాళి

వ కారం జొప్పించడం-

ఎముకలు > ఎంకలు > వెంకలు
ఎంగిలి > వెంగిలి
ఎగతాళి > వెగతాళి
ఎక్కిరింత > వెక్కిరింత

ఈ వకార యుక్త రూపాలను నాగరకులు కూడా గ్రహించి వాడుకోవడం వలన అవి ఆమోదయోగ్యాలై నిఘంటువులకు ఎక్కడం సంభవించింది.

ఎన్ను (Ear of corn) > వెన్ను
ఎన్న > వెన్న
ఎక్కిరింత > వెక్కిరింత

మహాప్రాణత్వం పొందించడం-

బావి > భావి
కథ > ఖద
సగం > సఘం
జంజెం > ఝంఝెం

(4) నవ్యకల్పనలు (Innovations) : ప్రయోక్త కుండే కల్పనా శక్తివల్ల, కొన్ని పదాలు సందర్భాన్ననుసరించి, అర్థవిధేయాలై వానిచే అప్పటి కప్పుడు కల్పింపబడతాయి. ఈ కల్పనకు ఆధారభూతమైన అంశం, ఆ పదం సూచించే వస్తువుకు సంబంధించిన వర్ణనాంశం.

ఉదా॥ జానపద భాషలో,

పూజారి > వేల్పులోడు
ఆడపిల్ల > పరయింటి దీపం
మగవాడు > తనింటి దీపం
రైలు సిగ్నల్ > రెక్కమాను
Living room > మనుసాల

ముండ గ్రాసం > మనోవర్తి
చిన్నపిల్ల > చంకబాటు

ఇటువంటి కల్పనలే కాక, పశువులకూ పక్షులకూ పెట్టుకునే పేర్లు, ధాన్యంలో భేదాల పేర్లు, చీరల్లోనూ రవికెల్లోనూ ఉండే భేదాలను స్పష్టం చేసే పేర్లు నగల పేర్లు, ఆయుధాల పేర్లు, వ్యాధి విశేషాల పేర్లు ఇవన్నీ కల్పనా పటిష్ఠాలై అవతరించి కొత్త పదసంపదను భాషకు ప్రసాదిస్తాయి.

ఉదా॥ (1) చీరెలు-

కోటబొమ్మంచు చీరె
గంగసరాల చీరె
మూడుకొంగుల చీరె
అంచపట్టిన చీరె
నాగపడిగల చీరె
ముత్యాలపందిరి చీరె మొ॥

(2) రవికెలు-

పూసల రవికె
గొల్లపోత రవికె
అద్దాల రవికె
నేర్లుదీసిన రవికె
సన్నపోత రవికె
కసింద రవికె

(3) ఆభరణాలు-

గిరిగాజులు
బిళ్ళగాజులు
కర్ణ పువ్వులు
బవిరి రేకలు
చిటికెన బద్దులు
అనంత గంటీలు
ముంగామురుగులు
మీనా బిళ్ళలు

(4) ధాన్యభేదాలు- కాశీ సన్నాలు
చిట్టి మల్లెలు
కృష్ణ ప్రయాగలు
గౌరీ కుంకుమలు
రామ సాగరాలు
మల్లె సన్నాలు
(5) గుఱ్ఱాల పేర్లు- పున్నమ చంద్రుడు
నడుమింటి డేగ
చంద్రుని తేట
సంపెంగ పువ్వు
(6) ఆవుల పేర్లు- లేతమావిడి
కల్పవృక్షము
ఆకాశగంగ
చిత్రవన్నెల చిలక
కామధేనువు
(7) ఆయుధ భేదాలు- చిగురు కండెలు
చందురు వంకలు
తామర కూనలు
కుప్పి కోలలు
నేచాలు
చీకటి మిణుగుర్లు
(8) వ్యాధి విశేషాలు- కడుపు బల్ల
గండమాల
గానుగ రోలు
దోర శిరసు
కుండేటి యొర్లు
ఫాలగౌదలు

ఒక్కొక్క వృత్తికి సంబంధించిన వివిధాంశాలలో ఈ రకమైన నవ్యపద సమృద్ధిని మనం చూడవచ్చును.

ఈ విధంగా కొత్తపదాల కల్పన ప్రయోక్త యొక్క కల్పనా సామర్థ్యాన్ని బట్టి ఏర్పడి భాషలోని పద సంపదకు విస్తృతిని కలిగిస్తుంది.

# 11

# మాండలిక విజ్ఞానం

భాషలో సంభవించే ధ్వని పరిణామాన్ని, అర్థపరిణామాన్ని, ఆదాన ప్రక్రియనూ నిశితంగా పరిశీలించిన తర్వాత, మొత్తం భాషలో వేరువేరు ప్రాంతాలను బట్టి, వ్యవహర్తల సాంస్కృతిక స్థాయిని బట్టి, వయో భేదాన్ని బట్టి, భిన్నభిన్న రూప విశేషాలు ఎలా ఏర్పడవచ్చునో అంచనా కట్టడం కష్టం కాదు. ఒకే భాష అది వ్యవహరించబడే భౌగోళిక స్థితిగతుల్ని బట్టీ, దాన్ని వ్యవహరించే మనుష్యుల వివిధ స్థాయిలనుబట్టీ, భిన్నత్వాన్ని సంతరించుకోగా, ఆ భిన్నత్వాన్ని పరిశీలించే శాస్త్రమే మాండలిక విజ్ఞానంగా పరిగణనం చెందింది.

ఒక కాలంలో ఒక మనిషికి సంబంధించిన వైయక్తిక భాషా వ్యవహారాన్ని ఆంగ్లంలో Id olect అని వ్యవహరిస్తారు. మాండలిక భాష అంటే, ఒక మండలానికి చెంది, భిన్నభిన్న జనులకు సంబంధించిన, ఒక కాలంయొక్క వైయక్తిక భాషా వ్యవహారాల సమాహారం అని నిర్వచించవచ్చు. ప్రాంతీయ భేదాన్ని లెక్కపెట్టకుండా, ఒక భాష మొత్తంలో, ఒక కాలంలో ఉండే భిన్న వ్యవహారాల సమాహారాన్ని గ్రహిస్తే, దానికీ, ఒక ప్రాంతానికి మాత్రమే చెందిన భిన్నవ్యవహారాల సమాహారానికీ, భేదం కనిపిస్తుంది. ఒక భాష మొత్తంలో ఉండే వైయక్తిక వ్యవహారాల మధ్యగల పోలికల కంటే ఒక మాండలికంలోని వైయక్తిక వ్యవహారాల మధ్య ఉండే పోలికలు హెచ్చు.

ఒక భాషకు చెందిన రెండు మాండలికాల్లో ఈ వైయక్తిక భాషా వ్యవహారాలు (Idiolects) ఎక్కువ పోలికలు కలిగినవిగా కనిపిస్తే ఆ రెండు ప్రాంతాల వారికీ పరస్పరావగాహన శక్తి (Mutual Initelligibility) పుష్కలంగా ఉన్నట్లు అర్థం చేసుకోవచ్చు. అంటే ఈ రెండు ప్రాంతాల మధ్యా సమాన వ్యవహార పరిధి (Common Core) ఉంటుంది. ఈ పరిధి స్పష్టంగా ఉన్నంత కాలం ఆ మాండలికాలు రెండూ భిన్న భాషలుగా పరిగణించబడక, ఒకే భాషకు చెందిన ప్రాంతీయ భేదాలుగానే పరిగణించబడతాయి.




( C=Common Cove )

ఒకొక్కొక్కసారి రెండు మాత్రమే కాక అంత కెక్కువ ప్రాంతాలకు చెందిన భాషా భేదాలకు కూడా ఒకే సమాన వ్యవహార పరిధి ఉండడం సంభవించవచ్చు.




లేదా, వాటికి ఒకే సమాన వ్యవహార పరిధి లేకపోయినా, అవి సమకూడే పద్ధతివల్ల ఒకదాని కొకటి అర్థమయ్యే మార్గం స్పష్టం కావచ్చును.




ఒక మండలానికి చెందిన భాషా భేదాన్ని, దానితో సంబంధం కలిగిన పొరుగు మండలానికి చెందిన వ్యక్తి, రెండు విభాగాలుగా ఏర్పాటు చేసుకోవడం జరుగుతుంది. (1) తన భాషా వ్యవహారంతో భిన్నంకాని వ్యవహారసమాహారం సమాన వ్యవహారపరిధిలో ఇమిడేవన్నీ ఇటువంటి వ్యవహారాలే. (2) తన భాషా వ్యవహారంలో భిన్నత కలిగి ఉన్నా తనకు అర్థమయ్యే వ్యవహారం- ఈ రెండవ రకపు వ్యవహారాన్ని తన వ్యవహారంగా అంగీకరించడం గానీ, దాన్ని తన వ్యవహారంతో కలిపి వాడడం గానీ అతడు చేయలేడు. కాని దాన్ని అర్థం చేసుకునే ప్రయత్నంలో కృత కృత్యుడు కాగలడు. ఇందులో తాను వాడే వైయక్తిక వ్యవహారాన్నిఉత్పాదక వ్యవహారమనీ(Productive Idiolect) తాను అర్థం మాత్రమే చేసుకోగల వ్యవహారాన్ని గ్రహణశీల వ్యవహార మనీ (Receptive Idiolect) వ్యవహరించవచ్చు.

అదలా ఉండగా, ఏ భాషలోనైనా అర్థ బోధనకు అనవసర మనిపించేంత ఎక్కువగా (Redundant) వాక్యంలో ధ్వనులు పేర్చబడవచ్చు. అంటే ఒకరు ఉచ్చరించే ప్రతి వాక్యంలోనూ ఉండే ధ్వనుల్ని మనం పూర్తిగా వినకపోయినా ఆ వాక్యగతమైన అర్థం మనకు అవగతమవుతూనే ఉంటుంది. వాక్యంలో ఉండే ప్రతి ధ్వనీ ప్రత్యేకార్థాన్ని ఇచ్చేదే అయితే ఆ ధ్వని వినిపించకపోతే మనకా వాక్యం అర్థం కాకుండా పోవలసి వస్తుంది. ఈ విధమైన వాక్యాలు ఏ భాషలోనూ ఉండవు. దీన్నిబట్టి ఏ భాషలోనైనా ధ్వని విరహితమైన అవగాహనా శక్తి సగానికి సగం ఉంటుందని భాషావేత్తలు అంచనా వేయగలిగారు. ఇది ఉండడం వల్లనే రైలు స్టేషను, ఫాక్టరీ స్థలం మొదలైన ధ్వని సంకులమైన స్థలాల్లో కూడా జనం ఎదుటివాడు ఉచ్చరించే వాక్యాలను పూర్తిగా వినలేకపోయినా అవగతం చేసుకోగలుగుతున్నారు. ఇట్లా అవగతమయ్యే ధ్వని సంకేత ధ్వని (Code noise). అంతేకాక ఒక గదినిండా మనుషులుండి, అక్కడ నాలుగైదు వేరువేరు భాషల్లో సంభాషణ పెద్దగా సాగుతున్నాసరే, ఆ గోల మధ్యలో, ఒకడికి తన భాషే అవగతమై అందుకు మిగిలిన భాషాధ్వనులన్నీ ఏ విధంగానూ ప్రతిబంధకాలు కాకుండా ఉండడం జరుగుతుంది — ఈ రకంగా అవగతం చేసుకునే ధ్వనిని సంవాద ధ్వని (Channel noise) అంటారు.

ఇటువంటి భేదాలు కూడా మాండలిక పరిగణనంలో ప్రధాన పాత్రను వహిస్తాయి.

భాషలో ప్రాంతీయ విభేదాలను గురించి వెతికేటప్పుడు మనం ఒక విషయం గుర్తించవలసి ఉంటుంది. ఏ ప్రాంతంలోనైనా విద్యావంతుల భాషకూ, విద్యాహీనుల భాషకూ భేదం ఉంటుంది. రెండూ రెండు సమాంతర రేఖల వంటివి. విద్యావంతుల భాష విభిన్న ప్రాంతాలకు చెందినదే అయినా అందులో ఏకసూత్రత కనిపిస్తుంది. ఇందుకు కారణం ఏ ప్రాంతానికి చెందిన విద్యావంతులనైనా. ఒకరికొకరికి సంబంధం ఉండేటట్లుగా కలిపే ప్రచారసాధనాలలోని భాష.

సాధారణంగా ఈ విద్యావంతుల భాషనే ప్రామాణికంగా ఉంచుకుని ఇదే సరియైన భాష అనడం, దీన్నిబట్టి మిగతా విభేదాలను సరిచేయడానికి ప్రయత్నించడం నాగరకులకు అలవాటు. ఏ ప్రాంతంలోనైనా శిష్టవ్యావహారికంగా చెల్లుబడి అయ్యేభాష ఈభాషే! ప్రాంతీయ భాషా స్వరూప పరిగణనంలో ఇటువంటి భాష చూపించే ప్రభావం చాలా తక్కువ.

ఇక, ఈనాటికైనా తెలుగుభాషకు ఖచ్చితమైన మాండలిక భేదాలెన్నో సశాస్త్రీయంగా స్థాపించబడలేదు. కేవలం వ్యవహార సౌకర్యం కోసం

మాత్రమే, రాజకీయంగా చేసిన విభాగాలను బట్టీ, ఆయా ప్రాంతాల నామాలను బట్టీ, కృష్ణా, గుంటూరు, విశాఖ, నెల్లూరు, తెలంగాణా, రాయలసీమ అంటూ విభజించిన అశాస్త్రీయ మాండలిక నామాలే చెల్లుబడి అవుతున్నాయి డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు తెలుగు మాండలికాలను నాలుగు విధాలుగా విభజించవచ్చునని స్థూలంగా చేసిన సూచన మాత్రం ఒకటి కనిపిస్తుంది.

తెలుగు ఎకాడమీ నిర్వాహకులు, మాండలిక సర్వేక్షణ చేయించి (Dialect Survey) మాండలిక వివరాల్ని తయారు చేయాలని మొదలుబెట్టి ఇప్పటికి, కడప, గుంటూరు, విశాఖ, కరీంనగర్, వరంగల్ మండలాలకు మాత్రం ఈ వివరాల సంపాదనను పూర్తి చేసి ప్రచురించడం జరిగింది.

ఈ సర్వేక్షణ సశాస్త్రీయంగా తెలుగు దేశమంతటా జరిగి, వివరాలు ప్రకటించబడితేనే తప్ప తెలుగు భాషా మండలాల నిక్కచ్చితనం స్పష్టంకాదు.

పాశ్చాత్య దేశాలలో మాండలిక భేదాలను భాషా పటాల ద్వారా గుర్తించే వాడుక పందొమ్మిదవ శతాబ్దం పశ్చిమార్థంలోనే ఆరంభమైంది. 1881 లో జర్మన్ భాషకు చెందిన భాషాభేదాలను George Wenker అనే భాషావేత్త భాషాపటం (Linguistic Atlas) ద్వారా చూపించడానికి ప్రయత్నం చేయడం జరిగింది. ఆపటాలు గీయడానికి ఆయన అవలంబించిన పద్ధతి ఇది: జర్మన్ భాషలో 40 వాక్యాలను ఏరి వేరు వేరు ప్రాంతాలలో ఉండే 40 మంది పాఠశాల అధ్యాపకులకు వాటిని పంపించాడాయన. వాటిని, వాళ్ళ వ్యవహారంలో ఉండే రూపాలతో తిరిగి వ్రాసి పంపించమని అభ్యర్థించడం జరిగింది. ఆ విధంగా, ఒకే భాషకు ఆ రోజుల్లో మాండలికాలయిన మార్పులు ఎన్ని ఉన్నాయో సేకరించడం జరిగింది. అయితే, ఆ పాఠశాలాధ్యాపకులు ఈ విషయాల్లో తరిఫీదు పొందినవారు కాదు. అందువల్ల ఆ ప్రయత్నాన్ని శాస్త్రీయమైన ప్రయత్నంగా భావించడానికి వీలులేదు.

తర్వాత ఎంతో మంది ఈ రకమైన ప్రయత్నాలు చేయకపోలేదు. అమెరికన్ కౌన్సిల్ ఆఫ్ లెర్నెడ్ సొసైటీ వారు, 1939-43 సంవత్సరాల మధ్య ఒక భాషా పటాన్ని (Atlas) వెలువరించడం జరిగింది. దీనికి సంపాదకత్వం వహించిన వాడు Hans Kurath అనే పాశ్చాత్యుడు. ఆయన ఈ పథకంలో పని చేయడానికి పదిమంది భాషా జిజ్ఞాసువుల్ని ఎన్నుకోవడం జరిగింది. వాళ్ళకు ధ్వని లేఖనంలో (Phonetic Script) తరిఫీదు ఇవ్వడం జరిగింది. వాళ్ళు ఒక్కో ప్రదేశంలో ఒక్కొక్కరి వంతున ఎంతో మంది భాషా వ్యవహర్తల్ని (Informants) ప్రశ్నించి సమాచారాన్ని రాబట్టుకున్నారు. ఈ సమాచారం,

వర్ణం, పదం, వాక్య నిర్మాణం, పదబంధాలు మొదలైన భాషకు సంబంధించిన మౌలిక విషయాలను కలిగి ఉన్నది. అంతకు ముందు ఎవరో ఒక వ్యక్తినే సమాచార దాతగా గ్రహించే వాడుక ఉండేది. ఈ నవీన విధానం వల్ల, ముసలి, పడుచు - బీద, గొప్ప - ఆడా మగా, కులీన, అకులీన - విద్యాధిక విద్యారహిత- వర్గాల భేదాలను గూడా దృష్టిలో ఉంచుకుని సమాచార వైవిధ్యాన్ని రాబట్టడం ఒనగూడింది. ఈ ప్రయత్నం వల్లనే, ఒకే భాషలో, అంతర్గతంగా పలుభాషా ప్రదేశాలు (Speech areas) ఉన్నట్లుగా స్పష్టమైంది. ఈ విధంగా 1943 నాటికే ఈ మాండలిక పటాల నిర్మాణం పాశ్చాత్య దేశాలలో రూపం దిద్దుకున్నది.

ఇక భారతదేశంలో తొలిదొ_ల్లగా భాషావిషయక సర్వేక్షణ జరిపిన వాడు గ్రియర్‌సన్ పండితుడు. ఆయన, ఉద్యోగవశాన జరిపిన సర్వేక్షణ అవడంవల్ల దీన్ని శాస్త్రీయపద్ధతుల్లో నిర్వహించిన సర్వేక్షణగా పేర్కొనడానికి వీలులేదు. కేవలం ప్రశ్నావళిముఖంగా ఆయన సామగ్రిని సంకలనం చేశారు.

ఏ భాషలోనైనా, వర్ణం, పదాంశం, పదం, వాక్యం, పదబంధం వంటి మౌలికాంశాలను దృష్టిలో ఉంచుకుని, ఒక నిర్దిష్టమైన పద్ధతిని అనుసరించి మాండలిక పటాలను (Dialect Atlases) నిర్మించవలసి వస్తుంది. అవి నిర్మించడంలో అవశ్యమూ ఈ కింది సూత్రాలను పాటించాలి: (1) తొలుత భౌగోళిక స్థితిగతుల వల్లనో, రాజకీయ పరిస్థితుల వల్లనో భాషలో భిన్న లక్షణాలు ఉండగలవని మనం అనుమానించే ప్రాంతాలను పరిశోధకుడు ఎన్నుకో వలసి ఉంటుంది. (2) ఆ భిన్నప్రదేశాలలో ప్రాతినిధ్యం వహించే ఊళ్ళను అటూ ఇటూ కూడా మొదటనే ఎంచుకోవలసి ఉంటుంది. (3) ఒక్కొ ఊరికి సుశిక్షితు డైన ఒక్కొ భాషా సంగ్రాహకుడు (Field worker) వెళ్ళి, అక్కడ వ్యవ హర్తల్ని (Informants) నియమించుకోవలసి ఉంటుంది. ఇతనికి కొన్ని కనీస లక్షణాలు ఉండడం అవసరం. (i) సమాచారదాత మరీ చిన్నవాడు కాకూడదు. (ii) పూర్తిగా విద్యావంతుడూ కాకూడదు. (iii) పలుమార్లు ఇతర ప్రాంతాలకు ప్రయాణం చేయడంవల్ల, తన భాషమీద, ఆయా ప్రాంత భాషల ప్రభావం పడినవాడు కాకూడదు. (iv) తాను నివసిస్తున్నప్పుడున్న యువ తరానికి, ముందుతరంలో పుట్టి పెరిగినవాడై ఉంటే మంచిది. (v) ఉచ్చారణావ యవాల లోపం, ఉచ్చారణ లోపం గలవాడుగా ఉండకూడదు. ఇటువంటి లక్షణాలు కలిగిన వ్యవహర్తల వలన మంచి ఫలితాలు లభించే అవకాశం ఉంది. (4) అంతేకాక, వృద్ధులనుండి, పడుచువారినుండి, విద్యాధికుల్నుండి, విద్యా హీనుల్నుండి, రకరకాల వృత్తులు చేపట్టినవారినుండి, స్త్రీలనుండి కూడా విషయ

సేకరణ చేసి మొదటి సమాచారదాత (Informant) ఇచ్చిన సమాచారంతో దాన్ని తైపారు వేసుకుని చూడవలసి ఉంటుంది. (5) భాషా సంగ్రాహకుడు మొదట తాను రాబట్టదలచుకున్న సమాచారాన్ని ప్రశ్నావళి రూపంలో తయారు చేసుకుని ఉంచుకోవలసి ఉంటుంది. (6) ఆ ప్రశ్నలకు జవాబులు సమాచార దాత నుండి రాబట్టే ప్రయత్నంలో వర్ణాలు, పదాలు వాక్యం పదబంధాలు వంటి విభిన్న మూలరూపాలకు సంబంధించిన భాషాస్వరూపాన్ని గుర్తించడానికి వీలు కలుగజేసుకోవలసి ఉంటుంది. (7) వర్ణాలను ఉచ్చారణ విధేయ లిపిలో గ్రహించే తరిఫీదును భాషా సంగ్రాహకుడు అవశ్యమూ పొందడం అవసరం.

ఈ సమాచారాన్ని సేకరించడం క్షుణ్ణంగా లోపరహితంగా ముగిసిన వెనుక ఆయా అంశాలలో విభిన్నతలు ఎక్కువగా ఉన్నచోట, వాటిని సూచిస్తూ, విభేదకరేఖలు (Iso glosses) గీయాలి. అంటే ఒక్కో అంశానికి ఒక్కో వ్యవహార విభేదకరేఖ కలిగిన పటం తయారుచేయాలి. అటువంటి పటాలు, ఎన్నో అంశాలను సంబంధించి లెక్కకు మిక్కిలిగా తయారుకావడానికి వీలుంటుంది. ఈ అన్ని పటాలలోను, భేదకరేఖలన్నీ ఒకే ప్రాంతాన్ని దాటుతూ, ఒకే విధంగా ప్రదేశ విభజనని చేసినట్లయితే, ఆ రేఖలకు అటూ ఇటూ ఉన్న రెండు ప్రదేశాలనూ, మనం ఒకే భాషకు చెందిన రెండు మాండ లికాలుగా నిర్ణయించవచ్చును. అనగా, ఈ పటాలను ఒకదాని మీద ఒకటి బొత్తిగా ఉంచి వెలుగుకు అభిముఖంగా పట్టి ఉంచితే ఆ రేఖలన్నీ ఒక బొత్తిగా, ఒకే ప్రదేశాన్ని దాటుకుంటూ పోతూ ఉండడం మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

అట్లా కాక, భేదక రేఖలన్నీ అడ్డదిడ్డంగా బిక్కిరి బిక్కిరిగా ఒక దాన్నొకటి కత్తిరిస్తూ కనపడితే అక్కడ స్థిరపడ్డ మాండలిక భేదమేదీ లేదని గుర్తించవచ్చు. పెద్ద పెద్ద పట్టణాలు నానారకాల జనులకు కూడలి స్థలాలై బహు భాషా ప్రాంతాలు (Multi Lingual Areas) గా ఉంటాయి. రాజకీయ మత, సాంఘిక కారణాల వలననో, వస్తువుల కొనుగోలుకో, న్యాయస్థానాల కొరకో, వ్యాపార నిమిత్తమో, జనం ఇటువంటి చోట్లకు వివిధ ప్రాంతాలనుండి వస్తూ పోతూ ఉంటారు. ఇక్కడ ఒక భాషకు సంబంధించిన ప్రాంతీయ భేదా లతో పాటు, భిన్న భాషా వ్యవహారాలు కూడా వినిపిస్తుండవచ్చును. ఇటువంటి ప్రదేశాలను స్థిత్యంతర ప్రదేశా (Transition Areas) లంటారు. ఇటువంటి చోట్ల వ్యవహార భేదక రేఖలు బిక్కిరి బిక్కిరిగా ఉండడం కనిపిస్తుంది.

ఆధునిక కాలాన రేడియో, పత్రికలు, సినిమాలు, టెలివిజన్ వంటి ప్రచార సాధనాల వల్లా, పారిశ్రామికీకరణం వల్లా, శీఘ్రయాన సాధనాల వల్లా,

ప్రాంతీయ భాషా భేదాల మధ్య దూరం తరుగుతున్నట్లుగా మనం గుర్తించవచ్చును. అనగా మాండలిక భేదాల ఉనికి క్రమంగా తెరమరుగై పోతున్నదని చెప్పవచ్చు. కాని మాండలికాధ్యయనం వల్ల (1) వ్యవహర్తృ సమాజాల (Speech Communities) మధ్య సదవగాహన ఏర్పడుతుంది. (2) ప్రాచీన సాంస్కృతిక చరిత్ర వెల్లడి అవుతుంది. (3) ఒక్కో ప్రాంతపు భాష మీద కుదురుకున్న పరభాషా ప్రభావం, సామ్యం, ఊనిక, స్వరం, కొత్త పద బంధాల పుట్టుక వంటి ఎన్నో అంశాలలో ఉండే విశిష్టతలు గోచరిస్తాయి. (4) దీనివల్ల భాష సజీవమైందనీ, మార్పును అనుక్షణమూ ఆహ్వానించే ప్రక్రియ అనీ గ్రహింపు కలుగుతుంది. (5) ప్రాచీన వ్యాకరణ వేత్తలు చెప్పిందే వేదమనీ, దాన్ని అతిక్రమించడం నేరమనీ ఊహించే ఛాందసం నశిస్తుంది.

ఈ ప్రయోజనాల నాశించి, ఈ మాండలిక విజ్ఞానాన్ని అధ్యయనం చేయడం అవశ్యమూ అవసరం.

12

# అర్థ విజ్ఞానం

ఏ భాషలోనైనా పదమనేది ఎప్పుడూ అర్థరహితంగా ఉండదు అర్థం అంటే ఏమిటి అనే ప్రశ్న వెనక ఎంతో తాత్త్వికత కనిపిస్తుంది ఒక వ్యక్తి తన మనస్సులో, తన మానసిక స్థితిగతుల్ని ఆధారంగాకొని ఏర్పరచుకొనే భావజాలమే ఆతడు తీర్చే భాషలో వ్యక్తమవుతుంది. ఆ భావజాలం యొక్క సంపూర్ణ స్వరూపమో, అందులో కొంతభాగమో, దానికి సంబంధించిన వివిధ ఛాయలో, భాషలోని పదాలకు అర్థాలుగా భాసించడం జరుగుతున్నది. ఇటువంటి అర్థాలనూ, వాటి ఛాయలతో సహా అవి పొందే పరిణామాలనూ గుర్తించి, కొన్ని విభాగాలుగా పేర్చి, వాటి ప్రత్యేక లక్షణాలను నిర్వచించడం వలన, అర్థ పరిణామ చరిత్ర (Semasiology) రూపు చెందుతుంది

మన ప్రాచీన భాషావేత్తలు మాటకున్న అర్థాన్ని గురించి విపులమైన చర్చ చేయడం జరిగింది. పాణిని సంస్కృత భాషకు రచించిన వ్యాకరణం, యాస్కుడు మాటల అర్థాలకు వ్యుత్పత్తుల్ని ఆలోచిస్తూ తీర్చిన నిరుక్తం, భర్తృహరి తన వాక్యపదీయంలో శబ్దమన్నది ఒక అర్థాన్ని వెలువరించడానికి పుట్టిన అంశమే (Unit) కాని, కేవలం దాన్ని కొన్ని ధ్వనుల సమూహంగా విభజించి పరిశీలించడానికి వీలుకానిది అని చేసిన స్ఫోటవాదం, పతంజలి తొలు దొల్తగా తన మహాభాష్యంలో శబ్దానికున్నట్లుగా పేర్కొన్న ధ్వనీ, ఇవన్నీ పదానికుండే అర్థాన్ని గూర్చిన వివరణలే. కాగా ఆలంకారికులు పేర్కొన్న అభిధ, లక్షణ, వ్యంజనావృత్తులు కూడా అర్థాన్ని వివరించడానికి రూపు చెందించిన అంశాలే. ఆనందవర్ధనాచార్యుడు ప్రచారంలోకి తెచ్చిన ధ్వని, వ్యంజనావృత్తి మూలకమే. ఆయన, పతంజలి వాడిన ధ్వనిపదాన్ని గ్రహించి, దాన్ని అర్థ శక్తికి పర్యాయపదంగా వాడుకోవడం జరిగింది. దీన్నే తరువాతి ఆలంకారికులైన అభినవగుప్తుడు, మమ్మటుడు, విశ్వనాథుడు మొదలైనవారు బాగా వ్యాప్తి లోకి తీసుకురావడం జరిగింది.

ఒక పదానికి లోక వ్యవహారం వల్ల, రూఢి వల్ల కలిగిన అర్థమేకాక సన్నివేశం వలన, పరిస్థితుల వలన, ఉచ్చారణా వైవిధ్యం వలన ఆ పదాన్ని

అంటి పట్టుకుని అర్థచ్ఛాయలెన్నో ఉంటాయనీ, వీటన్నిటి సమాహార స్వరూపమే పదగతమైన, నిజమైన అర్థమనీ ఆనందవర్ధనాచార్యుడు స్పష్టం చేయడానికి ప్రయత్నించాడు. అదే ఆయన ధ్వని సిద్ధాంత సారాంశం కూడా. దీన్నే Charles C Fries అనే భాషావేత్త సంఘపరమైన సాంస్కృతికార్థమని (Social Cultural Meaning) వివరించాడు.

పదానికీ, అందులో నిక్షిప్తమైన అర్థానికీ ఉన్న సంబంధం యాదృచ్ఛిక (Accidental) మైంది పరంపరగా ఒక పదానికి ఇదీ అర్థమని మనం గ్రహించి గుర్తు పెట్టుకోవడం జరుగుతున్నదే కాని ఆపదానికీ ఆఅర్థానికీ ఎటువంటి సంబంధమూ లేదు. నిప్పు అన్న పదాన్ని మనం ఉచ్చరిస్తున్నప్పుడు, దానికున్న అర్థం వల్ల అది మన నోటిని కాల్చదు కోమలి అనే పదంలో ఉన్న ఏ అక్షరానికైనా కోమలత్వంతో సంబంధం లేదు.

కాని మనుష్యుడు ఏదో ఒక రకమైన ప్రేరణ (Motivation) వల్ల కొన్ని భావాలను కొన్ని పదాలతో అనుసంధించడం జరుగుతున్నది.

ఉదా॥ 'కాకా' అని ధ్వనిచేసే పక్షి పేరు 'కాకి'- మంట మండేటప్పుడు కిణ కణమనే ధ్వన్యనుకరణం స్ఫురిస్తుంది కాబట్టి 'కణ కణమనేవి నిప్పులు'- బంతులూ, బుట్టలూ, బుగ్గలూ ఇవన్నీ మూతిని బూరటిల్ల చేసిన ఆకారంలో ఉంటాయి కాబట్టి, ఆ పదాలు 'బ' ధ్వనితో మొదలవుతాయి. ఇటువంటి ప్రేరణల వల్ల, కొన్ని పదాలకు కొన్ని అర్థాలు అనుసంధించడం జరిగింది. ఈ ప్రేరణ వల్లనే భాషలో చిత్ర విచిత్రాలయిన పదబంధా లేర్పడడానికి వీలు కలుగుతుంది. పదబంధాలలో పదాలు ఇచ్చే సాంకేతికార్థానికీ, శ్రోత, ఆ పదబంధాలను విన్నప్పుడు గ్రహించే సామూహికార్థానికీ (Total expression) ఏ మాత్రమూ సంబంధం ఉండదు.

ఉదా॥ 1. పొయిలో పిల్లి లేవలేదు > (వంట చేయలేదు)
2. వాళ్ళిద్దరిమధ్యా పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది > (తీవ్రమైన వైరం)

ఇక్కడ ఏ ఒక్క పదానికో ఉన్న అర్థ విశేషం కాక, మొత్తం వాక్యాన్నంతా లెక్కలోకి తీసుకోవలసి ఉంటుంది.

ఇదిట్లా ఉండగా, కొన్ని పదాలకు, తమకు సాంకేతికంగా నియతమైన అర్థమేకాక, ఆ అర్థాన్ని అనుసరించి ఉద్భవించే అనేకచ్ఛాయార్థాలు కూడా అనుసంధింపబడవచ్చు.

(1) ఇటువంటి పదాలను బహ్వర్థక పదాలు (Polynms)అని వ్యవహరిస్తారు.

ఉదా॥ 1. నాటకం > ప్రదర్శన యోగ్య ప్రక్రియ

దీనినుండి వచ్చిన ఛాయార్థాలు- 1. వంచన 2 నిజాన్ని మభ్యపెట్టడం.

2. కమ్మ > 1. తాటి ఆకు

> 2. తాటాకుమీద వ్రాసిన లేఖ

> 3. ఏ లేఖ అయినా

> 4. తాటాకుతో చేసిన కర్ణాభరణం

> 5. ఏ లోహంతో చేసిందయినా

(2) సమరూపపదాలు (Homonyms): పదాల్లో కొన్నిటికి ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా భిన్నార్థాలు ఆపాదించడం భాషలో కనిపిస్తుంది- వీటినే నానార్థాలు అనికూడా అంటారు. ఈ రకమైన అర్థాలు, పైన బహ్వర్థక పదాల విషయంలో స్పష్టం చేసిన అర్థాల కంటే భిన్నాలు. ఈ అర్థాలు తొలుత విభిన్నధాతువుల వలన భిన్న భిన్నంగా ఏర్పడి, భాషా పరిణామ క్రమాన, ఆ ధాతువులు ఏకరూపత సాధించగా, సమాన రూప పదాలకు కుదురుకోవడం జరిగింది.

ఉదా॥ 1. తేలు > to float (*తేట్-)

> Scorpion (*తేళ్-)

2. చెప్పు > to say (*కెప్-v)

> Foot wear (*కెరుప్పు)

(3) పర్యాయ పదాలు (Synonyms): భాషలో ఒకే అర్థాన్ని ఇచ్చేవిగా భిన్న భిన్న పదాలు ఏర్పడడం, రకరకాల మార్గాల వలన జరగడానికి వీలుంది. ఇతర భాషల ప్రభావం, ప్రాంతీయమైన విభిన్నతలు, ఇటువంటి పద వైవిధ్యాన్ని సృష్టించడానికి సమర్థాలు.

ఉదా॥ 1. Hundred > నూరు
వంద

2. Girl > పిల్ల
పోరి
గుంట

సమకాలికంగా ఉండే భాషలోని పదాల అర్థాలను గురించి ఆలోచిస్తే పైన చెప్పిన విధంగా వైవిధ్యాలు స్పష్టమౌతాయి. అట్లాకాక, ప్రాచీన కాలం నుండీ కావ్యపరంగా మనకు తెలిసిన తెలుగు పదాల అర్థాలను. ఈనాటి అర్థాలతో సమన్వయిస్తే ఆ పరిశీలన మరొక రకంగా ఉంటుంది.

I ఒక పదానికి ప్రాచీన కాలంలో ఒక అర్థం నియతంగా ఉండి తరువాతి కాలంలో దానిలో మార్పు సంభవించవచ్చు. ఈ మార్పును కొన్ని రకాలుగా మనం వింగడించడానికి వీలుంది.

(i) అర్థ సంకోచం (Reduction in Contexts) : ఒక కాలంలో సామాన్యార్థంలో వాడబడే పదం, తర్వాత విశేషార్థంలో రూఢిని పొందడం.

ఉదా॥ 1. కోక > వస్త్ర సామాన్యం (భారతార్థం)
> స్త్రీలు ధరించే వస్త్రం
2. మృగం > జంతు సామాన్యం (వేటాడబడేది)
> జింక
> (మురగ్) — కోడి

(ii) అర్థవ్యాకోచం (Expansion in Contexts) : ఇది అర్థ సంకోచానికి వ్యతిరేక ప్రక్రియ. ఒక కాలంలో విశిష్ట సంకేతంగా వాడబడే పదం తదుపరి, సామాన్య సంకేతంగా మారుతుంది.

1. నూనె > నువ్వుల నూనె
> ఏ నూనె అయినా (సామాన్యవాచి)
2. చెంబు > రాగిపాత్ర
> ఏ పాత్ర అయినా

(iii) అర్థాపాదనం (Alteration of Contexts): ఒక కాలంలో ఒక పదానికి సహజంగా ఉండే సాంకేతికార్థం కాక, తర్వాతి కాలంలో అది వాడబడే సన్నివేశాలను బట్టి అర్థేతరాలు ఆపాదింపబడడం.

ఉదా॥ 1. గవార్ > గ్రామస్థుడు
> మూఢుడు
2. రావణుడు > రామాయణ ప్రతివీరుడు
> దుష్టుడు
3 వయందేవస్య > మంత్రభాగం
> భోజనం

II. ఆలంకారికంగా చెప్పడం వల్లా, పోలికలు పేర్చడం వల్లా, కొన్ని అర్థ పరిణామ భేదాలను వివరించవచ్చు.

(i) ఆలంకారిక ప్రియత్వం :

ఉదా॥ 1. వాడు బట్టపేగవుతున్నడు
(పాలిపోయి అనారోగ్యంగా ఉండడం)

2. ఉప్పు కారం తినని మనిషి (పరమ సాధువు)
3. వాడు సిసింద్రీ (చలాకీ మనిషి)

ఇటువంటి పదబంధాలు వివిధ ప్రదేశాలలో భిన్న భిన్నంగా ఏర్పడి ఆయా మాండలికాలకు భేదక లక్షణాలను ఆపాదించి పెట్టడానికి సమర్థాలవుతున్నాయి.

(ii) మృదూక్తి (Euphemism) : సంఘంలో అధమ స్థానంలో ఉన్నవారిని గురించిగానీ, మనం ఉచ్చరించడానికి వెనుదీసే విషయాలను గురించి గానీ చెప్పవలసి వచ్చినప్పుడు దాన్ని ఆలంకారికంగా, మృదువుగా చెప్పడం జరుగుతుంది.

ఉదా॥ 1. మేతర్ (మహత్తర్) — పాకీ పనివాడు
2. సూత్రం పెరిగిపోయింది — తెగిపోయింది
3. దీపం కొండెక్కింది — ఆరిపోయింది

(iii) వినయోక్తి : ఎదుటివారి పట్ల గౌరవాన్ని ప్రదర్శిస్తూ తన్ను తాను వినయపూర్వకంగా తక్కువ చేసుకునే ప్రయత్నంలో ఏర్పడే పదాలు-

ఉదా॥ 1. బాంచను దొరా !
2. అడియేన్ దాసుణ్ణి !
3. బందెగానె అలీ!

(iv) రూపకోక్తి (Metaphorical Extension) : పోలికలను బట్టి కొన్ని వస్తువుల్ని తెలిసిన వాటితో కలిపి, పదబంధాలను సృష్టించడం జరుగుతున్నది.

1. సీతాఫలం కళ్ళు
2. వాన కాళ్ళు
3. వరి పొట్ట

III అర్థాపకర్ష (Pejorative extension) కొన్ని పదాలకు ఒకప్పుడు సభ్యార్థమే ఉండి ఆ తరువాత దానికి నీచార్థం ఆపాదింపబడుతుంది.

ఉదా॥ 1. ముండ > జుత్తు కత్తిరింపబడిన విధవ
> ఒక తిట్టు
2. తద్దినం > Death Anniversary
> వదిలించుకోవలసిన పీడ
3. కంపు > సువాసన (ఛారతార్థం)
> దుర్వాసన

IV. అర్థోత్కర్ష (Ameliorative extension) : ఇది అర్థాపకర్షకు విరుద్ధమైనది. ఒకప్పుడు నీచార్థముండి, తదుపరి గౌరవార్థంగా మారే పదాలీ విభాగంలోకి రాగలవు.

ఉదా॥ సభికులు

V లోకనిరుక్తి (Folk Etymology) · పదగతమైన ధ్వనులకు సంబంధించినంతవరకూ దీన్ని ధ్వనిపరిణామంలో ఉదాహరించినట్లే, అర్థానికి సంబంధించి అర్థపరిణామంలోనూ ఉదాహరించవలసి వస్తుంది. ఇక్కడ పనిచేసే ముఖ్య లక్షణం సామ్యమే.

ఉదా॥ 1. మాక్స్ ముల్లర్ — మోక్షమూలరు
2. ఆరుద్రకార్తె — ఆరెద్దలకార్తె
3. షితాబ్ ఖాన్ — చిత్తాబ్జఖానుడు

ఈ విధంగా పదాలను, వాటికి నియతాలైన అర్థాల సహాయంతో పరిశీలిస్తే అర్థపరిణామ చరిత్రకు కొంత రూపం ఏర్పడుతున్నది. ఈ భేదాలకు తోడుగా, ఇతోధిక పరిశీలన వలన మరికొన్ని భేదాలను కూడా వీటితోపాటు చేర్చుకోవడానికి వీలుండవచ్చును.

# 13

# వాక్యరచన

సాంప్రదాయికమైన పద్ధతిలో దేన్ని మనం వాక్యమని గానీ, వాక్య భాగమని గానీ పిలుస్తామో దాన్ని ఆధునికులు నిర్మాణం అంటారు. నిర్మాణ మంటే కొన్ని అర్థవంతగల ప్రత్యేక పదాల సమూహం (A construction is any significant group of morphemes). ఒక నిర్మాణానికి సంబంధించిన సమూహం మనకు అవగతం కావలెనంటే ఆ నిర్మాణంలో ఉన్న ప్రతి రెండు పదాల మధ్య ఉండే సంబంధాన్నీ, సాన్నిహిత్యాన్నీ, చక్కగా అవగతం చేసుకో వలసి ఉంటుంది. ఒక నిర్మాణంలో ఇమిడి ఉన్న పదాలను అవయవాలు (Constituents) అంటారు. అవయవాలు కలది గనుక, ఒక నిర్మాణం, అవయవి (Construction) అని పిలువబడుతుంది. దీన్నిబట్టి నిర్మాణ మనేది మొత్తం వాక్యం కావచ్చును లేదా ఒకటికంటే ఎక్కువ అవయవాలు కలిగి సన్నికర్షతో కూడిన వాక్యభాగం కావచ్చును. సన్నికర్ష అంటే, రెండు అవ యవాల మధ్య ఉండే అర్థగతమైన, దృఢమైన సంబంధం, లేదా దగ్గరితనం. ఒక నిర్మాణంలో ఏ రెండు పదాల మధ్యనైనా యీ సన్నికర్ష కనిపిస్తే ఆ రెండు పదాలనూ సన్నిహితావయవాలు (Immediate Constituents) అని పిలుస్తారు. ఇక్కడ సన్నికర్ష అంటే అర్థబోధనా పటిష్ఠమైన గురుతర సంబంధమే కాబట్టి, ఒకవేళ ఒక నిర్మాణంలో, రెండు అవయవాలు, అటువంటి సంబంధం లేకుండా, కేవలం భౌతికంగా దగ్గరగా ఉన్నా అవి సన్నిహితావ యవాలు కావు.

ఉదా॥ బలరాముడూ కృష్ణుడూ వసుదేవుని కొడుకులు - అన్న నిర్మాణంలో, | వసుదేవుని | | కొడుకులు | అనే రెండూ అర్థగతమైన పటిష్ఠ సంబంధం కలిగిన అవయవాలు—ఇవి రెండూ భౌతికంగా కూడా, అనగా నిర్మాణంలో వాటికున్న స్థానాన్నిబట్టి కూడా, సన్నిహితాలే- ఇక్కడ వసుదేవుని యొక్క కొడుకులు అనే సంబంధాన్ని గ్రహించి, వీటిని సన్నిహితావయవాలుగా మనం నిర్ధారించవచ్చును-ఇక, | కృష్ణుడూ | | వసుదేవుని | అనే రెండు అవయవాలూ, నిర్మాణంలో ఉండే స్థానాన్నిబట్టి దగ్గరగా ఉన్నా, ప్రత్యక్షంగా వాటి రెండింటికీ మధ్య అర్థగతమైన పటిష్ఠ సంబంధం లేదు. ఇవి రెండూ ఆ రకంగా సన్నిహితావయవాలు కావు.

ఒక నిర్మాణంలో ఉండే పద ప్రత్యయాల మధ్యా, అవయవాల మధ్యా ఉండే సన్నికర్షను గమనించడం, దానివల్ల అవయవిక విభాగాలను (Constituent classes) గుర్తించడం వలన, ఆభాషకు చెందిన నిర్మాణపరమైన నమూనాలను (Constructional Patterns) నిర్ణయించడానికి వీలుపడుతుంది. అంటే ఒక భాషలో ఉండే వాక్యస్వరూపాన్ని అవగతం చేసుకోవడం జరుగుతుంది. ఆధునిక భాషావేత్తలు ఈ పద్ధతుల వలన భాషకు సంబంధించిన స్థూలమైన చట్రాన్ని (Frame Work) నిర్ణయించగలిగారు వాక్యమనేది యెప్పుడైనా ఈ స్థూల నిర్మాణంలో ఇమిడేదిగా ఉంటుంది.

ఇక తెలుగు వాక్యాన్ని ప్రత్యేకంగా గ్రహిస్తే, ప్రాచీన లక్షణకారులు దీన్ని గురించి వివరంగా చెప్పలేదనవచ్చు. చిన్నయసూరి వాక్య పరిచ్ఛేదాన్ని బాల వ్యాకరణంలో తీర్చలేదు. కాని పదాలకుండే పరస్పర సంబంధాన్ని ఒక విధంగా సమాస పరిచ్ఛేదంలో స్పష్టం చేయడానికి అయన పూనుకొన్నాడు. సమర్థంబులగు పదంబు లేకపదమగుట సమాసమనీ, పృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావము సామర్థ్యమనీ ఆయన వివరించాడు. పదాల మధ్య ఉండవలసిన అర్థ బోధనా పటిష్ఠమైన గురుతర సంబంధాన్నే ఈ వివరణ స్పష్టం చేస్తుంది.

ప్రౌఢ వ్యాకర్త తన వ్యాకరణంలో వాక్య పరిచ్ఛేదాన్ని చేర్చడం జరిగింది. 'వాక్యంబునా యోగ్యతాకాంక్ష సహితంబగు నర్థంబుకల ఆసత్తి యుక్త పద సముదాయము' అని నిర్వచించాడు. ఇక్కడ యోగ్యత అంటే వాక్యంలో ఉండే పదాలకూ, పదగతమైన అర్థాలకూ పరస్పరం వైరుధ్యంలేని సంబంధం ఉండడం. అకాంక్ష అంటే పదగతమైన అర్థాన్ని తెలుసుకోవాలనే శ్రోతల పరమైన అపేక్ష. ఆసత్తి అంటే అర్థబోధ కలిగించేవిధంగా ఒక క్రమమైన పద్ధతిలో పదాలు జతకూడడం. ఈమూడు లక్షణాలూ తప్పని సరిగా వాక్యంలో ఉండాలని ఆయన తీర్మానించాడు. ఆయనే మరొక చోట పదాలకు పరస్పరమూ ఉండే సంబంధాన్ని అన్వయం అని చెప్పడం జరిగింది సారాంశాన్ని సవివరంగా పరిశీలిస్తే ఆధునికులు చెప్పిందీ, సాంప్రదాయికులు చెప్పిందీ ఇంచుమించు ఒకటే. ఈ లక్షణాలు ఒక తెలుగు వాక్యానికే కాక ఏ భాషకు చెందిన వాక్యానికైనా చక్కగా అన్వయించేవిగా ఉంటాయి.

తెలుగు వాక్యాన్ని భాషావేత్తలు నిర్మాణ పరంగా మూడు విభాగాలు చేయడం జరిగింది. అవి 1) సామాన్యవాక్యం, 2) సంశ్లిష్టవాక్యం, 3) సంయుక్త వాక్యం.

1. ఇందులో సామాన్య వాక్యాలు మళ్ళీ రెండు రకాలు.

(i) క్రియారహిత వాక్యాలు.

ఉదా : కృష్ణుడు అల్లరివాడు

(ii) క్రియా సహిత వాక్యాలు

ఉదా : కృష్ణుడు రుక్మిణిని పెళ్ళాడాడు.

(2) సంశ్లిష్టవాక్యాలు ఒకే సమాపక క్రియతోగానీ, క్రియారహితంగా గానీ, ఏర్పడే సామాన్య వాక్యం కంటే భిన్నమైనవి. ఇందులో క్రియా రహిత వాక్యాలు ఉండవు ఇందులో ఒక సమాపక క్రియతో ఏర్పడే ప్రధాన వాక్యంతో సాధారణంగా ఒకటిగానీ అంతకు ఎక్కువగానీ అసమాపక క్రియలతో ఏర్పడే వాక్య భాగాలుకూడా అనుసంధింపబడి ఉంటాయి. అసమాపక క్రియలకు బదులుగా భావనామాలు ఉండడం కూడా మనం చూడవచ్చును

ఉదా॥ కృష్ణుడు అక్రూరుణ్ణి పంపించి, గోపికల్ని ఓదార్చాడు.
(అసమాపక క్రియ)

కృష్ణుడు కంసుణ్ణి చంపటం చేత,జనులకు మేలు కూర్చాడు.
(భావనామం)

అసమాపక క్రియ భావర్థకంతో సమానం. అందువల్ల అసమాపక క్రియలలో కాలాన్ని బట్టి యెన్ని భేదాలను చూపించవచ్చునో, భావ నామాలలో కూడా అన్ని భేదాలనూ మనం చూపించవచ్చును.

సంశ్లిష్ట వాక్యాలలోనే అనుకృతి వాక్యాలనే మరొక ఉపవిభాగం ఉంది. ఇక్కడ అనుకృతి అంటే అర్థం ఒకరు అన్నారని మరొకరు చెప్పే పద్ధతి. ఈ ఒకరు మొదట అన్నవారే కావచ్చును. లేదా మరొకరు కావచ్చును. ఇక్కడ ఒక వాక్యంలో మరో వాక్యం అంతర్గతంగా ఇమిడి ఉంటుంది.

ఉదా॥ ''ఇవ్వాళ రాముడు రానన్నాడు''-

ఇక్కడ, "(నేను) రాను" అన్న వాక్యం, ''రాముడు అన్నాడు'' అనే వాక్యంలో అంతర్గతంగా ఉంది. ఇందులో మొత్తం వాక్యం గర్భివాక్యమైతే, "(నేను) రాను'' అన్నది గర్భవాక్యమౌతుంది. సాధారణంగా ఈ అనుకృతి సంశ్లిష్ట వాక్యాల్లో కనిపిస్తుంది అనుకృతి వాక్యాల నిర్మాణంలో వచ్యర్థాన్నిచ్చే అనుధాతువు క్త్వార్థకరూపం ప్రధాన పాత్ర వహిస్తుంది.

ఉదా॥ కుక్క భౌభౌ అన్నది.

కుక్క భౌభౌ మని అన్నది అని విశ్లేషిస్తే, అనుకృతి వాక్యమే అవుతుంది. కాని ఇక్కడ మాత్రం 'అని' ని అనుధాతువు యొక్క క్త్వార్థక

రూపంగా గ్రహించడం సబబు కాదు కేవలం అనుకరణకోసం వాడిన ఒక అవ్యయంగా గ్రహించడం సముచితం.

(3) సామాన్య సంశ్లిష్టవాక్యాలు కాక సంయుక్త వాక్యాలనే విభజనను చాలామంది భాషావేత్తలు తెలుగులో చేయడం జరిగింది. నిజానికి సంయుక్త వాక్యమనేది నిర్మాణపరంగా, సామాన్య, సంశ్లిష్ట వాక్య నిర్మాణాల కంటే భిన్నమైన నిర్మాణం కలిగింది కాదు. నిర్మాణదృష్ట్యా ఇది సామాన్య వాక్యాల సంయోజనం కానీ, సంశ్లిష్టవాక్యాల సంయోజనం కానీ అవుతుంది.

ఇంగ్లీషులో ఉన్న సంయుక్త వాక్య నిర్మాణం వంటిది తెలుగులో లేదు. అందుకే అక్కడి సంయుక్త వాక్యాలను తెలుగులోనికి యథాతథంగా అనువదిస్తే ఆ తెలుగు కృతకమైన అనువాదపు తెలుగులాగా మనకు తెలిసి పోతుంది.

ఉదా॥ Rama went to the forest and killed Ravana. దీనికి యథానువాదం- రాముడు అరణ్యమునకు వెళ్ళెను మరియు రావణుని చంపెను

ఇది తెలుగుభాషకు కృతకమైనది. దీన్ని తెలుగులోనికి తేవలసివచ్చి నప్పుడు రాముడు అరణ్యమునకు వెళ్ళి (లేదా వెళ్ళిన తరువాత) రావణుని చంపెను అని సంశ్లిష్టవాక్యంగానే నిర్మించవలసి ఉంటుంది. అట్లాకాక, రాముడు అరణ్యమునకు వెళ్ళెను. రావణుని చంపెను. అని రెండు సామాన్య వాక్యాలు చేస్తే ఆ రెండింటికీ మధ్య ఉండవలసిన సంబంధం, అనగా వెళ్ళిన తరువాత అనే అర్థస్ఫూర్తి బలంగా కనిపించదు.

ఇంతకూ సంయుక్తవాక్యాన్ని వివరించబూనుకుంటే, యీ రకంగా చెప్పవచ్చును. తనలో ఇమిడిఉన్న పదసంయోజనాన్ని ఒకే రకమైన కొన్ని వాక్యాలుగా విడగొట్టడానికి వీలు కలిగించే వాక్యమే సంయుక్తవాక్యం.

ఉదా॥ బలరాముడు, కృష్ణుడు వసుదేవుని కొడుకులు. ఈ వాక్యాన్ని

(1) బలరాముడు వసుదేవుని కొడుకు.

(2) కృష్ణుడు వసుదేవుని కొడుకు.

అని రెండు క్రియారహితాలయిన సామాన్యవాక్యాలుగా విభజించవచ్చును. అట్లా విభజించడానికి అనువైన పదసంయోజనం ఈ వాక్యంలో ఉంది. (1) ఇందులో ఉన్న సమప్రాధాన్యం కల కర్తృపదాల సంఖ్యనుబట్టి వాక్యాలు ఏర్పడడం జరిగింది. అదే విధంగా (2) కర్మస్థానంలో ఉన్న పదాల సంఖ్యనుబట్టి కూడా కొన్ని వాక్యాలుగా ఒక సంయుక్తవాక్యాన్ని విడగొట్టవచ్చును.

ఉదా॥ కృష్ణుడు శిశుపాల దంత వక్త్రులను చంపెను.

(1) కృష్ణుడు శిశుపాలుని చంపెను.

(2) కృష్ణుడు దంతవక్త్రుని చంపెను.

(3) ఇందులో ఉండే అసమాపక క్రియల సంఖ్యను బట్టి కూడా వాక్యసంఖ్య నిర్ణయింపబడవచ్చు

ఉదా॥ కృష్ణుడు శ్యమంతకమణిని తెచ్చి, సత్రాజిత్తు అనుమతి పొంది సత్యభామను గ్రహించెను- ఇందులోని భిన్న వాక్యాలిలా ఉంటాయి.

(1) కృష్ణుడు శ్యమంతకమణిని తెచ్చి సత్యభామను గ్రహించెను.

(2) కృష్ణుడు సత్రాజిత్తు అనుమతిని పొంది సత్యభామను గ్రహించెను.

(4) ఇందులో ఉండే భావనామాల సంఖ్యను బట్టి కూడా వాక్య సంఖ్యను నిర్ణయించవచ్చును.

ఉదా॥ నేను వెళ్ళేసరికి, వాడు రావడం పోవడం జరిగింది.

(1) నేను వెళ్ళేసరికి వాడు రావడం జరిగింది.

(2) నేను వెళ్ళేసరికి వాడు పోవడం జరిగింది.

ఇక సంయుక్త వాక్యాన్ని నిర్మాణాన్ని బట్టి చూస్తే, అది సామాన్య వాక్య నిర్మాణాన్ని గానీ, సంశ్లిష్ట వాక్య నిర్మాణాన్ని గానీ కలిగి ఉంటుంది.

ఉదా॥ తల్లీ పిల్లలూ కులాసాగా ఉన్నారు.

ఈ వాక్యాన్ని విడగొడితే-

(1) తల్లి కులాసాగా ఉంది.

(2) పిల్లలు కులాసాగా ఉన్నారు.

అనే క్రియా సహితాలయిన రెండు సామాన్య వాక్యాలు ఏర్పడుతున్నవి. అదే విధంగా-

ఉదా॥ పంతులుగారూ విద్యార్థులూ విజ్ఞానయాత్ర చేసి నిన్ననే వచ్చారు" అన్న వాక్యాన్ని విడగొడితే-

(1) పంతులుగారు విజ్ఞాన యాత్ర చేసి నిన్ననే వచ్చారు.

(2) విద్యార్థులు విజ్ఞాన యాత్ర చేసి నిన్ననే వచ్చారు.

అనే క్రియాసహితాలయిన రెండు సంశ్లిష్ట వాక్యాలు ఏర్పడుతున్నవి. దీనినిబట్టి, సామాన్య సంశ్లిష్ట వావ్యాలకూ, సంయుక్త వాక్యానికీ నిర్మాణ దృష్ట్యా తేడా లేదు. ఇందులోనుండి విడివడే వాక్యాల సంఖ్య, ఇందులోని కర్తృ, కర్మ, అసమాపక క్రియ, భావనామాదికాల సంఖ్యనుబట్టి వేరువేరుగా నిర్ణయింపబడుతుంది ఈ సంయుక్త వాక్యంలో వాక్యాల సంయుక్తత్వాన్ని

ఆయా పదాలకు చేర్చిన ఊ, ఓ, ఈ, అ వంటి స్వర వైశిష్ట్యం కూడా సూచించ వచ్చును.

ఉదా॥ (1) వనానికి రాముడూ లక్ష్మణుడూ వెళ్ళారు.
(2) ఇది మన మంచికో చెడుకో వచ్చింది.
(3) ఇక్కడ కలిమీ లేమీ భేదాలు లేవు.
(4) ఇదింతకూ జరిగేదా, ఒరిగేదా!

ఈ స్వరాలు, వాక్యాన్ని విడగొట్టే సామర్థ్యం కలిగిన ఆయా పదాలకు అనుబంధింపబడడం జరుగుతుంది.

ఇంతకుమించి, అయితే, తర్వాత, ఇంకా, కాని వంటి అవ్యయాల్ని చేర్చి, వాటికి వెనకా ముందూ ఏర్పడిన వాక్యాలను కలిపి, సంయుక్త వాక్యాలనడం ఉంది. ఇటువంటిచోట్ల సంయుక్త వాక్యానికీ, సామాన్య సంశ్లిష్ట వాక్యాలకూ తేడా చూపించడానికి పెద్దగా వీలుండదు.

ఉదా॥ సుందరమ్మ ఇవ్వాళ ఊరికి వెళ్ళాల్సింది. కాని వాళ్ళన్న ఒప్పుకోలేదు.

ఇది చూడడానికి సంయుక్త వాక్యంలాగా భ్రమింపచేస్తున్నా నిర్మాణాన్నిబట్టి యిది సంశ్లిష్టవాక్యమే. తెలుగులో నిర్మాణపరమైన వాక్యభేదాలివి.

కాగా, వాక్యం అందించే అర్థవైవిధ్యాన్ని బట్టి (1) ప్రశ్నార్థక (2) నిషేధార్థక (3) సందేహార్థక (4) ఆశ్చర్యార్థక (5) విధ్యర్థకాలుగా దాన్ని విభజింపవచ్చును. ఇవి నిర్మాణపరంగా సామాన్య సంశ్లిష్ట,సంయుక్త వాక్యాలలో ఏ ఒకటైనా కావచ్చును.

వాక్యంలో ప్రముఖ స్థానాన్ని వహించే ఉద్దేశ్యాన్నిబట్టి, మళ్ళీ ఒక వాక్యం (1) స్వార్థ (Reflexive) (2) ప్రేరణ (Causative) (3) కర్మణి (Passive) వాక్యాలుగా మూడు విభాగాలకు లొంగవచ్చును.

కర్మణి వాక్యాలు తెలుగు భాషకు పూర్తిగా ఎరువు వాక్యాలు కాకపోయినా, తెలుగులో, అందునా ముఖ్యంగా ప్రాచీనాంధ్రంలో వీటి ప్రయోగాలు సంస్కృతి ప్రభావం వలన ప్రవేశించినవే, ప్రాచీన శాసన భాషలో గానీ, కావ్య భాషలో గానీ ఈ రకపు వాక్యాలు కనిపిస్తవి. వ్యవహార భాషలో వీటి ఉపయోగం చాలా తక్కువ. ఈ వాక్యాల నిర్మాణంలో, (1) క్రియ సకర్మకమైనది కావడం (2) దానికి 'పడు' అనుబంధంగా చేరడం (3) వాక్యంలో ఉద్దేశ్య భాగంలో కర్మకు ప్రాధాన్యం ఉండడం ముఖ్య లక్షణాలుగా కనిపిస్తవి.

సంస్కృతం ఇటువంటి కర్మణి వాక్యోపయోగాన్ని తెలుగుకు నేర్పినట్లే యత్, తత్ ప్రయోగం చేసే సంబంధ బోధక వాక్య ప్రయోగాన్ని కూడా నేర్పింది. ప్రాచీన శాసనాలలో ఇటువంటి వాక్యరచన అక్కడక్కడా కనిపిస్తుంది. నన్నయ తన భారతంలో ఇటువంటి వాక్యాలను విరివిగా వాడుకున్నాడు. ఈ రకమైన సంబంధ బోధక వాక్యాలు తెలుగుభాషకు సహజమైనవి కాకపోవడం వలన, వ్యవహారంలో వీటి అస్తిత్వం చాలా తక్కువ. సంబంధబోధకతను సూచించడానికి క్రియాజన్య విశేషణాలను ఉపయోగించడమే తెలుగుభాషకు జాత్యమైన లక్షణం.

ఉదా॥ ''ఎవడు గంగ ఒడ్డున గోవును చంపెనో వాడు నరకమున పడును.''

''గంగ ఒడ్డున గోవును చంపినవాడు నరకమున పడును.''

ఈ రెండు వాక్యాలలో మొదటిది యత్తదర్థాన్నిచ్చే సర్వనామాల వాడుకతో కూడిన వాక్యం. రెండవది, ధాతుజ విశేషణం వాడిన రూపం. సంస్కృత ప్రభావం వలన తెలుగులోనికి వచ్చి, ప్రాచీన భాషలో విరివిగా వాడబడిన రెండు రకాల వాక్యాలూ, (1) కర్మణి వాక్యాలు (2) సంబంధ బోధక వాక్యాలు.

ఈ విధంగా తెలుగు వాక్య నిర్మాణం విస్తృత పరిధిని కలిగి, అర్థ బోధక శక్తిని కలిగి ఉన్నది.

14

# తెలుగు వ్యాకరణాలు – సంస్కృత ప్రభావం

తెలుగు భాషకు మొదట కనిపించిన వ్యాకరణ గ్రంథం సంస్కృతంలో ఉంది. అది ఆంధ్రశబ్దచింతామణి. ఆంధ్రశబ్దచింతామణికారుడు, అధర్వణ కారికావళి కర్తా తెలుగు వ్యాకరణానికి పాణిని, వరరుచి వంటి వాళ్ళు ఈ రెండు గ్రంథాలనూ జతచేసి వివరణాత్మకంగా వ్రాసిన మరొక వ్యాఖ్యాస గ్రంథం అహోబలపండితీయం. తర్వాత ఈ మూడింటి అడుగుజాడల్లో పడి తెలుగులో అర్వాచీనాలయిన అనేక వ్యాకరణ గ్రంథాలు వెలిశాయి.

తెలుగు వ్యాకరణాల మీద సంస్కృత ప్రభావాన్ని అంచనా వేయ డానికి మొదటి కొలమానం కొన్ని తెలుగు వ్యాకరణాలు సంస్కృతంలో రచింప బడడం. తర్వాత (1) వ్యాకరణ రచనా ప్రణాళికను సిద్ధం చేసుకోవడంలోనూ (2) పారిభాషిక పదాలను స్వీకరించడంలోనూ (3) సూత్ర రచనకు అవసరమైన విషయాన్ని గ్రహించడంలోనూ మనకు తెలుగు మీద సంస్కృత వ్యాకరణ ధోరణి ఎంత ప్రభావాన్ని చూపిస్తున్నదో స్పష్టంగా తెలిసివస్తుంది. సంస్కృత వ్యాకరణ శాస్త్రంతో పరిచయం లేనిదే ప్రాచీన భాషకు సంబంధించిన తెలుగు వ్యాకరణాన్ని అర్థం చేసుకోవడం కష్టం.

1. వ్యాకరణ రచనా ప్రణాళిక : చింతామణి పాణినీయపద్ధతి ననుసరించే సంజ్ఞ, సంధి, అజంత, హలంత, క్రియా పరిచ్ఛేదాలను తీర్చింది. ఇందులో సూత్రాలను వ్రాయడం వరకే కనిపిస్తుంది గాని, వాటికి క్లుప్తమైన వివరణగానీ, వ్యాఖ్యగానీ ఉండదు. వ్యాకరణవేత్త కోరుకునే లాఘవం పాణినీయంలో వలె ఇక్కడా ప్రముఖంగా కనిపిస్తుంది. తెలుగు వ్యాకరణానికి నప్పని అంశాలను గూడా, కేవలం సంస్కృతంలో ప్రణాళికా బద్ధంగా ఉండడం వల్ల మాత్రమే, తెలుగు వ్యాకరణాల లోనికి చొప్పించడం జరిగింది. దానికి మిక్కిలి బలమైన ఉదాహరణ విభక్తి ప్రణాళిక. సంస్కృతంలో కర్తృ, కర్మ, కరణ, సంప్ర దాన, అపాదాన, అధికరణ కారకాలుగా చెప్పబడిన విభక్తి ప్రణాళిక తెలుగు లోనికి యథాతథంగా ప్రవేశించింది. షడ్విధమైన ఈ విభజన నిజానికి తెలుగు వ్యాకరణంలో ఇమిడేది కాదు. అదే విధంగా సంస్కృతంలోని దశవిధ లకారా లను దృష్టిలో ఉంచుకుని తెలుగు వ్యాకరణాలలో వాటిని ప్రవేశ పెట్టడం కూడా

అసహజమైనదే. వ్యాకరణ సౌలభ్యంకోసం పదాలకు లేని అంశాలను ఆగమా దేశాలుగా విధించి, తర్వాత అవి లోపించినట్లుగా చెప్పడం కూడా సంస్కృత మర్యాద ననుసరించి తెలుగులో సిద్ధమైనదే.

2. పారిభాషిక పదాలు : తెలుగు వ్యాకరణం ఈ విషయంలో పూర్తిగా సంస్కృతానికి లోబడి ఉంటుంది. (1) ప్రత్యాహార సంజ్ఞల్ని (అచ్, హల్, ముజ్జు మొదలైనవి) (2) ఇత్సంజ్ఞల్ని గ్రహించడం (టిత్, కిత్, యట్, నుక్ వంటివి) (3) సంస్కృతంలో లేని పారిభాషికపదాల్ని సృష్టించవలసి వచ్చినప్పుడు, దేశ్యపదాల్ని ఏరుకోకుండా, సంస్కృత పారిభాషిక పదాల పద్ధతినే అనుసరించడం (ముత్తు, ద్రుతం, తద్ధర్మం మొదలైనవి) (4) వివరణ ఇవ్వకుండానే ఎన్నో సంజ్ఞల్ని తెలుగు వ్యాకరణాలలో జొప్పించడం (5) ఆకృతి గణాలంటూ కల్పించి, దేశ్యపదాలను సంస్కృతపదాల స్థాయిలో వాడడం (ఏమి, మఱి, కిషష్ఠి, ఆది, అవి, ఏది, ఏవి- ఇది ఆకృతి గణంబు). ఇవన్నీ మనం ఈ సందర్భంలో పరిశీలించగలిగిన అంశాలు.

సోదరభాష అయిన తమిళం ఉయిర్ (అచ్చు), మెయి (హల్లు) వంటి దేశ్యపదాలను ఎన్నుకుని, ప్రచారంలోనికి తీసుకుని రాగా, తెలుగుమాత్రం అచ్చు, హల్లు వంటి ప్రత్యాహార సంజ్ఞల్ని గ్రహించింది. స్వరం, వ్యంజనం, క్రియ, అవ్యయం, విశేష్యం, విశేషణం వంటి తత్సమ పదాలను గ్రహించింది. ఇత్సంజ్ఞల్ని ధారాళంగా వాడుకుంది. తెలుగు వ్యాకరణానికి అవసరమై, సంస్కృతానికి అవసరం లేని ద్రుతం, ద్రుతప్రకృతికం, కళ, తద్ధర్మం, మహతీవాచకం, ఔపవిభక్తికం వంటి యెన్నో సంజ్ఞలకు సంస్కృతభాషలోనే పేర్లను స్థిరం చేసింది. కాని దేశ్యపదాలను ఎంచుకుని తమిళం చేసినట్లుగా పరిభాషను తయారు చేసుకోలేదు. సంస్కృత వ్యాకరణం తెలిసినవాడే తెలుగు వ్యాకరణాన్ని కూడా అధ్యయనం చేస్తాడనే నిశ్చితోహ వల్ల కాబోలు తెలుగు వ్యాకరణకారుడు చాలా పారిభాషిక పదాలకు వివరణ ఇచ్చే పనికి పూనుకోలేదు.

సూత్రరచనలో కూడా సంస్కృత వ్యాకర్తలు పాటించిన లాఘవాన్నే తెలుగు వ్యాకర్తలు పాటించడానికి పూనుకున్నారు. సంస్కృతంలో పాణినీయ సూత్రాల మాదిరిగా రచనలో బిగువునూ లాఘవాన్నీ కలిగిన సూత్రాలుగా చాల వ్యాకరణ సూత్రాలను చెప్పవచ్చు.

చిన్నయసూరి ప్రత్యాహార సంజ్ఞల్నీ, ఇత్సంజ్ఞల్నీ ధారాళంగా వాడుకున్నాడు. సూత్రాలలో నిపాత సూత్రాలను (కద్రువ నాగమాత- వేధ పురోధ

పురోధసుడు మొ॥) ప్రవేశపెట్టాడు. వీలున్న చోట్ల పాణిని సూత్రాలను యథాతథంగా అనువదించి గ్రహించాడు (ప్రథమేతర విభక్తి విధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని) కొన్ని కొత్త సంజ్ఞల్ని తానై కల్పించినా వాటిని సంస్కృత వ్యాకరణ చ్ఛాయల్లోనే సృష్టించుకున్నాడు (డుమంతము, ముజ్జు, ముత్తు, త్రికము). తెలుగు వ్యాకరణాలలోని ఎన్నో అంశాలను నిశితంగా పరిశీలిస్తే రచనా ప్రణాళిక, పారిభాషిక పదాలు, సూత్రరచన వంటి అనేక అంశాలలో సంస్కృత వ్యాకరణాపేక్షలేని తొలినాటి తెలుగు వ్యాకరణాలు లేవని గ్రహించవచ్చు. అనగా తెలుగు వ్యాకరణాన్ని ప్రాచీనుల లక్షణ గ్రంథాలని చదివి అర్థం చేసుకోవాలంటే, ఒక వ్యక్తి తప్పనిసరిగా సంస్కృత వ్యాకరణ సంప్రదాయం ఎరిగినవాడై ఉండక తప్పదు.

ప్రాచీన కావ్యభాషలోనికి సంస్కృత పదజాలం ఎంత ముమ్మరంగా చొచ్చుకుని రావడం జరిగిందో, అంతే ఉద్ధృతంగా తెలుగు వ్యాకరణ సీమను కూడా సంస్కృత వ్యాకరణ మర్యాద నిశ్శేషంగా ఆక్రమించుకున్నది.

## 15

# ద్రావిడ భాషలు – తెలుగుకు గల స్థానం

ప్రపంచ భాషల నన్నిటినీ భాషావేత్తలు కొన్ని కుటుంబాలుగా విభజించడం జరిగింది. అందులో ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషల సంఖ్య ఇరవై రెండు.

ద్రావిడ భాషలు ప్రధానంగా దక్షిణ భారతదేశమంతటా వ్యాపించి ఉన్నాయి. తమిళ, మలయాళ, కర్నాట, ఆంధ్రదేశాలలో మాట్లాడే భాషలు ఈ కుటుంబానికి చెందినవి. తమిళం దక్షిణభారతంలోనే కాక, శ్రీలంకలోని ఉత్తరార్ధంలో కూడా వాడుకలో ఉంది. ఇక ఉత్తర భారతదేశంలో ఒరిస్సా, బీహార్ రాష్ట్రాలలోనూ, మధ్యప్రదేశ్‌లోనూ ఈ భాషలు మాట్లాడే వారున్నారు. మరీ ఉత్తరంలో, బ్రాహుయీ జాతివారు మాట్లాడే భాష ఈ కుటుంబానికి చెందిందే. ఇది పాకిస్థాన్‌లో ఉంది. అట్లాగే ఆఫ్ఘనిస్థాన్, నేపాల్, ఇరాన్ మొదలైన ఇతర దేశాలలో మరికొన్ని ద్రావిడ భాషలు ఉన్నట్లుగా ఇటీవలి పరిశోధనల వల్ల తెలుస్తున్నది.

ఈ భాషల్ని మూడు విభాగాలు చేయవచ్చని వెనుక ప్రకరణంలో చెప్పుకున్నాం (ప్రకరణం ఆరు).

ఈ కుటుంబానికి చెందిన ఇరవై రెండు భాషల్లో లిపి కలిగి, సంప్రదాయ సాహిత్య స్థితి కలిగిన భాషలు ముఖ్యంగా నాలుగు. అవి (1) తమిళం (2) మలయాళం (3) కన్నడం (4) తెలుగు.

తమిళభాష ఈ నాలుగు భాషల్లో అతి ప్రాచీనమైన సాహిత్యం కలిగిన భాష. ఈ భాష మాట్లాడేవారు దాదాపు 5 కోట్లు. క్రీ.శ. తొలి శతాబ్దంలోనే తమిళులకు తొలి వ్యాకరణగ్రంథం ఏర్పడ్డది అదే తొల్కాప్పియం. క్రీస్తుశకం ఒకటి, మూడు శతాబ్దుల మధ్య ప్రాభవం గడించిన సంఘ సాహిత్యం తమిళ సాహిత్య వైభవాన్నీ రీతుల్నీ చాటిచెప్తుంది. ఈ భాషలో ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన మౌలికరూపాలు ఎక్కువగా దొరకడానికి అవకాశం ఉంది. ఇది సంస్కృత భాషా ప్రభావానికి ఎక్కువగా లోబడకుండా స్వయం వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకున్న భాష. మూలద్రావిడంలో భాషాధ్వనులుగా పునర్నిర్మింపబడినవి కొన్ని తమిళంలో వర్ణత్వాన్ని పొంది కనిపిస్తున్నాయి.

మలయాళం క్రీ. శ. 5వ శతాబ్దివరకూ తమిళానికి మాండలికంగా ఉన్న భాషగా కొందరు వర్ణిస్తారు. ఈ భాష మాట్లాడే జనుల సంఖ్య దాదాపు 3 కోట్లు. 13 వ శతాబ్దంలో తొలికావ్యం ''రామచరితమ్'' జనించింది. తమిళ భాషకు భిన్నంగా, ఈ భాషమీద సంస్కృత ప్రభావం అధికంగా ప్రసరించింది తెలుగులో పాల్కురికి సోమనాథాదులు ఎంత ప్రయత్నించినా జనాదరణ పొందని మణిప్రవాళ శైలి ఈ భాషలో మిక్కిలి ప్రాచుర్యాన్ని పొందగలిగింది. మూలద్రావిడానికి చెందిన భాషాధ్వనులు ఈ భాషలో అస్తిత్వాన్ని సంపాదించుకుని వర్ణాలుగా స్థిరపడ్డాయి. అవి, (1) ఱ, ఴ, న ఌ.

కన్నడం : కర్ణాటక రాష్ట్రంలో వ్యవహరింపబడే యీ భాషలో సాహిత్యం క్రీ శ. తొమ్మిదవ శతాబ్దం నుండీ ఆరంభమైంది. ఇక్కడి తొలి గ్రంథం శివకోటాచార్యుడు రచించిన 'వడ్డారాధన' అని కొందరు అంటారు. ప్రాచుర్యం వహించిన మొదటి గ్రంథం నృపతుంగుని కవి రాజమార్గం ఇది లక్షణగ్రంథం. పదవ శతాబ్దంలో కవిత్రయమని ప్రసిద్ధికెక్కిన పంప, రన్న, పొన్న అనే ముగ్గురు కవులు కావ్యరచన చేశారు. ఈ భాష కూడా సంస్కృత ప్రభావాన్ని అధికంగా పొందిన భాషే. ఈ భాష మాట్లాడే వాళ్ళు దాదాపు 4 కోట్లు ఈ భాషలో, ప్రాచీన దశలో, మూల ద్రావిడానికి చెందిన భాషా ధ్వని ఱ వర్ణం మాత్రం, వర్ణంగా కనిపిస్తుంది.

పై మూడు భాషలూ దక్షిణ ద్రావిడ విభాగానికి చెందిన భాషలు.

తెలుగు · ఇది వ్యాప్తి చెందిన స్థలాన్ని బట్టి దక్షిణ ద్రావిడానికి సంబంధించిందిగా గుర్తించవలసి ఉంటుంది కాని నిర్మాణ దృష్ట్యా ఇది మధ్య ద్రావిడ విభాగానికి చెందిన భాష. దీని వ్యాప్తి రెండు లక్షల డెబ్బై యేడువేల చదరపు కిలోమీటర్ల వైశాల్యం (ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో). ఇంతేకాక రాష్ట్రేతర ప్రాంతాలలో కూడా ఇది వ్యాపించి ఉంది. ఈ భాషకు ఒరియా, హిందీ, కన్నడ, తమిళ, మహారాష్ట్ర భాషలు పొరుగు భాషలుగా ఉన్నాయి. మొత్తం దేశ వ్యాప్తంగా ఉన్న లెక్కల్ని బట్టి చూస్తే, హిందీ తరువాత ఎక్కువ మంది భారతీయులు మాట్లాడే భాష తెలుగే

ఈ భాష మీద కూడా సంస్కృత ప్రభావం అధికమే. చాలా రోజుల వరకు ఈ భాష సంస్కృత జన్యమనే అభిప్రాయం విజ్ఞులలో ఉండేది. ఎల్లిస్, బిషప్ కాల్డ్వెల్ అనే పాశ్చాత్యులు ఈ భాషల్ని అధ్యయనం చేసి, తెలుగును ద్రావిడ కుటుంబానికి చెందిన భాషగా సిద్ధాంతీకరించారు. అప్పటినుండీ, ఆ అభిప్రాయానికి బలాన్నిస్తూ ఎందరో దేశీయ, విదేశీయ భాషావేత్తలు, తర్జన భర్జనలు చేసి ఆ విషయాన్ని స్థిరీకరించారు.

ఈ భాషలో 11 వ శతాబ్దంలో సాహిత్యం నన్నయభట్టుచేత ఆరంభించ బడిన విషయం అందరికీ తెలుసు. అంతకుముందు శాసనాలలో రూపు దిద్దుకున్న తెలుగు భాష స్వరూపాన్ని గురించి వెనుక ప్రకరణాలలో గ్రహించడం జరిగింది.

మధ్యద్రావిడానికి చెందిన పన్నెండు భాషలలోనూ తెలుగు భాషదే నాయకస్థానం ఆ భాషలలో ఇదొక్కటే సాహిత్య స్థితిని చెందిన భాష.

తెలుగు మధ్యద్రావిడంగా ఎందుకు గుర్తింపబడిందో (1) వర్ణ పరంగా (2) సంధిపరంగా విశ్లేషించి గుర్తించవచ్చును.

1 వర్ణస్థితి

మూలద్రావిడ వర్ణాలు ఒక క్రమ పరిణామానికి లోబడి తెలుగులోనికి ఏ వర్ణాలుగా ఆవిష్కరింపబడ్డాయో ఆరవ ప్రకరణంలో వివరించడం జరిగింది.

(1) వర్ణ వ్యత్యయమనే ధ్వని మార్పు తెలుగు, పెంగొ, మండ, కుయి, కువి, గోండీ, కొండ భాషలలో కనబడుతుంది. ఈ మార్పు ఈ భాషలన్నీ ఏకభాషగా ఉన్న కాలంలో జరిగి ఉంటుంది.

మూల ద్రావిడభాషలోని, ఇ, ఉ లు తెలుగులో వాటికి అకారం పరంగా ఉన్నట్లైతే, ఎ ఒ లుగా మారడం జరుగుతుంది. ఇలా మారిన తరువాతనే వర్ణ వ్యత్యయం జరిగింది.

(2) తాలవ్యీకరణమనే ధ్వని మార్పు దక్షిణ ద్రావిడ భాషలైన తమిళ మలయాళాల్లోనూ, మధ్యద్రావిడంగా మనం భావించే తెలుగులో కూడా జరిగింది. తాలవ్యీకరణమంటే ఇ ఈ ఎ ఏ లతో కూడి ఉండే పదాది క కారం, చ కారంగా మారడం. అయితే మూలద్రావిడంలో తాలవ్యాచ్చు తరువాత మూర్ధన్యాక్షరం ఉంటే తమిళ మలయాళాల్లో తాలవ్యీకరణం జరగదు. తెలుగులో జరుగుతుంది (తమిళం-కిళి; తెలుగు-చిలుక — మూలద్రావిడం-కిళి 1318).

అంతేకాక, మూలద్రావిడంలోని *అయ్ నుండి వచ్చిన ఏకారంతో కూడుకుని ఉన్న కకారం తెలుగులో చకారంగా మారుతుంది (తెలుగు-చేయి < మూలద్రావిడం-కై 1628). తమిళం మలయాళాలలో కకారంగానే ఉంటుంది (కై).

ఈ రెండు భేదాలవల్లా, తమిళ మలయాళ భాషలలోని తాలవ్యీకరణం తెలుగు తాలవ్యీకరణం కంటే భిన్నమైనది. అందువలన తెలుగు దక్షిణ ద్రావిడ విభాగానికి చెందింది కాదని చెప్పవచ్చు.

2. ప్రత్యయ స్వరూపం

(1) తెలుగు, మిగిలిన మధ్యద్రావిడ భాషలలో బహువచన ప్రత్యయం నిత్యం. అంటే బహుత్వాన్ని చెప్పవలసి వచ్చినప్పుడు బహు వచన ప్రత్యయాన్ని తప్పక వాడవలసి ఉంటుంది కాని, దక్షిణద్రావిడ

భాషలలో బహువచన ప్రత్యయం వాడకుండా బహువచనార్థాన్ని సాధించ వచ్చు (తమిళ-ఇరంటు మరం; కన్నడ-ఎరడు మర). తెలుగులో రెండు చెట్టు అనడానికి వీలులేదు—ఉత్తర ద్రావిడభాషల్లో కూడా ఈ ప్రత్యయం వాడుక నిత్య మైంది కాదు. అందువల్ల, దక్షిణ, ఉత్తర ద్రావిడ భాషల్లో నిత్యం కాని బహు వచన ప్రత్యయం యొక్క వాడుక మధ్య ద్రావిడంలో నిత్యం. అది తెలుగులో కనిపిస్తుంది కాబట్టి తెలుగును మధ్యద్రావిడ కుటుంబానికి చెందిన భాషగా నిర్ధా రించవచ్చు.

(2) మహదేక వచన సర్వనామం . మూలద్రావిడంలో అవన్ట్ అనే రూపం దక్షిణ ద్రావిడంలో అవన్ గానూ, మధ్య ద్రావిడంలో అవన్ట్‌గానూ ఉండి వర్ణవ్యత్యయం వల్ల వాన్ట్ > వాండు > వాఁడు అనే రూపాన్ని తెలుగులో పొందింది. ఈ పరిణామం తెలుగులోనూ, ఇతర మధ్య ద్రావిడ భాషల్లోనూ జరిగింది. అందువల్ల తెలుగు మధ్య ద్రావిడ కుటుంబానికి చెందిన భాష

(3) భవిష్యత్సూచక ప్రత్యయాలు దక్షిణ ద్రావిడ భాషల్లో ఇవి పకార, వకారాలు. మధ్య ద్రావిడ భాషల్లో తకార, దకారాలు. తెలుగులో కూడా భవిష్యత్సూచక ప్రత్యయాలు తకార, దకారాలే. (పోవుదురు; చూతురు). అందు వలన తెలుగు మధ్య ద్రావిడ భాషా కుటుంబానికి చెందింది

(4) వ్యతిరేక ప్రత్యయం తెలుగులో 'అ' వ్యతిరేక ప్రత్యయంగా అన్ని పురుషలలోనూ క్రియా ప్రత్యయాల ముందు ఉంటుంది. దక్షిణ ద్రావిడ భాషల్లో, కేవలం అమహదేక బహువచనాల ముందు మాత్రమే ఉంటుంది. మిగి లిన మధ్య ద్రావిడ భాషలు కూడా తెలుగుకు మల్లే అన్ని పురుషలలోనూ క్రియా ప్రత్యయాల ముందు ఉంటుంది. కాబట్టి తెలుగు మధ్య ద్రావిడ భాష.

(5) క్త్వార్థక రూపం మధ్య ద్రావిడ భాషలన్నిటిలో భూతకాలికా సమాపక క్రియా ప్రత్యయాలు, ఇ, సి, చి అనే మూడు. తెలుగులో ప్రముఖంగా /ఇ/ భూతకాలికాసమాపక ప్రత్యయంగా కనిపించినా, వచ్చి, చూచి, చేసి, నిల్చి వంటి రూపాలలో కనిపించే సి/చి లు నిజానికి భూతకాలికాసమాపక ప్రత్యయాలు అనుచిత విభాగం వలన దీన్ని వ్యాకర్తలు /ఇ/ గా గుర్తించారు. సి/చి లు మధ్య ద్రావిడ భాషల్లో కనిపిస్తుండడం వలన తెలుగు మధ్య ద్రావిడ కుటుంబానికి చెందిందే అని నిర్ధారించవచ్చు.

ఈ రకంగా ఇంకా కొన్ని దృష్టాంతాలను చూపించవచ్చు.

ఇంతకూ ఈ పాఠ్య సారాంశమేమిటంటే తెలుగు, నిర్మాణపరంగా మధ్య ద్రావిడోప కుటుంబానికి చెందిన భాష అని నిర్ణయించగలగడం.

# 16

# ద్రావిడ పద వ్యాప్తి, వ్యుత్పత్తి

ద్రావిడులు, ద్రావిడభాషలు అనే పదాలు ఈనాడు వ్యవహార ప్రసిద్ధమైనాయి. ఈ ద్రావిడ పదవ్యాప్తిని పరిశీలిస్తే ఈ పదం జాతిపరంగాను, దేశపరంగాను, భాషాపరంగాను కూడ ప్రాచీనకాలం నుంచి కనిపిస్తున్నట్లు తెలుస్తుంది.

మనుస్మృతిలోని పదవ అధ్యాయంలో పతితజాతి క్షత్రియులలో పౌండ్రక, ఓడ్ర, కాంభోజ, యవన, శక, పారద, పహ్లవ, దరదులతోపాటు ద్రవిడ శబ్దం జాతిపరంగా ప్రయుక్తమైంది. రాబర్ట్ కాల్డ్వెల్ తన తులనాత్మక వ్యాకరణంలో ఇట్లా రాశాడు: Manu says (X-43, 44) "The following tribes of kshatriyas have gradually sunk into the state of Vṛshalas (out casts), from the extinction of sacred rites and from having no communication with Brahmins, viz, Pauṇḍrakas, oḍras, Draviḍas, Kambojas, Yavanas, Sakas, Paradas, Pahlavas......Daradas" శాస్త్రోక్తమైన పవిత్రకర్మలను చేయకపోవటంవల్ల క్షత్రియజాతికి చెందిన ఈ తెగలవాళ్లను బ్రాహ్మణులు వెలివేశారనీ, వాళ్ళంతా వృషలులలో కలిసిపోయారనీ మనువు చెప్పినట్లు తెలుస్తుంది. ఈ విధంగా ఒక తెగ పేరుగా ద్రవిడ పద ప్రయోగం కనిపిస్తుంది.

మహాభారతంలో ద్రావిడుల ప్రసక్తి ఉంది. అరణ్యపర్వంలో శ్రీకృష్ణుడు రాజసూయయాగ సమయంలో ధర్మరాజుని సేవించటానికి వచ్చిన రాజుల్లో పాండ్య, ఓఢ్ర, చోళ, ద్రవిడాంధ్రకులున్నట్లు ధర్మరాజుకి జ్ఞాపకం చేస్తాడు.

యత్ర సర్వాన్ మహీపాలాన్ శస్త్రతేజో భయార్దితాన్
సవంగాంగాన్ స పౌండ్రోడ్రాన్ స చోళ ద్రవిడాంధ్రకాన్.

ఈ ద్రావిడ పదప్రయోగం జాతివాచకమని స్పష్టం.

భరతుడి నాట్యశాస్త్రంలో (అధ్యా. 17, శ్లో. 46) పాత్రోచిత భాషను గురించిన చర్చలో బర్బర కిరాత ఆంధ్ర ద్రమిలాది జాతులకు శౌరసేని మొదలైన ప్రాకృతాల నుపయోగించరాదని చెప్పబడింది.

న బర్బర కిరాతాంధ్ర ద్రమిలాద్యాసు జాతిషు
నాట్యప్రయోగే కర్తవ్యం పార్యం భాషా సమాశ్రయం.

జగన్నాథ పండితరాయలు తన రసగంగాధరం ద్వితీయాననంలో ఉపమా నిరూపణ ఘట్టంలో అప్పయ్యదీక్షిత మతాన్ని ఖండిస్తూ ఈ విధంగా చెప్పాడు.

"క్వచిద్వ్యంగ్య ప్రధానా సా ఇతి తైరేవ ద్రవిడశిరో
మణిభిః అభ్యధీయత తదపి అహృద్యమేవ"

ఉపమాలంకారం కొన్నిచోట్ల వ్యంగ్యప్రధానంగా ఉంటుందని ద్రవిడ శిరోమణి యైన వారిచేత చెప్పబడిన విషయం హృద్యమైనదికాదు అని దీనికి అర్థం. ద్రవిడ శిరోమణి అని అప్పయ్యదీక్షితుణ్ణి ఉద్దేశించి ప్రయోగించబడిన ఈ పదం జాతిపరంగా కనిపిస్తుంది.

దేశపరంగా ద్రావిడ పద ప్రయోగాలు కిందివిధంగా కనిపిస్తాయి. అమరసింహుని నామలింగానుశాసనంలో ద్రవిడ దేశ సంబంధమైన ఒక మూలిక అనే అర్థంలో ద్రావిడశబ్దం ప్రయుక్తమయింది.

"కర్చూరకో ద్రావిడకః కల్పాకో వేధముఖ్యకః
ఓషధ్యో జాతిమాత్రేస్యుః అజాతౌ సర్వమౌషధమ్"
(ద్వితీయకాండ, వనౌషధావర్గం, 135 శ్లో.)

కర్చూరకము, ద్రావిడకము, కల్పాకము, వేధముఖ్యకము అనేవి పర్యాయ పదాలు. ఇవి జాతిపరంగా తీసుకొన్నప్పుడు ఓషధులనీ, అజాతిగా తీసుకొంటే అన్నీ ఔషధాలే అని దీని భావం. ఇందులో ద్రావిడక శబ్దానికి ద్రవిడదేశేజాతః (ద్రవిడదేశమునందు పుట్టినది) అని భానూజీ దీక్షిత రామాశ్రమీ వ్యాఖ్య తెలుపుతుంది.

బాణుడు రచించిన కాదంబరిలో చండికాలయ వర్ణన సందర్భంలో "జరద్ద్రావిడ ధార్మికేణ అధిష్ఠితాం చండికాం అపశ్యత్" అని ద్రవిడశబ్దం దేశ పరంగా వాడబడింది వృద్ధుడైన ద్రవిడ ధార్మికుడితో అధిష్ఠింపబడ్డ చండికను (చంద్రాపీడుడు) చూశాడు అని అర్థం.

శ్రీ శంకరుడు సౌందర్యలహరిలో తాను ద్రవిడ శిశువునని చెప్పాడు. దేవీస్తన్య మహిమాభివర్ణనలో ఇట్లా చెప్పబడింది.

తవ స్తన్యం మన్యే ధరణిధరకన్యే! హృదయతః
పయః పారావారః పరివహతి సారస్వతమివ
దయావత్యాదత్తం ద్రవిడ శిశు రాస్వాద్యతవయ
త్కవీనాం ప్రౌఢానామ జని కమనీయః కవయితా. (75 శ్లో.)

ఓ హిమగిరి పుత్రీ! భగవతీ! ప్రీతితో నీవిచ్చిన స్తన్యము నాస్వాదించి ఒక ద్రవిడ శిశువు (శ్రీ శంకరుడు) సమర్థులైన కవులలో మనోహరుడైన కవియైనాడు. అందువల్ల నీ హృదయం నుంచి పుట్టిన పాలసముద్రం వాఙ్మయవిలాసంగా మారి ప్రవహిస్తోందనీ, అదే నీ స్తన్యమనీ తలుస్తాను అని ఈ శ్లోకభావం.

రవీంద్రుడు రచించిన జాతీయగీతంలో "ద్రావిడ ఉత్కళ వంగా" అని ద్రావిడ శబ్దం తమిళ, మలయాళ, కర్ణాటాంధ్ర దేశాలకు సామూహికంగా వాడబడింది.

భాషాపరంగా కూడ ఈ ద్రావిడ పద ప్రయోగం ప్రాచీనకాలం నుంచి కనిపిస్తుంది

బుద్ధుని జీవితచరిత్రను తెలిపే లలితవిస్తరంలో 64 భారతీయ లిపులలో ద్రావిడ లిపి ఒకటిగా చెప్పబడింది. ఈ లలితవిస్తరం క్రీ పూ. మూడవ శతాబ్దిలో అశోకుడి కాలంలో రచించబడిందని చెప్తారు[8]. దీనిలోని పదవ అధ్యాయమైన 'లిపిశాలా సందర్శన పరివర్తం'లో బోధిసత్త్వుడు విద్యాభ్యాసం కోసం లిపిశాలకు వెళ్ళినప్పుడు గురువైన విశ్వామిత్రుడికి 64 లిపులను తెలిపి, వాటిల్లో ఏ లిపిని తనకు బోధిస్తారని అడుగుతాడు. ఆ 64 లిపులలో 12 వదిగా ద్రావిడ లిపి చెప్పబడింది[9].

భరతుడి నాట్యశాస్త్రంలో (17-50) నాటకంలో ఉపయోగించదగిన 'విభాషలు' ఏడు విధాలనీ, అవి శకార, అభీర, చండాల, శబర, ద్రమిల, ఆంధ్ర వనచరుల వ్యవహారంలోనివనీ చెప్పబడింది.

> శకారాభీర చండాల శబర ద్రమిలాంధ్రజాః
> హీనా వనేచరాణాం చ విభాషా నాటకే స్మృతా

నాటకమునం దుపయోగింపదగు 'విభాషలు' ఏడు విధములు-శాకారి, ఆభీరి, చాండాలి, శాబరి, ద్రామిడి, ఆంధ్రి, హీనులైన వనచరులు వాడెడి వనౌకసి[10].

ఈ విభాషలను ఎవరెవరికి ఉపయోగించాలో వివరిస్తూ వనచారులకు శాబరిని గాని, ద్రామిడిని గాని ఉపయోగించాలని చెప్పబడింది[11].

ఏడవ శతాబ్దికి చెందిన కుమారిలభట్టు మీమాంసా తంత్రవార్తికంలో ద్రావిడశబ్దాన్ని "తద్యథా ద్రావిడాది భాషాయాం[12]" అని భాషాపరంగా వాడాడు.

ఇక ఈద్రావిడపద వ్యుత్పత్తిని పరిశీలిద్దాం. 'ద్రవిడ' శబ్దం సంస్కృతమని కొందరు అభిప్రాయపడితే, సంస్కృతీకరించబడ్డ దేశ్యపదమని మరికొందరు భావిస్తున్నారు కాల్డ్వెల్, యస్ కె. ఛటర్జీ, గంటి జోగిసోమయాజి మొదలయినవారు ఇది సంస్కృతపదమని భావించారు.

సంస్కృత భాషాపదమని భావించినవాళ్ళ ప్రకారం ఇది ద్రవిడ, ద్రామిడ, ద్రావిడ అనే రూపాలతో కనిపిస్తుంది. ఈ మూడు రూపాల వ్యవహారంలోను కొంత భేదం ఉంది. ద్రావిడజాతికి చెందినవారు ద్రావిడులు. వారు వ్యవహరించిన భాషలు ద్రావిడభాషలు. తమిళ భాషా వ్యవహర్తలను ద్రమిడులని కూడ అంటారు. ద్రమిళ పదంలోని 'మ'వర్ణం 'వ'గా మారటంవల్ల ద్రవిడ పదం ఏర్పడిందనీ, తరువాత ఈ ద్రవిడ/ద్రావిడ పదం విశాలార్థంలో, అంటే, ద్రావిడ భాషా కుటుంబపు భాషల వ్యవహర్తలందరి పరంగానూ వాడబడిందనీ వీరి అభిప్రాయం.

'తమిళ'మనే పదం ద్రావిడశబ్దం నుంచి వచ్చిందని సంస్కృతీయుల నిర్ధారణ. ద్రావిడ-దామిడ-దమిడ-దమిళ-తమిళ అనేది దీని పరిణామక్రమమని వీరి భావన. సంయుక్తాక్షరాలు, నాదవత్ స్పర్శధ్వనులు పదాదిన లేకపోవటం తమిళ భాషాలక్షణం గాబట్టి పై విధమైన ధ్వని పరిణామం ద్రావిడ భాషా ధ్వని పరిణామ నియమాలకి అనుగుణమైనదే. సంస్కృతంలోని ద్రావిడ శబ్దానికి తమిళీకరణం చేసిన 'తిరావిడ' అనే రూపం మధ్యయుగపు తమిళ సాహిత్యంలో కనిపిస్తుంది. ద్రావిడ ప్రబంధం అనే అర్థంలో 'తిరావిడ ప్పిరబందం' అనే ప్రయోగం ఉంది. తిరావిడ ప్పిరబందం అనే పదానికి Vaishnava sacred poems by the Alvars అనే అర్థ ముంది దీన్నే దివ్యప్రబంధమని కూడ అంటారు[13].

ద్రావిడ శబ్దానికి సంస్కృతీయులు సూచించిన వ్యుత్పత్తులు కూడ ఊహలమీద ఆధారపడ్డ చమత్కార భాషణాలు. కర్చూరకమనే మూలికను గురించి వివరిస్తూ, దాని పర్యాయపదమైన 'ద్రావిడక' శబ్దానికి గురుబాలప్రబోధిక 'ద్రావయతి ఇతి రోగాన్ ద్రావిడకః' - రోగాలను హరించేది అని వ్యుత్పత్తిని చెప్పింది.

దేశ్యపదమని భావించినవారి ప్రకారం దేశ్యపదమొకటి ఉండగా అది 'ద్రావిడ' అని సంస్కృతీకరించబడింది. అది 'తమిట్' అనే దేశ్యపదం. దీనికి దేశీయమైన వ్యుత్పత్తులు కొన్ని కనిపిస్తాయి. తమిళ భాషానిఘంటువైన పింగళ నిఘంటువులో[14] 'తమిళ్(ట్)' అనే పదానికి తీయనిది, అందమైనది అని అర్థాలివ్వబడ్డాయి Tamil Lexicon[15] లో Sweetness, Melodiousness అనే అర్థాలీ 'తమిట్' పదానికివ్వబడ్డాయి. అంతేకాక, తమిట్ అనే పదానికి ఇనిమై (Sweetness) అనే అర్థాన్ని పింగళ నిఘంటువు ఇచ్చింది అని కూడ అందులో చెప్పబడింది[16]. మొఴి అనే పదానికి పదం, భాష అని అర్థాలు. Tamil Lexicon లో మొఴి= పదం అనే అర్థంతోపాటు "మఱై మొఴి తానె మందిరం

ఎన్బొ'' (రహస్యపదాలతో కూడిన పదాలను అట్లాగే ఉచ్చరించాలి) అనే తొల్కాప్పియం (పొరుళదిగారం-481) లోని ప్రయోగం ఇవ్వబడింది. ఇదే పదానికి భాష, భాషించు (లేక భాషణము) అనే అర్థాలతోపాటు "మొళి పెయర్ తేయత్తర్ ఆయినుమ్'' (భాషను మాట్లాడే ప్రజలు ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి వెళ్తుంటారు) అనే ప్రయోగం 'కురుందొగై' (11 వ పద్యం) నుంచి ఇవ్వబడింది. తమ్ + మొళి>తమిళ్ అంటే తమభాష, సొంతభాష అని వేరొక వ్యుత్పత్తి. ఇందులోని 'తమ్' అనేది తమ అని అర్థాన్నిచ్చే సర్వనామ మూల రూపం. అమిళ్‌దు[17] అనే తమిళ పదానికి అమృతం అని అర్థం చెప్తూ, తానమిళ్దిమ్ ఎన్రు ఉణరప్పాట్రు (వర్షం అమృతంగా భావించబడింది) అనే తిరుక్కురళ్-11 లోని ప్రయోగం Tamil Lexicon ఇచ్చింది ఈ అమిళ్‌దు పదాన్ని చాల సార్లు ఆవృత్తిచేస్తే 'తమిళ్' అనే రూపం వస్తుందని కొందరి అభిప్రాయం. తమిళం అమృతం వంటి భాష అని వీరి తాత్పర్యం. త-మి-ళ్ అంటే ళ కారాన్ని కలిగిన భాష అని మరొక వ్యుత్పత్తి త-మి-ళ్ అనే మూడు వర్గాలకు చెందిన వర్ణాలు కలిగిన భాష తమిళమని కొందరి ఊహ. ఈ భాషలోని 18 హల్లుల్ని కింది విధంగా విభజించారు.

వల్లినమ్ : కచట(త)పఱ
మెల్లినమ్ : ఙఞణన(మ)న
ఇడైయినమ్ : యరలళ(ఴ)వ

ఇటువంటి విభజన కలిగిన భాష తమిళమని. ఈ విధమైన వ్యుత్పత్తులు అశాస్త్రీయమైనవి ఇంకా ఎన్నో కనిపిస్తాయి. ఇవేవీ శాస్త్రీయమైన వ్యుత్పత్తులు కావు. ఎవరి బుద్ధికి తోచిన వాటిని వారు నిరూపించారు. ఎవరికి అందిన ఊహలు వారు చేశారు.

ఈ విధంగా చాల ప్రాచీనకాలం నుంచి కనిపిస్తున్న 'ద్రావిడ' పదాన్ని కొన్ని భాషల సముదాయానికి ఉపయోగించి, ఆ భాషలన్నీ ఒకే వర్గానికి చెందినవి కావటంవల్ల వాటిని ద్రావిడభాషలనీ, అవి ద్రావిడ భాషా కుటుంబానికి చెందినవనీ మొదటిసారిగా చెప్పింది కాల్డ్వెల్.

## REFERENCES


1. Robert Caldwell, A comparative grammar of the Dravidian or South Indian Family of Languages, 1974 (చూ పుట 143, పంక్తులు 8-13)
2. మహాభారతం, అరణ్యపర్వం, 48-18, Bhandarkar Oriental Research Institute, Poona, 1942 (చూ. పుట 143, పంక్తులు 21, 22).

3. పోణంగి శ్రీరామ అప్పారావు, నాట్యశాస్త్రము, పుట 486 (చూ పుట 144, పంక్తులు 1, 2)
4. జగన్నాథ పండితరాయలు, రసగంగాధరం, చౌకాంబా విద్యాభవన్, వారణాసి, 1969 (చూ పుట 144, పంక్తులు 6, 7)
5. అమరసింహుడు, నామలింగానుశాసనం (అమరకోశః), Chaukhambha Sanskrit Series, Varanasi, 1970, P. 223 (చూ. పుట 144, పంక్తులు 15, 16).
6. బాణభట్ట కాదంబరి Chaukhambha Sanskrit Sansthan, Varanasi, 1976, P. 648 (చూ. పుట 144, పంక్తి 24)
7. శ్రీ శంకరుడు శ్రీసౌందర్యలహరి శ్రీ లక్ష్మీధర వ్యాఖ్య, తదితర వ్యాఖ్యల సంక్షిప్త ఆంధ్ర భావానువాదము, అనువాదకులు పాలావఝ్ఝల శ్రీరామశర్మ, శ్రీ దుర్గామల్లేశ్వర స్వామివారి దేవస్థానము, విజయవాడ 1967 (చూ. పుట 144 చివరిశ్లోకం).
8. కొమర్రాజు వేంకట లక్ష్మణరావు, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము-ప్రథమ సంపుటము, ఆంధ్రపత్రికా ముద్రాలయము 1932 పుట 201
9. లలితవిస్తరం (బుద్ధ భగవానుని భవ్యజీవిత చరితం) అనువాదః తిరుమల రామ చంద్ర బులుసు వేంకటరమణయ్య, 1969, పుట 184
10. పోణంగి శ్రీరామ అప్పారావు, నాట్యశాస్త్రము, పుట 487
11. పైది, పుట 488
12. కోరాడ రామకృష్ణయ్య భాషా చారిత్రక వ్యాసములు, కోరాడ ప్రచురణాలయము, మద్రాసు, 1954, పుట 149
13. Tamil Lexicon, Vol 3, University of Madras, 1929.
14. ''ఇనిమైయుమ్ నీర్మైయుమ్ తమిళ్ ఎనలగుమ్'', పింగళ నిఘంటువు, సూత్రం 3610
15. Tamil Lexicon, Vol. 3, University of Madras, 1929
16. పైది, Vol. 6, University of Madras, 1936.
17. పైది, Vol. 1, ,, ,, ,,

17

# ద్రావిడభాషల పరిగణనం

భారతదేశంలోని నాలుగు భాషా కుటుంబాలలో ఇండోఆర్యన్, ద్రావిడ భాషా కుటుంబాలు ముఖ్యమైనవి. ఉత్తర భారతదేశంలో ఆర్యభాషలు, దక్షిణ భారతదేశంలో ద్రావిడభాషలు ప్రచురంగా వ్యవహరించబడుతున్నాయని స్థూలంగా చెప్పవచ్చు.

ద్రావిడ భాషలు ప్రత్యేకమైన భాషా కుటుంబానికి చెందినవనే విషయాన్ని చాలాకాలం క్రిందటే పరిశోధకులు గమనించారు. ఎ.డి. కాంబెల్ (A D Campbell) రచించిన తెలుగు వ్యాకరణానికి note to the introduction అని కూర్చిన ఉపోద్ఘాతంలో ఎలిస్ (Francis W Ellis) ఈ భాషల సాజాత్య సంబంధాన్ని ప్రస్తావించారు. తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం, తుళు (కొడగు ని తుళు యొక్క మాండలికమన్నారు), మాల్తో భాషలను ఆయన పేర్కొన్నారు.

ఏక భాషా కుటుంబ ప్రస్తావన స్పష్టంగా లేనప్పటికీ భారతదేశానికి ఇతర కార్యార్థులై వచ్చిన కొందరు పాశ్చాత్యులు వివిధ ద్రావిడభాషలను గురించి పదిహేడో శతాబ్దినుంచి పరిశీలన చేసినట్లు తెలుస్తుంది. ద్రావిడభాషల సాజాత్య సంబంధం చాలకాలం క్రిందటే గుర్తించబడినా, దాన్ని సహేతుకంగా నిరూపిస్తూ వాటికి విపులమైన వ్యాకరణాన్ని మొదటిసారిగా రచించింది డాక్టర్ రాబర్ట్ కాల్డ్వెల్. ఈయన రచించిన A comparative Grammar of the Dravidian or South Indian family of languages అనే గ్రంథం 1856 లో ప్రకటించబడింది. ద్రావిడభాషల తులనాత్మక పరిశీలనకు ప్రారంభం అదే. భారతదేశ భాషల్లో ఏ కుటుంబానికైనా మొదట రచించబడిన తులనాత్మక వాక్యరణం కూడా ఇదే. ఈ భాషలకు సామూహికంగా ద్రావిడభాషలు అనే పేరు కూడ ఆయన దగ్గరనుంచే ప్రారంభమైంది. అంతకు పూర్వం దక్కను భాషలనీ, తమిలిక్ భాషలనీ వ్యవహరించబడేవి.

తరువాత గ్రియర్సన్ పర్యవేక్షణలో భారతీయభాషల పరిశీలన ప్రారంభమైంది. Linguistic Survey of India అనే పేరుతో పదకొండు సంపుటాలు 1927 లో ప్రకటించబడ్డాయి. వాటికి సంపాదకుడు గ్రియర్సన్.

అందులో నాలుగో సంపుటంలో ద్రావిడ భాషలను గురించిన విశేషాలు వివరించ బడ్డాయి. దీనికి పరిశీలకుడు డాక్టర్ స్టెన్‌కొనొ (Sten konow).

భాషా పరిగణనం ప్రపంచంలో ఉన్న భాషల సంఖ్యగాని లేక ఒక భాషాకుటుంబంలోని భాషల సంఖ్యగాని కచ్చితంగా చెప్పటం సాధ్యం అయ్యే పని కాదు ఏవి ప్రత్యేకభాషలో, ఏవి భాషాంతర్గత భేదాలో నిర్ణయించటానికి స్పష్టమైన ప్రమాణాలు, కొలబద్దలు లేవు. అందువల్ల కచ్చితమైన సంఖ్యా పరిగణనం సాధ్యం కాకపోయినా స్థూల పరిగణనం చేయవచ్చు.

ద్రావిడభాషల విషయానికి వస్తే కాల్డ్వెల్ చెప్పిన భాషలు 'బ్రాహుయి' కాక పన్నెండు. ఇందులో ఆరు నాగరక భాషలు. ఆరు అనాగరక భాషలు. సాహిత్యం, సంస్కృతి కలిగినవి నాగరక భాషలు. ప్రాచీన సాహిత్యం లేక అనాగరకులైన ఆటవికుల వ్యవహారంలో ఉన్నవి అనాగరక భాషలు. తమిళం, మలయాళం, తెలుగు, కన్నడం, తుళు, కొడగు లేక కూర్గి అనేవి నాగరక భాషలు (Cultivated Languages) గాను, తొద, కోత, గోండ్, ఖోండ్ లేక కు (కువి), ఒరాయన్ (కురుఖ్), రాజమహాలి (మాల్తో) అనేవి అనాగరక (uncultivated) భాషలుగాను కాల్డ్వెల్ పేర్కొన్నాడు.

తరువాత జరిగిన పరిశోధనలవల్ల మరికొన్ని ద్రావిడ భాషలు గుర్తించటంతో వీటి సంఖ్య పెరిగింది. ప్రకృతం సుమారు 25 భాషల వరకు ఉన్నట్లు పరిశోధకుల అభిప్రాయం.

తులనాత్మక పరిశీలన చేయటంవల్ల తేలిన తరతమ సహజాత సంబంధాలను బట్టి ఈ భాషలను మూడు ప్రధాన ఉప కుటుంబాలుగ విభజించవచ్చు అవి దక్షిణ, మధ్య, ఉత్తర ఉప కుటుంబాలు. దక్షిణ ద్రావిడ భాషలు (South Dravidian Languages): 1 తమిళం, 2. మలయాళం 3. కన్నడం 4 తుళు 5 కొడగు 6. తోద 7. కోట 8. బడగ. మధ్యద్రావిడ భాషలు (Central Dravidian Languages) : 9 తెలుగు 10. కుయి 11. కువి 12. కొండ 13. గోండి 14. కొలామి 15 నాయికి 16. పర్జి 17. ఒల్లారి 18 గదబ 19 పెంగో 20.కోయ. ఉత్తరద్రావిడభాషలు(North Dravidian Languages): 21. కురుఖ్ 22. మాల్తో 23. బ్రాహుయి.

ఇంకా 70 వేల మంది వ్యవహర్తలు గల యెరుకల, 15 వేల మంది వ్యవహర్తలు గల యెరవ, 9 వేల మంది వ్యవహర్తలు గల కురుంబ, కైకాడి, 6 వేల మంది వ్యవహర్తలుగల కొరవ, 4 వేల మంది వ్యవహర్తలుగల ఇరుల, 2 వేల మంది వ్యవహర్తలుగల బుర్గండి భాషలు నీలగిరి కొండల పరిసర ప్రాంతాలలో వ్యవహరింపబడుతున్నాయని ఆంద్రొనోవ్ (Dr. M S Andronov)

తెలిపారు. యెరుకల, కైకాడి, కొరవ, బుర్గండి లు తమిళ భాషా మాండలికాలు గానూ, కురుబ కన్నడభాషా మాండలికంగాను Linguistic Survey of India నాలుగో సంపుటంలో పేర్కొనబడ్డాయి. బడగ కన్నడ భాషకూ, కోయ గోండీ భాషకూ మాండలికాలని కొందరి అభిప్రాయం. నేపాల్ దేశంలో పసులకాపరుల వాడుకలో ఉన్న 'దన్‌గర్' అనే వాగ్రూపం కురుఖ్ భాషా మాండలికమని నిర్ధారించబడింది.

ఈ భాషల్లో తమిళ, కన్నడ, తెలుగు, మలయాళ భాషలకు ప్రాచీనమైన లిఖిత సాహిత్యమూ, కోశ వ్యాకరణ రచనా సంప్రదాయమూ ఉన్నాయి. ఇవి నాగరక భాషలు. అనాగరక ద్రావిడ భాషలకు లిఖిత సాహిత్యం లేదు. వాటిలో చాల భాషలకు లిపి కూడ లేదు. వాటిని గురించి తెలుసుకోవటానికి పాశ్చాత్య పండితుల రచనలు, భారతీయ పండితుల వ్యాకరణాలు ప్రధానాధారాలు. ఇందులో కొన్నిభాషలను గురించి కేవలం వాటిపేర్లు మాత్రమే తెలుస్తున్నాయి.

ఇవికాక కుందపూరుకు తూర్పుగా పడమటి కనుమల ప్రాంతంలో కొందరు ఆదిమవాసులు కొన్ని ద్రావిడ భాషలను వ్యవహరిస్తున్నారని ఆంద్రొనోవ్ అభిప్రాయం. అవే బెల్లారి, కొరగ భాషలు. ఇవేకాక కసువ, సవర, మండ మొదలైన ద్రావిడ భాషలను గురించి పరిశోధనలు చేయవలసి వున్నదని ఆంద్రొనోవ్ తెలిపారు. పరిశోధితం కాని కొన్ని దక్షిణ ద్రావిడ భాషలను గురించి అణ్ణామలై విశ్వవిద్యాలయంలో పరిశోధన సాగుతున్నట్లు తెలుస్తోంది. కొన్ని మధ్య ద్రావిడ భాషలకు గురించి "భారతీయ భాషల కేంద్ర అధ్యయన శాఖ" (CIIL) పరిశోధన చేయిస్తున్నట్లు తెలుస్తోంది. గోండీ భాషపై ప్రత్యేక పరిశోధనకు తెలుగు అకాడమీ సంకల్పించింది.

ఇంతవరకు తెలిసిన భాషలన్నిటికి సమగ్రమైన వ్యాకరణాలు లేవు. కొన్నిటికి పదాల పట్టికలు మాత్రమే కనిపిస్తాయి. కొన్నిటికి పేర్లు మాత్రమే తెలియటం జరిగింది. ఇంతవరకు లభించిన ఆధారాల సహాయంతో ఈ భాషలను గురించి తెలిసిన కొన్ని విశేషాలు దిగువ ఇవ్వబడినాయి.

తమిళం : ఇది ద్రావిడభాషలలో ప్రాచీనకాలంలో గ్రంథస్థమైన భాష. దక్షిణ ద్రావిడ భాషల్లో ప్రధాన భాషగా పరిగణించబడుతోంది. వ్యవహర్తల సంఖ్య అధికంగా ఉండటమూ, అతి ప్రాచీన లిఖిత సాహిత్యం, వ్యాకరణ గ్రంథాలు లభించటమూ ఇందుకు కారణం. ఈ భాషా వ్యవహర్తలు తమిళనాడు రాష్ట్రంలోనే కాక శ్రీలంకలోను, బర్మా, మలేషియా, ఇండోనేసియా వంటి ఆగ్నేయాసియా దేశాల్లోను, దక్షిణాఫ్రికాలోను, దక్షిణ అమెరికా ఖండంలోను

బ్రిటిష్ గయానాలోను, ఇంకా ఫిజి, మారిషస్, మడగాస్కర్, ట్రినిడాడ్ మొదలైన ద్వీపాల్లోను వ్యాపించి ఉన్నారు. ఈ భాషా వ్యవహర్తల సంఖ్య భారతదేశంలో సుమారు 30 5 మిలియన్లు, శ్రీలంకలో రెండు మిలియన్లపైన, ఆగ్నేయాసియాలో సుమారు ఒక మిలియను, దక్షిణాఫ్రికాలో సుమారు 0.25 మిలియన్ల మంది ఉన్నారు.

ఈ భాషకు తమిళం, తముల్, మలబారి, ద్రావిడి, అరవం అనే పేర్లున్నట్లు తెలుస్తుంది. ఇందులో తమిళమనే పేరు ఎట్లా వచ్చి వుంటుందనే చర్చ కాల్డ్వెల్ చేశారు. ఇది 'ద్రవిడ' శబ్దభవమని ఆయన అభిప్రాయం. దీని ప్రాచీనరూపం 'ద్రమిడ' అయ్యుండవచ్చు. ఇది ప్రాచీన తమిళగ్రంథాల్లో 'తిరమిడ'గా కనిపిస్తుంది పదాది సంయుక్తాక్షరంలోని రేఫ లోపించి నాదాక్షరమైన 'ద' శ్వాసంగా మారి, చివరి 'డ' కారం 'అ' కారంగా లేక 'ళ'కారంగా మారటంవల్ల నేటి తమిళమనే రూపం ఏర్పడింది. దీన్నే ఫ్రెంచివాళ్ళు తముల్ అని రూపించారు. పోర్చుగీస్‌వాళ్లు ఈ భాషను మలబారి (Malabar) అన్నారు. అందువల్ల ఆ కాలంలో చాలమంది యూరపియనులు కూడ ఈ పేరుతోనే వ్యవహరించారు.

సంస్కృతంలో దాక్షిణాత్యుల్ని 'ద్రావిడ' శబ్దంతో సూచించారు. తమిళ శబ్దానికి సమాన పదంగా కూడ 'ద్రావిడ' పదం కనిపిస్తుంది.

దక్కన్ ముసల్మానులు, తెలుగు కన్నడ భాషా వ్యవహర్తలు తమిళ భాషని అరవం అని కూడ అంటారు. తమిళులను 'అరవలు' అని కూడ తెలుగువాళ్లంటారు. 'అరవ' పద వ్యుత్పత్తిని స్పష్టంగా చెప్పటం కష్టం. తమిళదేశంలోని కొంత ప్రాంతానికి (ఉత్తరార్కాడు, దక్షిణార్కాడు జిల్లాలు) అరవనాడనే పేరుండేదనీ, దాన్నిబట్టి అరవం అనే పేరు వచ్చిందనీ ఒక ఊహ తమిళంలో అఱమ్ అనే పదానికి ధర్మం, నీతి అని అర్థం. అఱవన్ అంటే నీతిమంతుడని అర్థం చెప్పారు. ఆ పదానికి సంబంధించినది లేక అరవలు మాట్లాడే భాష అరవం అనేది ఇంకో ఊహ. తమిళంలో అఱివు అనే పదానికి అర్థం జ్ఞానం (Knowledge) అని, దాన్ని కలిగినవాళ్లు అరవలు, వాళ్ళ భాష అరవం అనేది మరో ఊహ. కొందరు తెలుగు పండితులు 'అరవ' పదాన్ని సంస్కృతపదంగా భావించారనీ, అ+రవ అంటే రవం లేనిదనీ, ఆ భాషలో మహాప్రాణ ధ్వనులు లేకపోవటం వల్ల తమిళదేశానికి ఉత్తరపు సరిహద్దులో ఉన్న ప్రజలు తమిళాన్ని అర్థశూన్యమని అన్నారనీ ఇంకో వ్యుత్పత్తి ఇవన్నీ ఊహలే. 'అరవ' శబ్దానికి

తమిళ భాషలో బ్రాహ్మీలిపిలో చెక్కబడిన గుహాశాసనాలు క్రీ. పూ. 100 సంవత్సరాల నాటివి లభించాయి. లభించిన గ్రంథాల్లో 'తొల్‌కాప్పియమ్' అనే లక్షణగ్రంథం ప్రాచీనమైనది. ఇది క్రీస్తుకు పూర్వకాలానిదే అని చాల మంది భావిస్తారు. దీనిపైన సంస్కృత వ్యాకరణ ప్రభావం ఉన్నప్పటికీ పరిభాషని ఏర్పరచుకోవటం మొదలైన విషయాల్లో ఈ గ్రంథకర్త స్వాతంత్ర్యం వహించినట్లు తెలుస్తుంది. అంతేకాక, తమిళ సాహిత్యంలో కూడ కావ్యాల ఇతివృత్త నిర్మాణాదుల్లో గ్రంథకర్తలు స్వతంత్రమార్గాన్ని అనుసరించారని విమర్శకుల అభిప్రాయం. తిరుక్కురళ్, శిలప్పదిగారమ్, మణిమేగలై, జీవక చింతామణి, కంబరామాయణం మొదలైనవి తమిళ సాహిత్యంలోని ప్రసిద్ధ గ్రంథాలు.

తమిళ భాషలో ప్రాంతీయమైన వ్యవహారభేదాలు చాల ఉన్నాయి. ఈ భాషా మాండలికాల మీద కృషిచేసిన ఆంద్రొనోవ్ తమిళనాడులో అయిదు మాండలికాలను గుర్తించారు. 1. తూర్పు వ్యవహారం: తంజావూరు, తిరుచిరా పల్లి మండలాల భాష, మదురై జిల్లాలోని ఈశాన్యప్రాంతం ఇందులో చేరు తుంది. 2. ఉత్తర వ్యవహారం: మద్రాసు పట్టణభాష, చెంగల్పట్టు, ఉత్తర దక్షిణ ఆర్కాటు జిల్లాల భాష. 3. దక్షిణ వ్యవహారం: తిరునల్వేలి, రామనాధ పురం జిల్లాలు, మదురై జిల్లాలోని నైరుతిప్రాంతం ఈ మండలంలో చేరతాయి. 4. పశ్చిమ వ్యవహారం: నీలగిరి, కోయంబత్తూరు, సేలం జిల్లాలు ఈ మండలం లోనివి. 5. శ్రీలంక తమిళం.

తమిళ వ్యవహర్తలు ప్రపంచంలో చాల ప్రాంతాలకు భిన్నకాలాల్లో వలసపోయారు గాబట్టి ఇంకా ఇతర మాండలికాలు కూడ నిరూపించటానికి అవ కాశముంది. పైన చెప్పినవి భారత ఉపఖండంలోని మాండలికాలు మాత్రమే.

సాంఘిక భేదాలనుబట్టి కూడ వ్యవహార భేద నిరూపణ చేయవచ్చు. వాటిల్లో బ్రాహ్మణ, బ్రాహ్మణేతర వ్యవహార భేదాలను గురించి ఇటీవల కొంత పరిశోధన జరిగింది.

తమిళభాషకు ప్రాచీన వ్యాకరణాలే కాక ఆధునిక వ్యాకరణాలు, నిఘంటువులు, అనేకం ఉన్నాయి. పాశ్చాత్యుల రచనల్లో ఆర్డెన్ (A H. Arden) రచించిన A Progressive Grammar of Common Tamil ముఖ్యమైనది. యస్. అగస్త్యలింగం వ్రాసిన A Generative Grammar of Tamil అత్యాధునిక వ్యాకరణం. ఈ భాషలోని వివిధ మాండలికాలను గురించి, అనేక వ్యాకరణాంశాలను గురించి కృషి ఇంకా జరుగుతూనే ఉంది.

2. మలయాళం ఈ భాషను కేరళ రాష్ట్రంలో వ్యవహరిస్తారు. వ్యవహర్తల సంఖ్య సుమారు 17 మిలియన్లు. ఇది ద్రావిడ భాషా పదమే కాని సంస్కృత మలయ శబ్ద భవం కాదు. 'మల' అనే ద్రావిడ పదానికి కొండ అని అర్థం. 'ఆళమ్' అనే పదం ఆళ్=పాలించు, ఏలు, కలిగివుండు అనే అర్థాలున్న ద్రావిడ శబ్దం నుంచి ఏర్పడింది. మలయాళమంటే కొండదేశమని అర్థం.

పశ్చిమ ప్రాంతపు తమిళభాషా మాండలికం నుంచి మలయాళం పదో శతాబ్దంలో వేరుపడిందని జ్వెలబిల్ అభిప్రాయం. కాని తొమ్మిదో శతాబ్ది నాటికే ఈ భాష ఉన్నట్లు కొట్టాయమ్ స్థాణు రవివర్మ తామ్ర శాసనం వల్ల తెలుస్తుంది. అప్పటినుంచి 11 వ శతాబ్దివరకు ఈ భాషలో 21 శాసనాలు లభించాయి. 10 వ శతాబ్ది నాటివైన రామచరితం, రామకథాపాట్టు అనే గ్రంథాలు ప్రాచీనాలు. 12 వ శతాబ్ది తరువాత సందేశ కావ్యాలు, చంపువులు, ఖండకావ్యాలు, భారత భాగవత పురాణాలలోని గాథలు అనేకం మలయాళ భాషలో వ్రాయబడ్డాయి ఈ భాషపైన సంస్కృత ప్రభావం అధికంగా కనిపిస్తుంది. ఆధునిక సాహిత్యంలో నూతన ప్రయోగాలు చేసిన కవులు ఈ భాషలో ఉన్నారు. మలయాళ వ్యవహర్తలలో అక్షరాస్యత అధికం.

ఈ భాషలో ప్రాదేశిక మాండలికాలతో పాటు గుర్తించదగిన సాంఘిక వ్యవహార భేదాలు కూడ కొన్ని ఉన్నాయి. వీటిని నంబూద్రి, నాయర్, మోప్ల, పులయ, నస్రాణి వ్యవహార భేదాలుగా జ్వెలబిల్ గుర్తించారు. పి. ఫ్రెడ్రిక్ అనే పరిశోధకుడు బ్రాహ్మణ, నాయర్, శూద్ర, అస్పృశ్య అని నాలుగు భేదాలుగా విభజించారు.

తమిళ మలయాళాల సన్నిహిత సంబంధాన్నిబట్టి ఈ రెండు భాషలను ఒక ఉపకుటుంబంగా పరిగణిస్తారు.

మలయాళ భాషకు 14 వ శతాబ్దిలో సంస్కృతంలో రచించబడిన లీలాతిలకమనే ప్రాచీన వ్యాకరణం ఉంది. గుండర్ట్ (Rev H Gundert) వ్రాసిన మలయాళ భాషా వ్యాకరణం (1851), మలయాళ ఆంగ్ల నిఘంటువు (1872) ఉన్నాయి. ఎల్. వి. రామస్వామి అయ్యర్ The Evolution of Malayalam Morphology (1936), ఎ. చంద్రశేఖర్ Evolution of Malayalam (1953) అనే గ్రంథాలను రచించారు. ఈ భాషను గురించి కేరళ విశ్వవిద్యాలయంలో పరిశోధన జరుగుతోంది.

3. కన్నడం: ఈ భాషను కర్ణాటక రాష్ట్రంలో సుమారు 17.5 మిలియన్ల మంది వ్యవహరిస్తారు. కర్ణాటమనీ, కన్నడమనీ, Canerese అనీ ఈ భాషను

అంటారు. ఈ శబ్దాల వ్యుత్పత్తిని నిరూపించటం కష్టం. గుండర్ట్ 'కర్ + నాడు' అంటే నల్లని నేల గల దేశమనీ, ఇది ద్రావిడభాషా పదమనీ,తరువాత సంస్కృతీక రించబడిందనీ అభిప్రాయపడ్డారు. 'కరు + నాడు' అంటే ఎత్తయిన ప్రదేశమనీ కర్ణాటదేశం తీరప్రదేశాలకంటె ఎత్తయిన పీఠభూమి అనీ కొందరు ఊహించారు. కరునాడు అనే ద్రావిడ పదమూ కర్ణాటమనే సంస్కృత పదమూ వేరువేరనీ, అవి క్రమంగా అభిన్నాలయినాయనీ ఒక ఊహ.

ఈ భాష క్రీ.పూ. 4,5 శతాబ్దాల నాటికే ప్రత్యేక భాషగా వేరుపడిందని పరిశోధకుల అంచనా. ఈ భాషలో శాసనాలు క్రీ.శ. 5 వ శతాబ్ది నుంచి లభిస్తు న్నాయి. అప్పటి నుంచీ 9 వ శతాబ్దివరకు 150 శాసనాలు లభించాయి. కన్నడ భాషలో ప్రాచీన గ్రంథం నృపతుంగుని 'కవిరాజమార్గ' అనే లక్షణగ్రంథం. ఇది 9 వ శతాబ్ది నాటిది. శివకోటాచార్య విరచితమైన 'వడ్డారాధన' అనే గ్రంథం క్రీ.శ. 7 వ శతాబ్ది నాటిదని కొందరి అభిప్రాయం. 10 వ శతాబ్దిలో పంపకవి విక్రమార్జున విజయం, పొన్నకవి శాంత పురాణం, రన్నకవి అజిత పురాణం, రన్నకందమనే నిఘంటువు వ్రాశారు. ఈ ముగ్గురు కవులను రత్నత్రయమంటారు.

కన్నడ భాషలో బ్రాహ్మణ, బ్రాహ్మణేతర, హరిజన వ్యవహార భేదాలున్నట్లుగా పరిశోధకులు గమనించారు. ధార్వార్, బెంగుళూరు, మంగుళూరు అనే ప్రాదేశిక భాషాభేదాలు కూడ కనిపిస్తాయి. ఈ భాషకు కేశిరాజు వ్రాసిన 'శబ్దమణిదర్పణ' అనే ప్రాచీన వ్యాకరణం ఉంది. కిటెల్ (Rev F. Kittel) వ్రాసిన A Grammer of the Kannada Language (1903) అనేది చాల ప్రసిద్ధమైన వ్యాకరణం ఈయన రచించిన నిఘంటువు కూడ ప్రసిద్ధమైనదే. గాయ్(G S Gai)వ్రాసిన Historical Gr mmar of old Kannada(1946), స్పెన్సర్ (H. Spencer) వ్రాసిన A Kanarese Grammar (1950) అనే వ్యాకరణాలూ, బ్రైట్ (W Bright) వ్రాసిన An outline of Colloquial Kannada (1958) అనే గ్రంథమూ ఈ భాషను గురించి రచించబడ్డాయి. కుశాలప్పగౌడ 'గౌడ కన్నడ' అనే వర్ణనాత్మక వ్యాకరణం (1970) రచించారు. ఎ. కె. రామానుజన్ A Generative Grammar of Kannada అనే పేరుతో సిద్ధాంత వ్యాసాన్ని వ్రాశారు. (Ph D Thesis of Indiana University, 1964). బి. రామచంద్రరావు పంప భారతంలోని భాషకు ఒక వర్ణనాత్మక వ్యాకర ణాన్ని రచించారు (1972).

4. తుళు · ఈ భాష కేరళ రాష్ట్రంలోని కాసరగోడ్ తాలూకాలోను, కర్ణాటక రాష్ట్రంలో దక్షిణ కనరా జిల్లాలోని మంగుళూరు, ఉడిపి, కార్కల,

పుత్తూరు తాలూకాల్లోను వ్యవహారంలో ఉంది. వ్యవహర్తలు సుమారు 0.94 మిలియన్లు. ఈ భాషా వ్యవహర్తల్లో విద్యాధికులున్నప్పటికీ దీనికి సొంత లిపిలేదు. పూర్వం మలయాళ లిపిని కొన్ని మార్పులతో వాడుకొనేవారు. తరువాత బేసెల్ మిషన్ ప్రచురణకర్తలు కన్నడ లిపిని వాడినప్పటి (1842) నుంచి కన్నడ లిపి వాడబడుతోంది. లిఖిత సాహిత్యం లేకపోయినా గాని ఇది అభివృద్ధి చెందిన భాష గాబట్టి దీనిని కాల్డ్వెల్ నాగరక భాషగా పరిగణించారు. దీనికి 'తుళువ' అనే నామం కూడ ఉన్నట్లు తెలిపారు. 'తుళు' అనే పదానికి మృదువు అని అర్థమనీ, ఈ పదం ఆ భాషా వ్యవహర్తలను బోధిస్తుందనీ బ్రిగెల్ (Rev. J. Brigel) అభిప్రాయం.

తుళు భాషా వ్యవహర్తలు వారి అధికార వ్యవహారాలు ఆయా రాష్ట్రాల భాషల్లోనే జరుపుకుంటారు. బ్రిగెల్ A Grammar of Tulu Language (1872) అనే వ్యాకరణాన్ని వ్రాశారు. తుళు-ఇంగ్లీషు, ఇంగ్లీషు-తుళు నిఘంటువులను (1866, 1872) మేనర్ (A. Manner) అనే ఆయన తయారుచేశారు. ఎల్.వి. రామస్వామి అయ్యర్ Materials for a sketch of Tulu Phonology అనే వ్యాసాన్ని 1936 లో Indian Linguistics లో వ్రాశారు. డి యన్. శంకరభట్ ఒక వర్ణనాత్మక వ్యాకరణం (1967) రచించారు. బి రామచంద్రరావు ఈ భాషను గురించి కొన్ని వ్యాసాలు వ్రాశారు. చివరి వారిద్దరూ ఈ భాషా వ్యవహర్తలు.

5. కొడగు : ఈ భాషను కర్ణాటక రాష్ట్రంలోని కూర్గు ప్రాంతంలో వ్యవహరిస్తారు. వ్యవహర్తల సంఖ్య 80 వేలు. ఈ భాషకు కూర్గు, కూర్గి, కొడగి, కొడవ అనే పేర్లున్నాయి. దీన్ని కుడగు అని కూడా అంటారు. 'కుడ' అనే పదానికి ప్రాచీన తమిళంలో పశ్చిమమని అర్థం. తమిళులకు పడమరవైపున గల ప్రాంతాలలో ఇది వ్యవహరించబడటం వల్ల పడమరదిక్కు పేరే ఆ దేశానికీ, దేశస్థులకూ భాషకూ క్రమంగా పేరైనదని కాల్డ్వెల్ అభిప్రాయం. ఈ దేశస్థులను 'కొడగులు' అని వ్యవహరించిన శాసనం ఒకటి 1174 ప్రాంతపుది మైసూరుజిల్లాలో దొరికింది. ఈ భాషా వ్యవహర్తలు చాల మంది నాగరకులు, విద్యావంతులు. ఈ భాషకు కూడ లిపీ, సాహిత్యమూ లేకపోయినా నాగరక జనవ్యవహారం మూలంగా కాల్డ్వెల్ నాగరకభాషగా పరిగణించారు. ఈ భాషకు కోల్ (R. A Cole) వ్రాసిన An Elementary Grammar of the Coorg Language (1867) అనే వ్యాకరణం మాత్రం ఉంది. ఎమెనో (M B. Emeneau) ఈ భాషమీద కొంత కృషి చేశారు.

6 తోడ: ఈ భాషను నీలగిరి కొండల పశ్చిమ ప్రాంతంలోని నీలగిరి, ఉదకమండలం, కూనూరు తాలూకాల్లో కొండజాతులవారు వ్యవహరిస్తారు. వ్యవహర్తల సంఖ్య సుమారు 800. ఈ భాషకు తొద, తుద అని కూడ పేర్లున్నాయి. ఈ భాషా వ్యవహర్తలను తోడా జాతివారని అంటారు. స్టీవెన్సన్ (Rev Steveⁿson) తోడా భాషాపదాలను కొన్నిటిని సేకరించారు. W H R Rivers 1906 లో The Todas అనే గ్రంధాన్ని రచించారు. కల్నల్ మార్షల్ (Col Marshall) A phrenologist amongst the Todas (1673) అనే గ్రంథాన్ని వ్రాసినట్లూ, ఆ గ్రంథంలోని భాగంగానే పోప్ (Rev Dr Pope) Outlines of the Grammar of Tuda Language అనే వ్యాకరణాన్ని వ్రాసినట్లూ కాల్డ్వెల్ పేర్కొన్నారు. ఎమెనో తోడ భాషని గురించీ, ఆ ప్రజలని గురించీ కొన్ని వ్యాసాలు రచించారు.

7. కోట ఇదికూడ నీలగిరి కొండల్లో ఆదివాసులచేత వ్యవహరించబడే భాష. వ్యవహర్తలు సుమారు 900 మంది. ఈ భాషా వ్యవహారాన్ని సేకరించి ఎమెనో నాలుగు సంపుటాలుగా ప్రకటించారు (1944, 46). జి. సుబ్బయ్య 1973 లో A Descriptive analysis of Kota అనే సిద్ధాంత వ్యాసాన్ని అణ్ణామలై విశ్వవిద్యాలయానికి సమర్పించారు.

8. బడగ · ఈ భాష నీలగిరి కొండల ప్రాంతంలోని ఆదివాసులు మాట్లాడతారు. కొందరు దీన్ని కన్నడభాషా మాండలికంగానే పరిగణిస్తారు. కాని 10 వ శతాబ్దిలోనే కన్నడభాషనుంచి విడివడి ప్రత్యేకభాషగా రూపొందింది. జనసంఖ్య ఆంద్రొనోవ్ అంచనా ప్రకారం సుమారు 90 వేలు. స్విన్‌తన్ (R B. Swinton) కొన్ని బడగ భాషాపదాలను సేకరించి Some Badaga words అనే పేరుతో Indian Antiquary, Vol. VII లో ప్రకటించారు.

9 తెలుగు ఈ భాషా వ్యవహర్తలు ఆంధ్రప్రదేశ్‌లోను, కర్ణాటక రాష్ట్రంలోని కోలారు జిల్లాలోను, తమిళనాడులోని మద్రాసు నగరం, సేలం, రాజపాళయం, కోయంబత్తూరు ప్రాంతంలోను, మధ్యప్రదేశ్‌లోని చాందా, బస్తర్ ప్రాంతాలలోను పరిగణించదగిన సంఖ్యలో ఉన్నారు. ఇతర దేశాల్లో బర్మా, మారిషస్ దీవులు మొదలైన ప్రాంతాలలో కూడ చాలకాలం క్రిందట వలస వెళ్ళిన తెలుగువాళ్లున్నారు. ఈ భాషా వ్యవహర్తలు ఆంధ్రప్రదేశ్‌లో 4 3½ కోట్ల మంది ఉన్నారనీ, ఇతర రాష్ట్రాలలోను, ఇతర దేశాలలోను ఉన్నవారిని కలుపుకొంటే సుమారు 6 కోట్లుండవచ్చుననీ భద్రిరాజు కృష్ణమూర్తి గారి అభిప్రాయం. తెనుగు, ఆంధ్రం, జెంతూ, వడుగు, వరుగి, తెలింగ అని భిన్న విధాలుగా, భిన్న

ప్రాంతీయులచేత ఈ భాష వ్యవహరించబడుతుంది. తెలుగు భాషా చరిత్ర (1974) లో ఆచార్య జి.యన్. రెడ్డి ఈ పదాల చరిత్రని వివరించారు.

ఈ భాషలోని మొట్టమొదటి శాసనం క్రీ. శ. 575 వ సంవత్సరం నాటి ఎర్రగుడిపాడు శాసనం ఇది కడప జిల్లాలోని కమలాపురం తాలూకాలో ఉన్న ఎర్రగుడిపాడు గ్రామంలో చెన్నకేశవస్వామి ఆలయ ప్రాకారంమీద లభించింది. దీన్ని వేయించిన పరిపాలకుడు రేనాటిచోడ వంశీయుడైన ఎరికల ముత్తురాజు. అప్పటి నుంచి 11 వ శతాబ్దివరకు దాదాపు 150 శాసనాలు దొరికాయి. 11 వ శతాబ్దినుంచి ప్రామాణిక లిఖిత సాహిత్యం లభిస్తోంది. రాజరాజ నరేంద్రుని ఆస్థానకవియైన నన్నయ రచించిన మహాభారతానువాదం ప్రథమ కావ్యమని నిర్ధారించబడింది. తెలుగులో స్వతంత్ర గ్రంథరచన తక్కువైనా చాల సాహిత్య శాఖల్లో గ్రంథరచన జరిగింది. నన్నయ, తిక్కన, ఎర్రాప్రెగడ అనే ముగ్గురు కవులు క్రమంగా భిన్నకాలాలలో చేసిన మహాభారతానువాదం మహాగ్రంథంగా పరిగణించబడుతోంది. అప్పటి నుంచి ఇప్పటి వరకు కవులెందరో గొప్ప కావ్యాలను రచించారు. తెలుగు భాషలో ప్రాచీన సాహిత్యమంతా చాలభాగం ఛందోబద్ధ రచనే. చంపూకావ్యాలలోని వచన రచన తప్ప చెప్పుకోదగిన ప్రాచీన వచన కావ్యాలు లేవు. ఆధునిక సాహిత్యంలో మాత్రం నవల, కథానిక వంటి కొన్ని సాహిత్య ప్రక్రియలు కనిపిస్తాయి. నాటకాలు కూడ తెలుగులో ఇటీవలి కాలంలోనే రచించబడ్డాయి.

తెలుగుభాషకు సంస్కృత మార్గానుసారియైన ప్రాచీన వ్యాకరణ రచనా సంప్రదాయం ఉంది. కర్తృత్వం సరిగ్గా తెలియని ఆంధ్ర శబ్ద చింతామణి, అధర్వణ కారికావళి (వికృతి వివేకం) అనే వ్యాకరణాలు ఈ భాషకు సంస్కృతంలో రచించబడ్డాయి. ఈ రెంటినీ పురస్కరించుకొని అహోబలపతి చేసిన కవిశిరోభూషణము అనే వ్యాఖ్యాన గ్రంథం కూడ సంస్కృతంలోనే వుంది. ఆ తరువాత ఎన్నో చిన్నవ్యాకరణాలున్నా, 1858 లో పరవస్తు చిన్నయసూరి వ్రాసిన బాలవ్యాకరణమనే గ్రంథానికి అధిక ప్రాచుర్యం కలిగింది. దీనికి పరిపూరకంగా బహుజనపల్లి సీతారామాచార్యులు రచించిన త్రిలింగ లక్షణశేషము అనే వ్యాకరణం కూడ దీనితోపాటు పాఠశాలలలో చదువుతారు. ఈయనే రచించిన శబ్దరత్నాకరము (1885) అనే ప్రాచీన భాషా నిఘంటువు కూడ ప్రసిద్ధమైనది.

ఈ భాషకు పాశ్చాత్యులు కొందరు వ్యాకరణాలు వ్రాశారు. వాటిలో ఆర్డెన్ (A H. Arden) రచించిన A Progressive Grammar of Telugu ఎక్కువ విపులమైన వ్యాకరణం. సి.పి. బ్రౌన్ A Grammar of the Telugu Language (1857) అనే వ్యాకరణాన్ని, ఇంగ్లీష్-తెలుగు, తెలుగు-ఇంగ్లీష్

నిఘంటువులనూ (1852) రచించారు. విలియం బ్రౌన్ A Grammar of the Gentoo Language (1817) అనే వ్యాకరణమూ, ఎ.డి. కాంబెల్ A Grammar of the Telugu Language (1816) అనే వ్యాకరణమూ రచించారు. సూర్యరాయాంధ్ర నిఘంటువు అనే తెలుగు నిఘంటువు 1936 లో ప్రారంభించబడి 1972 లో పూర్తి అయింది.

ఈ భాషా చరిత్రను తెలిపే గ్రంథాలలో చిలుకూరి నారాయణరావు గారి ఆంధ్ర భాషాచరిత్రము, గంటి జోగి సోమయాజి గారి ఆంధ్ర భాషా వికాసము, భద్రిరాజు కృష్ణమూర్తిగారి సంపాదకత్వాన వివిధ వ్యాసకర్తలు కూర్చిన తెలుగు భాషా చరిత్ర ముఖ్యమయినవి. క్రియా ప్రాతిపదికల తులనాత్మక, వర్ణనాత్మక పరిశోధన గ్రంథాన్ని (Telugu Verbal Bases, [Berkeley] 1961) భద్రిరాజు కృష్ణమూర్తి గారు ప్రకటించారు. ప్రాచీన శాసన భాషా స్వరూపాన్ని బూదరాజు రాధాకృష్ణ, ఎమ్. కందప్పచెట్టి గార్లు పరిశోధించి ప్రకటించారు. తెలుగు భాషా మాండలికాలను గురించి పరిశోధన చేసిన భద్రిరాజు కృష్ణమూర్తి గారు కళింగాంధ్రం, మధ్యాంధ్రం, దక్షిణాంధ్రం, పశ్చిమాంధ్రం అని నాలుగు ప్రాదేశిక భాషా మండలాలను నిరూపించారు. ఈ భాషా మాండలికాలను గురించి తెలుగు అకాడమీ వారు కొంతకాలం నుంచి విషయసేకరణ చేస్తూ కొన్ని గ్రంథాలు ప్రకటించారు. ఈ భాషకు ఆధునిక పద్ధతిలో సమగ్ర వ్యాకరణం రచించబడలేదు గాని కొన్ని అంశాలమీద విశేషమైన పరిశోధన జరిగి కొన్ని వ్యాసాల రూపంలోనూ చిన్న చిన్న గ్రంథాల రూపంలోనూ కనిపిస్తున్నాయి. ఈ పద్ధతిలో 1968-70 సంవత్సరాల మధ్య భారతిలో ప్రచురించబడిన చేకూరి రామారావు గారి నామ్నీకరణ వ్యాసాలు, 1975 లో ప్రచురించబడిన తెలుగు వాక్యం అనే గ్రంథమూ చెప్పుకోదగిన రచనలు.

**10.** కుయి : ఈ భాషా వ్యవహర్తలు ఒరిస్సా రాష్ట్రంలోని ఫుల్బని, గంజామ్ జిల్లాలలో ఉన్నారు. వీరి సంఖ్య 0.51 మిలియన్లు. లింగం లక్ష్మాజి వ్రాసిన An Introduction to the Kui or Kandh Language (1962) అనే గ్రంథమూ, పెరీరా (J.E. Friend Pereira) వ్రాసిన A Grammar of the Kui Language (1909) అనే వ్యాకరణమూ ఈ భాషకున్నాయి. విన్‌ఫీల్డ్ (W.W. Winfield) A Grammar of the Kui Language (1928) అనే వ్యాకరణాన్నీ, A Vocabulary of the Kui Language (1929) అనే గ్రంథాన్నీ వ్రాశారు.

**11.** కువి : దీని వ్యవహర్తలు ఆంధ్రరాష్ట్రంలోని విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలలోను, ఒరిస్సా రాష్ట్రంలోని గంజాం, కలహంది, కోరాపుట్

జిల్లాలలోను ఉన్నారు. వీరి సంఖ్య సుమారు 0.17 మిలియన్లు ఈ భాషకి ఖోండ్, కోదు, సామంతు, జాతాపు, కోజు అనే ప్రాదేశికనామాలు కూడ ఉన్నాయి. ఈ భాషకు షుల్జ్ (F V P Schulze) వ్రాసిన A Grammar of the Kuvi Language (1911) అనే వ్యాకరణమూ, Vocabulary of Kuvi-Konda Language (1913) అనే గ్రంథమూ, ఫిట్‌జరాల్డ్ (A G Fitzerald) వ్రాసిన Kuvinga Bassa : The Khond Language as spoken by the Parjas of the Madras Presidency (1913) అనే గ్రంథమూ ఉన్నాయి. బరో, భట్టాచార్య కలిసి Notes on Kuvi with a short vocabulary అనే వ్యాసాన్ని Indo Iranian Journal లో 1963 లో ప్రకటించారు.

**12.** కొండ : ఈ భాషను ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖపట్నం జిల్లా, ఒరిస్సారాష్ట్రంలోని కోరాపుట్ జిల్లాలలోని ఏజన్సీ ప్రాంతాలలో వ్యవహరిస్తారు. వ్యవహర్తల సంఖ్య 12 వేలు. ఈ భాషకు 'కూబి' అని ఇంకో పేరు కూడ ఉంది. భట్టాచార్య వ్రాసిన Konda Language అనే వ్యాసమూ (1956), భద్రిరాజు కృష్ణమూర్తి వ్రాసిన Konda or Kūbi, A Dravidian Language అనే వర్ణనాత్మక వ్యాకరణ గ్రంథమూ (1969) ఉన్నాయి.

**13.** గోండి : ఈ భాషను ఆంధ్రప్రదేశ్‌లోని ఆదిలాబాదు జిల్లాలోను, మధ్యప్రదేశ్‌లోని చింద్వారా, బెతుల్, బస్తర్, చాందా, బాలాఘాట్, నాగపూర్, వార్ధా, యోత్‌మల్, భండారా జిల్లాలలో ఉన్న ఆదివాసులు వ్యవహరిస్తారు. కోయభాషా వ్యవహర్తలు కాక కేవలం గోండీ భాషా వ్యవహర్తల సంఖ్య 1.5 మిలియన్లు. ఈ భాషలో చాల వ్యవహార భేదాలున్నాయి. వాటిల్లో కోయ, మడియ, రాజగోండ్ అనేవి ప్రధానభేదాలు.

ఈ మాండలిక భేదాలలో కొన్ని స్వతంత్ర ప్రతిపత్తి గల భిన్న భాషలైనా కావచ్చు. భిన్న భాషా ప్రతిపత్తిని నిర్ణయించటానికి ఇప్పటివరకు జరిగిన పరిశోధన సరిపోదు. వీటిలో ఆంధ్రప్రదేశ్‌లో వ్యవహారంలో ఉన్న కోయ వ్యవహారాన్ని కొందరు వేరే భాషగా పరిగణిస్తారు.

గోండి భాషకు విలియంసన్ (H D Williamson) Gondi Grammar and Vocabulary (1899) అనే వ్యాకరణాన్ని, ట్రెంచ్ (C.G.C. Trench) Gondi Grammar and Vocabulary (1921) అనే గ్రంథాన్ని, మిచెల్ (A N Mitchell) A Grammar of Maria Gondi (1942) అనే వ్యాకరణాన్ని, మాస్ (C. F Moss) An Introduction to the Grammar of the Gondi Language (1950) అనే గ్రంథాన్ని వ్రాశారు. సేతుమాధవరావు A Grammar of the Gondi Language (1954) అనే

వ్యాకరణాన్ని, పి.యస్. సుబ్రహ్మణ్యం A Descriptive Grammar of Gondi (1968) అనే వర్ణనాత్మక వ్యాకరణాన్ని రచించారు. హిస్‌లాప్ (S Hislop) Papers relating to the Aboriginal Tribes of the Central Provinces (1866) లో గోండీభాషపైన ఒక వ్యాసముంది. బరో, భట్టాచార్య కలిసి 1960 లో Journal of the Asiatic Society లో A Comparative Vocabulary of the Gondi dialects ని ప్రకటించారు

14 కొలామి : ఆంధ్రప్రదేశ్‌లోని ఆదిలాబాద్ జిల్లాలోను, మధ్యప్రదేశ్‌లోని యోత్‌మల్, వార్ధా జిల్లాలోను ఉన్న ఈ భాషా వ్యవహర్తల సంఖ్య 50 వేలు. ఈ భాషకు నాయిక్రి (Naikri) అనే మాండలిక భేదముంది. సేతు మాధవరావు వ్రాసిన A Grammar of the Kolami Language (1950), ఎమెనో రచించిన Kolami - A Dravidian Language (1955) అనే గ్రంధాలున్నాయి

15 నాయికి ఆంధ్రప్రదేశ్‌లోని ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాల లోను, మధ్యప్రదేశ్‌లోని చాందాప్రాంతంలోను కొండ ప్రాంతాల్లో నివసించే 1500 మంది వ్యవహరించే భాష ఇది. దీనిని గురించి ప్రత్యేక గ్రంధం ఏదీ లేదు. బరో, భట్టాచార్య సేకరించిన విశేషాలు Naiki of chanda అనే పేరుతో Indo Iranian Journal లో (1961) ప్రకటించబడ్డాయి.

16. పర్జి ఇది మధ్యప్రదేశ్‌లోని దక్షిణ జగదల్పూరులోను, బస్తర్ ప్రాంతంలోను సుమారు 25 వేల మందిచేత వ్యవహరించబడే భాష. సంస్కృత ప్రజా శబ్దం ఒరియా భాషా ప్రభావంవల్ల పొరొజగా మారి, అది పొరజ>పొర్జ> పర్జ అయిందని అంటారు. బరో, భట్టాచార్య రచించిన The Parji Language (1953) అనే గ్రంధం మాత్రం ఉంది.

17 ఒల్లారి ఒరిస్సా రాష్ట్రంలోని కోరాపుట్ జిల్లాలో దక్షిణ భాగం లోని ఏజన్సీ ప్రాంతంలో ఒల్లారీ లేక హల్లారీ అనబడే ఈ భాషావ్యవహర్తలు 800 మంది. భట్టాచార్య రచించిన Ollari, A Dravidian Speech (1957) అనే గ్రంధం ఉంది.

18 గదబ దీనిని కొండేకోర్ గదబ లేక సాలూరు గదబ అని అంటారు ఆంధ్రప్రదేశ్‌లో శ్రీకాకుళం జిల్లాలోని సాలూరు తాలూకాలో ఈ భాషా వ్యవహర్తలున్నారు. వీరి సంఖ్య సరిగా తెలియదు. ఆంద్రొనోవ్ అంచనా ప్రకారం 40 వేలమంది. భద్రిరాజు కృష్ణమూర్తి, భట్టాచార్య గార్లు వేరువేరుగా

ఈ భాషా విశేషాలు సేకరించారు. పేరి భాస్కరరావు Kondekor Gadaba : A Dravidian Language (1973) అనే సిద్ధాంత వ్యాసాన్ని రచించారు.

ఒల్లారి, గదబ భాషలు ఏకభాషాంతర్గత భేదాలనీ, ఒకే భాషయొక్క రెండు మాండలికాలనీ బరో, భట్టాచార్యగార్ల అభిప్రాయం. ఆంద్రొనోవ్ కూడ ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

**19** పెంగో : ఈ భాషను ఒరిస్సా రాష్ట్రంలోని కోరాపుట్ జిల్లాలో నవరంగపూర్ ప్రాంతంలోను, దళమంతపూర్ ప్రాంతంలోను కొందరు ఆదివాసులు వ్యవహరిస్తున్నారు. వీరి సంఖ్య 1300 మంది. ఇది ద్రావిడభాష అని 1891 జనసంఖ్య లెక్కలలోనే (Census report) గుర్తించబడింది. ఈ భాషలో మాండలిక భేదాలధికంగా లేవని దీనిగురించి పరిశోధన చేసిన బరో, భట్టాచార్యగార్ల అభిప్రాయం. వీరు వ్రాసిన The Pengo Language (1970) ఒక్కటే ఈ భాషను గురించి తెలుసుకోవటానికి ఆధారం. మండ భాష దీనికి సన్నిహితమైనదని వీరే చెప్పారు.

**20** కోయ : ఈ భాషావ్యవహర్తలు ఒరిస్సాలోని కోరాపుట్ జిల్లాలోను, ఆంధ్రప్రదేశ్‌లో వరంగల్, ఖమ్మం, తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలలోను ఉన్నారు. వీరి సంఖ్య సుమారు లక్షన్నర. Rev. John Cain 1881 లో "The Koi, a Southern tribe of the Gond" అనే వ్యాసాన్ని Journal of the Royal Asiatic Society & Great Britain & Ireland లోను, A Vocabulary of Koi Language అనే వ్యాసాన్ని Indian Antiquary 8 వ సంపుటంలోను ప్రకటించారు. టైలర్ (Stephen Tyler) వ్రాసిన Koya, An Outline Grammar of Khammam dialect (1969), పి యస్. సుబ్రహ్మణ్యంగారు ఆదిలాబాద్ గోండీకి, కోయ భాషకూ వ్రాసిన వ్యాకరణం A Descriptive Grammar of Gondi (1968) ఉన్నాయి.

**21** కురుఖ్ బీహారు రాష్ట్రంలో భాగల్పూరు, ఛోటా నాగపూరు ప్రాంతాలలోను, ఒరిస్సా రాష్ట్రంలో సుందరగడ్, సంబల్పూరు జిల్లాలలోను, మధ్యప్రదేశ్‌లో రాయఘడ్, సర్గూజా జిల్లాలలోను 1.14 మిలియన్ల ప్రజలు ఈ భాషను వ్యవహరిస్తున్నారు. ఒరావాన్ అనే పేరుతో పూర్వ పరిశోధకులు దీనిని వ్యవహరించారు. ఫెర్డినాండ్ హన్ (F. Hahn) రచించిన Kurukh Grammar (1900), కురుఖ్ (ఒరావొ)-ఆంగ్ల నిఘంటువు (1903), గ్రిగ్నార్డ్ (A Grignard) వ్రాసిన A Grammar of the Oraon language (1924) ఈ భాషకు ఉన్నాయి.

22. మాల్తో : బీహారు రాష్ట్రంలో సంతాల్ పరగణాలలోని రాజ మహల్ పర్వత ప్రాంతంలో వ్యవహరించబడే ఈ భాషా వ్యవహర్తల సంఖ్య 90 వేలు. ఈ భాషను రాజమహాలీ, మాలేరీ అని కూడ అంటారు. ఈ భాషకు ద్రూసే (Earnest Droese) వ్రాసిన Introduction to Malto Language (1884) అనే గ్రంథమూ, స్విన్‌తన్ కూర్చిన Rajmahali words (Indian Antiquary Vol VII) అనే పదాల పట్టికా ఉన్నాయి. శిశిరకుమార్‌దాస్ వ్రాసిన Structure of Malto (1973) అనే గ్రంథం ప్రకటించబడింది.

23. బ్రాహుయి : పాకిస్తాన్‌లోని బెలూచిస్తాన్ రాష్ట్రంలోని కెలత్ ప్రాంతంలో ఈ భాష వ్యవహారంలో ఉంది. ఇరాన్, ఆఫ్ఘన్‌స్తాన్‌లలో కూడ కొందరి వ్యవహారంలో ఉంది. దీని వ్యవహర్తలు సుమారు నాలుగు లక్షల మంది. ఈ భాష ఉత్తర ద్రావిడభాష అయినా మిగిలిన రెంటికంటె చాల భిన్నమైనది. ఇండో ఆర్యన్ భాషల నడుమ ఉండటంవల్ల ఆ భాషల ప్రభావం అధికంగా ఉన్న భాష. ఈ భాషలో కలత్ (Kalat), సరవన్ (Sarawan), ఝలవన్ (Jhalavan) అని మూడు మాండలికాలున్నట్లు ఆంద్రొనోవ్ చెప్పారు. దేనిస్ బ్రే వ్రాసిన The Brahui Language (1909-1934) అనే గ్రంథ ముంది. ఎమెనో రచించిన Brahui and Dravidian Comparative Grammar ని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంవారు 1962 లో ప్రచురించారు.

ఇవికాక మిగిలిన భాషలను గురించి ఎక్కువ వివరాలు తెలియవు. వాటిని గురించి విస్తృత పరిశోధన ఇంకా జరగవలసి ఉంది.

# 18

# సాజాత్య చర్చ

ద్రావిడ భాషలన్నీ ఒక ప్రత్యేక కుటుంబానికి చెందినవనీ, ఆ భాషలన్నీ ఒకే మూలద్రావిడ భాషనుంచీ పుట్టిన సోదర భాషలనీ ఈనాడు పరిశోధకులంతా అంగీకరించిన విషయం. ఈ భాషలను గురించి పరిశోధనలు జరిగిన మొదటి రోజుల్లో ఇవి ఏ భాషా కుటుంబానికి చెందినవనే విషయంలో అభిప్రాయ భేదాలు, వాదాలు కొనసాగాయి.

మొదట ప్రాచీన లాక్షణికుల రచనల్లో తెలుగుభాషను గురించిన అభిప్రాయాలు ఏ విధంగా ఉన్నాయో పరిశీలిద్దాం.

ఆంధ్ర శబ్ద చింతామణిలో-

ఆద్య ప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయోర్భవేద్వికృతిః

కేవలతయాను సర్వత్యభే చ యేయం యథాతథం భాషా

సంస్కృత ప్రాకృతాలు తెలుగుకి ప్రకృతులు. ఈ రెండింటి వికృతి తెలుగు. ఈ తెలుగు ఆ రెంటిని కేవలం అనుసరిస్తుంది అనీ,

అథర్వణుడి వికృతి వివేకంలో

ఆద్యా మహార్థాసా మూలం సర్వస్యేతి నిగద్యతే

తదనుక్తస్య కార్యస్యవక్తా భవతి పాణినిః

గొప్పదైన సంస్కృతం అన్నిటికి మూలమని చెప్పబడుతోంది. అందువల్ల ఇక్కడ చెప్పబడని కార్యాలకి పాణిని వక్త అవుతాడు

అనీ చెప్పబడింది. దీన్ని బట్టి తెలుగుకి సంస్కృతం మూలమనీ తెలుగుకీ సంస్కృతానికీ జన్యజనక భావమున్నదనే అభిప్రాయం వీళ్ళిద్దరికీ ఉన్నదనీ తెలుస్తుంది. అంతేకాక అహోబలపతి కవి శిరోభూషణంలో "...సంస్కృత భాషాయాస్సకల భాషా నిదానత్వాత్" అని రాశాడు. సంస్కృత భాష సకల భాషలకు నిదానము అని దీనికి అర్థం.

పై ఆంధ్రశబ్ద చింతామణి శ్లోకంలోని 'వికృతి' శబ్దానికి సంస్కృత ప్రాకృత జన్యత్వమని అర్థం కాదనీ, ఆ రెంటినీ అనుసరించటమూ, అనుసరించక పోవటమూ (ఉభయానుసారిత్వమును నుభయ విలక్షణత్వమును) అనే అర్థమనీ

గంటి జోగిసోమయాజి అభిప్రాయపడ్డాడు (ద్రావిడ భాషలు, పుట 50). అంతే కాకుండా, సంస్కృత భాషకి సకల భాషా జనకత్వాన్ని చెప్పటంలో సంస్కృత భాష యొక్క ప్రాచీనతా, అనేక భాషలు దానినుంచి పుట్టటం అనే విషయాలు అభిప్రేతములనీ కూడ ఈయన అభిప్రాయపడ్డాడు (పైది, పుట 51).

ఆంధ్ర భాషాభూషణకర్త కేతన-
తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును
దానివలన గొంత గానబడియె
గొంత తాన కలిగె నంతయు నేకమై
తెనుగు బాసనాగ వినుతికెక్కె

అని అన్ని భాషలకూ తల్లి సంస్కృతమే అని చెప్తూ సంస్కృతం కొంతా, కొంత తానుగానే కలిగి ఉన్న తెలుగూ కలిసి తెలుగు భాష అయిందన్నాడు. ఇంకా, సంస్కృత పదాలు తెలుగులోకి ఏ విధంగా వస్తాయో ఆ పద్ధతుల్ని ప్రత్యేకంగా చెప్పాడు. సంస్కృత ప్రాతిపదికలు, ధాతువులేకాని సంస్కృత విభక్తి ప్రత్యయాలతో గూడిన రూపాలు, సంస్కృత క్రియారూపాలు మొదలైనవి తెలుగులో ప్రయోగింపబడవనే నిషేధాన్ని విధించాడు. దీన్నిబట్టి ఇతర భాషల నుంచీ శబ్ద జాలమెంత వచ్చి చేరినా తెలుగు సంస్కృత జన్యమైన 'వికృతి' భాష కాక స్వతంత్రమైన భాషగా గ్రహింపదగినదని వ్యక్తమవుతోందని కోరాడ రామకృష్ణయ్య అభిప్రాయపడ్డాడు (భాషా చారిత్రక వ్యాసములు, పుట 106).

మొత్తం మీద ప్రాచీనాంధ్ర వ్యాకరణ కర్తలు తెలుగుకీ, సంస్కృతానికీ జన్యజనక భావాన్ని అంగీకరించలేదని కోరాడ రామకృష్ణయ్య, వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి, గంటి జోగిసోమయాజి భావించారు.

ద్రావిడ భాషలు ఆర్య భాషా కుటుంబానికి చెందినవనీ, సంస్కృతం నుంచి జన్మించినాయనీ భావించిన భాషాశాస్త్ర పరిశోధకులు కొందరున్నారు.

తమిళ భాషను గురించి పరిశ్రమ చేసిన పోప్ ద్రావిడ భాషలకు సంస్కృతంతో సన్నిహిత సంబంధముందని అభిప్రాయపడ్డాడు.

మద్రాసు ప్రసిడెన్సీ కళాశాలలో ఆచార్యులుగా ఉండిన టి. యం. శేషగిరిశాస్త్రి సంస్కృతంలోను, ద్రావిడభాషల్లోను కూడ పరిశ్రమ చేశాడు. ఈయన దక్షిణభారత భాషలనేకాక మరాఠీ, బెంగాలీ, ఒరియా మొదలయిన భాషల నభ్యసించాడు. లాటిన్, గ్రీక్ భాషలను గురించి కూడ తెలిసికొని, భాషా తత్త్వపరిశీలన చేశాడు. 1884 వ సంవత్సరంలో Notes on Aryan and Dravidian Philology అనే గ్రంథాన్ని ప్రకటించాడు. అప్పటి ద్రావిడ భాషా

పండితులు ద్రావిడ భాషలు సిథియన్ భాషా కుటుంబానికి చెందినవని భావిస్తుంటే ఈయన అందుకు భిన్నంగా ఆర్యభాషా కుటుంబానికి చెందినవని అభిప్రాయపడ్డాడు. ద్రావిడ భాషల్లోని పదాలకూ, వ్యాకరణ పద్ధతులకూ ఆర్యభాషా పద వ్యాకరణ పద్ధతులతో సంబంధమున్నదని నిరూపించటానికి ప్రయత్నించాడు. ఈయన ద్రావిడ భాషల పరస్పర సంబంధాన్ని గుర్తించి ఆ భాషారూపాలను పరస్పరం పోల్చి పరిశీలించాడు గాని, వాటిని సంస్కృతంతోను, ఆర్య భాషలతోను ముడిపెట్టి రూప నిష్పత్తిని చూపటంలో ధ్వని సూత్రానుగుణంగా కాక స్వతంత్రంగా తన కిష్టమైన పద్ధతిలో కల్పించ ప్రయత్నించాడు. ఈ భాషల గురించి పరిశ్రమ చేసిన పాశ్చాత్య భాషా శాస్త్రవేత్తలకు భిన్నమైన పద్ధతిలో ఈ భాషల మధ్యగల సంబంధాన్ని సాధించాలని ప్రయత్నించాడు. దీన్ని తరువాతి పరిశోధకులు శాస్త్రీయ పద్ధతిగా అంగీకరించలేదు. ఆదరించలేదు. ఈయన రచించిన గ్రంథాల్లో ఆంధ్ర శబ్దతత్త్వము, అర్థానుస్వారతత్త్వము, తమిళ శబ్దతత్త్వము అనేవి ప్రకటించబడ్డాయి.

మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా ఉండిన పేకుమళ్ళ రాజగోపాలరావు కొన్ని భాషావిషయిక వ్యాసాలను ప్రకటించాడు. ఆర్య ద్రావిడ భాషలలో తెలుగు అతి ప్రాచీనమైనదని భావించి, ట్యూటానిక్ భాషా వర్గానికి చెందిన ఆంగ్లోశాగ్జన్ మొదలైన భాషలలోని పదాలకు, తెలుగుపదాలకు ఉన్న సామ్యాన్ని చూపిస్తూ, అటువంటి సామ్యం కలిగిన పదాల పట్టికను ప్రకటించాడు. తెలుగుకి, ద్రావిడభాషలకి ఆర్యభాషలతో సజాతీయత్వాన్ని ప్రతిపాదించటానికి ప్రయత్నించాడు.

డాక్టర్ చిలుకూరి నారాయణరావు ద్రావిడభాషలు ఆర్యభాషాజన్యములని భావించాడు. ద్రావిడ పదాలు, ధాతువులు ఆర్యభాషలనుంచి నిష్పన్నములైనాయని నిరూపించటానికి ప్రయత్నించాడు. ఉత్తర భారతదేశంలోని ఆధునికార్య భాషల లాగానే ద్రావిడభాషలు కూడ ప్రాకృతాపభ్రంశాలనుంచి క్రీ శ 8-10 శతాబ్దుల ప్రాంతంలో పుట్టినాయని ఈయన వాదం. 1937 లో రాసిన 'ఆంధ్ర భాషా చరిత్రము' లో ద్రావిడభాష లార్యభాషా జన్యములనే వాదాన్ని సిద్ధాంతీకరించ యత్నించాడు. ద్రావిడ భాషాపదాలు ప్రాకృతజన్యాలని నిరూపించటానికి ఒక్క తెలుగుపదాలనే ప్రధానంగా గ్రహించాడు గాని, ఇతర ద్రావిడ భాషా సమాన పదాలతో పోల్చి మూలరూపాల నన్వేషించలేదు. ద్రావిడభాషలలోని ప్రత్యేక వర్ణాలయిన ఱ, ఌ ఴ సంస్కృతం నుంచి ద్రావిడ భాషలలోకి వచ్చాయని ఈయన అభిప్రాయం. సంధి, సమాసం, లింగ వచన విభక్తులు, క్రియ మొదలైన వాటిల్లో ఆర్య ద్రావిడ భాషలకు సన్నిహిత సంబంధముందని నిరూపించటానికి ఈయన ప్రయత్నించాడు.

ఇక ద్రావిడభాషలు ఒక ప్రత్యేక కుటుంబానికి చెందినవిగా మొదట గ్రహించింది ఫ్రాన్సిస్ ఎలిస్. ఈయన 1816 లో ఎ డి. కాంబెల్ రాసిన A Grammar of the Teloogoo Language కి ఉపోద్ఘాతంగా Notes to the Introduction ని రాస్తూ, అందులో తమిళం, మలయాళం, కన్నడం, తుళు, తెలుగు, కొడగు, మాల్తో భాషలు ఒకే కుటుంబానికి చెందినవనీ, వీటికి సంస్కృతంతో జన్యజనక సంబంధం లేదనీ నిరూపించాడు. వీటిని ఈయన దక్షిణదేశ భాషలు (Dialects of Southern India) అన్నాడు.

డెన్మార్క్ దేశస్థుడైన రాస్మస్ క్రిస్టియన్ రాస్క్ (1787-1832) భారతదేశానికి వచ్చి, భారతదేశ భాషలను గురించి తెలుసుకొన్నాడు. తమిళం, మలయాళం, కన్నడం, తెలుగు, కుయి, గోండ్ కురుఖ్, మాల్తో, బ్రాహూయి భాషలు సంస్కృతం కంటె భిన్నమైన వర్గానికి చెందినవని తెలుసుకొని ఇవి ఒక ప్రత్యేకమైన కుటుంబానికి చెందినవని తెలిపాడు ఈ భాషల నీయన 'మలబారిక్' భాషలని అన్నాడు.

ద్రావిడభాషల ఏకకుటుంబత్వ సిద్ధాంతాన్ని సమగ్రంగా చర్చించి, తగిన ఉపపత్తులతో నిరూపించి స్థిరపరిచినవాడు రాబర్ట్ కాల్డ్వెల్. ఈయన 1856 లో ప్రకటించిన A Comparative Grammar of the Dravidian or South Indian Family of Languages అనే గ్రంథం ద్రావిడ భాషలకి మొట్టమొదటి విపులమైన తులనాత్మక వ్యాకరణం. ఇప్పటికీ ఇది పరిశోధకులకి శిరోధార్యంగానే ఉంది

కాల్డ్వెల్ నాటికి భాషాశాస్త్ర పరిశోధనలు అంతగా వృద్ధి చెందలేదనే చెప్పాలి. ద్రావిడ భాషలను గురించి చెప్పదగిన పరిశోధనలు కూడ జరగలేదు. ఇప్పుడు మనకి తెలిసిన ద్రావిడ భాషలన్నీ కూడ వెలుగులోకి రాలేదు. ఆయన పరిగణించినవి పన్నెండు ద్రావిడ భాషలు మాత్రమే. బ్రాహూయితో కలిపితే పదమూడు. ఆయన కాలానికి తెలిసిన పన్నెండు భాషలూ ఒక కుటుంబానికి చెందినవని శాస్త్రీయంగా నిర్ణయించి, ఆ కుటుంబానికి ద్రావిడ భాషా కుటుంబమని మొదట పేరుపెట్టినవాడు కాల్డ్వెల్. ఈయన ననుసరించి తరువాతి పండితులీ పదాన్నే వాడారు కాల్డ్వెల్ ద్రావిడ భాషల ప్రత్యేక లక్షణాలను వివరించి, ఆ భాషలు సంస్కృతం నుంచి జన్మించినవి కావని నిర్ణయించాడు

ఆ కాలంలో ఇతర పండితులతో పాటు కాల్డ్వెల్ కూడ ద్రావిడ భాషలు సిథియన్ లేక తురేనియన్ భాషా కుటుంబానికి చెందినవని భావించాడు. ఇండో యూరపియన్, సెమిటిక్ భాషలు తప్ప ఆసియాలోని మిగిలిన భాషలన్నీ సిథియన్ కుటుంబానికి చెందినవని ఆ కాలంలో వాళ్లు భావించారు. ఇండో యూరపియన్ భాషలకంటె సిథియన్ భాషలతోనే ద్రావిడ భాషలకు ఎక్కువ సంబంధముందని కాల్డ్వెల్ నిర్ణయించాడు. కాని ఈ సిద్ధాంతం సరిఅయినదని తరువాతి పరిశోధకులంగీకరించలేదు.

మలయాళ భాషలో పరిశ్రమ చేసిన గుండర్ట్, కన్నడ భాషలో పరిశ్రమించిన కిట్టెల్ ద్రావిడ భాషలు సంస్కృత ప్రాకృత జన్యాలు కావని భావించి కొన్ని దేశీయ పదాలను భిన్న భాషలలోని సజాతీయ రూపాలతో పోల్చి మూల ధాతు స్వరూపాన్ని గుర్తించటానికి ప్రయత్నించారు

సర్ జార్జి గ్రియర్సన్ పర్యవేక్షణలో ప్రకటించబడిన Linguist.c Suryey of Ind a అనే పన్నెండు సంపుటాల ఉద్గ్రంథంలోని నాలుగో సంపుటంలో ద్రావిడ భాషలను గురించి స్థూలంగా రూపించబడింది ఇది 1906 లో ప్రచురించబడింది. దీని సంపాదకుడు స్టెన్‌కానో. ద్రావిడ భాషలకి ఆర్య భాషలతోను, సిథియన్ భాషలతోను సజాతీయ సంబంధం లేదనీ, వీటిని ప్రత్యేక కుటుంబంగానే పరిగణించాలనీ ఈయన తెలిపాడు. ద్రావిడ భాషల పరస్పర సంబంధాన్ని గురించి చర్చించాడు. ఈ సందర్భంలో ద్రావిడ భాషల్లోని ఉప కుటుంబ విభజనని గురించి ప్రస్తావించాడు.

సంధి, దక్షిణదేశ భాషా సారస్వతములు-దేశి, భాషా చారిత్రక వ్యాసములు అనే గ్రంథాలకు కర్త అయిన కోరాడ రామకృష్ణయ్య ద్రావిడ భాషలు ప్రత్యేక కుటుంబానికి చెందినవని భావించి, అందుకనేక ఉపపత్తులను తన గ్రంథాల్లో చూపించాడు. ఈ భాషలు ఆర్య భాషా జన్యములన్న వారి వాదనలను ఖండించాడు. ద్రావిడ భాషల పరస్పర సంబంధాన్ని నిరూపించాడు ఈయన రచనలు నేటికీ ప్రామాణికాలు.

వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి "ద్రావిడ భాషా పరిశీలనము" అనే గ్రంథంలో కాల్డ్వెల్ చెప్పిన చాల విషయాలను ఖండించినా, ద్రావిడ భాషలు సోదర భాషలని రాశాడు. వాటికి ఆర్యభాషతోను, సిథియన్ భాషలతోను ఉన్న సంబంధం గురించి కూడ ఈయన చర్చించాడు.

గంటి జోగిసోమయాజి "ద్రావిడ భాషలు" అనే గ్రంథంలో వాటి పరస్పర సంబంధాన్ని పరిశీలించి అవి ప్రాచీనమైన భాషలనీ ప్రత్యేక కుటుంబానికి చెందినవనీ, సంస్కృతం నుంచి పుట్టినవి కావనీ నిర్ణయించాడు. ఈయన రాసిన "ఆంధ్ర భాషావికాసము" లో కూడ తెలుగు మొదలయిన ద్రావిడ భాషల పరస్పర సంబంధాన్ని నిరూపించి, వీటికీ సంస్కృత ప్రాకృతాలకూ జన్యజనక భావం గాని, సోదర సంబంధం గాని లేదన్నాడు.

ఇంకా ద్రావిడ భాషలను గురించి పరిశోధనలు చేసి వాటి సాజ్యాతాన్ని చర్చించి నిరూపించిన వాళ్ళలో యల్.వి. రామస్వామి అయ్యర్, యూల్ బ్లాక్, ఎమెనో, బరో, భద్రిరాజు కృష్ణమూర్తి, పి.యస్. సుబ్రహ్మణ్యం, ఎన్. కుమారస్వామి రాజా, జ్వలబిల్, ఆంద్రొనోవ్ మొదలయిన వాళ్ల పేర్కొనదగిన పరిశోధకులు.

# 19

# ద్రావిడభాషల ఏకకుటుంబత

ద్రావిడభాషా కుటుంబానికి చెందినవని చెప్పబడుతూ ద్రావిడ భాషలని వ్యవహరించబడుతున్న ఈ భాషలన్నీ ఒకే మూలభాషనుంచి పుట్టాయి. అదే మూలద్రావిడభాష ఈ ద్రావిడ భాషలు ఏకకుటుంబానికి చెందినవని నిర్ణయించటానికి కారణం ఆ యా భాషలమధ్య స్పష్టంగా కనిపిస్తున్న సంబంధమే. వాటి పరస్పర సంబంధం ఆయా భాషలలోని ధ్వనులు, ధాతుప్రత్యయ నిర్మాణం, సంధి, లింగ వచన విభక్తి ప్రత్యయాలు, సర్వనామరూపాలు, విశేషణాలు, క్రియలు, వాక్యనిర్మాణం మొదలయిన అంశాలలో వెల్లడి అవుతుంది. ఈ భాషల్లో సమానంగా కనిపించే ఈ లక్షణాలు వీటిని మిగిలిన భాషలనుంచి వేరు చేస్తాయి. ప్రత్యేక భాషలుగా నిరూపిస్తాయి.

సర్వభాషలకు జనని సంస్కృతమనే అభిప్రాయం ప్రాచీనకాలం నుంచి భారతీయుల్లో పాతుకొనిపోయింది. తెలుగు కూడ సంస్కృతం నుంచి పుట్టిందే అనే నమ్మకం కొందరు మన వైయాకరణులకు, పండితులకు ఉన్నట్లు తెలుస్తుంది. భాషా శాస్త్రవేత్తల పరిశీలనల ఫలితంగా తెలుగు మొదలైన ద్రావిడభాషలు సంస్కృతంనుంచి గాని మరే ఇతర భాషనుంచి గాని పుట్టినవి కావనీ, అవన్నీ ఒకే మాతృభాషనుంచి ఏర్పడిన సోదరభాషలనీ నిరూపించబడింది. ఆ మాతృభాషనే మూల ద్రావిడభాష లేక ప్రాచీనద్రావిడభాష (Proto-Dravidian) అని అంటాం.

భాషలన్నీ పరిణామక్రమంలో ఎన్నెన్నో మార్పుల్ని పొందుతూంటాయి. అయినా గాని మాతృభాషా లక్షణాల్ని చాలవరకుగాని లేదా కొంత వరకు గాని ఆయా భాషలు కలిగి ఉంటాయి. అందువల్లనే సోదర భాషల నడుమ పోలికలు కనిపిస్తాయి ఆ పోలికలను- అంటే, సమానంగా కనిపించే ఆ లక్షణాలను ఆధారంగా చేసుకొని భాషా శాస్త్రవేత్తలు ఆయా భాషల నడుమ గల సంబంధాన్ని నిర్ణయించటానికి ప్రయత్నిస్తారు అటువంటి సామ్యం ఆయా భాషల నడుమ అధికంగా కనిపిస్తే అవి సోదర భాషలనీ, అవన్నీ ఒకే మూల భాష నుంచి ఏర్పడినవనీ సిద్ధాంతం.

ద్రావిడ భాషల సోదర సంబంధాన్నీ, ఏకకుటుంబతను నిరూపించే ప్రత్యేక లక్షణాల్లో ముఖ్యమైనవి కొన్ని :

1. శబ్ద స్వరూపానుగుణమైన విభాగాన్ని (Morphological classification) బట్టి ద్రావిడభాషలు సంయోగాత్మకదశ (Agglutinative Stage) కి చెందుతాయి. ఈ భాషల్లో అర్థభేదాన్ని సూచించటానికి ధాతువుపైన ధాతువు, పదంపైన మరోపదం చేరుతూంటుంది గాని సంస్కృతంలోలాగ ఉపసర్గలు కాని ప్రత్యయాలు కాని చేరవు ప్రత్యయాల వంటివి కొన్ని కనపడుతున్నా వాటి పూర్వస్వరూప చరిత్రలను పరిశీలిస్తే అవి కూడ ఒకప్పుడు ప్రత్యేకమైన స్వతంత్ర పదాలే అని తెలుస్తుంది.

2. ద్రావిడ భాషల్లో అ ఇ ఉ ఎ ఒ అనే హ్రస్వాచ్చులూ వాటి దీర్ఘాలూ ఉన్నాయి. సంస్కృతంలోని ఋ, ౠ వర్ణాలు లేవు. హల్లుల్లో క చ ట ఱ త ప అనే శ్వాస స్పర్శ వర్ణాలున్నాయి. అవే కొన్ని సందర్భాల్లో నాదాలుగా ఉచ్చరించబడతాయి (ఈ విషయం వివరంగా వర్ణపరిణామ ప్రకరణంలో చర్చించబడుతుంది). మహాప్రాణాలు లేవు. ఙ, ఞ, న, మ అనే అనునాసిక వర్ణాలు, పార్శ్వికాలైన ల ళ లు, ర వర్ణం, య వ లు, ద్రావిడభాషలకు ప్రత్యేక వర్ణమైన ఴ వర్ణం ఉన్నాయి. కాలక్రమంలో శ ష స లు, మహాప్రాణాలు ఇతర భాషా ప్రభావంవల్ల చేరి, నేటి కొన్ని ద్రావిడ భాషల్లో కనిపిస్తున్నాయి.

3. ద్రావిడభాషా ధాతువులు సాధారణంగా ఏకాచ్కాలు (Mono-Syllabic) వర్, పో మొదలైనవి. సంయుక్తాక్షరాలు చాల తక్కువ.

4. ఈ భాషల్లో కొన్ని నామపదాలకు, క్రియాపదాలకు భేదముండదు. ఒకే ధాతువు నామవాచకంగాను, క్రియగాను కూడ ప్రయోగించబడుతుంది. పండు పండింది అన్నప్పుడు 'పండు' అనేది నామంగాను, క్రియగాను కూడ వాడబడింది. కట్టు, బొంకు, మునుగు, వెలుగు మొదలైన పదాలెన్నో ఇటువంటివి కనిపిస్తాయి.

5. ద్రావిడ భాషల్లో స్వరసమత లేక స్వరసామ్యం (Vowel harmony or harmonic sequence of Vowels) ఉంది. ఒక పదంలో సన్నిహితంగా ఉన్న అక్షరాల్లోని అచ్చులు ఒకదాన్నిబట్టి మరొకటి మారటం స్వరసమత. ఉదా: లక్ష్మి + కు > లక్ష్మికి; కత్తి + లు > కత్తులు. మొదటి పదంలో పూర్వపు 'ఇ' కారం పరమందున్న 'ఉ' కారం ఇ కారంగా మారటానికి కారణమైంది. రెండో పదంలో పూర్వపు 'ఇ' కారం ఉ కారంగా మారటానికి పరమందున్న 'ఉ' కారం కారణమైంది. ఈ విధంగా ఒక అచ్చు ప్రభావం వల్ల సన్నిహితంగా ఉన్న వేరొక అచ్చు మారటం స్వరసమత. దీన్ని అచ్చుల సమీకరణమని (Assimilation of Vowels) కూడ అంటారు.

6 ఈ భాషల్లో సంధి సామాన్యంగా పరరూప సంధి. రెండు పదాలు గాని పదాంశాలు గాని సన్నిహితమై ఒకే పదంగా రూపొందినప్పుడు పూర్వ పదాంతంలోని స్వరం లోపించి పరపదాది స్వరమే నిలుస్తుంది. ఇది రెండచ్చుల నడుమ సంధి జరిగే పద్ధతి. సంధి జరగనప్పుడు యకార వకారాలు ఆగమాలుగా ఆ రెండు పదాల మధ్య వచ్చి చేరతాయి సంస్కృతంలోని వృద్ధి సంధి, గుణ సంధి, సవర్ణ దీర్ఘ సంధి వంటివి ఈ భాషల్లో లేవు.

7. ద్రావిడభాషల్లో లింగ వివక్ష అర్థాన్నిబట్టి ఏర్పడింది అది లౌకిక లింగానుసారి. సహజలింగ భేదానికి దగ్గరలో ఉంటుంది సంస్కృతంలో లింగ వివక్ష శబ్దాన్ని బట్టి ఉంటుంది. స్త్రీ వాచక పదాలు స్త్రీలింగమనీ పురుషవాచక పదాలు పుంలింగమనీ మిగిలిన జడవాచక పదాలు నపుంసక లింగాలనీ నియమం లేదు సంస్కృతంలో దారాః అనే పదం పుంలింగం, భార్యా అనేది స్త్రీ లింగం, కళత్రమ్ అనేది నపుంసక లింగం అవుతాయి ఈ మూడు పదాలు ఏకార్థబోధ కాలే. తెలుగులో ఇవి స్త్రీ వాచకాలు. సంస్కృతంలో వృక్షః అనే పదం జడ పదార్థాన్ని సూచించేదైనా పుంలింగం అవుతుంది. ద్రావిడ భాషల్లో అది అమహ ద్వాచకం. అదే విధంగా లతా, నదీ, శిలా, జటా, వేణీ మొదలయిన జడవాచక పదాలు సంస్కృత భాషలో స్త్రీ లింగాలు. ద్రావిడ భాషల్లో ఇవి అమహద్వాచకాలు. దీన్నిబట్టి సంస్కృతంలో సహజ లింగానికీ వ్యాకరణ లింగానికీ భేదం ఉన్నదని తెలుస్తుంది. కొన్ని పదాలు రామః, సీతా, భార్యా వంటివి సహజలింగమూ, వ్యాకరణ లింగమూ కూడ ఒకటే అయినవి కనిపిస్తాయి ద్రావిడ భాషల్లో నామ వాచకాలు అర్థాన్ని బట్టి విభజించబడ్డాయి. తమిళంలో ఉయర్‌తిణై, అఖ్రిణై అని రెండు విధాలు. వివేకం కలిగిన వారిని సూచించేవి ఉయర్‌తిణైలోను, తద్భిన్నమైనవి అఖ్రిణైలోను చేర్చబడ్డాయి. తెలుగులో మహత్తులు. అమ హత్తులు అని రెండు విధాలుగ ఈ విభాగం కనిపిస్తుంది

8. ఈ భాషల్లో ఏక, బహు వచనాలు రెండే ఉన్నాయి సంస్కృతం లోని ద్వివచనం లేదు. ఏకవచనాన్ని సూచించటానికి ప్రత్యేకమైన చిహ్నం ఏదీ లేదు. బహువచనాన్ని సూచించటానికి సార్వనామికావశేషాలు (రు, ము, వి వంటివి), కళ్, లు వంటి ప్రత్యయాలు చేరతాయి.

9. విభక్తుల్ని సూచించటానికి ద్రావిడ భాషల్లో ప్రత్యేకమైన ప్రత్య యాలు లేవు. కొన్ని స్వతంత్ర శబ్దాలు కాని, వాటి అవశిష్ట భాగాలు కాని నామం పైన చేరి విభక్త్యర్థాన్ని సూచిస్తుంటాయి. సంస్కృతంలో ప్రతి విభక్తిలోను ప్రతి వచనానికి వేరువేరుగా ప్రత్యేక ప్రత్యయాలు చేరతాయి. ద్రావిడ భాషల్లో

విభక్తి ప్రక్రియ సంస్కృతంలో లాగ శబ్దాల యొక్క స్వరూపాన్ని బట్టి మారేది కాదు. కొన్ని ప్రత్యేక పదాల్ని విభక్త్యర్థాల్లో పరసర్గలు (Post Positions) గా వాడటం ఈ భాషల్లోని ప్రత్యేక పద్ధతి. ఉదా : నీ కోసం, ఇంటి దగ్గర, పుస్తకంలో.

10. సర్వనామాల విషయంలో ద్రావిడ భాషల కొక ప్రత్యేకత ఉంది. చాల ద్రావిడ భాషల్లో ఉత్తమ పురుష సర్వనామ బహువచన రూపాలు రెండు కనిపిస్తాయి. మధ్యమ పురుష సర్వనామాన్ని కలుపుకోని కేవల ఉత్తమ పురుష బహువచన రూపం (exclusive) 'మేము' అనేదొకటి. రెండోది మధ్యమ పురుష సర్వనామాన్ని కలుపుకొనే ఉభయార్థ బోధకమైన అస్మదర్థక బహువచన రూపం (Inclussive) 'మనము' అనేది. ఇటువంటి భేదం ఇండోయూరపియన్ భాషల్లో లేదు. అర్వాచీనార్య భాషలు కొన్నిట్లో ద్రావిడభాషా ప్రభావం వల్ల తరువాతి కాలంలో ఏర్పడింది

11. సంఖ్యావాచకాలు ద్రావిడభాషల్లో ఒకటినుంచి పదివరకు ఉన్నాయి. తరువాత నూరు సంఖ్య ఉంది. పది తరువాత వాటిని చెప్పేటప్పుడు మొదట పదులు చెప్పి తరువాత ఒకట్లను చెప్తారు. పదకొండు, ఇరవైమూడు, ముప్పైనాలుగు, తొంభైతొమ్మిది అనే విధంగా ఉంటుది సంస్కృతంలో దీనికి వ్యతిరేకమైన పద్ధతి. మొదట ఒకట్లను చెప్పి తరువాత పదులను చెప్తారు. అష్టాదశ, ద్వాత్రింశత్ అనే విధంగా ఉంటుంది.

12. ద్రావిడ భాషల్లో ఒక నామానికి పూర్వం ప్రయోగించబడటంవల్ల నామం విశేషణంగా మారుతుంది ఉదా చెరువు నీళ్లు. ఇట్లాగే అ, ఈ, ఏ, నీ, నా, తన మొదలైన సర్వనామాంగాలు కూడ నామానికి పూర్వం చేర్చబడటంవల్ల విశేషణాలవుతాయి ఈ విశేషణాలకి లింగ, వచన భేదం ఉండదు. స్వతంత్ర ప్రతిపత్తి లేకుండా వీటికి తరువాత చేరవలసిన నామపదాన్ని అపేక్షిస్తూంటాయి. ఉదా : మంచి అమ్మాయి; త. నల్లపెణ్ (మంచి అమ్మాయి). సంస్కృతంలో విశేషణానికి, దానికి సంబంధించిన విశేష్యానికి లింగ వచన విభక్తులలో ఏకరూపత ఉండాలనే నియమముంది. అంటే, నామ పదం ఏ లింగ వచన విభక్తుల్లో ఉంటుందో విశేషణం కూడ అదే లింగ వచన విభక్తుల్ని కలిగి ఉండాలని. ఉదా: సుందరః పురుషః, సుందరీ స్త్రీ, సుందరం వనం; తత్ పుస్తకం, తాని పుస్తకాని.

13. సమాస ప్రణాళికను ద్రావిడ భాషీయులు సంస్కృతం నుంచి గ్రహించినా గాని ద్రావిడ భాషల్లో సమాసాలు సంస్కృత సమాసాల లాగ సుదీర్ఘంగా ఉండవు సాధారణంగా రెండు మూడు మాటలతోనే ఈ సమాసా

లేర్పడతాయి. వెన్న దొంగ, పండు ముసలి, కూరగాయలు వంటివి ఈ భాషలకు సహజమైన సమాసాలు. విభక్తి ప్రత్యయాలు ప్రత్యేకంగా లేకపోవటంవల్ల ఈ సమాసాల్లో సంస్కృతంలోలాగ విభక్తిలోపం జరిగినట్లు కనపడదు. పదాలు ఒకదానికొకటి చేరటంవల్ల మాత్రమే సమాసాలేర్పడినట్లు కనిపిస్తుంది. రాజ్ఞః పురుషః>రాజపురుషః అని సంస్కృతంలో సమాసం ఏర్పడుతుంది. తెలుగులో అన్నదమ్ములు అన్నప్పుడు ఏ విధమయిన విభక్తి లోపమూ కనిపించదు.

14. ద్రావిడ భాషల్లో తర తమ భావ నిరూపణ పద్ధతి ఉన్నదికాని అది సంస్కృతంలో కంటె కొంత భిన్నంగా ఉంటుంది. సంస్కృతంలోని తరప్ ప్రత్యయార్థంలో తెలుగులో కంటె, కన్న వాడబడతాయి. ఉదా : ఆ పుస్తకం కంటె ఈ పుస్తకం మంచిది; ఈ పుస్తకం కన్న ఆ పుస్తకం పెద్దది. తమిళంలో ఇదర్కు అదు పెరిసు (దీనికి అది పెద్దది) అంటారు. తమప్ ప్రత్యయార్థంలో 'లో' వాడబడుతుంది. గోవులలో కపిల బహుక్షీర అనే ఉదాహరణ చాలమందికి తెలిసిందే. దీన్నే వ్యవహారంలో ఆవులన్నిట్లోకి కపిలావు బాగా పాలిస్తుంది అంటాం. ఆవులన్నిటి కంటె అని కూడ అంటారు. తమిళంలో అవట్రిల్ ఇదు నల్లదు 'వాటిల్లో ఇది మంచిది' అని ఉంటుంది.

15. క్రియల యొక్క కాలాన్ని తెలియజేయటానికి సంస్కృతంలో లాగ దశవిధ లకార ప్రక్రియ ద్రావిడ భాషల్లో లేదు. భూత భవిష్యద్వర్తమాన కాలాలు మూడు మాత్రం ఉన్నాయి.

16. ధాతువుకి వ్యతిరేకార్థక ప్రత్యయాన్ని చేర్చటంవల్ల ద్రావిడ భాషల్లో వ్యతిరేకార్థం ఏర్పడుతుంది. కొన్నిచోట్ల వ్యతిరేకార్థకాన్ని సూచించే ప్రత్యయం ఏదీ చేరకుండానే వ్యతిరేకార్థకం ఏర్పడుతుంది. ఉదా: త. సెయ్-Φ ఏన్>సెయ్యేన్, తె చెయ్-అ-ను>చెయ్యను, గోండి కియ్-ఓ-న్>కియ్యోన్. ఇల్లై, లేదు, కాదు మొదలయిన వ్యతిరేకార్థక సమాపక క్రియారూపాలను చేర్చటంవల్ల కూడ వ్యతిరేక క్రియా రూపాలేర్పడతాయి. ఇండో యూరపియన్ భాషల్లో వ్యతిరేకార్థకాన్ని తెలియజేయటానికి ప్రత్యేక పదాన్ని వాడతారు. ఉదా: సం. న కరోమి 'చేయను.'

17. అసమాపక క్రియల ప్రయోగం ద్రావిడ భాషల్లో సాధారణం. ధాతువుకి కాలబోధక ప్రత్యయం గాని, వ్యతిరేకార్థకం గాని చేరి అసమాపక క్రియారూపం ఏర్పడుతుంది. చదివి, చదువుతూ, చదవక వంటివి అసమాపక క్రియలు. ఒక వాక్యంలో ఎన్ని అసమాపక క్రియలయినా ఉండవచ్చు.

18. ఇండో యూరపియన్ భాషల్లో కనిపిస్తున్న కర్మార్థక ప్రయోగం ద్రావిడ భాషలకు సహజం కాదు. కర్మకు ప్రాధాన్యాన్నిచ్చి కర్త్రపేక్ష లేకుండా చెప్పటం కర్మార్థకం యొక్క ముఖ్య లక్షణం. ఈ పద్ధతి ఈ భాషల్లో లేదనే చెప్పాలి. ఇది కొన్ని ద్రావిడ భాషల్లో, అందులోను గ్రాంధిక భాషలోనే సంస్కృత భాషా ప్రభావం వల్ల వచ్చినట్లు కనిపిస్తుంది. ప్రాచీన కాలంలో ద్రావిడభాషల్లో కర్మార్థక ప్రయోగాలు చాల తక్కువగా ఉండటం, కాలక్రమంలో వీటి ప్రయోగం అధికం కావటం ఈ విషయానికి ఉపబలకం. వ్యవహారంలో మాత్రం ఇది లేదు అవసరమయిన కొద్దిచోట్ల వాడటం కనిపిస్తుంది. ఈ భాషల్లో 'పడు' ధాతువు కర్మార్థక ప్రయోగానుబంధంగా వాడబడుతోంది. ఉదా : చెప్పబడింది

19. సంబంధ బోధక సర్వనామాలు వాడటం ద్రావిడ భాషావ్యవహర్తల స్వభావంకాదు. వాటి స్థానంలో ధాతుజ విశేషణాల్ని వాడతారు. సంబంధ బోధకమయిన 'యత్' శబ్దాన్ని గురించి కాని, దానికి చేరే 'తత్' శబ్దాన్ని గురించి కాని పదవ శతాబ్దికి పూర్వం ద్రావిడ భాషల్లో చెప్పబడలేదు. 'ఎవడు పాపం చేస్తాడో వాడు అనుభవిస్తాడు' అనే వాక్యంలో ఎవడు, వాడు పదాలు యత్తద్వాచకాలు. ఇటువంటివి సంస్కృతానుకరణం వల్ల ద్రావిడ భాషల్లో ఏర్పడ్డాయి. ఈ భాషలకు సహజమైనది ధాతుజ విశేషణాల లేక క్రియాజన్య విశేషణాల వాడుక. 'పాపం చేసేవాడు అనుభవిస్తాడు' అనే విధంగా వాక్యం ఉంటుంది.

20. ద్రావిడ భాషల్లో వాక్యం కర్తృవాచి పదంతో ప్రారంభమై క్రియా పదంతో పూర్తి అవుతుంది. కర్తకి విశేషణం ఉంటే ఉండవచ్చు లేకపోతే లేదు. కర్తకి తరువాత కర్మ ఉంటుంది. దానికి పూర్వంగాని, తరువాత గాని క్రియావిశేషణం ఉంటే ఉండవచ్చు. వాక్యాంతంలో క్రియాపదం ఉంటుంది. ఈ విధమైన క్రమం ప్రతి వాక్యంలోను ఉంటుంది. ఉదా : చక్కని రాముడు సీతను సంతోషంతో పెళ్ళాడాడు; తెలివైన విద్యార్థి ఆసక్తితో పుస్తకాన్ని చదివాడు.

# 20

# ద్రావిడ భాషల ప్రాచీనత

భారతదేశంలో నాలుగు భాషా కుటుంబాలున్నాయని తెలుసుకొన్నాం. అవి టిబెటోబర్మన్, కొలేరియన్, ఇండోఆర్యన్, ద్రావిడ భాషా కుటుంబాలు. ఇందులో ఆర్యభాషా వ్యవహర్తలు భారతదేశానికి ఆగంతకులని పరిశోధకులు నిర్ధారణ చేశారు. ఆర్యులు ఎప్పుడు ఏ మార్గాన ఈ దేశానికి వచ్చారనే విషయంలో పండితులలో అభిప్రాయ భేదాలున్నాయి ఈ భేదాల విషయం ఎట్లావున్నా ఆర్యులు మన దేశానికి వలసవచ్చినారనే విషయం నిర్ధారితం.

ఆర్యులు భారతదేశానికి వచ్చిననాటికి ఇక్కడ స్థానికులైన ప్రజలు నివసిస్తున్నారు. ఆనాడు ఆర్య అల్పసంఖ్యాకులు. స్థానికు లధికసంఖ్యాకులు. ఈ ఆర్యేతరుల ప్రసక్తి ఋగ్వేదకాలం నుంచి కనిపిస్తుంది. వీరిని ఋగ్వేదంలో దస్యులనీ, వృషలులనీ పేర్కొన్నారు. ఋగ్వేదంవల్ల ఇంకా తెలిసిన విషయాలివి. ఆర్యులు భారతదేశానికి చేరినప్పుడు ఇక్కడ దట్టమైన అరణ్యాలు, కొన్ని గ్రామాలు, పట్టణాలు ఉన్నాయి. ఇక్కడి ప్రజలు ఆగంతకుల కర్థంకాని భాషను మాట్లాడుతున్నారు. ఆగంతకులు తెల్లని రూపం కలిగినవారు. స్థానికులు నల్లని వారు కావటంవల్ల ఆగంతకులు తాము గొప్పవారమని గర్వపడ్డారు. ఆర్యులకీ దస్యులనబడిన స్థానికులకీ ఘర్షణ జరిగింది. అది చాలకాలం జరిగింది. ఆర్యేతరులు చాల నాగరకులు. రాజకీయ చాతుర్యం కలిగినవారు. వాళ్ళకి చాల కోటలు, పట్టణాలు ఉన్నాయి. పోరాటంలో గెలిచి ఆర్యులు దస్యుల దగ్గరున్న అపార సంపదను కైవసం చేసుకొన్నారు వాళ్ళని జయించి గంగానదీ లోయ ప్రాంతాన్ని ఆక్రమించారు. అప్పుడు ఆర్యేతరులు ఆ ప్రాంతం నుంచి తరిమివేయబడ్డారు.

ఈ విధంగా ఋగ్వేదంలో ఆర్యుల ఆర్యేతరుల సంఘర్షణాది విషయాలు చెప్పబడినాగాని ఆర్యేతరులైన ఆ స్థానికులు ఎవరనే విషయం స్పష్టంగా లేదు. భారతదేశంలో ఉన్న ద్రావిడ, కొలేరియన్ జాతుల్లో ఎవరైనా కావచ్చు. ఎవరైనా గాని కొత్తప్రాంతానికి వలసవెళ్ళినప్పుడు స్థానికులతో ఘర్షణపడటంతో పాటు కొంతకాలానికి స్నేహం చేయటమూ, వారితో కలిసిమెలిసి జీవించటమూ జరుగుతుంది. ఆ సందర్భంలో ఒక జాతి ప్రజల ఆచార విచారాలు, సంస్కృతి సభ్యతలు మొదలైనవి మరొక జాతిలోనికి వెళ్ళటం సహజం. అదే విధంగా ఒకరి భాషా ప్రభావం కూడ మరొకరి భాషపైన పడుతుంది.

భారతదేశానికి వచ్చిన ఆర్యుల విషయంలోను ఇదే జరిగింది. వారు స్థానికులతో కలిసి మెలిసి ఉండటంవల్ల వారి నాగరకతా సంస్కృతులతో పాటు వాటికి సంబంధించిన పదాల్ని కూడ గ్రహించారు. స్థానికుల దగ్గర నుంచి తామెరుగని వస్తువులను, వాటితోపాటు ఆయా పదాలను, ఆయా ప్రాంతాల్లోని ఫలపుష్ప వృక్షాదుల నామాలను కూడ స్వీకరించారు ఈ కారణంగా ఆర్య భాష లోనికి- అంటే, సంస్కృత భాషలోనికి ఇతర భాషాపదాలు చాల వచ్చి చేరాయి. ఈ విధంగా అన్యభాషా పదాలు సంస్కృతంలోనికి రావటం ఋగ్వేదకాలం నుంచి ప్రారంభమయింది. సంస్కృతంలో చేరిన ఇటువంటి పదాలకుసంస్కృత భాషా వ్యుత్పత్తి కనిపించటంలేదు. అటువంటి సందర్భాల్లో ఆ పదాలు ఆర్యేతర భాషల నుంచి సంస్కృతంలోనికి వచ్చి వుంటాయని భావించబడుతుంది

సంస్కృతంలో అంత ప్రాచీనకాలం నుంచి కనిపిస్తున్న ఆర్యేతర భాషాపదాలు ఏ భాష నుంచి వచ్చి చేరాయన్నది తెలియవలసిన విషయం. ఏద యినా, స్థానికంగా ఉన్న ఏదో ఒక భాష నుంచి మాత్రమే వచ్చి వుండాలి. భారతదేశంలో నేడు ఇండో ఆర్యన్ భాషలే అధిక ప్రాంతంలో వ్యవహరించబడు తున్నాయి. ఇతర భాషా కుటుంబాలకి చెందిన భాషలు కూడ గణనీయంగానే ఉన్నాయి వాటిలో కొలేరియన్ ద్రావిడ భాషలు చెప్పుకోదగ్గవి ద్రావిడ భాషలు మరీ ముఖ్యమయినవని చెప్పాలి. ఇవి భారతదేశంలో దక్షిణ ప్రాంతమంతటా విస్తరించి ఉన్నాయి. మధ్య ఇండియాలోను, ఉత్తర భాగంలో బెలూచిస్తాన్ వరకు కూడ ద్రావిడభాషలు వ్యవహారంలో ఉన్నాయి ఈ ద్రావిడ భాషల ప్రభావం సంస్కృతంపైన ఉండటాని కవకాశముంది. సంస్కృతంలో కనిపిస్తున్న ఆర్య భాషేతర లక్షణాలకు కారణం ఎక్కువగా ఈ ద్రావిడ భాషాప్రభావమే అని, కొంతవరకు కొలేరియన్ భాషా ప్రభావమూ ఉన్నదనీ బరోవంటి భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

భారతదేశంలోని ఆర్యేతర భాషా కుటుంబాల్లో ద్రావిడ భాషా కుటుంబం జనసంఖ్యా దృష్ట్యా, విస్తీర్ణత దృష్ట్యా, నాగరకత దృష్ట్యా ముఖ్యమైనది. అంతేకాకుండా సంస్కృత భాషపైన ప్రభావం చూపించటంలో కూడ దీనికి చెప్పుకోదగిన ప్రాముఖ్యముంది. సంస్కృత భాషలో చేరిన సంస్కృతేతర భాషా పదాల్లో అధిక భాగం ద్రావిడ భాషా పదాలని పరిశీలన వల్ల తేలింది.

అన్యభాషా పదాలు కొన్ని ఆర్యభాషలో చొరబడినట్లు పూర్వ కాలికు లైన శాస్త్రవేత్తలు గ్రహించారు. 7వ శతాబ్దికి చెందిన కుమారిలభట్టు తన 'మీమాంసా తంత్ర వార్తికం'లో సంస్కృతంలో అనేక ద్రావిడభాషా పదాలున్నట్లు

నిరూపించాడు. వైదిక భాషలో చేరిన మ్లేచ్ఛభాషా పదాలకు అర్థ నిర్ణయం చేస్తూ సంస్కృత వైయాకరణులు ఆ మ్లేచ్ఛ పదాలకు సంస్కృత వ్యుత్పత్తులను కల్పించి ఏ విధంగా సమర్థించారో నిరూపించటానికిగాను ద్రావిడ భాషా పదాలైన అటర్, చోర్, పాంబు మొదలైన వాటిని ఉదాహరణగా చూపాడు. 'మార్గము' అని అర్థం కలిగిన 'అతర్' (DED 2589) అనే ద్రావిడ పదాన్ని 'తృ' ధాతువు నుంచి నిష్పన్నమైనట్లు భావించి తరింపశక్యముగానిది గనుక అతర్ అనటం యుక్తమే అని ఆ నిష్పత్తిని సమర్థించారని, చోర్ (DED 2354) అనే ద్రావిడ పదానికి సంస్కృత చోర శబ్దంతో అభేదాన్ని కల్పించారని, సర్పవాచియైన పాంబు (DED 3361) శబ్దానికి సంస్కృతంలోని పాపః అనే శబ్దంతో అభే దాన్ని కల్పించి పాము పాపి కాబట్టి ఆ వ్యుత్పత్తి సరియైనదే అని సమర్థించారని ఈ విధంగా మ్లేచ్ఛ భాషా పదాలకు స్వభాషానురూపమైన అర్థాలను, వ్యుత్పత్తులను కల్పించారని కుమారిల భట్టు తెలిపాడు.

12 వ శతాబ్దిలో ప్రాకృత వ్యాకరణాన్ని వ్రాసిన హేమచంద్రుడు ఆ భాషలలో చేరిన దేశ్య శబ్దాలను గురించి 'దేశినామమాల' అనే గ్రంథాన్ని వ్రాశాడు. అందులో కొన్ని ద్రావిడ భాషా పదాలున్నాయి. అక్కా 'వృద్ధ భగినీ' అత్తా 'పితృష్వసా', ఊరో 'గ్రామః, కురుల 'కుటిలకేశీ', చించా 'అమ్లికా' జేసరో 'రవిః', పసిండీ 'కనకం', పావో 'సర్పః', పుల్లీ 'వ్యాఘ్రః', మొగ్గరం 'కుట్మల'— ఈ విధంగా ద్రావిడ భాషా పదాలను దేశ్య పదాలుగా గుర్తించి సంస్కృతంలో అర్థాలనిచ్చాడు. దీన్నిబట్టి ఆ నాటికే ఆ భాషల్లో చేరిన ప్రాకృతేతర పదజాలాన్ని గురించిన అవగాహన అతని కున్నదని చెప్పవచ్చు. తరువాత జరిగిన తులనాత్మక పరిశీలనలో ఈ పదాలు ద్రావిడభాషా పదాలని నిర్ధారణ చేయబడ్డాయి.

సంస్కృత భాషలో చేరిన ద్రావిడభాషా పదాల పరిశీలన ఆధునిక కాలంలోఎక్కువగా జరిగింది. డాక్టర్ హెచ్. గుండర్ట్ 1869లో Journal of the German Oriental Society లో వ్రాసిన Dravidian elements in Sanskrit అనే వ్యాసంలో అటువంటి పదాల పట్టిక నొకదాన్ని ఇచ్చారు. 1894లో కిట్టెల్ తన కన్నడ ఆంగ్ల భాషా నిఘంటువుయొక్క పీఠికలో అటువంటి పదాల పట్టికనే మరొకదాన్ని ఇచ్చారు. కాల్డ్వెల్ తన తులనాత్మక వ్యాకరణంలో సంస్కృత భాషలో కనిపిస్తున్న ద్రావిడభాషా పదాల పరిశీలన చేశారు. ఇక బరో

1945, 46, 47 సంవత్సరాలలో వ్రాసిన వ్యాసాల్లో ద్రావిడభాషా జన్యములై మిగిలిన సోదర భాషల్లో సమాన పదాలను కలిగివున్న సుమారు 500 పదాలు సంస్కృతంలో చేరాయని నిరూపించారు. విపుల పరిశీలన చేస్తే వాటి సంఖ్య ఇంకా అధికంగానే ఉండవచ్చునని కూడ ఊహించారు.

సంస్కృతంలోనికి ద్రావిడభాషా పదాలు వచ్చి చేరటం ఋగ్వేద కాలం నుండి ప్రారంభమైంది. తరువాతి కాలాల్లోను ఈ పదాల ఆదానం సాగింది. రామాయణ మహాభారతాల్లో కూడ ద్రావిడ పదాలు కనిపిస్తాయి. ఇటువంటి పదాలు చాల వాటికి బరో వ్యుత్పత్తిని నిరూపించారు. ఈ పదాలకి ఇండో యూరపియన్ వ్యుత్పత్తి దొరకక పోవటం, ద్రావిడ భాషల్లో వ్యుత్పత్తి కనిపించటం, అవి నీర 'నీరు', మీన 'చేప', ముకుల 'మొగ్గ' కుంతల 'జుట్టు', తామరస 'తామరపువ్వు', తాల 'తాటిచెట్టు' వంటి ప్రాథమిక పదజాలానికి చెందిన పదాలు కావటం వల్ల ఇవి ద్రావిడ భాషా పదాలని నిర్ణయించటమైంది ఈ పదాలు ద్రావిడ భాషలన్నిట్లోను చాలవరకు కనిపిస్తాయి. కొన్ని కొన్ని ధ్వని భేదాలున్నా గాని రూపంలోను, అర్థంలోను సామ్యాన్ని కలిగి వుంటాయి. అందువల్ల అటువంటి పదాలను పరిశీలిస్తే అవి ద్రావిడ భాషా పదాలని తేలుతుంది. అవి కొన్ని క్రింద ఇవ్వబడ్డాయి.

1.సం. ఏడ 'గొర్రె, పోట్టేలు, అడవిమేక' త. యాడు, ఆడు 'మేక, గొర్రె' మ. ఆడు 'మేక, గొర్రె' క. ఆడు 'మేక' తోడ. ఆడు 'మేక' తె ఏట 'పొట్టేలు' గోండి. యేటీ 'ఆడమేక' కుయి. ఆడ 'మేక' కురుఖ్ ఏడా 'మేక' మాల్తో. ఏదె 'మేక' బ్రా. ఎట్ 'ఆడమేక'.

2 సం నీర 'నీరు' త. మ. క. నీర్ 'నీరు' తె. నీరు. కుయి. నీర్ 'రసం' (juice, sap, essence) బ్రా. దీర్ 'నీరు'.

3. సం. పున్నాగ 'Calophyllum Inophyllum' త. పున్నై. మ. పున్న, క. పొన్నె, పున్నికె, తుళు పొన్నె, తె. పొన్న.

ఈ పదాల్లో కనిపిస్తున్న ధ్వని భేదాలు ద్రావిడ భాషా ధ్వని పరిణామానికి అనుగుణంగానే ఉన్నాయి.

పరిశీలించబడిన ఇటువంటి పదాలన్నీ సంస్కృతంలోను ద్రావిడ భాషల్లోను కూడ కనిపిస్తున్నాయి. అటువంటప్పుడు ఆయా పదాలు సంస్కృత పదాలో లేక ద్రావిడ పదాలో పరిశీలించి నిర్ణయించవలసి వుంటుంది. అంటే, ఆ పదాలు ద్రావిడభాషల నుంచి ఆర్య భాషలోనికి వెళ్లినాయా లేక ఆర్య భాష

నుంచి ద్రావిడ భాషల్లోకి వచ్చినాయా అనే విషయాన్ని తెలుసుకోవాలి. వాటిని జాగ్రత్తగా పరిశీలిస్తే అవి ఏ భాషా పదాలో తెలుస్తుంది. ఆ పరిశీలన చేయటానికి కొన్ని సూత్రాల్ని అనుసరించాలని బరో చెప్తారు.

1. మొదట చేయవలసింది ఏమిటంటే పరిశీలనలో ఉన్న ఆ పదాలకి ఇండో యూరపియన్ భాషా వ్యుత్పత్తి ఉన్నదో లేదో గమనించాలి. అంటే, సంస్కృతంలో కనిపిస్తున్న ఆయా పదాలకి సమాన పదాలు ఇండోయూరపియన్ భాషా కుటుంబానికి చెందిన ఇతర భాషల్లో ఉన్నాయేమో పరిశీలించాలి. ఆ విధంగా లేకపోతే ఇండోయూరపియన్ భాషా వ్యుత్పత్తి లేదని నిర్ధారణ చెయ్యాలి. సంస్కృత భాషలో కనిపిస్తున్న సంస్కృత భాషా వ్యుత్పత్తి దొరకని ఆయా పదాలు ద్రావిడ భాషల్లోకి కూడ ద్రావిడేతర భాష నుంచి వచ్చి చేరాయేమో గమనించాలి. చాల ద్రావిడ భాషల్లో సమాన పదాలు కనిపిస్తే అప్పుడాయా పదాలు ద్రావిడ భాషా వ్యుత్పత్తి కలిగినవని తెలుస్తుంది

2. పరిశీలనలో ఉన్న పదాలు ఆయా భాషల్లో ఎంత ప్రాచీనకాలం నుంచి వాడబడి ఉన్నాయో తెలుసుకోవాలి. ఎంత అధికంగా వ్యాప్తిలో ఉన్నాయనే విషయమూ గమనార్హమే. ప్రాథమిక పదజాలానికి ఏ భాషలో అయినా వ్యాప్తి ఎక్కువగా ఉంటుంది. అయా పదాలు ద్రావిడ భాషల్లో ఎక్కువ వ్యాప్తిని పొంది వుండి ప్రాథమిక పదజాలానికి చెందినవైతే వాటికి సంస్కృత భాషలో కనిపిస్తున్న సమానపదాలకి ఇండోయూరపియన్ భాషా వ్యుత్పత్తి లేకపోతే ఆయా పదాలు ద్రావిడ భాషా పదాలుగానే భావించాలి. సంస్కృతంలో కనిపిస్తున్న మీన 'చేప', నీర 'నీరు', కాక 'కాకి', ఫల 'పండు' వంటి పదాలు ఇటువంటివే. ఇవి ద్రావిడ భాష నుంచి సంస్కృతంలోనికి వెళ్ళాయి ఈ పదాలు ప్రాథమిక పదజాలానికి చెందినవి. చాల ద్రావిడభాషల్లో కనిపిస్తాయి. ఇప్పటికీ తమిళ భాషలో 'చేప' అనే అర్థంలో 'మీన' శబ్దం మాత్రమే ఉంది. ఇతర ద్రావిడ భాషల్లో క్రింది విధంగా కనిపిస్తుంది. త మీన్, క. మాన్ (మీను), తె. మీను, గోం. మీన్, కువి, కుయి మీను, మాల్తో. మీను. నీర శబ్దమూ క్రింది విధంగా ద్రావిడ భాషల్లో కనిపిస్తుంది. త. మ. క. నీర్, తుళు. నీరు, తె. నీరు, కుయి. నీర్, బ్రా. దీర్. ఈ పదాలకి ఇండోయూరపియన్ భాషా వ్యుత్పత్తిగాని, ఆ భాషల్లో వ్యాప్తి గాని కనిపించదు

సంస్కృత భాషలో ప్రాచీనకాలంలో లేకుండా తరువాతి కాలంలో కనిపిస్తే అవి ద్రావిడ పదాలని చెప్పవచ్చు ఉదాహరణకి ఘూక 'గుడ్లగూబ' అనే పదం ప్రాచీన సంస్కృత సాహిత్యంలో కనపడదు. తరువాతి కాలంలో

కనిపిస్తుంది. మరి కూర్కై అనే పదం ప్రాచీన తమిళ గ్రంథాల్లో సంస్కృతం కంటె పూర్వమే కనిపిస్తుంది. కన్నడంలో గూగి, గూగె, గూబె అనీ తెలుగులో గూబి, గూబ అనీ కనిపిస్తుంది. ఇదే విధంగా పగడం అనే అర్థాన్నిచ్చే సం. ప్రవాల, త.మ. పవలమ్, క. పవళె, తె పగడము, కువి పగ్నెలు పదం ప్రాచీన తమిళ గ్రంథాల్లో కనిపిస్తుంది. ఇది క్రీస్తు శకారంభ కాలంలోనే తమిళ భాషలో ఉన్నట్లు తెలుస్తుంది. ఆ కాలంలో ద్రావిడ భాషలపై ఆర్య భాషా ప్రభావం అంతగా ఉన్నదని చెప్పలేం. అదీగాక పగడమనేది దక్షిణదేశపు సముద్రతీరంలో విస్తారంగా లభించే వస్తువు. కాబట్టి ఇది పుట్టిన చోటనే దీనికాపేరు కూడా లభించి వుండాలి. ఈ విషయం ఇది ద్రావిడ పదమే అనటానికి ఉపబలం.

3. ఈ విధంగా ద్రావిడభాషా పదాలే అని తేలిన ఆయా పదాలు ద్రావిడ భాషా ధాతువు నుంచి నిష్పన్నమైనాయన్న (derived) విషయం నిర్ధారణ కావాలి. ఉదాహరణకి సంస్కృతంలోని 'చందన' అనే పదాన్ని తీసుకొందాం. చందనపు చెట్టు, చందనపు పొడి, గంధం అని దీనికి అర్థాలు. ఈ పదం ద్రావిడ భాషల్లో క్రింది విధంగా కనిపిస్తుంది. త. చాందు (Pigment, Paste, Sandal Paste, Sandal tree), చాందమ్ (Sandal), చాత్తు (Smear), మ. చాందు (Paste of sandal), క. సాదు (a fragrant substance, perfume), తె. చాదు (To rub into a paste, a beauty spot of paste). ఈ పదాలను పరిశీలిస్తే ఇది ద్రావిడ భాషా పదమే అని తేలుతుంది. వ్యుత్పత్తిని బట్టి చూస్తే చాదటం (to rub into paste) అని అర్థాన్నిచ్చే పదాలతో 'చందన' పదానికి సంబంధమున్నట్లు తెలుస్తుంది. చాదు అనే పదానికి రుద్దటం అనే Paste అనీ, గంధం (Sandal Paste) అనీ కూడ అర్థాలుండటం గమనార్హం. ఈ పదం నుంచి చందన (Sandal) మనే ప్రత్యేకార్థం కలిగిన పదం ఏర్పడి వుండాలి. గంధపు చెక్కని చాదటం (రుద్దటం) వల్ల Paste రూపంలో ఏర్పడిన పదార్థాన్ని చందనం అన్నారు. ఇదే విధంగా చాదటంవల్ల తయారైన బొట్టు పెట్టుకొనే నల్లని పదార్థాన్ని తెలుగువాళ్లు చాదు (<చాదు) అని అంటారు.

4. పరిశీలించే పదాలలోని ధ్వని భేదాలనుబట్టి కూడ ఆయా పదాలు ఏ భాషకు చెందినవో నిర్ణయించవచ్చు. ఉదాహరణకి సంస్కృతంలో మల్లికా అనే పదముంది. దీనికి సమాన పదాలుగా త ముల్లై, మ. ముల్ల, క. మొల్లె, తె. మొల్ల అనేవి కనిపిస్తాయి. అన్ని ద్రావిడ భాషా పదాల్లోను మొదటి అచ్చు ఉ/ఒ కనిపిస్తోంది. సంస్కృతంలో మాత్రం 'అ' ఉంది. సంస్కృతం నుంచి ఈ పదాన్ని ద్రావిడ భాషలు ఎరవుగా తెచ్చుకొని వుంటే సంస్కృత పదంలోని

'అ' వర్ణానికి బదులుగా తమిళ మలయాళ భాషల్లో 'ఉ' తెలుగు కన్నడ భాషల్లో 'ఒ' ఎందుకున్నదో వివరించటానికి తగిన కారణం కనపడదు. ఈ పదం ద్రావిడ పదమే అని భావిస్తే సంస్కృత పదంలో 'అ' వర్ణమెందుకున్నదో చెప్ప గలుగుతాము. సంస్కృతంలో హ్రస్వ 'ఒ' కారం లేదు. అందువల్ల ద్రావిడ పదంలోని 'ఒ' కార స్థానంలో సంస్కృత పదంలో 'అ' కారం వచ్చింది. ఈ పదాల్లోని ఉ/ఒ ల్లో 'ఒ' కారమే ప్రాచీనమనీ, అది తమిళ మలయాళ భాషల్లో 'ఉ' కారంగా మారిందనీ భాషాశాస్త్రవేత్తలు నిర్ధారణ చేశారు.

ఇదే విధంగా ద్రావిడ భాషా పదంలోని హ్రస్వ 'ఎ' కార స్థానంలో కూడ సంస్కృతంలో హ్రస్వ 'ఎ' కారం లేని కారణంగా 'అ' కారం కని పిస్తుంది. సం. అర్క 'Colotropis gigantea' త. ఎరుక్కు, మ. ఎరిక్కు, క. ఎర్కె,ఎక్కె,యక్క. తెలుగులో దీనికి సమానపదం కనిపించదు. సంస్కృతం లోని అర్కపదమే కావ్యభాషలో వాడబడింది తెలుగువారి వాడుకలో జిల్లేడు అనే పదం కనిపిస్తుంది.

ద్రావిడ భాషలో మాత్రమే ప్రత్యేకంగా కనిపిస్తున్న. ఆ భాషలకే పరిమితమైన కొన్ని హల్లుల వల్లకూడ ఆయా పదాలు ద్రావిడభాషా పదాలని తెలుస్తుంది. ఉదాహరణకి సంస్కృతంలో తాల అనే పదానికి సమాన పదాలుగా తెలుగులో తాడి, కన్నడంలో తాఱ్ (Palmyra) కనిపిస్తాయి. ఈ 'ఱ' వర్ణం ద్రావిడ భాషల్లో మాత్రమే ఉన్నవర్ణం. మరి ఏ భాషలోను లేదు. ఆ వర్ణం సంస్కృతంలో లేకపోవటం వల్ల దాని స్థానంలో 'ల' వచ్చింది.

5. సంస్కృతంలోను, ద్రావిడ భాషల్లోను కనిపిస్తున్న పదాల అర్థాన్ని పోల్చి చూడటం వల్ల కూడ ఆ పదం ఏ భాషకి చెందినదో తెలుస్తుంది. సం. మల్ల 'కుస్తీ పట్టేవాడు' (Wrestler athlete), త. మల్లన్ 'కుస్తీపట్టే వాడు, యుద్ధవీరుడు, బలవంతుడు, యువకుడు, సేనానాయకుడు, కొండ ప్రాంతపు నివాసి'. ఇందులో సంస్కృత పదంకంటె తమిళ పదానికి విశాలార్థం కనిపిస్తోంది. అందువల్ల ద్రావిడ భాషా పదమే సంస్కృతంలోనికి చేరి వుంటుం దని చెప్పవచ్చు. మిగిలిన ద్రావిడ భాషల్లో ఈ పదం క్రింది విధంగా కని పిస్తుంది. మ. మల్లన్, క. మల్ల, తె. మల్లు

పైన చెప్పిన పదాలు కాక ఇంకా ఋగ్వేదంలో కనిపిస్తున్న ద్రావిడ భాషా పదాలు కొన్ని కుండ (Pot), దండ (Stick), పుష్ప, బల, బీజ, మయూర, ఉలూఖల (త. ఉలక్కై, మ. ఉలక్క, క. ఒలకె, తె రోకలి) మొదలైనవి ఋగ్వేదంలో మండూక శబ్దం కనిపిస్తుంది. ద్రావిడ పదాలైన మణ్ (earth),

తూన్కు (to nod, sleep) అనే పదాలనుంచి మండూక శబ్దం వ్యుత్పన్నమైందని తెలుస్తుంది. వాతావరణం పొడిగా ఉన్నప్పుడు కప్ప మట్టిలోపల నిద్రిస్తుంది. అది మన్ను (*మణ్)లో తూగు (*తూన్కు)నది. అదే మండూకమైంది.

ఈ విధంగా ఋగ్వేదకాలంనుంచి ఆధునికార్య భాషల వరకు ద్రావిడ భాషా పదాలు ఆర్య భాషల్లో చేరటం జరిగింది. ఋగ్వేదకాలం నాటికి ఆర్యులు ఉత్తర భారతదేశంలో కొన్ని ప్రాంతాల్లో మాత్రమే ఉన్నారు. ఆనాడు ఉత్తరం నుంచి దక్షిణం వరకు భారతదేశమంతటా ద్రావిడ భాషలు వ్యాపించి ఉన్నాయి. ఋగ్వేదంలో ద్రావిడ పదాలుండటంవల్ల, తరువాతి కాలాల్లో కూడ సంస్కృతంలో ద్రావిడ పదాలు చేరటం వల్ల ఇప్పుడు ఆర్య భాషలు వ్యాపించి వున్న ఉత్తర భారత దేశమంతా ఒక కాలంలో ద్రావిడభాషలు వ్యవహరింప బడిన ప్రాంతమే అని తెలుస్తుంది.

ద్రావిడ భాషా పదాలు సంస్కృతలోనికి వెళ్ళి చేరటం సంస్కృత భాషా చరిత్రలో అన్ని కాలాల్లోను కనిపిస్తుంది. ఆ విధంగా ద్రావిడ భాషా పదాల్ని తీసుకోవటం క్రమంగా అధికమైందని కూడ ఆ భాషలో చేరిన ఆయా పదాలను బట్టి తెలుస్తుంది. రామాయణ మహాభారత కాలాల్లో ద్రావిడ పదాలు అధికంగా చేరినట్లు ఆయా గ్రంథాలను బట్టి తెలుస్తుంది. అ గ్రంథాల్లో మొదటి సారిగా కనిపిస్తున్న ద్రావిడ పదాల్లో చాల పదాలు క్రీస్తుపూర్వపు పాలి భాషలో కనిపిస్తాయి. ప్రాకృత భాషల్లో కూడ ప్రాచీన హింద్వార్య భాషల్లోలేని పదాలు కొన్ని కనిపిస్తాయి. అవి ద్రావిడ భాషా పదాలుగా నిర్ణయించబడ్డాయి.

ద్రావిడ భాషల నుంచి తీసుకొన్న పదాల సంఖ్య మిగిలిన కాలాల్లో కంటె వేదకాలంలో తక్కువ. పవిత్రమైనవిగా భావించబడుతున్న వేదాల్లో తక్కువగానే అయినా అన్య భాషా పదాలు చేరినాయంటే అంతకు పూర్వం ఎంతో కాలం నుంచి అవి ఆ ప్రజల వ్యవహారంలో ఉండి వుండాలి. లేకపోతే ఆ పదాలకి వేదభాషలో స్థానం ఉండటం జరగదు. దీన్నిబట్టి వేదకాలానికి చాల పూర్వమే ఆర్యులకు ద్రావిడులతో సంబంధం (Contact) ఉన్నదని తెలుస్తుంది.

ఈనాడు ద్రావిడభాషలు దక్షిణ భారతదేశంలోనే అధికంగా ఉన్నాయి కాబట్టి ఆర్యభాషలోకి వెళ్లి చేరిన ద్రావిడ పదాలు ప్రస్తుతం మనకి కనిపిస్తున్న ద్రావిడ భాషల నుంచి మాత్రమే తీసుకోబడ్డాయని భావించనవసరం లేదు. మధ్య, ఉత్తర భారతదేశంలో అక్కడక్కడా ద్రావిడ భాషా ప్రాంతాలు నేటికీ కనిపిస్తున్నాయి. అవి ఆర్య భాషలతో పరివృతమై ఆ భాషా ప్రభావానికి లోనవుతున్నాయి. సంస్కృతంపైన ప్రభావం చూపిన భాష ఉత్తర ద్రావిడ భాష అనే చెప్పాలి.

ఈనాడు కురుఖ్, మాల్తో, బ్రాహుయి లు మాత్రమే ఉత్తర ద్రావిడ భాషలుగా కనిపిస్తున్నాయి గాని ప్రాచీనకాలంలో అంటే, ఆర్యులు భారతదేశానికి వచ్చి నప్పుడు ఉత్తర భారతదేశమంతటా ద్రావిడ భాషలు వ్యవహారంలో ఉండి వుంటాయి. అందువల్లనే అవి ఆర్యభాషను ప్రభావితం చేయగలిగాయి. ఆ ప్రాచీన కాలంలో ఆ ప్రాంతమంతటా ద్రావిడభాషలు అధికంగా వ్యాపించి వుండటంవల్లనే ద్రావిడ భాషా ప్రభావం ఆర్య భాషపైన అన్ని కాలాల్లోను అధికంగా కనిపిస్తుంది. తరువాత ఆయా ప్రాంతాలను ఆర్యులు ఆక్రమించటంవల్ల ఉత్తరాన ఉన్న ద్రావిడ భాషా ప్రాంతాలు ఆర్య భాషా ప్రాంతాలుగా మారాయి. అందువల్లనే ఆర్యేతర భాషలు భారతదేశంలో ఉత్తర ప్రాంతం నుంచి దక్షిణ ప్రాంతానికి వ్యాపించినా యనీ, అవే ద్రావిడ భాషలనీ భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

ఆర్యులు చాల ద్రావిడ భాషాపదాలను స్వీకరించారనేది నిరూపించ బడిన విషయం. కాని సంస్కృతంలో తగిన పదజాలం కలిగివుండి కూడ నీర, మీన, కానన, కుంతల వంటి పదాల నెన్నిటినో కూడ గ్రహించటం జరిగింది. వీటికి సంస్కృతంలో వరుసగా ఉదక, మత్స్య, వన, కేశ అనే పదాలున్నాయి. ప్రాథమిక పదజాలానికి చెందిన ఈ పద స్వీకారం నిజానికి ఆర్యభాషా వ్యవ హర్తలకి అంత అవసరం కాదనే చెప్పాలి. కాని ఇందుకు కారణం ఆ కాలంలో ఉత్తర భారతదేశంలో ఉన్న ఉభయభాషావ్యవహారమే (bilingualism). మొదట ఇటువంటి పదస్వీకారం సామాన్య జనవ్యవహారంలో ప్రారంభమై క్రమంగా వ్యవహారబలంవల్ల గ్రంథాల్లో స్థానాన్ని పొందుతుంది. అదే ఋగ్వేద కాలంలోను జరిగింది. భాషలున్నంత కాలమూ జరుగుతుంది.

ఈ విధంగా వైదిక సంస్కృతంలోనే ద్రావిడ భాషా పదాలు చేరినట్లు నిరూపించబడటంవల్ల వేదకాలం నాటికి ద్రావిడ భాషలు భారతదేశంలో విరివిగా వ్యాప్తిలో ఉన్నట్లు తెలుస్తుంది. పవిత్ర గ్రంథాలుగ భావించబడుతున్న వేదాలలో వీటికి స్థానం లభించిందంటే అంతకు పూర్వం ఎంతోకాలం నుంచి ద్రావిడభాషలు ప్రజల వ్యవహారంలో ఉండి క్రమంగా అభివృద్ధి చెందాయని చెప్పవచ్చు

21

# మూల ద్రావిడ భాషా ప్రతిబింబం

భాషా పరిణామం నూతన భాషోత్పత్తికి కారణమవుతుంది. ఒక భాష లోని మాండలిక భేదాలు కాలక్రమంలో వేర్వేరు భాషలుగా పరిణమించటానికి అవకాశముంది. ఒక భాషా సమాజానికి చెందిన వ్యవహర్తలు కొందరు వేరు ప్రాంతానికి వలసవెళ్లి అక్కడ స్థిరనివాస మేర్పరచుకొంటే కొంత కాలానికి వలస వెళ్లిన ప్రజల భాషలో మార్పు వస్తుంది. అది కేవలం కాలక్రమంలో సంభవించే మార్పు మాత్రమే కాక ఆయా ప్రాంతాలలో వ్యవహరించబడుతున్న అన్యభాషా ప్రభావానికి లోనై సంతరించుకొన్న కొత్త లక్షణాలతో కూడిన మార్పు. అటువంటి సందర్భంలో మార్పుచెందిన ఈ భాష మూలభాషా ప్రాంతం లోని భాష కంటె భిన్నమైన లక్షణాల్ని కలిగివుంటుంది. ఇంకా కొంత కాలానికి విభేదాలు అధికమై, ఈ రెండూ ప్రత్యేక భాషలుగా కనిపిస్తాయి. ఒకనాటి వైదిక సంస్కృతం నుంచి వివిధ ప్రాకృత భాషలు, వాటినుంచి ఆధునిక ఔత్తరాహ భాషలు ఈ విధంగా ఏర్పడినవే.

ఒక భాష నుంచి ఏర్పడిన భిన్న భాషలను జన్యభాషలు (daughter languages) అంటారు. జన్యభాషలకు మూలమైన దానిని జనకభాష (parent lauguage) అంటారు. ఒక మూల భాష నుంచి పరిణమించిన జన్య భాషల మధ్య ఉన్న సంబంధం సోదర సంబంధం. ఆ భాషల్ని సోదర భాషలు (sister languages) లేక సగోత్ర భాషలు, జ్ఞాతి భాషలు (Cognate languages) అంటారు. భారత దేశంలోని తమిళం, మలయాళం, కన్నడం, కుయి, కువి, కొండ వంటి ద్రావిడ భాషలు సోదర భాషలే.

భాషా పరిణామాన్ని పరిశీలించినప్పుడు రెండు లక్షణాల్ని గమనించ వచ్చు. 1. భాషలో వచ్చిన మార్పు వల్ల ఒక భాషలో ఏర్పడిన నూతన లక్షణం (Innovation). ఉదాహరణకి మధ్య ద్రావిడ భాషలలో కాలక్రమంలో ఏర్పడిన పదాది సంయుక్తాక్షరాలు. ద్రావిడ భాషలో సంయుక్తాక్షరాలుండవు. కాని ఇది మధ్య ద్రావిడభాషల్లో ఏర్పడిన నూతన పరిణామం. 2. ఒక భాషలో నిలిచివున్న ప్రాచీనభాషాలక్షణం (Retention or Survival). ఉదాహరణకి మూల ద్రావిడ భాషలోని పదాది *చ- వర్ణ చాల ద్రావిడ భాషల్లో ముఖ్యంగా దక్షిణ

ద్రావిడ భాషల్లో లోపించింది. పర్జివంటి మధ్య ద్రావిడ భాషలు -డ్లాన్ని నిలుపుకొన్నాయి. భాషా పరిణామాన్ని పరిశీలించేటప్పుడు ఈ రెండు విషయాల్ని దృష్టిలో పెట్టుకోవలసి వుంటుంది.

ద్రావిడ భాషల పరస్పర సంబంధం చాలకాలం క్రిందటే నిరూపించబడింది. ఆ భాషలలోని వర్ణాలు, ధాతు నిర్మాణం, పదజాలం, వ్యాకరణం అంతా ఒకే విధంగా ఉంటుంది. కాబట్టి ఆ భాషలన్నీ చాల ప్రాచీనకాలంలో ఒకే భాషగా ఉండి కాల క్రమంలో మార్పును పొంది వేర్వేరు రూపాలను సంతరించుకొని వేర్వేరు భాషలుగా రూపొందాయని చెప్పవచ్చు. ఆ మూల భాషనే ఇప్పుడు మనం మూలద్రావిడభాష (Proto Dravidian language) అంటున్నాం. అదే నేటి ద్రావిడ భాషలన్నిటికీ జనకభాష. దాన్ని చాల ప్రాచీనకాలంలో అంటే, నేటి ద్రావిడ భాషలేవీ ఏర్పడక పూర్వం భారతదేశంలోని ద్రావిడులు వ్యవహరించి వుండి వుంటారని చెప్పవచ్చు.

ఆ మూలద్రావిడ భాష అన్ని ప్రాంతాలకు వ్యాపించిన తరువాత అది వేర్వేరు మార్పుల్ని పొందింది. క్రమంగా అవన్నీ ఒకదాని కొకటి అర్థం కానంతగా మార్పుచెంది వేర్వేరు భాషలుగా పరిణమించాయి. అవే నేటి తెలుగు కన్నడ తమిళ మలయాళాది భాషలు. ఇప్పటి ద్రావిడభాషల్లో కనిపిస్తున్న ఏ సామాన్య లక్షణమైనా కొన్ని వేల సంవత్సరాలనాటి ప్రాచీన ద్రావిడభాషలో ఉండి వుంటుంది ఏదయినా ఆ విధంగా కాని పక్షంలో అంటే, మూల భాషలోని లక్షణం ఏ భాషలో అయినా కనిపించకపోతే ఆ భాష మాత్రం కాలక్రమంలో అధికమైన మార్పులకు లోనై ఉంటుందని చెప్పాలి. ఇదే విధంగా కొన్ని భాషల్లో మూల భాషలో లేని లక్షణాలు కూడ కనిపించవచ్చు. ఆ సందర్భంలోను ఆ భాషలు ఎక్కువ మార్పుకి లోనవుతున్నాయనే తెలుస్తుంది.

కొన్ని వేల సంవత్సరాల క్రిందట వ్యవహరించబడిన మూల ద్రావిడ భాషా స్వరూపం తెలుసుకోవటానికి స్పష్టమైన లిఖితాధారాలు లేవు. ఆ భాష ఏ విధంగా ఉండిందో తెలియాలంటే జన్య భాషల్లోని సదృశ లక్షణాల్ని పోల్చి చూచి లిఖిత ప్రమాణ రూపం లేని జనకభాషా స్వరూపాన్ని కొంతవరకు నిరూపించవచ్చు. ఈ నాడు వ్యవహారంలోఉన్న ద్రావిడ భాషల్ని తులనాత్మకపద్ధతిలో పరిశీలించి ఆయా భాషల్లోని లక్షణాల్ని తెలుసుకొని వాటి ఆధారంతో మూల ద్రావిడ భాషా స్వరూపాన్ని ఊహించటం జరిగింది. జన్య భాషలెంతగా మారినా జనకభాషా లక్షణాల్ని పూర్తిగా పోగొట్టుకోవు. సోదర భాషలతో వాటి సజాతీయతను తెలిపే సమాన భాషా లక్షణాలు వర్ణాల్లోను, పదజాలంలోను, ప్రత్యయాల్లోను, వాక్యనిర్మాణాదుల్లోను కనిపిస్తాయి. దాన్నిబట్టి మూల భాషా లక్షణాలు కొన్ని మార్పుల్ని పొంది కూడ జన్యభాషల్లో ఉండడం సహజమని తెలుస్తుంది.

మూలభాష నుంచి విడిపోయి స్వతంత్ర పరిణామాలకి లోనైన ప్రతి భాషలోను మూలభాషా లక్షణాలు కొంతవరకు తప్పక నిలిచి వుంటాయి. ఆయా భాషల పరిణామక్రమంలో కలిగిన అన్య భాషా సాహచర్యంపైన ఈ విషయం ఆధారపడి వుంటుంది. ఇతర భాషల ప్రభావం అధికంగా ఉన్న భాషల్లో మూల భాషా లక్షణాలు అల్పంగా నిలిచివుంటాయి. అన్యభాషా ప్రభావానికి అంతగా లోనుగాని భాషల్లో ప్రాచీన భాషా లక్షణాలు అధికంగా నిలిచివుంటాయి. కాబట్టి మూలభాషా లక్షణాలు ఏయే భాషలెంతవరకు నిలుపుకొన్నాయో పరిశీలించాలంటే నాగరక భాషలతోపాటు అనాగరక భాషల్ని కూడ పరిగణలోనికి తీసుకోవాలి. అట్లా పరిశీలించినప్పుడు ప్రతి భాషలోను ఏవో కొన్ని ప్రాచీన భాషా లక్షణా లున్నట్లు తెలుస్తుంది. కేవలం ఏ ఒక్క భాషా ప్రాచీన లక్షణాలన్నిటిని నిలుపు కొన్నది కనిపించదు.

నేటి ద్రావిడభాషల్ని పరిశీలించి వాటిలోని సామాన్య లక్షణాల ఆధా రంగా ప్రాచీన ద్రావిడభాషా లక్షణాల్ని కొంతవరకు నిరూపించటం జరిగింది. ఈ ప్రాచీన ద్రావిడభాషకి ప్రాచీన తమిళభాష (సెందమిళ్ లేక Classical dialect of the Tamil language) సన్నిహితంగా ఉంటుందనీ, అది మూల ద్రావిడ భాషకి ప్రతినిధి అనీ కాల్డ్వెల్ ప్రభృతి పరిశోధక పండితుల అభిప్రాయం.

'సెందమిళ్' ప్రాచీన తమిళ మాండలికం. ఇది ప్రాచీన తమిళ భాషా లక్షణాల్ని నిలుపుకొన్నది. అన్య భాషా ప్రభావానికి అంతగా లోనుగాని తమిళ భాషలో ప్రాచీన ద్రావిడ భాషా లక్షణాలు అధికంగా నిలిచివుంటాయి. ప్రాచీన తమిళ వాఙ్మయాన్ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. అందులో సంస్కృత ప్రాబల్యానికి లోనుగాని దేశ్యపదజాలం ఎక్కువ. ఎరవు తెచ్చుకొన్న పదాలే తక్కువగా ఉన్నప్పుడు మరి ధ్వనులలోను, తదితర నిర్మాణంలోను మార్పులు జరగటానికి అవకాశం తక్కువ. అయినా గాని ఏ ద్రావిడ మాండలి కమూ ప్రాచీన ద్రావిడభాషకు ప్రతిబింబం కాదనే (ప్రతినిధి కాదనీ) చెప్పాలి.

ప్రస్తుతం లభిస్తున్న ద్రావిడ భాషలన్నిటిని పోల్చిచూస్తే మూల ద్రావిడ భాషా లక్షణాలు చాలవరకు తెలుస్తాయి. ఆ మూలభాష నుంచి ఇప్పటి ద్రావిడ భాషలన్నీ ఏర్పడ్డాయి కాబట్టి కేవలం సెందమిళమే కాకుండా అన్ని భాషలూ కూడ మూలభాషా లక్షణాల్ని వెల్లడి చేయటానికి సహాయపడతాయి. అయినప్పటికి ద్రావిడభాషల ప్రాచీన లక్షణాల్ని తెలుసుకోవటానికి తమిళమే, అందులోను సెందమిళమే సహాయపడుతుందని చాలమంది అభిప్రాయపడ్డారు.

ద్రావిడ భాషలన్నిటిలోను తమిళం అతి ప్రాచీనమైన నాగరక భాష కావటం అందుకు కారణం. అది చాల మూల ద్రావిడ భాషా లక్షణాల్ని కూడ నిలుపుకొంది. నాగరక అనాగరక ద్రావిడ భాషల్ని పరిశీలిస్తే వాటిలో ఏ భాషలో ఏయే ప్రాచీన ద్రావిడభాషా లక్షణాలు నిలిచివున్నాయో తెలుస్తుంది. మూల

ద్రావిడ భాషాలక్షణాల్ని మనసులో పెట్టుకొని ఆ లక్షణాలు ఏయే భాషలో ఎంత వరకు కనిపిస్తాయో తులనాత్మకంగా పరిశీలిస్తే నేటి ద్రావిడభాషల్లో ఏది ప్రాచీన ద్రావిడ భాషా లక్షణాల్ని అధికంగా కలిగివున్నదో, ఏది ప్రాచీన ద్రావిడ భాషకి ఎక్కువ సన్నిహితంగా ఉన్నదో తెలుస్తుంది.

1. ఴ (ẓ) వర్ణం ద్రావిడభాషలలో మాత్రమే కనిపించే వర్ణం. ఇది ఆ భాషలకు మాత్రం పరిమితమైనది. మూలద్రావిడ భాషలో కూడ ఇది ఉండి నట్లు తెలుస్తుంది. మూలద్రావిడభాషా *ఴ వర్ణం నేటి ద్రావిడ భాషలు కొన్నిటిలో మార్పును పొందింది. ఇది తమిళ మలయాళ భాషలలో మాత్రం నిలిచివుంది. ఉదా: ఏఴు 'ఏడు'. కన్నడంలో 'ళ'గా మారింది ఉదా: ఏఴు/ఏళు 'ఏడు'. తెలుగు శాసన భాషలో ఇది కనిపిస్తుంది. ఏఴు. కాని కావ్యభాషలో లేదు. ఈ వర్ణం తెలుగులో 'డ'గా మారింది. ఉదా: ఏడు. వర్ణవ్యత్యయం కారణంగా ఇది పదాదికి వచ్చి 'ద' గా మారింది. ఉదా : అఴన్కు>ఴాన్కు>దాఁగు> దాఁగు>దాగు. వర్ణవ్యత్యయ కారణంగా పదాది సంయుక్తాక్షరాల్లో వచ్చినప్పుడిది రేఫంగా మారింది. ఉదా: కొఴ్ఉవ్>కొఴ్వ్>క్ఴొవ్వు>క్రొవ్వు. ఈ విధంగా *ఴ వర్ణం మిగిలిన ద్రావిడ భాషల్లో కూడ కొంత మార్పును పొంది కనిపిస్తుంది. కాని తమిళ మలయాళ భాషల్లో మాత్రం చాలచోట్ల ఇది నిలిచి వుంది తమిళంలో అధికంగా ఇది కనిపిస్తుంది.

2 మూల ద్రావిడభాషా వర్ణాలైన *ణ, *ళ లు మధ్య, ఉత్తర ద్రావిడభాషల్లో న, ల లతో కలిసిపోయాయి. దక్షిణ ద్రావిడభాషలలో ఇవి నిలిచివున్నాయి. ఉదా: త. మ. క. కోట. కణ్ 'కన్ను'; తోద. కొణ్, తుళు. కొడగు. కణ్ణి; తె. కన్ను; కొలా. నా. గదబ. కన్; గోండి. కన్; ఒల్లారి. కణ్; కొండ. కణ్; కుయి. కన్ను, కువి. కన్ను; కురుఖ్. ఖను (Khanu); మా ఖను (quanu); బ్రా. ఖన్ (khan). వీటికి మూల భాషా రూపం *కణ్. ఈ ఉదాహరణలను బట్టి తమిళము, మిగిలిన దక్షిణ ద్రావిడభాషలు మూలభాషా లక్షణాన్ని నిలుపుకొన్నట్లు తెలుస్తుంది.

ఇదే విధంగా *ళ వర్ణంకూడ దక్షిణ ద్రావిడభాషల్లో నిలిచివుంది. త. వెళ్ 'తెలుపు'; మ వెళ్; కోట వెళ్; క. బెళ్; తె. వెలుఁగు. వెల్ల; కొలా వెలుంగ్; పర్జి. విలి; ఒల్లా. విలెద్.

3. మూల ద్రావిడభాషలోని *ఞ వర్ణం మలయాళంలోను, ప్రాచీ తమిళంలోను, కొడగులోను మాత్రం కనిపిస్తుంది. మిగిలిన భాషల్లో ఇది 'న' వర్ణంతో కలిసిపోయింది. ఉదా: 1 త. ఞాన్, నాన్ 'తీగ, తాడు, str ng cord'; మ ఞాన్; క. నేన్; తె. నాను 'నాను అనబడే కంఠాభరణం'. 2. త. ఞాలమ్ 'నేల, భూమి'; మ. ఞాలమ్, తె నేల, నాయికి. ఏల్, గోండి. నేలీ, నెల్, కుయి. నేల, నేద, నేడె, కురుఖ్. నాల్.

4. మూల ద్రావిడ పదాది *య- వర్ణం ప్రాచీన తమిళంలో మాత్రం నిలిచివుంది. మిగిలిన భాషల్లో లోపించింది. ఉదా : 1. త. యాటు, ఆటు 'మేక, గొర్రె', మ. ఆటు, క. ఆడు, తె. ఏట. 2. త. యానై, ఆనై. 'ఏనుగు'; మ. ఆన, క. ఆనె; తె. ఏనుఁగు, ఏనిక, ఏనిగె, ఏనిగ, ఏనుగ; కొలా. ఎనాగీ, ఏన్గి, పర్జి. ఏను, గదబ. ఏనిగ్; గోండి. ఏనీ, కొండ. ఏని.

5. మూలద్రావిడభాషలో ఉన్న సంయుక్తాచ్చు *అయ్ (ay) దక్షిణ ద్రావిడభాషల్లో అదే విధంగా కనిపిస్తుంది. ఇది మధ్య, ఉత్తర ద్రావిడ భాషల్లో 'ఏ' (<*ey)గా మారినట్లు తెలుస్తుంది. ఉదా : త. కై 'చెయ్యి'; మ. కై, కయ్య; కోట. కయ్; తోడ. కొయ్, క. కయ్, కయి, కయ్య, కెయ్, కొడగు. కయ్, తుళు. కై; తె. చేయి; కొలా. పర్జి. కెయ్; కువి. కేయు, కేజు, కురుఖ్. ఖెఖ్ఖా (khekkha), మాల్తో. ఖెఖె (qeqe). 2. త. కైతల్, కైతై 'మొగలి, fragrant screwpine, pandanus odoratissimus' మ. కైత, క. కేదగె, కేదిగె; తె. గేదఁగి.

6. మూల ద్రావిడ భాషలో శ్వాసవత్ స్పర్శాలేకాని నాదవత్ స్పర్శాలు లేవు. తమిళ మలయాళ భాషల్లో ఈ విధానమే నిలిచివుంది. పదాదిన కచతప లు పరుషములుగానే కనిపిస్తాయి ఉదా : పాణై 'కుండ, బాన', రెండచ్చుల నడుమ, అనునాసికములకు పరమైనప్పుడు ఇది సరళములుగా ఉచ్చరించబడతాయి. ఉదా: చోడు (cōtu) 'జోడు, జంట', పొంది (ponti) 'బొంది, శరీరం'. ద్విత్వములైనప్పుడు పరుషాలుగానే ఉచ్చరించబడతాయి. ఉదా: కట్టమ్ 'గడ్డము'. ఈ విధంగా శ్వాస స్పర్శాలే పూరక ప్రవృత్తిని కలిగి ఈ నాటికి కూడ తమిళ మలయాళ భాషల్లో ఉన్నాయి. శ్వాస నాద స్పర్శాల నడుమ అర్థభేదం ఈ భాషల్లో లేదు. కాబట్టి అవి ప్రత్యేక వర్ణాలు కావని చెప్పగలం. అది మూలద్రావిడ భాషా స్థితి. అదే తమిళ మలయాళ భాషల్లో నేటికీ కనిపిస్తుంది.

సాధారణంగా ద్రావిడ భాషల్లో శ్వాస నాద స్పర్శాలు ఒకదానికొకటి వాడబడినాగాని అర్థభేదం కలగదు. ఉదా: తె కడుచు/గడుచు(to pass time); త.కూన్; క.కూను, గూను; తె.గూను (hemp). తెలుగులో ఈ విధంగా అర్థ భేదం కలగని పదాలు ఇంకా చాల కనిపిస్తాయి- కడప-గడప; మొకం-మొగం; చీరాడు-జీరాడు, చల్లు-జల్లు, చెప్పటం-చెప్పడం, బ్రతుకు-బ్రదుకు మొదలైనవి. తెలుగు, కన్నడ భాషల్లో శ్వాసనాదాలనడుమ అర్థభేదం కాలక్రమంలో ఏర్పడింది. అందువల్ల అవి ప్రత్యేక వర్ణాలుగ నిరూపించబడ్డాయి. ఉదా: తె. పాట-బాట, కాలము-గాలము.

7. మూలద్రావిడ భాషలో దంతమూలీయ, మూర్ధన్యవర్ణాలు పదాదిన రావని సిద్ధాంతం. తమిళ మలయాళ భాషల్లో నేటికీ ఇదే విధంగా ఉంటుంది. కాని మధ్య ద్రావిడ భాషలైన తెలుగు, కుయి, కువి ఉప కుటుంబంలో మాత్రం

వర్ణవ్యత్యయం కారణంగా ఈ వర్ణాలు పదాదిన కనిపిస్తాయి. ఉదా : 1. త. ఇరణ్డు 'రెండు', మ. రణ్డు 'రెండు', ఇరట్ట 'రెట్టింపు', ఇరుపదు 'ఇరవై', కోట. ఇర్వద్ 'ఇరవై'; తోడ. ఎడ్ 'రెండు'; క. ఎరడు 'రెండు'; కొడగు. ఇరువది 'ఇరవై', తె. రెణ్డు, ఇరువది, ఇరవై, కొలామి, ఇర్వై 'ఇరవై'; నాయికి. ఇద్దర్ 'ఇద్దరు'; పర్జి. ఇర్డు 'రెండు వస్తువులు'; గదబ. ఇండి 'రెండు వస్తువులు', గోండి. రండ్ 'రెండు', ఈరూ(ర్) 'ఇద్దరు', కొండ. రుండి 'రెండు'; కుయి, కువి. రీ 'రెండు'; కురుఖ్. ఇర్బ్ 'ఇద్దరు', మాల్తో, ఇవ్ర్ 'ఇద్దరు'; బ్రా. ఇరట్ 'రెండు'. 2. త. ఇల్లై 'లేదు'; మ. ఇల్ల; కోట. తోడ. ఇల్, క. ఇల్ల; కొడగు. ఇల్లె; తుళు. ఇజ్జి; తె. లేదు; పర్జి. చిల, గోండి. హిల్లె, సిలె, కొండ. సిల్, కుయి. సిడ, కువి. హిల్ల్, మాల్తో. చిలె. 3. త. ఇఱి 'దిగు', మ. ఇఱిక; క. ఇళి, తుళు. ఇళియుని, తె. డిగ్గు; డిగు>దిగు, కొలామి. డిగ్, డిగ్, డిగ్గ్; నాయికి. డిగ్గ్, పర్జి. ఇడ్(ir̥-); గదబ. ఇడ్గ్ (ir̥g-), కుయి. దీవ, బ్రా. దడింగ్ (dariṅg).

8. ద్రావిడ భాషలో సంయుక్తాక్షరాలుండవు. ఇది మూల ద్రావిడ భాషాస్థితి. తమిళంలో ఈ స్థితి నిలిచివుంది. వర్ణవ్యత్యయాది పరిణామాలవల్ల తెలుగు, కుయి, కువి వంటి మధ్య ద్రావిడభాషల్లో భిన్న హల్సంయోగం కాల క్రమంలో ఏర్పడింది. చాల ద్రావిడభాషలు ఈనాటికి కూడ ప్రాచీన భాషాస్థితినే నిలుపుకొన్నట్లు తెలుస్తుంది. ఉదా : 1. త.మ. కొఴు 'కొవ్వు'; కోట. కొళ్, తోడ. క్వళ్, క. కొర్వు, కొర్బు, కొబ్బు; తుళు. కొమ్మె, తె. క్రొవ్వు. కొవ్వు; కొలా. నాయికి. కొరు, పర్జి. కొడ్వ్ (Korw); కుయి, క్రోగ; కువి. కొరొవ; బ్రా. కుబేన్. 2. త. మిఴుంకు 'మ్రింగు'; మ. మిఴున్నుక; కోట. మింగ్, క. మింగు, ముంగు, కొడగు. ముగ్గ్; తె. మ్రింగు, మింగు, కొలామి. మింగ్; కురుఖ్. మున్ఖ్నా (Munkhnā).

పై ఉదాహరణలను గమనిస్తే పదాదిన రేఫ ద్వితీయ వర్ణంగా కలిగిన సంయుక్తాక్షరాలు వర్ణవ్యత్యయ కారణంగా కొన్ని మధ్యద్రావిడభాషల్లో ముఖ్యంగా తెలుగులో ఏర్పడినట్లు తెలుస్తుంది. దీనితోపాటు ఇతర హల్లులతో కూడిన సంయుక్తాక్షరాలు కూడ మధ్య ద్రావిడభాషల్లో కనిపిస్తాయి. ఉదాహరణకి కొన్ని క్రింద ఇవ్వబడ్డాయి. 1. త వరై 'వ్రాయు', మ వర, క. బరె, తె. వ్రాయు, రాయు, కుయి. ప్రీస; కువి. బ్రీనై. 2. త. విరి 'విరియు, వ్యాపించు'; మ. విరియుక, క. బిరి, తె. విరియు, కుయి. వ్రింగ 'ముక్కలై పోవటం'; కువి. బ్రీఅలి. 3. త.మ. తలై 'తల', క. తలె, తల; తె. తల, కుయి. త్లఉ 'తల, తలమీది జుట్టు', కువి. త్రాజు 'తల'. 4. త. మ. క. పుఴు 'పురుగు', తె. పుర్(రు)గు, పుర్(రు)వు, ప్రువ్వు, కుయి. ప్డీయు (pr̥iu), ప్ఢియు; కువి. ప్రీయూలి 'గొంగళి పురుగు', ప్లిగులి 'పురుగు'. 5. త. ముయల్, ముచల్

'కుందేలు', మ. ముయల్; క. మొల, మల; కుయి. మ్డాడు (mr̥āḍu); కువి. మ్డాలూ- (mr̥ālū), మ్రాలు, మ్రలు. దీనికి తెలుగులో సమానపదం (Corresponding word) కనపడదు. ఈ విధంగా సంయుక్తాక్షరాలేర్పడటం మధ్య ద్రావిడ భాషల్లో జరిగిన నూతన పరిణామం (Innovation).

9. అన్ని ద్రావిడభాషల్లో లింగవివక్ష ఒకే విధంగా కనపడదు. తోడ, బ్రాహుయి భాషల్లో లింగ వివక్ష కనపడదు. తెలుగు తప్ప మిగిలిన మధ్య ద్రావిడ భాషల్లో పురుషవాచక శబ్దాలన్నీ ఒక లింగంగాను, పురుషేతర వాచకాలన్నీ ఇంకొక లింగంగాను పరిగణించబడతాయి. ఉదాహరణకి గోండిలో వోర్ 'అతను', వూర్ 'వాళ్లు' (పుంలింగ బహువచనం), అద్ 'ఆమె, అది', అవ్ 'వాళ్లు (స్త్రీ లింగ బహువచనం), అవి'. తెలుగులో 'అవి' అనే పదానికి "ఆ స్త్రీలు" అనే అర్థం రాదు. తోడ తప్ప మిగిలిన దక్షిణ ద్రావిడభాషల్లో ఏకవచనంలో పుం, స్త్రీ, నపుంసక (లేదా మనుష్యేతర) లింగములు, బహువచనంలో పుం. స్త్రీ సామాన్య బహువచనం నపుంసక బహువచనం ఉన్నాయి. వీటిలో స్త్రీ లింగవాచి ప్రత్యయం-ఆళ్. ఇది మొదట 'స్త్రీ' అనే అర్థాన్నిచ్చే ప్రత్యేక శబ్దం. త. ఇల్లాళ్, తె. ఇల్లాలు. దీన్ని బట్టి దక్షిణ ద్రావిడభాషల్లో స్త్రీ లింగ ఏకవచనం ఆళ్ అనే శబ్దాన్ని ప్రత్యయంగా ఉపయోగించటంవల్ల సృష్టించబడిందని తెలుస్తుంది. ఉత్తర ద్రావిడభాషలైన కురుఖ్, మాల్తోభాషల్లో పుంలింగ ఏకవచనం, పుంలింగేతర ఏకవచనం, పుం స్త్రీ సామాన్య బహువచనం మాత్రం కనిపిస్తాయి. వీటిలో నపుంసకాలలో ఏకబహువచన భేదం లేదు. మొత్తంమీద అన్ని భాషల్లోను స్త్రీ పురుషులు కలిసివున్న సముదాయాన్ని తెలిపేటప్పుడు పురుష బహువచన రూపాన్నే వాడతారు. దీన్నిబట్టి మనుష్య బహువచన లింగం ద్రావిడ భాషా ఉపకుటుంబాలు మూడిట్లోను ఉన్నట్లు తెలుస్తుంది. కాబట్టి ఇది మూల ద్రావిడభాషలో ఉండిందని ఊహించవచ్చు. ఇదే విధంగా ఏకవచనంలో గమనిస్తే మధ్య, ఉత్తర ద్రావిడభాషల్లో పురుష, పురుషేతర భేదం కనిపిస్తుంది. దీన్ని బట్టి ఏకవచనంలో పురుష, పురుషేతర భేదం మూలద్రావిడంలో ఉండేదని నిర్ణయించవచ్చు. మొత్తం మీద మూల ద్రావిడభాషలో ఏకవచనంలో పురుష, పురుషేతర భేదం, బహువచనంలో మనుష్య, మనుష్యేతర భేదం ఉన్నదని భావించాలి. మూల ద్రావిడభాష నుంచి దక్షిణ ద్రావిడభాషలు పరిణామం చెందినప్పుడు ఏకవచనంలో స్త్రీలింగ రూపాన్ని కొత్తగా సృష్టించుకొన్నాయి తెలుగు కాక మిగిలిన మధ్య ద్రావిడభాషలు కూడ ఒక కొత్త పరిణామాన్ని పొందాయి. వాటిలో ఏకవచనంలో పురుష, పురుషేతర భేదం ఉంది అది మూల ద్రావిడభాష నుంచి మార్పు ఏమి లేకుండా వచ్చిందే ఈ విభజనని అనుసరించి బహువచనంలో కూడ అదే విధంగా మనుష్య బహువచనంలో నుంచి స్త్రీ లింగాన్ని తీసి అమనుష్య బహువచనంలో చేర్చి పురుష, పురుషేతర భేదాన్ని ఏర్పరచు

కొన్నాయి. ఈ విధంగా లింగ వివక్షకు సంబంధించి స్త్రీ లింగ ఏకవచనం విషయంలో దక్షిణద్రావిడభాషలు, స్త్రీలింగ బహువచన విషయంలో తెలుగేతర మధ్య ద్రావిడభాషలు నూతన పరిణామాన్ని పొందాయి. స్త్రీలింగ బహువచనానికి సంబంధించి ఉత్తర, దక్షిణ ద్రావిడ భాషలు, తెలుగు ప్రాచీన లక్షణాన్ని నిలుపుకొన్నాయని, స్త్రీలింగ ఏకవచనానికి సంబంధించి ఉత్తర, మధ్య ద్రావిడభాషలు ప్రాచీన లక్షణాన్ని నిలుపుకొన్నాయని తెలుస్తుంది. ఉత్తర ద్రావిడభాషలు మాత్రమే స్త్రీలింగ ఏక, బహువచనాలు రెంటి విషయంలోను ప్రాచిన లక్షణాన్ని నిలుపుకొన్నాయని స్పష్టమవుతుంది.

10. బంధు వాచక స్త్రీలింగ పదాలకు చివర *-అళ్ అనే ప్రత్యయం నుంచి పరిణమించిన ప్రత్యయం ఒకటిచేరటం మధ్య ద్రావిడ భాషల్లో కనిపిస్తుంది. ఈ ప్రత్యయం దక్షిణ ద్రావిడ భాషల్లో స్త్రీలింగ ఏకవచనంలో కనిపించే -అళ్/-అళ్ అనే స్త్రీలింగ ప్రత్యయం వంటిదే. ఈ రెండూ అళ్ 'స్త్రీ' అనే శబ్దం నుంచి పుట్టినవే. మధ్య ద్రావిడ భాషల్లో బంధువులైన స్త్రీలను సూచించే పదాలకి చేరే ఈ 'అళ్' ప్రత్యయం దక్షిణ ద్రావిడ భాషా పదాలకి చేరినట్లు కనపడదు. ఉదా: 1. తె. కోడలు; కొలామి, కొరల్ 'తమ్ముడిభార్య', నాయికి. కొరళ్ 'కోడలు, 'పెళ్ళికూతురు'; పర్జి, కొడొల్ (Koṛol) 'పెళ్ళి కూతురు'; గదబ. కోడల్ (Kōṛal) 'కోడలు, తమ్ముడి భార్య'; గోండి. కొరిఅడ్ (Koriāṛ) 'కోడలు'. 2. తె. చెలియలు, చెల్లెలు; పర్జి. చాలల్, గదబ. సేలల్, చెల్లాల్; గోండి. సేలాడ్ (Selāṛ). 3. తె. మఱఁదలు; కొలామి. మరందల్, కుయి, మ్రేగలి.

ఈ విధంగా *-అళ్ ప్రత్యయం ఉన్నపదాలు మధ్య ద్రావిడ భాషల్లోనే కనిపిస్తాయి. కాని దక్షిణోత్తర ద్రావిడ భాషల్లో లేవు. కాబట్టి ఇవి మూల మధ్యద్రావిడ భాషా కాలంలో ఏర్పడ్డాయనవచ్చు. ఈ పదాలలోని ధాతువులు మాత్రం మూలద్రావిడ భాషలోనివే. ఆ ధాతువులకి స్త్రీ ప్రత్యయమైన *-అళ్ చేరటం మధ్య ద్రావిడ భాషలలో నూతన పరిణామం. ఆ విధంగా చేరకపోవటం ప్రాచీన ద్రావిడ భాషా లక్షణం. అది ఉత్తర, దక్షిణ ద్రావిడ భాషల్లో నిలిచివుంది.

11. ద్రావిడ భాషల్లో ఏకవచనం బహువచనం అని రెండు విధాలుగ వచన భేదం కనిపిస్తుంది. మధ్యద్రావిడభాషల్లో అమహద్వాచక బహువచన ప్రత్యయాన్ని నిత్యంగా ప్రయోగిస్తారు. అంటే, బహువచనాన్ని ఉద్దేశించినప్పుడు తప్పకుండా బహువచన బోధక ప్రత్యయం చేర్చబడుతుంది. ఉదాహరణకి తెలుగులో రెండు చెట్లు అనే అంటాం గాని రెండు చెట్టు అంటే వ్యాకరణ దోషమవుతుంది. అట్లాగే గోండిలో రండ్‌మరాక్ అనీ, కోటలో రెండ్‌మాకూల్ అనీ ప్రయోగిస్తారు. ఈ విధంగా మధ్య ద్రావిడ భాషల్లో అమహద్బహువచన ప్రత్యయ ప్రయోగం నిత్యం. కాని దక్షిణద్రావిడభాషల్లో ఈ విధమైన అమహద్బహువచన ప్రత్యయ

ప్రయోగం వైభాషికం. అంటే, ఈ ప్రత్యయాన్ని ప్రయోగించటమూ వుంది. ప్రయోగించకుండా కూడ వ్యవహారాన్ని జరుపుకోవటమూ వుంది. తమిళం, మలయాళం, కోట, కన్నడం, కొడుగు భాషల్లో అమహద్బహువచన బోధక 'ౘళ్' ప్రత్యయమున్నా దానిని సాధారణంగా వాడరు. ఉదాహరణకి త. ఇరండు మరం, మ రండుమరం, క. ఎరడుమర, కొడగు. రండుమర. ఈ విధంగా బహువచన ప్రత్యయాన్ని చేర్చకుండానే అమహద్బహువచన రూపాల్ని ప్రయోగించే పద్ధతి కనిపిస్తుంది. ఉత్తరద్రావిడభాషలైన కురుఖ్, మాల్తోలలో అమహద్వాచక బహువచన ప్రత్యయం లేదు. బ్రాహూయిలో క్/అక్ అనే బహువచన ప్రత్యయం ఉన్నా దాన్ని చేర్చి, చేర్చకుండా కూడ వాడతారు ఉదాహరణకి బ్రాహూయిలో మార్ అనే పదానికి 'కొడుకు, పిల్లవాడు' అని అర్థం. ఇద్దరు కొడుకులు అని చెప్పటానికి ఈ భాషలో ఇరామార్/ఇరామాక్ అని బహువచనం చేర్చకుండాను, చేర్చి ప్రయోగిస్తారు. దీన్నిబట్టి అమహద్బహువచన ప్రత్యయ వైభాషిక ప్రయోగం దక్షిణోత్తర ఉపకుటుంబాల్లో ఉన్నట్లు తెలుస్తుంది. ఇదే మూలద్రావిడ భాషలోని స్థితి అని ఊహించవచ్చు. మధ్య ద్రావిడ భాషలు ఈ ప్రత్యయ ప్రయోగాన్ని నిత్యం చేసుకొన్నాయి.

12. సర్వనామ రూపాలను పరిశీలిస్తే ఉత్తమ పురుషలో ఏక, బహువచనాలకు మూలరూపాలు *యాన్, *యామ్, *ఞాన్, *ఞామ్ అనేవి ఉన్నట్లు తెలుస్తుంది. వీటిలో *యాన్, *యామ్‌లు తమిళ భాషలోనే నిలిచివున్నాయి. *ఞ- వర్ణాది రూపాలు మలయాళంలో మాత్రం కనిపిస్తాయి. మిగిలిన భాషల్లో ఈ రూపాలు కొంత మార్పుని పొందాయి అంటే, పదాది *య- వర్ణాన్ని లోపింపజేసుకొన్న రూపాలు, పదాది *ఞ- వర్ణం న- వర్ణంతో కలిసిపోయిన రూపాలు కనిపిస్తాయి. తెలుగులో మేము, మనము అనే బహువచన రూపాలు స్వతంత్రంగా ఏర్పడ్డాయి. కాబట్టి ఈ సర్వనామాల మూలభాషా రూపాల్ని నిలుపుకొన్నది తమిళ మలయాళ భాషలని తెలుస్తుంది.

మధ్యమ పురుషలోని ఏక, బహువచనాల మూలరూపాలు *నీన్, *నీమ్ అనేవి. ఇవి కొంచెం మార్పుతో తమిళ, మలయాళ, కన్నడ, తెలుగు భాషల్లో కనిపిస్తాయి తెలుగులో ఈరు, మీరు అనే బహువచన రూపాలు స్వతంత్రంగా ఏర్పడ్డాయి కాబట్టి దక్షిణ ద్రావిడభాషలు ప్రాచీన రూపాల్ని నిలుపుకొన్నట్లు తెలుస్తుంది.

ఇక ప్రథమపురుషసర్వనామ ఏకవచన రూపాలు దక్షిణ ద్రావిడ భాషల్లో *అవన్ అనే మూల ద్రావిడరూపం నుంచి ఏర్పడినట్లు తెలుస్తుంది. మధ్య ద్రావిడభాషల్లోని రూపాలకు మూలరూపం *అవన్ṭ్ (awanṭ) అనేది. ఆయా ద్రావిడభాషారూపాల్ని పోల్చిచూస్తే తమిళాది దక్షిణ ద్రావిడభాషారూపాలు ప్రాచీన రూపానికి సన్నిహితమైనవనీ మిగిలిన భాషల్లో కొంత మార్పుని పొందా

యని తెలుస్తుంది. తెలుగు, కొండ వంటి మధ్య ద్రావిడభాషారూపాల్లో వర్ణ వ్యత్యయంవల్ల ఏర్పడిన రూపాలు కూడ కనిపిస్తాయి. తెలుగులోని వాడు, వారు కొండలోని వాన్డు (wānr̲(u) ఏకవచనం), వార్ (బహువచనం) రూపాలు ఇటు వంటివే.

ద్రావిడభాషలో నిర్దేశార్థక సర్వనామ రూపాల ప్రాతిపదికలు అ,ఇ లు. దూరాన్ని సూచించటానికి 'అ', సమీపాన్ని సూచించటానికి 'ఇ' వాడబడతాయి. ఈ ప్రాతిపదికలకి లింగబోధక ప్రత్యయాల్ని చేర్చితే అ+అన్>అ+వ్+అన్>అవన్ అనీ, ఇ+అన్>ఇ+వ్+అన్>ఇవన్ అనీ తమిళ మహద్వాచక ఏకవచన సర్వనామ రూపాలు ఏర్పడతాయి. నడుమ నున్న 'వ్' సంధిలో ప్రకృతి భావ నివారణకు చేరింది. తమిళంలో 'అన్' వలెనే తెలుగులో మహద్వాచకాన్ని బోధించే ప్రత్యయం డు/ఉడు/అడు. కాబట్టి తెలుగులో ఈ సర్వనామ రూపాలు తెలుగు ప్రత్యయాన్ని చేర్చుకొని అవడు, ఇవడు అని ఉండాలి. కాని వీటికి బదులు వాడు, వీడు అనే రూపాలు కనిపిస్తాయి. ఇక్కడ నిర్దేశాత్మక ప్రాతిపదికలైన 'అ,ఇ' లు పదాది నుంచి పదం మధ్యకు జరిగాయి. వర్ణవ్యత్యయంతో పాటు రెండచ్చులూ కలిసి ఒకటే దీర్ఘాచ్చుగా కూడ మారటం జరిగింది. (awadu>waadu>wādu, iwaḍu>wiadu>wīdu) లేదా రెంటిలో రెండో అచ్చు లోపించింది. అందువల్ల మొదటి అచ్చు దీర్ఘం అయింది. దీన్ని లోప దీర్ఘత అంటారు.

ఈ రూపాలను మిగిలిన ద్రావిడభాషలలోని వాటితో పోల్చినప్పుడు మార్పును పొందిన తెలుగు భాషారూపాలు తరువాత ఏర్పడినవనీ, తమిళాది భాషల లోని రూపాలే ప్రాచీనమనీ అవే ప్రాచీనభాషకి సన్నిహితమైనవనీ తెలుస్తుంది.

ఇంతవరకు చెప్పిన విషయాలు తమిళ మలయాళాది దక్షిణ ద్రావిడ భాషలలో నిలిచివున్న ప్రాచీన ద్రావిడభాషా లక్షణాలు. ఇక తమిళభాషలో కని పించకుండా మిగిలిన భాషల్లో నిలిచివున్న ప్రాచీన ద్రావిడ భాషా లక్షణాలను పరిశీలించాలి.

13. మూల ద్రావిడభాషలోని పదాది *క- వర్ణ పరిణామాన్ని పరిశీలిస్తే కొన్ని భాషల్లో అది తాలవ్యీకరణం పొందినట్లు తెలుస్తుంది. ఈ *క-వర్ణానికి తాలవ్యాచ్చులు పరమైతే తెలుగులో అది చ- వర్ణంగా మారుతుంది. తాలవ్యాచ్చులు పరమై తరువాత మూర్ధన్యేతర హల్లున్నప్పుడది తమిళ, మళయాళ భాషల్లో తాలవ్యీకరణాన్ని పొందుతుంది. అంటే చ- వర్ణంగా మారుతుంది. మూర్ధన్య వర్ణం పరమైనా కాకపోయినా తెలుగులో మాత్రం తాలవ్యీకరణం జరుగుతుంది. ఈ ధ్వని మార్పు తెలుగు, తమిళ, మలయాళ భాషల్లో మాత్రమే జరుగుతుంది. కన్నడం లోను, మిగిలిన మధ్య ద్రావిడభాషల్లోను ఎటువంటి మార్పు లేదు కాబటి ఈ

విషయంలో తమిళ, మలయాళ భాషలకంటె మిగిలిన భాషలే ప్రాచీన ద్రావిడభాషా లక్షణాన్ని నిలుపుకొన్నట్లు తెలుస్తుంది. దీనికి ఉదాహరణగా క్రింది పదాల్ని చెప్పవచ్చు. 1. త.మ. చెవి 'చెవి'; కోట. కెవ్, క కివి; తె చెవి; కొలా. నాయికి. కెన్. 2. త.మ. కిళి 'చిలుక'; కోట. కిళివకి; క. గిళి, గిణి; తె. చిలుక; పర్జి. కిల్, గదబ. కిలిన్.

14. మూలద్రావిడ భాషలోని పదాది *చ- వర్ణం దక్షిణ ద్రావిడభాషల్లో కొన్నిచోట్ల లోపిస్తుంది. కాని అది ఉత్తర, మధ్య ద్రావిడభాషల్లో నిలిచివుండటం గమనించవచ్చు ఉదా: 1. త.మ.క తు.తె. ఉప్పు; కొలాయి, నాయికి. సుప్; పర్జి. చుప్; ఒల్లారి. సుప్; గదబ. చుప్పు 2. త. క. ఈ 'ఇచ్చు'; తె. ఇచ్చ్-, కొలా. నాయికి. సీ; పర్జి. చీ, గ. ఒ గోండి. సీ; కొండ. సి; కురుఖ్. చి-; మాల్తో. చియ్.

దీన్నిబట్టి *చ- వర్ణలోపం దక్షిణ ద్రావిడ భాషల్లో జరగటం నూతన పరిణామమనీ, మధ్య, ఉత్తర ద్రావిడ భాషలే ప్రాచీన లక్షణాల్ని నిలుపుకొన్నాయనీ తెలుస్తుంది.

15. మూల ద్రావిడభాషలో లింగవివక్షను తెలిపే ప్రత్యయాలు లేవని పండితుల అభిప్రాయం. లింగ బోధక ప్రత్యయాలన్నీ ద్రావిడ భాషల్లో పరిణామ క్రమంలో ఏర్పడ్డాయి. ఈ విషయంలో ఉత్తర, మధ్య ద్రావిడ భాషలకంటె దక్షిణద్రావిడ భాషల్లో అధికమైన మార్పు జరిగినట్లు కనిపిస్తుంది. నేటి ద్రావిడ భాషల్లో అసలు లింగవివక్షలేని వర్గం ఒకటి వుంది బ్రాహూయి, తోడ, కోట భాషలు దీనిక్రిందికి వస్తాయి. ఈ భాషల్లో సందర్భాన్నిబట్టి లింగభేదాన్ని గుర్తించాలి. రెండో వర్గంలో పురుష బోధకాలు, పురుషేతరాలు అని రెండు తెగలు కలిగిన భాషలున్నాయి. ఇవి మధ్యద్రావిడ భాషలు. మూడో వర్గంలో తెలుగు, కురుఖ్, మాల్తో భాషలు చేరతాయి వీటిలో ఏకవచనంలో మహత్తులు, ఇతరములు అని రెండు రకాలుంటాయి. బహువచనంలో మనుష్యులొక వర్గం, మనుషేతరాలు ఇంకొకవర్గం. మహన్మహతీ వాచకాలొక వర్గంగాను, మహతీత రామహద్వాచకాలు ఇంకొక వర్గంగాను ఉంటాయి. ఇక నాలుగో వర్గానికి చెంది నవి తమిళం, మలయాళం, కన్నడం, తుళు, కోట భాషలు. వీటిలో ఏకవచనంలో కూడా మహతీవాచకాలకి లింగబోధక ప్రత్యయం ఏర్పడింది. ఇది నూతన పరిణామం. ఏకవచనంలో మూడు వాచకాలను బోధించటానికి వేర్వేరు ప్రత్యయాలీ భాషల్లో కనిపిస్తాయి. బహువచనంలో మహన్మహతీ వాచకాలు, మహతీత రామహద్వాచకాలు అనే భేదం ఉంది.

ఈ భాషల్లో నూతనంగా ఏర్పడిన మహతీవాచకఏకవచన ప్రత్యయం - అళ్ అనేది. ఉదా. త.మ.కో.క. అవళ్ 'ఆమె'. ఈ ప్రత్యయం 'స్త్రీ' అనే అర్థాన్నిచ్చే 'ఆళ్' శబ్దంనుంచి ఏర్పడింది.

పైన చెప్పిన విషయాలన్నీ గమనిస్తే ఏ ఒక్క భాషా మూల ద్రావిడ భాషా లక్షణాలనన్నిటినీ సంపూర్ణంగా కలిగివున్నదని చెప్పలేం. మొదటి ఎనిమిది విషయాల వల్ల మూల భాషా లక్షణాల్ని తమిళ, మలయాళాది దక్షిణ ద్రావిడ భాషలు నిలుపుకొన్నట్లు తెలుస్తుంది. లింగవివక్షకు సంబంధించి దక్షిణ, మధ్య ద్రావిడభాషల్లో ప్రాచీన లక్షణాలతోపాటు నూతన పరిణామాన్ని కూడ గమనించవచ్చు. ఉత్తర ద్రావిడ భాషలు మాత్రమే ప్రాచీన లక్షణాన్ని పూర్తిగా నిలుపుకొన్నట్లు తెలుస్తుంది. అమహద్బహువచన ప్రత్యయ ప్రయోగం కూడ ఉత్తర, దక్షిణ ద్రావిడ భాషా ఉప కుటుంబాల్లో మూల భాషలో ఉన్నట్లే కనిపిస్తుంది. సర్వనామ రూపాలలో ప్రాచీన భాషా రూపాల్ని తమిళ మలయాళాది దక్షిణ ద్రావిడ భాషలు నిలుపుకొన్నాయి మరి *క- వర్ణ, *చ- వర్ణ పరిణామాన్ని పరిశీలించినప్పుడు తెలుగు, తమిళ, మలయాళ భాషలు నూతన పరిణామాన్ని పొందినట్లు, మిగిలిన భాషలు ప్రాచీన భాషా స్థితిని నిలుపుకొన్నట్లు తెలుస్తుంది.

ఈ విధంగా ఆయా భాషల్లో నిలిచివున్న ప్రాచీన భాషా లక్షణాల్ని ఏర్పడిన నూతన పరిణామాల్ని కూడ పోల్చిచూస్తే తమిళమే, అందులోను ప్రాచీన తమిళం అధికంగా మూలభాషా లక్షణాల్ని నిలుపుకొన్నట్లు తెలుస్తుంది. మిగిలిన భాషలు కూడ కొన్ని కొన్ని ప్రాచీన లక్షణాల్ని కలిగి ఉన్నాయి.

ద్రావిడ భాషలన్నిటిలోను ప్రాచీనతమ భాష తమిళం. శాసనాల్ని బట్టి, ఆ భాషా సాహిత్యాన్ని బట్టి ఈ విషయం రుజువైంది. తమిళ సాహిత్య చరిత్రను బట్టి ఆ భాష క్రీస్తు పూర్వపు కాలానికి చేరుతుంది. తమిళం కాని, ఏ ఇతర ద్రావిడ భాషకాని అది ఎంత ప్రాచీనమైనమైనదైనా, అర్వాచీన కాలానికి చెందినదైనా మూలద్రావిడ భాషకు ప్రతిబింబం కాదు. ప్రాచీన ద్రావిడ భాషా లక్షణాలను అధికంగా కలిగివున్న తమిళం మూలభాషకు సన్నిహితంగా ఉన్నదని చెప్పగలమే కాని తమిళమే మూలద్రావిడభాష అని కాని, అదే మూల ద్రావిడ భాషకి ప్రతిబింబమని కాని, తమిళమే మిగిలిన ద్రావిడ భాషలకు మాతృక అని కాని చెప్పటం సమంజసం కాదు. తమిళం మిగిలిన ద్రావిడ భాషలకు సోదర భాష. ఆయా ద్రావిడభాషల నడుమ ఉన్నది సోదర సంబంధం. వాటికీ మూలద్రావిడ భాషకీ గల సంబంధం జన్యజనక సంబంధం ఈ ద్రావిడ భాషలన్నిటికి మూలద్రావిడ భాష జనక భాష.

# 22

# ద్రావిడ భాషా లిపులు

భాషకు ధ్వనిరూపం మొదటి దశ. లిపిరూపం అనంతర దశ ప్రతి భాషా వ్యవహర్తలు తమ సాంస్కృతిక జీవనంలోని తరువాతి దశలలో లిపిని తయారుచేసుకొంటారు. సమాజ సాంస్కృతికాభివృద్ధికి లిపి ఎంత దోహదం చేస్తుందంటే— లిపి లేని ఏ సమాజమూ అభివృద్ధి చెందింది కాదు. అభివృద్ధి చెందిన ఏ సమాజమూ లిపిలేకుండా లేదు.

లిపికీ భాషకీ అవినాభావ సంబంధం లేకపోయినా ఆ భాష అవసరాలకి సరిపోయేటట్లుగా లిపి రూపొందించబడుతుంది. భాషలాగానే లిపి కూడ చారిత్రక పరిణామక్రమంలో ఏర్పడి కాలక్రమాన కొన్ని మార్పుల్ని పొందుతుంది. అయితే, భాషకంటె కొంత నెమ్మదిగా మారుతుంది.

లిపి లేఖనసాధనాల తీరుతెన్నులను బట్టి మారుతుంది. ప్రాచీనకాలంలో గంటంతో రాసినప్పుడు గొలుసుకట్టుగా రాసేవారు. తరువాతికాలంలో విడివిడిగా రాయటం వచ్చింది. అచ్చులోనూ అంతే.

ద్రావిడ భాషలన్నిటికీ వర్ణమాల (Alphabet) లేదు. తమిళం, మలయాళం, కన్నడం, తెలుగు భాషలకి మాత్రమే ఉంది. తుళు, కొడగు భాషీయులు కన్నడలిపిని వాడతారు. తెలుగు అకాడమీవారు ప్రచురిస్తున్న గోండీభాషా వ్యాకరణంలో తెలుగు లిపిని వాడారు. వీటిల్లో తమిళ మలయాళ భాషలకి, తెలుగు కన్నడ భాషలకి పోలిక ఉంది. ఇవన్నీ బ్రాహ్మీ లిపి నుంచి పరిణతి చెందినవని శాస్త్రవేత్తల అభిప్రాయం.

అన్ని భారతీయ లిపుల లాగానే ద్రావిడ భాషా లిపి కూడ ప్రధానంగా అక్షర లిపి, అంటే, ఒక హల్లూ ఒక అచ్చూ కలిసి ఒక అక్షరంగా ఏర్పడటం. ఈ లిపిలో

1. పదాదిలో వచ్చే అచ్చులకీ పద మధ్యంలో వచ్చే అచ్చులకీ వేరు వేరు గుర్తులుంటాయి. ఉదాహరణకి పదాదిలో 'అ' గా రాస్తాం. ఇదే అచ్చుని పద మధ్యంలో ✓ అని రాస్తాం. దీన్నే తలకట్టు అంటాం క్+అ>క. పదాదిలో 'ఇ'గా రాసే అచ్చుని పదమధ్యంలో ి గా రాస్తాం. క్+ఇ>కి. ఇట్లాగే మిగిలిన అచ్చులకి కూడ వేరువేరు గుర్తులున్నాయి.

2. తెలుగులో సంయోగంలో వచ్చే హల్లుకీ, మిగిలిన హల్లులకీ గుర్తులు వేరువేరుగా ఉంటాయి. ఉదాహరణకి క అనే హల్లు (క్+అ)ని సంయోగంలో ్క అని రాస్తారు. అక్క, అక్కడు. ర అనే హల్లు (ర్+అ)ని సంయోగంలో ్ర అని రాస్తారు. క్ర, చక్రం. మిగిలినవాటికి కూడ ఇట్లాగే ఉంటుంది.

3. తెలుగులో వ్యంజన సంయోగంలో అచ్చు గుర్తు మొదటిహల్లుకే ఉంటుంది. ఉచ్చారణలో చివరి హల్లుకే ఉంటుంది. సంయుక్తంలో మొదటి హల్లుకి ఉపయోగించే గుర్తు ప్రధాన చిహ్నం (Primary symbol) అనీ, రెండో హల్లుకి ఉపయోగించేది అప్రధానచిహ్నం (Secondary symbol) అనీ భావించినట్లయితే ప్రధాన చిహ్నానికే అచ్చుగుర్తుని గ్రహించే యోగ్యత ఉంటుంది. ఉదాహరణకి 'గుర్తు' అనే పదంలో 'ర్తు' అనేది సంయుక్తాక్షరం. ఇందులోని రేఫ తకారాలలో మొదటి హల్లుకే అచ్చుగుర్తు చేరింది. అందుకే 'రు'గా రాస్తాం. ఉచ్చారణలో మాత్రం చివరిహల్లుకే అచ్చు చేరుతుంది. గుర్‌త్‌ఉ అనే పలుకుతాం.

ఏ భాషకీ సంపూర్ణమైన లిపి అంటూ లేదు. ఆయా వ్యవహర్తల సాంస్కృతికావసరాలకి సరిపడిన లిపి మాత్రముంది. ఆ దృష్టితో చూస్తే తెలుగువారి అవసరాలకి తెలుగు లిపి చాలవరకు సరిపోతుంది.

తెలుగు భాషలో ఉండే ధ్వనులన్నిటికీ తెలుగులో లిపి సంకేతాలు లేవు ప్రధాన ధ్వనిభేదాలకు మాత్రం ఉన్నాయి.

అచ్చుల్లో ఇప్పటి అవసరాలకి ఱ అనే ధ్వనికి గుర్తుండటం సౌకర్యం. కాని అటువంటి గుర్తులేదు. ఇది నిరోష్ఠ్యాచ్చు (higher low front unrounded vowel). కొట్టాడు, తిట్టాడు, వచ్చాడు వంటి భూతకాలిక క్రియల్లోను టాటాకు వంటి పదాల్లోను 'అ' రాసి ఱ గా ఉచ్చరిస్తారు. ఇంగ్లీషు నుంచి వచ్చిన మాటల్లో వ్యంజనం తరువాత ఱ అనే ధ్వనిని సూచించటానికి 'య' ని ఉపయోగిస్తున్నారు. గ్యాసు, బ్యాంకు, మ్యాపు. అయితే ఈ పద్ధతి సంయుక్త వ్యంజనమున్నచోట పాటించటంలేదు. క్లాసు, గ్లాసు, బ్లాక్ బోర్డ్, బ్రాండ్. తమిళ భాషలోను ఇదే పద్ధతి కనిపిస్తుంది.

తెలుగులో అవ్యవహితోచ్చారణలో పద మధ్యంలోను, రెండు పదాల మధ్యన సంధి జరుగుతుంది. ఈ సంధివల్ల అచ్చుల్లో కొన్ని మార్పులు జరుగుతాయి. వీటిని రాతలో సూచించటానికి వీలులేదు ఉదాహరణకి కోడలు అనే పదంలో సంధి జరిగితే 'కోళ్ల' అవుతుంది. దీనికీ కోడి+లు వల్ల ఏర్పడే కోళ్ల శబ్దానికీ భేదం చూపించలేం. ఇటువంటి మార్పులు అన్ని అచ్చుల్లోను గమనించవచ్చు. వాటిని రాతలో చూపించలేం. అయితే, అర్థ సందిగ్ధత వచ్చినప్పుడు

సంధిని రాతలో చూపించకుండా ఉండటం తెలుగు వ్యవహర్తలు పాటించే పద్ధతి. అటువంటి సందర్భాల్లో 'కోడలు' అనే రాస్తారు.

తెలుగులో ఉన్న ప్రధాన వ్యంజన భేదాలన్నిటికీ గుర్తులున్నాయి. సంస్కృతం నుంచి వచ్చిన మహా ప్రాణాది వ్యంజనాలకీ ఉన్నాయి కాని ఉర్దూ, ఇంగ్లీషు మొదలైన భాషలనుంచి వచ్చిన కొన్ని రకాల వ్యంజనాలకి తెలుగులోను, మిగిలిన ద్రావిడ భాషల్లోను గుర్తులు లేవు. ఉదాహరణకి Zoology అనే ఇంగ్లీషు మాటలోని z,g లని చూపించటానికి తెలుగులో వేరు వేరు గుర్తులు లేవు. రెంటికీ 'జ'ని వాడతారు. కాఫీ (Coffee) ఫసలీ అనే మాటల్లో ఉన్న f అనే ధ్వనికి తెలుగులో గుర్తు లేదు. 'ఫ' నే వాడతారు. తమిళంలోను ఇంతే

ప్రాచీన భాష నుంచి వచ్చిన ఱ, ఁ గుర్తులు ప్రాచీన కావ్య భాషకి పరిమితం కాల విరుద్ధంగా ఎవరయినా ఆధునిక భాషలో వీటిని వాడినా అవి అపవాదాలు మాత్రమే.

తెలుగులో 'ం' అనేది విశిష్టమైన గుర్తు. దీన్ని అధివర్ణం (archiphoneme) గా భావించవచ్చు. అనునాసికేతర వర్గాక్షరాలకి పూర్వం వచ్చే అనునాసిక వ్యంజనాన్ని సున్నాతో సూచిస్తాం. సున్నా ఉచ్చారణని తరువాత వచ్చే వ్యంజనం నిర్ణయిస్తుంది. తరువాతి వ్యంజనం ఏ స్థానంలో ఉచ్చరిస్తారో ఆ స్థానంలో వచ్చే అనునాసికాలకి ఇది గుర్తు. వఙ్గ-వంగ, అఞ్చు-అంచు, పణ్ట-పంట, కన్త-కంత, కమ్పు-కంప. అనునాసికానికీ, తరువాతి వ్యంజనానికీ వర్గ వైరుధ్యముంటే సున్నా వాడరు. ఇట్లాంటి వైరుధ్యం కిన్క, లెన్క, కాన్పు, పాన్పు వంటి పదాల్లో ఉంది ఇతర భాషల నుంచి వచ్చిన చెమ్కి, చెమ్చా, రమ్జాన్ వంటి మాటల్లోను సున్నా వాడరు.

కమసాలి>కంసాలి అనే తద్భవ పదంలో (<ప్రాకృత కమ్మసాలి< సంస్కృత. కర్మశాలి) సున్నా ఉచ్చారణ అనునాసిక వకారంగా ఉంటుంది. ఈ రకపు ఉచ్చారణ సంస్కృత పదాల్లో వ,స,హ లకు పూర్వం వచ్చిన సున్నాకి కూడ ఉంది. (సంవత్సరం, మాంసం, సింహం) ఆధునిక రచనాభాషలో పదాంతం లోని సున్నాకి కూడ అనునాసిక వకారోచ్చారణే ఉంది (ఉన్నాం). ఈ విధమయిన ఉచ్చారణ ముఖ్యంగా కోస్తా జిల్లాల వారిలో కనిపిస్తుంది.

'క్ష' అనే అక్షరం సంస్కృతంలో క కార ష కారాల సంయోగమే అయినా తెలుగువారి ఉచ్చారణలో ట కార షకారాల సంయోగంగా మారి ప్రత్యేక ధ్వనిగా ఉంది. ఉదా. అక్షరం, నక్షత్రం.

బ్రహ్మ, చిహ్నం వంటి పదాలు కొందరు తెలుగు వారి ఉచ్చారణలో బమ్హ, చిన్హం గా వినిపిస్తాయి.

ఉచ్చారణ విధేయంగా రాయటం తెలుగువారికి మొదటినుంచి వస్తున్న అలవాటయినా కొన్నిచోట్ల ఉచ్చారణలో కనిపించే అన్ని మార్పులూ రాతలో

కనిపించకపోవచ్చు. ఉదాహరణకి సత్యం అనే మాటని రాయలసీమలో సత్తెం అనీ, కోస్తాజిల్లాల్లో సచ్చం అనీ ఉచ్చరిస్తారు. ఇటువంటిచోట్ల ఉచ్చారణాదర్శానికి ( Idealised pronunciation ) విధేయంగా లిపి ఉంటుంది. రాసిన విధంగానే చేసిన ఉచ్చారణ ఆదర్శవంతమయిన ఉచ్చారణ. కాబట్టి సచ్చం అని ఉచ్చరించినా సత్యం అనే రాస్తారు.

తమిళంలోను, ప్రాచీన మలయాళంలోను నాదవత్ స్పర్శాలు లేవు. పదం మధ్యలోను, రెండచ్చుల నడుమ శ్వాసవత్ స్పర్శాలనే రాస్తారు. కాని నాదాలుగా పలుకుతారు. ఉదాహరణకి త. పుకై (పుగై); మ. పుక (పుగ) 'పొగ'; త మ. పాటు (పాడు), 'పాడు'; త.మ. ముతు (ముదు) 'old'. అనునాసిక పూర్వకమైన శ్వాసాన్నికూడ నాదంగానే ఉచ్చరిస్తారు. శ్వాసంగా రాస్తారు. ఉదాహరణకి పొన్కు అని రాసి పొన్గు (పొంగటం) అని ఉచ్చరిస్తారు. నన్చు, చీన్తు, నమ్పు అని రాస్తారు. నన్జు (విషం), చీన్దు (చీదు), నమ్బు (నమ్మ) అని ఉచ్చరిస్తారు.

తమిళంలో శ,స లకు బదులుగా చ రాస్తారు. చివన్ అని రాసి శివన్‌గా ఉచ్చరిస్తారు. చఙ్కు అని రాసి శంగు (శంఖు)గా ఉచ్చరిస్తారు. చఙ్కీతమ్ అని రాస్తారు. సంగిదమ్ (సంగీతం) అని పలుకుతారు. మలయాళంలోను ఇదేవిధంగా ఉంటుంది.

ఴ వర్ణం ప్రాచీన తమిళంలో ఉంది. అర్వాచీనకాలంలో ఇది శ గా, య గా ఉచ్చరించబడుతోంది. కాని రాతలో మాత్రం నిలిచే ఉంది. వాఴ పఴం అని రాస్తారు. దీన్ని వాళపళం అనీ, వాయపయం (అరటిపండు) అనీ ఉచ్చరిస్తారు. కోఴి అని రాసి కోళి (కోడి) అని పలుకుతారు.

## 23

# ద్రావిడ భాషా వర్ణపరిణామం

నేటి ద్రావిడభాషలలోని ధ్వనులనూ వర్ణాలనూ పరిశీలిస్తే అవి అన్ని భాషల్లోను ఒకే విధంగా ఉన్నట్లు కనబడవు. మూలద్రావిడ భాషలోని వర్ణాలు ఆయా జన్య భాషల్లో కొన్ని మార్పులకు లోనైనాయి. అవి పొందిన మార్పులను బట్టి ఆయా భాషలలో అనేక విధాలుగ కనిపిస్తాయి. వాటి పరిణామ విధానాన్ని పరిశీలిద్దాం.

ఒక మూలభాషలోని విషయాలను తెలుసుకోవాలంటే ఆ భాష నుంచి పుట్టిన జన్య భాషలను పోల్చిచూడాలి. ప్రస్తుతం మనకు లభించే ద్రావిడ భాషల లోని వర్ణాలను పోల్చిచూసి వాటి ఆధారంతో మూల ద్రావిడ భాషా వర్ణాలను పునర్నిర్మించవచ్చు. ఈ పద్ధతిని తులనాత్మక విధానమంటారు. ఈ విధంగా ద్రావిడభాషలను పోల్చిచూసి మూల ద్రావిడభాషలో ఉండిన వర్ణాలను పునర్నిర్మించటం చాలకాలం క్రిందటే జరిగింది. 10 అచ్చులూ 16 హల్లులూ మూలభాషలో ఉన్నాయి.

అచ్చులు: అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఎ,ఏ,ఒ,ఓ -10.

హల్లులు: క, చ, ఞ, ట, ణ, త̱, త, న, ప, మ,య,ర,ల,ళ,ఴ,వ -16.

వీటిని క్రింది పట్టికలో ప్రదర్శించవచ్చు

| | | | |
|---|---|---|---|
| పూర్వాచ్చులు (front vowels) | ఇ,ఈ<br>ఎ,ఏ | ఉ,ఊ<br>ఒ,ఓ | పశ్చిమాచ్చులు (back vowels) |
| | అ, ఆ | | |

మధ్యాచ్చులు (central vowels)

| | ఓష్ఠ్యం | దంత్యం | దంత మూలీయం | మూర్ధన్యం | తాలవ్యం | కంఠ్యం |
|---|---|---|---|---|---|---|
| స్పర్శం | ప | త | త̱ | ట | చ | క |
| అనునాసికం | మ | న | | ణ | ఞ | |
| పార్శ్వికం | | | ల | ళ | | |
| కంపితం | | | ర | | | |
| అంతస్థం | వ | | | ఴ | య | |

వీటిలో దంతమూలీయ (త్ర, ర, ల), మూర్ధన్య (ట,ణ,ళ,ఴ) వర్ణాలు పదాదినరావు అంటే దంతమూలీయ, మూర్ధన్య వర్ణాలు ప్రాచీన ద్రావిడభాషలో పదాదిన లేవని అర్థం ప త చ క, మ న ఞ, వ య ఌ మాత్రమే పదాదిన వస్తాయి. ఇంక ఞ వర్ణం పదాంతంలో రాదు.

మొదట పదాదిన వచ్చే వర్ణాల పరిణామాన్ని వరుసగా తెలుసుకొందాం. మూలద్రావిడ పదాది *క- వర్ణం క్రింది విధంగా ఆయా ద్రావిడభాషల్లో కనిపిస్తుంది.

తెలుగు, తమిళ, మలయాళ భాషలలో పూర్వాచ్చులు పరమైనప్పుడు *క- వర్ణం చ- గా మారుతుంది. ఈ మార్పును తాలవ్యీకరణం (Palatali-sation) అంటారు

ఉదా: 1 త చీ, చీల్ 'చీము', మ. చీ 'కుళ్లు', క. కీవు 'చీము', తె చీకు, చీము, చీమిడి, కురు కిత్ 'కుళ్లు', మా. కిత్, బ్రా. కీష్ 'చీము'. దీని మూలభాషారూపంలోని పదాది *క- వర్ణం తమిళ, మలయాళ, తెలుగు భాషలలో తాలవ్యీకరణాన్ని పొందింది. చ- గా మారింది దానికి పరమైన అచ్చు పూర్వాచ్చు కావటమే అందుకు కారణం

ఏ మూర్ధన్య హల్లు *క- వర్ణానికి తరువాత ఉన్న పూర్వాచ్చుకి పరమైనా తమిళ, మలయాళ భాషలలో తాలవ్యీకరణం జరగదు. తెలుగులో మాత్రం జరుగుతుంది.

ఉదా. 2. త మ. కిళి 'చిలుక', క. గిళి, గిణి 'చిలుక', తె. చిలుక. దీని మూలభాషా రూపమయిన *కిళి లోని *క- వర్ణానికి పూర్వాచ్చు పరమైనా దానికి మూర్ధన్య హల్లు పరమైనందువల్ల తమిళ, మలయాళ భాషలలో తాలవ్యీకరణం జరగలేదు అందువల్ల *క- తో కూడిన రూపమే నిలిచి ఉంది. కన్నడంలో తాలవ్యీకరణ జరగదు. తెలుగులో మూర్ధన్యహల్లు పరమైనా తాలవ్యీకరణం జరుగుతుంది. అందువల్లనే చి(లుక)గా మారింది

*క- వర్ణానికి *ఐ (ay) అనే సంయుక్తాచ్చు పరమైనప్పుడు అది తెలుగులో ఏ గా మారుతుంది. అప్పుడు పూర్వాచ్చు పరమయినందువల్ల తాలవ్యీకరణం జరుగుతుంది

ఉదా: 3. త మ. కై, క. కయ్, తె. చేయి <*కెయ్ <*కయ్, కురు. ఖెఖా.

*క- వర్ణానికి పూర్వేతరాచ్చులు పరమైనప్పుడు ఏ మార్పూ పొందక క- గానే ఉంటుంది

ఉదా : 4. త. మ. క. కళ్ 'దొంగిలించు', తె. కల్ల 'అసత్యం, మోసం', కురు ఖడ్ 'దొంగిలించు', ఖల్బ 'దొంగతనం మాల్తో. [illegible] 'దొంగ'.

ఉత్తర ద్రావిడ భాషలలో *క- వర్ణ ఇ, ఈ లు పరమైనప్పుడు ఏ మార్పూ చెందక క- గానే ఉంటుంది. మిగిలిన అన్ని పరిసరాలలోను అది కంఠోష్మంగా మారుతుంది. చూ. ఉదా: 1,3,4.

ఇది *క-వర్ణం సాధారణంగా పొందే మార్పు. ఈ విధంగా కనిపించాల్సిన రూపాలకి కొన్ని అపవాదాలు కూడ కనిపిస్తాయి. భాషలలో ఒకదాని పైన మరోదాని ప్రభావం, అన్యభాషాపద స్వీకరణం, ధ్వన్యనుకరణం మొదలైనవి ఇందుకు కారణాలు. ఇటువంటి అపవాద రూపాలలో కొన్ని ఏ విధంగా వచ్చాయో కూడ చెప్పలేం. ఉదాహరణకు తెలుగులో కినియు, కెరలు వంటి పదాలు అపవాదరూపాలు. పదాది క- వర్ణానికి పూర్వాచ్చు పరమైనాగాని క- వర్ణం చ- గా మారలేదు. వీటికి సమాన రూపాలు మిగిలిన ద్రావిడ భాషలలో క్రింది విధంగా కనిపిస్తాయి.

ఉదా: 5. తె. కినియు 'కోపించు', క. కినిసు, త. చిన మ. చినిక్క-

ఉదా: 6. తె. కెరలు 'వ్యాపించు, అధికమగు', క. కెరళు, కెళర్; త. కిళర్, మ. కిళరుక.

ఈ పదాలు తెలుగులో తాలవ్యీకరణం జరిగిన సమయంలో కాక అంతకు పూర్వమో తరువాతో తాలవ్యీకరణం ప్రవర్తించని కన్నడం నుంచి వచ్చి చేరాయని చెప్పవచ్చు.

కన్నడంలో కూడ అపవాద రూపాలు కనిపిస్తాయి. అంటే తాలవ్యీకరణం జరిగిన రూపాలన్నమాట. చందలిర్, చెందళిర్, చదఱు, చెదఱు, చిఱు, చిట్టు, చేదు మొదలయినవన్నీ తెలుగు భాషా ప్రభావంవల్ల వచ్చిన పదాలు. తెలుగులో కూడ కినియు, కెంపు, కెందామర, కెరలు, కెలను, కెలసము, కేలు మొదలయినవి కనిపిస్తాయి. వీటిల్లో *క- వర్ణముంది. దీనికి కారణం కన్నడ భాషా ప్రభావమే.

మధ్య ద్రావిడ భాషయిన గోండీలో సర్పుమ్ 'చెప్పు, కాలిజోడు' అనే పదం, కువిలో సెప్పు అనే పదం ఒకే అర్థంలో కనిపిస్తాయి. వీటికి మూల రూపం *కెర్ప్- అనేది. మరి తాలవ్యీకరణం పొందిన ఈ రూపాలు మధ్య ద్రావిడ భాషలలోకి తెలుగునుంచి వచ్చి చేరాయి. ఈవిధంగా మధ్య ద్రావిడ భాషల్లోకూడ తాలవ్యీకరణం పొందిన అపవాద రూపాలు తెలుగు భాషా ప్రభావం వల్ల కనిపిస్తాయి.

అన్యభాషా పదాలలో సాధారణంగా తాలవ్యీకరణం జరగదు అంటే ద్రావిడభాషేతర పదాలలో ఈ ధ్వని పరిణామం జరగదని అర్థం. త.తె. కిచ్చిలి (orange, కిచ్చిలికాయ), క. కిత్తళె, కిచిలి, తుళు కిత్తలి. పై పదాలలో పూర్వాచ్చు పరమయినాగాని క- వర్ణం చ- గా మారలేదు. తెలుగులో కనిపిస్తున్న కిటికీ, కీలు వంటి పదాలలో తాలవ్యీకరణం జరగకపోవటానికి కారణం అవి అన్యదేశ్యాలు కావటమే.

ధ్వన్యనుకరణ పదాలలో కూడ తాలవ్యీకరణం జరగదు. అందువల్ల కిచకిచ, కిటకిట, కితకిత(లు), కిలకిల, కీచుకీచు వంటి రూపాలు పూర్వాచ్చుకి పూర్వం కూడ క- వర్ణంతో కూడినవి కనిపిస్తాయి.

తెలుగు, తమిళ, మలయాళ భాషలలో మాత్రం కనిపిస్తున్న ఈ తాలవ్యీకరణం ఆ భాషల్లో ఎప్పుడు జరిగింది ?

అశోకుని శాసనాల్లో కేరళపుత్ర అనే సమాసంలో 'కేరళ' పదం మొదటిసారిగా కనిపిస్తుంది. తమిళంలో ఇది చేరమాన్ అవుతుంది. దీన్నిబట్టి ఆర్యులు మొదట తమిళులతో సంబంధాన్ని ఏర్పరచుకొన్న నాటికి ఈ పదం తమిళదేశంలో కూడ కేరళగానే ఉచ్చరించబడుతోందని భావించవచ్చు. సంస్కృతంలో ప్రాచీనకాలంలో కేరళీయులను గురించిన ప్రస్తావన లేదు. కాబట్టి ఆర్యులకు, తమిళులకు సంబంధాదులు ఎప్పటినుంచి ఏర్పడ్డాయో కచ్చితంగా చెప్పలేకపోయినా అశోకుని కంటె ఇంకా పూర్వం కాదని చెప్పవచ్చు అశోకుని కాలం క్రీ పూ 272-232 దీన్నిబట్టి తాలవ్యీకరణం తమిళభాషలో క్రీ పూ. 300 ప్రాంతం నుంచి తమిళ సాహిత్యారంభ కాలం వరకు అంటే క్రీ.శ మొదటి కొన్ని శతాబ్దులవరకు గల నడిమికాలంలో జరిగివుండవచ్చు. క్రీ.శ. 2, 3 శతాబ్దులనాటికే ఈ ధ్వని పరిణామం జరగటం పూర్తయి ఆగిపోయింది.

మూర్ధన్యాక్షరం పరమయినప్పుడు తమిళ, మలయాళ భాషల్లో తాలవ్యీకరణం జరగకపోవటం, అయినాగాని తెలుగులో జరగటం, సంయుక్తాచ్చు(ay) పరమైనాగాని అది తెలుగులో 'ఏ'గా మారి తాలవ్యీకరణం జరగటం, తమిళ మలయాళాల్లో ఈవిధంగా జరగక *క- వర్ణం అట్లాగే నిలిచివుండటం గమనించాం. ఈ విధంగా తమిళ మలయాళ భాషలు, తెలుగు వేర్వేరుగా ప్రవర్తించటాన్ని బట్టి తాలవ్యీకరణం ఈ భాషలన్నిటికీ కలిసి ఒకేవిధంగా ఏర్పడిన నూతన పరిణామం (Innovation) కాదనీ, స్వతంత్రంగా రెండు భాషలూ విడివిడిగా పొందిన పరిణామమనీ తెలుస్తుంది.

పైన గమనించినదాన్నిబట్టి తమిళంలో తాలవ్యీకరణం సాహిత్యారంభ దశకు పూర్వమే జరిగినట్లు తెలుస్తుంది. అంతకు పూర్వమే తెలుగు, తమిళ భాషలు వేరుపడిపోయాయి. ఇక తెలుగులో ఈ ధ్వని పరిణామం ఎప్పుడు జరిగిందో కచ్చితంగా నిర్ణయించటానికి ఇంతవరకు సాక్ష్యాధారాలు లభించలేదని బరో చెప్పారు క్రీ శ 5వ శతాబ్దినాటికే ఈ పరిణామం జరిగినట్లు తెలుగు శాసనాలవల్ల తెలుస్తుందనీ, అంతకు పూర్వం ఎప్పటినుండి జరిగిందో తెలీక పోయినా అది తెలుగు దక్షిణ ద్రావిడం నుండి విడిపోయిన తొలిరోజుల్లో జరిగినట్లు కనిపిస్తుందనీ భద్రిరాజు కృష్ణమూర్తిగారు అభిప్రాయపడ్డారు.

ఇక మూలద్రావిడ పదాది *చ- వర్ణ పరిణామాన్ని పరిశీలిద్దాం. *చ- వర్ణం కొన్ని ద్రావిడభాషల్లో చ- గాను, మరి కొన్నిటిలో స- గాను కనిపిస్తుంది.

తమిళం, మలయాళం, తెలుగు, కొడగు, పర్జి, కురుఖ్, మాల్తో భాషల్లో చ- గానే వుంటుంది. గోండి, కుయి, కువి, కొలామి, నాయకి లలో స- గా మారుతుంది కొన్ని భాషల్లో చ-, స- లు రెండూ వుంటాయి. తోద భాషలో మాత్రం *చ- వర్ణం త- గా మారుతుంది కువిలోను, కుయి, గోండి భాషల కొన్ని మాండలికాలలోను, బ్రాహుయిలో కొన్నిసార్లు *చ- వర్ణం హ- గా మారుతుంది. మధ్య ద్రావిడ భాషయిన పర్జిలో మాత్రం *చ- ఎప్పుడూ నిలిచే వుంటుంది

కొన్ని దక్షిణ ద్రావిడ భాషల్లో *చ- వర్ణం త- గా మారటంగాని లేక లోపించటం గాని జరుగుతుంది. ఇది లోపించటం కంటె త- గా మారటమే ఎక్కువగా కనిపిస్తుంది లోపించటం కూడ ఎక్కువగా దక్షిణ ద్రావిడ భాషల్లోనే జరుగుతుంది. తెలుగులో మాత్రం చాల రూపాల్లో *చ- వర్ణం మారక అట్లాగే నిలిచి వుంది.

ఈ *చ- వర్ణ పరిణామం ఏ భాషలోను కూడ ఒక నియమం ప్రకారం జరిగినట్లు కనపడదు

ఉదా 7. త. చిక్కు 'పట్టుబడటం', మ చిక్కు- కొ. చిక్క్-, కో. చిక్-, తో తిక్-, క. సిక్కు, తు. సిక్క్-, తె. చిక్కు, కొలా సిక్- పర్జి. చిర్కి గోండి హిల్క్-, కుయి సిన్డు

ఉదా 8 త చూట్ 'పరిశీలించు', క. చూపు 'దృష్టి', తె. చూచ్-, చూపు, పర్జి చూడ్, గదబ సూడ్, గోండి సూడ్, [illegible], కుయి కొండ. సూడ్

ఉదా 9 త ఈ 'ఇచ్చు' [illegible] ఈ తె ఇచ్చ్, ఈ కొలామి [illegible], పర్జీ గదబ ఒల్లారి [illegible] గోండీ [illegible], హీ-, ఈ కుయి [illegible], కువి హీ- కొండ [illegible], కురు చి- మా [illegible]య్

ఉదా 10 త ఉప్పు [illegible] తె ఉప్పు 'ఉప్పు' కొడగు ఉప్పి, కో తో. ఉప్ కొలా సుప్ నా [illegible] ప చుప్ [illegible] చుప్పు

*చుప్ అనే పదం మూలద్రావిడ భాష దక్షిణ, మధ్య శాఖలుగా చీలే నాటికి ఉప్ చుప్ అని రెండుగా విడిపోయి వుంటుంది కాబట్టి దక్షిణశాఖ అంతటా ఉప్ అనీ, మధ్యశాఖకు చెందిన భాషల్లో చుప్ అనీ కనిపిస్తుంది అందు వల్లనే మూల మధ్యద్రావిడ భాషారూపంగా *చుప్ నీ మూలదక్షిణ ద్రావిడభాషా రూపంగా *ఉప్ నీ పునర్నిర్మించటం జరిగింది

*చ- వర్ణం కొన్ని భాషల్లో చ- గాను, కొన్నిట్లో స- గాను కనిపిస్తుం దనుకొన్నాం. గోండి, కుయి భాషల్లో స- యే కనిపిస్తుంది కాని చ- లేదు ఈ చ-/స- కొన్నిచోట్ల త- గా కూడ మారిన ఉదాహరణలున్నాయి

ఉదా 11. త మ. అరవు 'పాము', తె త్రాచు, గోం. తరాస్ 'పాము', కొండ. సరాస్, ప్రాసు, కుయి ప్రాసు, కువి. రాచు.

ఈవిధంగా చ-/స- నుంచి త- ఏర్పడటం ద్రావిడ భాషల్లో సాధారణంగా కనిపిస్తుంది. పదాది చ- కారమూ, పదాది త- కారమూ కలిగిన రూపాలు కూడ పక్కపక్కన కనిపిస్తాయి.

ఉదా: 12. తె. ఊఁగు, తూఁగు, త. తూన్కు, మ తూన్ను, క. తూగు. ఇటువంటి పదాల్లోని పదాది త- కారం చ-/స- నుంచి వచ్చిందే అని కచ్చితంగా చెప్పవచ్చు. కొన్ని రూపాల్లో పదాది హల్లు లోపించటమే అందుకు సాక్ష్యం. ఆ పదాది హల్లు త- నుంచి వచ్చినదే అయితే అదెప్పుడూ లోపించదు. *చ- నుంచి ఏర్పడినది కాబట్టి లోపించటం జరిగింది.

చ-/స- లతో ప్రారంభమయ్యే అన్ని పదాల్లోను పదాది హల్లు లోపిస్తుందని చెప్పలేం. అన్ని భాషల్లోను కూడ పదాది చ-/స- నిలిచివున్న పదాలు కొన్ని వున్నాయి.

ఉదా 13. త. మ చాల్ 'నాగటిచాలు', క. సాల్; తు. సాలు, తె. చాలు.

ఉదా. 14. త. మ. చారు 'మిరియాలతో చేసిన చారు'; క. చారు, సారు, తె. చారు.

చ-/స- తో కూడిన రూపాలు నేటి ద్రావిడభాషల్లో కనిపిస్తున్నా మూల ద్రావిడంలో చ- స- లతో కూడిన రెండు రూపాలూ వున్నాయనటానికి ఆధారం లేదు. ఈ రెండు ధ్వనుల వ్యాప్తి సోదర ద్రావిడభాషలలో ఏ విధంగా వుందో పరిశీలిస్తే ఈ విషయం బోధపడుతుంది

దక్షిణ ద్రావిడభాషల్లో తమిళంలో చ- వర్ణమే కాని స- లేదు మలయాళంలోను అంతే కన్నడంలో చ- స- రెండూ కనిపిస్తాయి కాని స-కారమే ప్రచురంగా వుంది తరచుగా ఒకే పదంలో ఈ రెండు ధ్వనులూ కూడ కనిపిస్తాయి. ఉదా చలి సలి ఇట్లా కన్నడంలో రెండు ధ్వనులూ రావటం మాండలిక భేదం వల్లనే కాని మూలభాషలో ఆ విధంగా లేదని గ్రహించాలి. తెలుగులోను చ-/స- లు రెండూ కనిపిస్తాయి. కాని చ-కారాది రూపాలుండటం సర్వసామాన్యం *చ- పదాదిస స-గా మారటం అక్కడక్కడ జరుగుతుంది. తుళులో కూడ కన్నడంలో వలెనే చ-/స- కారాది రూపాలున్నాయి అవి ఒకే పదంలో కూడ కనిపిస్తాయి.

మధ్య ద్రావిడ భాషల్లో చ-/స-/హ- గా ఈ వర్ణం కనిపిస్తుంది. ఉత్తర ద్రావిడ భాషల్లో చ-/స- లున్నా చ- వర్ణముండటమే సాధారణం.

ఈ విషయాల్ని బట్టి చ-/స- వేర్వేరు వర్ణాలు కావనీ ఒకదానికొకటి రూపాంతరాలనీ తెలుస్తుంది

ఈ విధంగా మూలద్రావిడ *చ- వర్ణం పొందే మార్పుల్ని గమనిస్తే ఏ మాత్రం నియమం కనిపించదు. కొన్ని పదాల్లో అన్ని భాషల్లోను చ-/స-

లున్నాయి. దక్షిణద్రావిడ భాషల్లో కొన్ని పదాల్లో ఇది లోపిస్తుంది. మరికొన్ని పదాల్లో నిలిచివుంది. ఒకే పదంలో లోపించటమూ, నిలిచివుండటమూ కూడ గమనించవచ్చు ఈ లోపించటమనేది దక్షిణద్రావిడభాషల్లో అందులోను తమిళంలో ప్రత్యేకంగా ప్రాచీన తమిళంలో అధికం.

పదాది *చ- వర్ణం లోపించటం ఎప్పుడు జరిదిందంటే తాలవ్యీకరణం జరగటానికి పూర్వమే అని చెప్పాలి. తాలవ్యీకరణం వల్ల వచ్చిన చ- వర్ణం లోపించిన ఉదాహరణ ఒక్కటి కూడ తమిళ మలయాళ తెలుగు భాషల్లో కన బడదు. కాబట్టి ఈ భాషల్లో తాలవ్యీకరణం పదాది *చ- వర్ణం లోపించటం ఆగిపోయిన తరువాతే జరిగిందని స్పష్టం. లేకపోతే తాలవ్యీకరణం వల్ల వచ్చిన చ- కూడ లోపించి వుండేది.

పదాది *చ- వర్ణలోపం క్రీస్తుశకానికి కొంచెం పూర్వం జరిగిన ధ్వని పరిణామమనీ, తాలవ్యీకరణం దానికి కొంత తరువాత జరిగిందనీ ఇంతవరకు లభ్యమైన సాక్ష్యాధారాలవల్ల చెప్పవచ్చు.

*త- వర్ణం అన్ని ద్రావిడభాషల్లోను త- గానే వుంటుంది. తమిళ; మలయాళ భాషల్లోను, తోద లోను తప్ప మిగిలిన భాషల్లో అక్కడక్కడ అప్పు డప్పుడు ద- గా మారుతుంది. కన్నడం, తుళు భాషల్లోని కొన్ని మాండలికాల్లో 'ఈ, ఏ' లకు పూర్వం తాలవ్యీకరణం జరుగుతుంది. అంటే *త- వర్ణం చ- గా గాని, స- గా గాని మారుతుంది.

ఉదా: 15. త. తలై 'తల'; మ.తల, క. తలె,తల, తె. తల, కొలా. నా. ఒల్లా. కొండ. తల, మాల్తో. తలి 'జుట్టు'.

ఉదా. 16. త. తొట్ట 'పెద్ద, గొప్ప' కోట. దొడ్, క. దొడ్డ తె. దొడ్డ, దొడ్డు.

ఉదా: 17. త. తీ, తీమ్ 'కాలటం', త. మ. తీ 'నిప్పు' క. తీ, సీ, 'కమలటం', తుళు. చీన్తుని 'కాలటం', తె. తీపు 'నొప్పి'.

*ప- వర్ణం ప్రాచీన కన్నడంలో ప-గాను, మధ్య, ఆధునిక కన్నడ భాషలో హ-గాను కనిపిస్తుంది. మిగిలిన అన్ని భాషల్లోను ప- గానే వుంటుంది.

ఉదా: 18. త. మ. కో. ప్రాచీన కన్నడం. పాల్ 'పాలు', తో. పోల్, అర్వాచీన కన్నడం. హాలు, తె. పాలు, పర్జి. పేల్, కొలా ఒ.గ. పాల్, గోం. కొం. కువి. కుయి. పాల్.

ఒకటి రెండు చోట్ల మధ్య ద్రావిడ భాషల్లో *ప- వర్ణం వ- గా మారటం కనిపిస్తుంది. ఉదా:

ఉదా: 19. త. పిటి 'పిండు', మ. పిఱియుక; క. పిటి, పిండు, హిండు, తె. పిండు, కుయి. ప్డీస; కువి. వీన్కి.

## పదాది సరళాలు

మూలద్రావిడభాషలో శ్వాసవత్ స్పర్శాలే (unvoiced stops) కాని నాదవత్ స్పర్శాలు (voiced stops) ఉన్నాయనటానికి ఆధారాలు లేవు. నేటి ద్రావిడ భాషల్లో చాలవాటిల్లో నాదాలు కనిపిస్తున్నాయి. తమిళం, ప్రాచీన మలయాళంలలో తప్ప మిగిలిన భాషల్లో శ్వాసనాదాలు అర్థభేదన సమర్థమైన ప్రత్యేక వర్ణాలుగ కనిపిస్తాయి. శ్వాసనాద భేదం భిన్నార్థ స్ఫూర్తిని కలిగిస్తుంది. కాని మూలద్రావిడ భాషలో ఈ శ్వాసనాదాలు ప్రత్యేక వర్ణాలుగా లేవనీ శ్వాసవర్ణాలు మాత్రమే ఉండినాయనీ నిరూపించబడింది.

మూల ద్రావిడ భాషలో నాదవత్ స్పర్శాలు లేవని కాల్డ్వెల్ అభిప్రాయం. నేటి మిగిలిన ద్రావిడ భాషలకు భిన్నంగా తమిళంలో నాదాలు లేవు. పదం మధ్యలో రెండచ్చుల నడుమ శ్వాసాలనే రాస్తారు కాని, నాదాలుగా పలుకుతారు. అనునాసిక పూర్వకమైన శ్వాసాన్ని కూడ నాదంగానే ఉచ్చరిస్తారు. ద్విత్వాక్షరం శ్వాసంగానే ఉచ్చరించబడుతోంది. పదాదిన కూడ శ్వాసాలే వుంటాయి కాని నాదాలు కాదు. ఇదే ద్రావిడ భాషల యొక్క ప్రాథమిక స్థితి అని కాల్డ్వెల్ అభిప్రాయం.

యూల్ బ్లాక్ (Jules Bloch) ఘోటక, గార్దభ, ద్రావిడ మొదలైన కొన్ని పదాల చరిత్రని ఆధారం చేసుకొని కాల్డ్వెల్ వాదాన్ని పూర్వపక్షం చేయ ప్రయత్నించారు. ఈ పదాలు ద్రావిడ భాషా పదాలనీ, అవి సంస్కృతంలోకి వెళ్ళాయనీ ఈయన అభిప్రాయం. ప్రాచీన ద్రావిడ భాషల్లో మహాప్రాణ నాదవత్ స్పర్శాలు ఉండి వుండవచ్చునని కూడ ఊహించారు. సునీతి కుమార ఛటర్జీ, యఫ్ బి.జె. కూపర్ మొదలైనవారు మూల ద్రావిడ భాషలో నాదస్పర్శాలున్నాయనే వాదాన్ని అంగీకరించారు. కాని వీరెవరూ తమ ఊహను సమర్థించుకోవటానికి సరైన సాక్ష్యాధారాలు చూపించలేదు.

నేటి ద్రావిడ భాషల్లో నాదవత్ స్పర్శాలు ప్రత్యేక వర్ణాలుగానే ఉన్నాయి. కొన్ని భాషల్లో ముఖ్యంగా తెలుగు, కన్నడ భాషల్లో అవి పదాదిన కూడ కనిపిస్తాయి. ఇటువంటి నాదాలు మూల ద్రావిడ భాషలో లేవనీ, తరువాతి కాలంలో ఆయా భాషల్లో ఏర్పడ్డాయనీ బరో సిద్ధాంతం. దీన్ని రుజువు చేయటానికి ఆయన చూపిన ఉపపత్తులివి.

I తెలుగు, కన్నడ భాషల్లో పదాది సరళాలున్న పదాలలో ఎక్కువ శాతం పదాలకు తమిళంలో సమాన పదాలు కనిపించవు. ఉదా: క. గద్దిగె 'గద్దె', తె. గద్దె, క. గంపె 'గంప', తె. గంప, క. గాళ 'గాలం' తె. గాలము, క. తె. గుంజు 'లాగు', క. తె. గుడ్డు, క. జటి, తె. జెట్టి, క. తె. జిగట, క. జింకె, తె. జింక, క.తె. జిడ్డు, క. జిణుగు 'వస్త్రంయొక్క సన్నదనం' తె. జిలుగు క.తె. జువ్వి, క. దట్ట 'దట్టం', తె. దట్టము, క.తె. దండి 'అధికం' క.తె. దీటు

'సమానం', క తె. దుప్పి, క.తె దుముకు, క. దూలె 'దురద', తె దూల, క. దోమె 'దోమ', తె దోమ క. బంకె 'జిగురు', తె. బంక క. బండె, తె బండ, క.తె బీడు, క.తె బెస్త

ఇవి కాక తెలుగులో మాత్రమే ఉన్న పదాలు, కన్నడభాషకు మాత్రమే పరిమితమైన పదాలు చాల ఉన్నాయి ఇవి ఆ భాషలో తప్ప ఇతర భాషల్లో కనిపించవు ఉదాహరణకి తెలుగులో గడ్డి, జాగు, దూడ, బొగ్గు మొదలయినవి. కన్నడంలో గుడుగు 'ఉరుము', దుడి 'శ్రమ', దుండు 'గుండ్రం' మొదలయినవి

ఈ విధంగా గ,జ,ద,బ లతో ప్రారంభమయ్యే పదాల్లో అధిక భాగానికి సమాన పదాలు తమిళంలో కనబడవు. ఇటువంటి పదాలు ఈ భాషల్లో అంటే కన్నడము తెలుగు భాషల్లో కాలక్రమంలో వచ్చి చేరాయని భావించవచ్చు

II తెలుగు, కన్నడ భాషల్లో పదాది సరళాలున్న పదాలలో కొన్నిటికి తమిళ, మలయాళ భాషల్లో సమాన పదాలు కనిపిస్తాయి అటువంటి వాటిల్లో అధికభాగం అర్వాచిన కాలంలో తమిళ, మలయాళ భాషల్లో చేరిన ఎరవు పదాలని జాగ్రత్తగా పరిశీలిస్తే తెలుస్తుంది అవి ప్రాచీన తమిళంలో కనపడవు. అర్వాచన కావ్యాల్లోను, వ్యావహారికంలోను మాత్రం కనిపిస్తాయి కాబట్టి ఆ పదాలను బట్టి పదాది నాదవత్ స్పర్శాలు ఆ భాషల్లో ఉన్నాయని చెప్పటానికి వీలుండదు అటువంటి పదాలు కొన్ని క్రింద ఇవ్వబడ్డాయి త కుట్టు 'రహస్యం' <తె క గుట్టు, త కెచ్చమ్ 'మోగేగజ్జెలు' < తె.క గజ్జె, త కెట్టమ్ 'గడ్డం' <తె గడ్డము. క గడ్డ, త. కెట్టి 'గట్టి' < తె గట్టి, త. చల్లడై 'జల్లెడ' <తె జల్లెడ. క జల్లడె, త చోడు 'జంట' <తె క జోడు, త తప్పణమ్ 'కుట్టేసూది' <తె దబ్బనము, క దబ్బణ దబ్బళ త తూలమ్ 'దూలం' <తె. దూలము, క. దూల, త పాగు 'అంశం' < తె బాగు, త పాణై 'కుండ' <తె బాన, క. బాన, త పొమ్మై 'బొమ్మ' <తె బొమ్మ, క. బొమ్మె.

III ఇటువంటి పదాలు అంటే, పదాదిన నాదవత్ స్పర్శాలతో కూడిన పదాలకి సమాన పదాలు కొన్ని తమిళంలో ప్రాచీన కాలం నుంచి కనిపిస్తాయి కాని అటువంటి సందర్భాల్లో ఆ పదాలకి సంబంధించి తెలుగు, కన్నడ భాషల్లో ఏకీభావం కనిపించదు కొన్ని పదాలకి తెలుగు భాషలో సరళం కనిపిస్తే కన్నడంలో కనబడదు. మరికొన్ని పదాలకి కన్నడంలో సరళం ఉంటే తెలుగులో ఉండదు కింది పదాలు కన్నడంలో సరళాలుండి తెలుగులో లేనివి క. గిణి, గిళి 'చిలుక', తె. చిలుక త కిళి, క. గెదలు 'చెదలు', తె చెదల చిదలై, క. జిల్లి 'బెజ్జం' తె. త. చిల్లి ఇక తెలుగులో నాదాలుండి కన్నడంలో లేని పదాలు కొన్ని తె. గాదిలి క కాదల్ త. కాదల్ 'ప్రేమ', తె గ్రుడ్డి, క. కురుడు, త. కురుడు 'గ్రుడ్డి', తె గొడుగు, క. కొడె, త కుడై 'గొడుగు.'

తెలుగు కన్నడ భాషల్లో ఒకే పదంలోనే పదాదిన శ్వాసవత్‌స్పర్శమూ నాదవత్ స్పర్శమూ కూడ అర్థ భేదాన్నివ్వకుండా కనిపిస్తాయి. తె. కడుచు, గడుచు; కణుపు, గణుపు; కుంట, గుంట; చొల్లు, జొల్లు. క. కంపు, గంపు 'వాసన'; కూను, గూను 'గూని', కొట్ట, గొట్ట 'గొట్టం'; పచ్చ, బచ్చ 'పచ్చ దనం'; పుట్టి, బుట్టి 'బుట్ట'; పూచి, బూచి 'పురుగు'.

ఈ ఉదాహరణల్ని బట్టి పదాది నాదవత్ స్పర్శాలు ద్రావిడ భాషల్లో ప్రాచీనకాలం నుంచి ఉన్నవి కాదనీ, ఈ నాదత ఈ భాషల్లో అర్వాచీన కాలంలో ఏర్పడిందనీ తెలుస్తుంది.

IV. తెలుగు కన్నడ భాషల్లో కనిపించే ఈ నాదత ఆ భాషల క్రమ పరిణామంలో ఏర్పడిందని కొన్ని పదాల్ని పరిశీలిస్తే స్పష్టమవుతుంది.

తెలుగులో గోరు అనే పదముంది. దీనికి సమాన పదాలుగా తమిళంలో ఉగిర్, కన్నడంలో ఉగుర్ కనిపిస్తాయి. తెలుగులో కనిపించే పదాది 'గ'వర్ణం ప్రాచీన కాలంలో పదంలో ఉండినట్లు తమిళ, కన్నడ పదాలనుబట్టి తెలుస్తుంది. వర్ణవ్యత్యయం వల్ల అది పదాదికి వచ్చింది. ఇదే విధంగా తెలుగులోని డిగు> దిగు అనే పదంలో కూడ జరిగింది. తమిళంలో దీనికి సమాన పదం ఇఴి. తెలుగులో మూలద్రావిడ ఴ వర్ణం 'డ' గా మారి తరువాత 'ద' గా మారింది. వర్ణవ్యత్యయం జరగటంవల్ల అది పదాదిన కనిపిస్తుంది.

తమిళంలో 'కూడు' అనే పదముంది. దీనికి అర్థం గూడు అని. దీనికి సమాన పదం తెలుగు, కన్నడాల్లో గూడు, తమిళంలో కూడు 'ఒక చోట చేరు' అనీ తెలుగు కన్నడ భాషల్లో కూడు అనీ క్రియా రూపాలున్నాయి. ఈ విధంగా క్రియారూపంలో అన్ని భాషల్లో పదాదిన క- కనిపిస్తోంది. కాబట్టి గూడు లోని పదాది నాదస్పర్శం పరిణామ క్రమంలో ఏర్పడిందని చెప్పవచ్చు.

ఇంతవరకు పరిశీలించిన విషయాన్ని బట్టి ప్రాచీన ద్రావిడభాషలో నాదవత్ స్పర్శ వర్ణాలు లేవనీ, తెలుగు, కన్నడ భాషలు ఈ వర్ణాలను కలిగి వుండటం ఆ భాషల్లో కలిగిన నూతన పరిణామ (innovation) మనీ తెలుస్తుంది. తెలుగు కన్నడభాషల్లోని నాద స్పర్శాలలో ప్రారంభమయ్యే పదాల్లో అధికశాతం ద్రావిడభాషాపదాలు కావనీ స్పష్టమవుతుంది.

*న- వర్ణం పూర్వాచ్చులు పరమైనప్పుడు బ్రాహుయి తప్ప మిగిలిన ద్రావిడభాషలన్నిట్లోను న- గానే ఉంటుంది. బ్రాహుయిలో మాత్రం ద- గా మారుతుంది.

ఉదా: 20. త. నెయ్‌త్తోర్ 'నెత్తురు', క. నెత్తర్; తె నెత్తురు; కొలా. నా. నెత్తుర్; గోం. నెత్తుర్; బ్రా. దితర్.

ఈ *న- వర్ణం మిగిలిన అచ్చులు పరమైనప్పుడు అన్ని భాషల్లోను న- గానే వుంటుంది. కొన్ని భాషల్లో అప్పుడప్పుడు లోపిస్తుంది. మిగిలిన భాషల

కంటె కొలామి, నాయకిలలో లోపం ఎక్కువగా కనిపిస్తుంది.

ఉదా : 21. త. నడ 'నడచు', మ. నడక్క, కోట. నడు, తోడ. నడ్; క. నడె; తె. నడచు, నడక, నడత; కొలా. నా. అడ్గ్-; కొండ. నడి.

ఇంకా కొన్ని భాషల్లో ఈ *న- వర్ణ లోపానికి ఉదాహరణలు D.E D. లో 3054, 3043, 3004 సంఖ్యల కింద ఇవ్వబడ్డాయి. పూర్వేతరాచ్చులు పరమైనప్పుడు *న- వర్ణాన్ని నిలుపుకొన్న ఉత్తర ద్రావిడభాషా పదాలు కూడ 2998, 2980 సంఖ్యల కింద కనిపిస్తాయి.

*ఞ- వర్ణం మలయాళంలోను, ప్రాచీన తమిళంలోను కనిపిస్తుంది. మిగిలిన అన్ని భాషల్లోను ఇది న- గా మారుతుంది. కొన్ని భాషల్లో లోపిస్తుంది. ఇందుకు ఏ విధమైన నియమం కనిపించదు. ఞ- వర్ణానికి పరమయ్యే అచ్చులు ద్రావిడభాషల్లో అ, ఆ, ఎ, ఏ లు కనిపిస్తాయి. దీన్నిబట్టి ఞ- వర్ణానికి పరమయ్యే అ, ఆ, ఎ, ఏ ల మధ్య అర్థభేదం లేదని తెలుస్తుంది ఉదాహరణకి తెలుగులో నెమలి, నమలి అనే పదాలు కనిపిస్తాయి. ఈ రెండు పదాలకూ అర్థం ఒకటే. అంటే, ఒకే పదంలో ఈ రెండచ్చులూ అర్థభేదం లేకుండా ఞ- వర్ణానికి పరంగా వాడబడ్డాయి.

ఉదా : 22. త. ఞమలి 'నెమలి', క. నవల్, నెమలి; తె. నమ్మి, నెమిలి, నమలి, నెమలి; కొలా. నా. నమ్లి, కొండ. నమిల్.

ఉదా: 23. త. ఞాఞ్జిల్, నాఞ్జిల్ 'నాగలి'; మ. ఞేన్నోల్, క. నేగల్; తె. నాఁగలి, నాఁగేలి, నాగలి, నాగేలి (అరసున్నతో కూడిన రూపాలు ప్రాచీన తెలుగుభాషా రూపాలు), కొలా. నాన్గ్లి, నా. నాన్గర్, ఒల్లా. గ. నాన్గల్; గోం. నాన్గెల్; కుయి. నాన్గెలి.

ఞ- వర్ణాది పదాల్ని పరిశీలిస్తే ఆ వర్ణానికి పరమయ్యే అచ్చు అ,ఆ, ఎ,ఏ లలో ఒకటి మాత్రమే అనీ మరే అచ్చూరాదనీ తెలుస్తుంది.

ఆయా భాషా పదాల్ని పరిశీలించినప్పుడు ఞ- వర్ణాన్ని నిలుపుకొన్న భాషలు మలయాళమూ, ప్రాచీన తమిళమూ అని తెలుస్తుంది. మిగిలిన భాషా పదాల్లో ఞ- వర్ణం లేకపోయినా తమిళ, మలయాళ భాషా రూపాల్ని బట్టి ఆ పదంలోని ఆదివర్ణం *ఞ- అని గుర్తించవచ్చు.

కొన్ని భాషల్లో న,నా-నె,నే లతో గూడిన రెండు రూపాలూ కనిపిస్తాయి. కాని ఞ- వర్ణం మాత్రం కనబడదు.

ఉదా: 24. త. నేమ్బు 'నేము'; మ. నేమ్బుక, నావుక; తె. నేము.

ఉదా: 25. త. నచ్చు 'ఇష్టం కలుగు'; క. నచ్చు, నెచ్చు; తె. నచ్చు.

ఈ విధంగా న- వర్ణానికి పరంగా అ,ఆ,ఎ,ఏ లు వేర్వేరు భాషల్లో కాని, ఒకే భాషలో కాని, ఒకే పదంలో కనిపించినప్పుడు మూలద్రావిడభాషలో ఆ అనునాసికం చ వర్గానునాసికమని భావించవచ్చు. ఈ భాషల్లో ఏ భాషా

రూపంలోను ఞ- వర్ణం నిలిచివుండకపోయినా న- కి తరువాత కనిపించే అ,ఆ, ఎ,ఏ ల వినిమయంవల్ల ఈ విషయం ఊహించవచ్చు

ఈ విధంగా కాక పదాదిన మూలద్రావిడ భాషలోని *న-, *నె- లు ఉన్నట్లయితే అటువంటి పదాల్లో న-, నె- ల వినిమయం జరగదు.

ఉదా: 26. త.మ. నడ 'నడచు', క. నడె; తె. నెత్తి

ఉదా: 27. త మ. నెట్టి 'మాడు'; క. నెత్తి, తె నెత్తి.

ఈ పదాల్లో న- కి తరువాత అ, ఎ ల మధ్య వినిమయం జరగలేదు. కాబట్టి పదాది నున్న న- వర్ణం ప్రాచీన ద్రావిడ భాషా *న- వర్ణమని తెలుస్తుంది.

దీన్నిబట్టి న- వర్ణానికి పరమైన అ,ఆ,ఎ,ఏ ల నడుమ వినిమయం జరిగితే ఆ వర్ణం మూలద్రావిడ భాషలోని *ఞ- వర్ణమనీ, నేడు కనిపించే న- వర్ణం దానికి ప్రతిబింబమనీ భావించాలి.

ఈ విధంగా ఞ- వర్ణానికి పరమయ్యే అచ్చుల మధ్య వినిమయం కనిపించటంవల్ల ప్రాచీన భాషలో ఈ వర్ణానికి పరమయిన అచ్చుయొక్క స్వభావం ఏమిటి? అది ఆ కాలంలో ఏ విధంగా ఉందేది? అని సందేహం కలుగుతుంది. ప్రాచీన తమిళ వ్యాకర్తలు ఞ- కి 'ఆ' గాని 'ఎ' గాని మాత్రమే పరంగా రావాలని నిర్దేశించారు. అంటే, ఞా, ఞె లు మాత్రమే ఉండాలి. దీన్నిబట్టి *ఞ- వర్ణానికి పరమయ్యే అచ్చు దీర్ఘంగా ఉన్నప్పుడు 'ఆ' గాను, హ్రస్వంగా ఉన్నప్పుడు 'ఎ'గాను ఉచ్చరించబడేదని ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారి అభిప్రాయం.

*మ- అన్ని ద్రావిడభాషల్లోను మ- గానే ఉంటుంది. బ్రాహుయిలో మాత్రం పూర్వాచ్చులకి పూర్వం 'బ'- గాను, మిగిలిన చోట్ల మ- గాను కనిపిస్తుంది.

ఉదా : 28. త. మరం, మరన్ 'మ్రాను, చెట్టు', మ. మరం, క. కొ'డ. తు. మర, తె. మ్రాను>మాను; పర్జి. మెరి, ఒ. మర్, గోం. మడా, కుయి. మ్రహ్ను, కువి. మ్రాను, మ్రాను; కొం. మరన్, మ్రాను; కు. మన్న్; మాల్తో. మను.

ఉదా : 29. త. మెట్టు 'మెరకభూమి'; క. మేడు, తె. మెట్ట, మిట్ట, మెట్టు; కొలా. మెట్ట, గో. మెటా, మెట్టా; బ్రా. బిట్.

*య- వర్ణానికి పరమయ్యే అచ్చులు అ,ఆ,ఎ,ఏ లు మాత్రమే. ప్రాచీన తమిళంలో *య- కి 'ఆ' మాత్రమే పరమవుతుంది. యానై 'ఏనుగు', యాడు 'మేక', యాఱు 'ఏరు' మొదలైన పదాలు కనిపిస్తాయి. క్రమంగా పదాది *య- వర్ణం లోపించిన రూపాలు ఆనై, ఆడు వంటివి తమిళంలో కనిపిస్తాయి. ఆ సాహిత్యంలో ఇటువంటి ప్రయోగాన్ని పరిశీలిస్తే పదాది *య- తో కూడిన పదాలే ప్రాచీనమైనవనీ, క్రమంగా *య- వర్ణం లోపించిన పదాలేర్పడ్డాయనీ తెలుస్తుంది. ప్రాచీన తమిళ సాహిత్యంలో యా- తో కూడిన రూపాలు

అధికంగాను, మధ్యకాలంలో యా- తోను, ఆ- తోను కూడిన రూపాలూ వాడబడ్డాయి ఇక ఆధునిక భాషలో ఆ- తో కూడిన రూపాలే అధికంగా కనిపిస్తాయి. మిగిలిన దక్షిణద్రావిడభాషల్లో కూడ ఇదే విధంగా, అంటే *య- వర్ణం లోపించి ఆ- తో కూడిన రూపాలుంటాయి. అప్పుడప్పుడు కొన్ని పదాల్లో పదాది *య- వర్ణం లోపించి తరువాతి అచ్చు 'ఏ' గా కూడ ఉంటుంది.

మధ్యద్రావిడభాషల్లో పదాది *య- వర్ణం లోపిస్తుంది. దానికి పరమైన అచ్చు 'ఏ' నిలిచివుంటుంది. అప్పుడప్పుడు 'ఆ' కూడ కనిపిస్తుంది. తెలుగులో ఎప్పుడూ 'ఏ' మాత్రమే కనిపిస్తుంది.

కురుఖ్, మాల్తో భాషల్లో పదాది *య- వర్ణం లోపించి, దానికి పరమయిన అచ్చు 'ఏ' గా కనిపిస్తుంది.

ఉదా: 30. త. యానై, ఆనై, 'ఏనుగు', మ. ఆన; కోట. తోడ. ఆన్, క. కొడగు. తుళు. ఆనె, తె. ఏనుగు, కొలా ఏన్గి; పర్జి. ఏను, గోం. ఏనీ.

ఉదా: 31. త. యాన్ 'నేను'; కోట. ఆన్, క. ఆన్; తె ఏను; కొలా. నా.ప ఒల్లా. గదబ. ఆన్, కుయి. ఆను, కురు. మాల్తో. ఏన్, బ్రా. ఈ

పైన గమనించిన ఆ, ఏ ల వినిమయం ఆయా పదాలకి పూర్వం ఉండిన *య- వర్ణం లోపించిన విషయం తెలుపుతుంది. తమిళం వంటి ఏ ఒక్క భాషలోను కూడ *య- వర్ణం నిలిచివుండకపోయినా ఆ, ఏ ల వినిమయం కనిపించటం వల్ల పదాదిన ఉండిన వర్ణం *య- అనీ, అది లోపించిందనీ చెప్పవచ్చు. దీన్నిబట్టి *య- వర్ణానికి పరమైన అచ్చులు ఆ, ఏ లనీ వాటికి ఆ సందర్భంలో అర్థభేదం లేదనీ తెలుస్తుంది. అందువల్లనే *య- తరువాత ఆయా భాషల్లో ఆ, ఏ ల వినిమయం కనిపిస్తుంది.

అట్లా కాకుండా ఆయా పదాలు ఆ, ఏ లతో ప్రారంభమయ్యే పదాలుగానే భావించి ఆయా పదాల్లోని అచ్చుల్ని మూలభాషలోని *ఆ, *ఏ లు గానే ప్రత్యేక వర్ణాలుగానే భావించవచ్చును గదా అని ప్రశ్నించవచ్చు. అవి మూలభాషలోనివే అయితే అన్ని భాషల్లోను కూడ అదే విధంగా 'ఆ'గా గాని, 'ఏ'గా గాని ఉంటాయి గాని, వినిమయం జరగటానికి అవకాశం లేదు. అందువల్ల వాటిని *య- వర్ణానికి పరమైన అచ్చులుగానే భావించాలి. అంటే, ఆ అచ్చులకి పూర్వం ఒకప్పుడు *య- వర్ణం ఉండి వుంటుందని చెప్పాలి. దీన్నిబట్టి మూల ద్రావిడ భాషలో *య- కి పరమయిన ఆ, ఏ ల నడుమ అర్థ భేదం లేదనీ, ఆ రెంటికి బదులుగా ఏదో ఒకే అచ్చు ఉండి వుంటుందనీ తెలుస్తుంది.

*వ- వర్ణానికి పరంగా అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ అనే అచ్చులు వస్తాయి. ఉ, ఊ, ఒ, ఓ లు రావు. ఈ వర్ణం కన్నడం, తుళు, కొడగుల్లోను, ఉత్తర ద్రావిడభాషల్లోను బ- గా మారుతుంది. తోడలో ప- గా మారుతుంది. మిగిలిన అన్ని ద్రావిడభాషల్లోను వ- గానే ఉంటుంది. కన్నడంలో ఈ మార్పు 9 వ శతాబ్దం నుంచి జరిగినట్లు తెలుస్తుంది.

ఉదా: 32. త.మ. వాయ్ 'నోరు'; కో. వాయ్; తో. పోయ్; కొడ. బాయ్, క. బాయ్; తు. బాయి; తె. వాయి; పర్జి. వాయ్; కురు. బఈ, బ్రా. బా.

ఉదా: 33. త. వాన్గు 'వంగు'; మ. వాన్నుక; కో. వక్, తో. పగ్; క. బాగు, బగ్గు, కొడ. బగ్గ్; తు. బగ్గుని; తె. వంగు; కొలా. నా. పర్జి. వంగ్; కురు. బంకా.

మూలద్రావిడభాషలో పదాదిన వచ్చే వర్ణాలు జన్య భాషల్లో ఏ విధంగా పరిణామాన్ని పొందాయో ఇంతవరకు చర్చించాం. ఈ తొమ్మిదివర్ణాలు మాత్రమే పదాదిన వస్తాయి. దంతమూలీయ, మూర్ధన్య వర్ణాలు ఏడూ రావు.

కాని నేటి ద్రావిడభాషల్లో మధ్య ద్రావిడవర్గానికి చెందిన తెలుగు, కుయి, కువి భాషల్లో జరిగిన వర్ణవ్యత్యయం కారణంగా ఈ వర్ణాలు పదాదిన కూడ కనిపిస్తాయి. మిగిలిన భాషల్లోని సమానపదాల్లో ఇవి పదం మధ్యలో కనిపిస్తాయి. కాబట్టి ఈ లక్షణం తెలుగు, కుయి, కువి, కొండ ఉప కుటుంబపు ప్రత్యేక లక్షణమని చెప్పవచ్చు.

ఉదా: 34. త. అరై 'రాయు'; మ. అరెక్క; క. అరె; తె. రాయు, రాచు, కుయి. రాగ; కువి. రాచ. దీనికి మూల భాషారూపం *అర్-అయ్.

ఉదా: 35. త. ఇల్లై 'లేదు', మ. ఇల్ల; కో.తో. ఇల్; క. ఇల్ల; పర్జి. చిల, గోం. సిల్లె, హిల్లె, కొం. సిల్; కుయి. సిడ, తె లే-. దీనికి మూలభాషా రూపం *చిల్.

ఉదా: 36. త. ఇఱై 'యజమాని', మ. ఇఱాన్, క. ఎఱె, తె. ఱేఁడు. దీనికి మూల భాషారూపం *ఇఱ్-అనఱ్.

ఉదా: 37. త. ఇழி 'దిగు'; మ. ఇழிక; క. ఇఴి, కొ. ఇళి; తె. డిగ్గు>దిగ్గు>దిగు, కొలా. నా. డిగ్; ప. ఇడి, కుయి. డీవ, కువి. ఢీ-. దీనికి మూల భాషారూపం *ఇఴ్-.

ఉదా: 38. త. అడంగు 'అణగు'; మ. అడన్నుక; క. అడంగు, అడకు; తె. అడఁగు, అడఁచు, డాఁగు, డాగు, దాఁగు, దాగు, కొలా. డాంగ్, కుయి. డాప. దీనికి మూలరూపం *అట్-అన్క్.

పైన చూపిన ఉదాహరణలను బట్టి ప్రాచీన భాషలో అచ్చుల నడుమ ఉన్న దంతమూలీయ మూర్ధన్య వర్ణాలు కొన్ని మధ్యద్రావిడ భాషల్లో వర్ణ వ్యత్యయం కారణంగా పదాదికి వచ్చినట్లు తెలుస్తుంది. ఇది ఈ భాషల్లో జరిగిన నూతన పరిణామం.

ఈ వర్ణవ్యత్యయం రెండు విధాలుగా జరిగినట్లు తెలుస్తుంది. మొదటి దాన్లో అజాదిగా నున్న ప్రత్యయం పరమయినప్పుడు ధాతుగత వర్ణాలలో (root syllable) వర్ణవ్యత్యయం జరిగి ప్రత్యయంలోని అచ్చు లోపించి ప్రాతిపదిక లోని అచ్చు దీర్ఘం అవుతుంది. దీనికి ఉదాహరణగా పైన ఇచ్చిన 34 వ సంఖ్య గలది సరిపోతుంది. *అర్ - అయ్ > ర - అయ్ > రా-యు అవుతుంది. ఇక

రెండవ రకమయిన వర్ణ వ్యత్యయం. దీన్లో ప్రత్యయాదిన అచ్చుంటే ఆ అచ్చు లోపిస్తుంది. హలాదిగా ఉన్న ప్రత్యయం పరమైనప్పుడు ధాతుగత వర్ణాల్లో వర్ణ వ్యత్యయం జరిగి ప్రత్యయంలో ఉన్న అద్విరుక్తహల్లు ద్విత్వంగా మారుతుంది పైన ఇచ్చిన 37 వ ఉదాహరణ దీనికి సరిపోతుంది. *ఇట్-ఇగ్>ఇట్-గ్->టి-గ్గ్>డి-గ్గ్>డిగ్>దిగు. ఈ వర్ణవ్యత్యయం జరిగిన తరువాత *-ట- వర్ణం తెలుగులో 'డ'గా మారింది తరువాత 11 వ శతాబ్ది ప్రాంతంలో తెలుగులోని పదాది 'డ-' కారం ద- గా మారింది. అందువల్లనే డిగు>దిగు, డాఁగు>దాఁగు వంటి రూపాలు కనిపిస్తాయి.

కొన్నిచోట్ల దంతమూలీయ, మూర్ధన్యేతర వర్ణాల్లో కూడ వర్ణ వ్యత్యయం జరిగినట్లు కనిపిస్తుంది. ఉదాహరణకి *అవన్త్ అనే మూలద్రావిడ రూపం నుంచి ప్రాచీన తెలుగుభాషలోని వాన్రు రూపం ఏర్పడింది. ఇది శాసన భాషలో కనిపిస్తుంది. ప్రాచీన తెలుగు సాహిత్య భాషలో ఈ రూపం వాఁడు గా మారింది. ఆధునిక భాషలో అరసున్న పోయి వాడు అయింది. కొండ భాషలో వాన్రు అనే కనిపిస్తుంది. ఇదే విధంగా *ఇవన్త్ నుంచి వీన్రు>వీఁడు>వీడు రూపాలు ఏర్పడ్డాయి. కొండలో వేన్రు రూపం కనిపిస్తుంది. 'ఇతను' అని దాని అర్థం. ఇవి వర్ణవ్యత్యయంవల్ల ఏర్పడిన రూపాలు

ఇదే విధంగా అది, ఇది అనే అర్థాలనిచ్చే రూపాలు తమిళ, మలయాళ, కన్నడాది భాషల్లో అదు, ఇదు అని ఉంటాయి. వీటికి ద్వితీయాది విభక్త్యంగ రూపాలు తెలుగులో దాని-, దీని- అని కనిపిస్తాయి. ఈ రూపాలు వర్ణవ్యత్యయంవల్ల ఏర్పడినవే. మిగిలిన ద్రావిడభాషల్లో ఇటువంటివి కనపడవు.

ద్రావిడ భాషల్లో పదాదిన సంయుక్తాక్షరాలు లేవు. కొన్ని మధ్య ద్రావిడ భాషల్లో వర్ణవ్యత్యయం జరగటంవల్ల కొన్ని చోట్ల పదాదిన సంయుక్తాక్షరాలు కనిపిస్తాయి. ప్రాచీన తెలుగు భాషలో ఈ విధంగా ఏర్పడిన సంయుక్తాక్షరాల్లో రేఫ మాత్రమే ద్వితీయ వర్ణంగా కనిపిస్తుంది ప్రథమ వర్ణం క,త,ప,గ,ద,బ, స,మ,వ లలో ఏదో ఒకటి మాత్రమే ఉంటుంది. క్రొత్త, త్రవ్వు, ప్రాత, గ్రుచ్చు, ద్రొబ్బు, బ్రుంగు, స్రుక్కు, మ్రింగు, వ్రాయు మొదలైన ఆది సంయుక్తాక్షర పదాలవల్ల ఈ విషయం తెలుస్తుంది. ఉదాహరణకి మూల భాషా పదం *మిట్-ఉన్కు>మిట్-న్గు>మ్రి-న్గు>మ్రి-న్గు అనే విధంగా మార్రి 'మ్రింగు' రూపం ఏర్పడుతుంది. ఇట్లాగే *కొట్-ఉవ్>కొట్-వ్>క్రొ-వ్వ్> క్రొ-వ్వు అనే విధంగా పరిణామం చెందింది. *కర్-అన్కు>కర్>అన్గు> క్రాఁగు గా మారింది.

ఈ విధంగా వర్ణవ్యత్యయంవల్ల పదాదిన రేఫ ద్వితీయ వర్ణంతో కూడిన సంయుక్తాక్షరాలేర్పడిన రూపాలు తెలుగు శాసన భాషలో క్రీ. శ. 5 వ శతాబ్ది నుంచి కనబడతాయి. అటువంటి పదాల్లో మొదటిది 'ప్రాలూరు' అనే గ్రామనామం.

తరువాత కొంత కాలానికి ఈ విధంగా సంయుక్తాక్షరాల్లోని రెండో హల్లు లోపించటం జరిగింది ఈ లోపం ఎప్పుడు జరిగిందో స్పష్టంగా చెప్పలేం. 12 వ శతాబ్ది ప్రాంతంలో మొదలైందనవచ్చు. మరి దీనికి అపవాదంగా 'వ్రాత' వంటి పదాలు ఒకటి రెండు కనిపిస్తాయి. ఇందులో మొదటి హల్లు లోపించి రేఫ మాత్రం నిలుస్తుంది. రాత, రాయు వంటి రూపాలు తెలుగు వారి వ్యవహారంలో వినిపిస్తాయి.

## అపదాది హల్లులు

మూలద్రావిడ భాషలో శ్వాసవత్ స్పర్శాలే ఉన్నాయి కాని, అవి పదం మధ్యలో అచ్చులే నడుమా, అనునాసిక పూర్వమైనప్పుడూ నాదాలుగా ఉచ్చరించబడేవని అనుకొన్నాం. శ్వాసనాద స్పర్శాల మధ్య అర్థభేదం ఆయా భాషల్లో కాలక్రమంలో ఏర్పడిందనీ తెలుసుకొన్నాం.

మూలద్రావిడ భాషలోని అపదాది హల్వర్ణాలు ఇతర ద్రావిడ భాషల్లో ఏ విధంగా కనిపిస్తాయో పరిశీలిద్దాం. మూలద్రావిడ భాషలో ద్విత్వాలుగా ఉన్న శ్వాసవత్ స్పర్శవర్ణాలు తమిళ మలయాళభాషలు తప్ప మిగిలిన ద్రావిడభాషల్లో అద్విరుక్త శ్వాసాలుగాను, మూలద్రావిడంలోని అద్విరుక్త శ్వాసవత్ స్పర్శ వర్ణాలు నాదవత్ స్పర్శాలుగాను మారతాయి. ఇది సాధారణంగా జరిగే పద్ధతి.

*-క- తమిళ, మళయాళ భాషల్లో- క -గానే వుంటుంది కాని [-గ-]గా ఉచ్చరించబడుతుంది. తోడలో -హ- గా, మిగిలిన దక్షిణ ద్రావిడభాషల్లో - గ- గా, కనిపిస్తుంది. పర్జిలో -గ-, -వ-, -య- గాను, గోండిలో -య-, -గ- గాను, కువిలో -య- గాను, మిగిలిన మధ్య ద్రావిడభాషల్లో -గ- గాను, కురుఖ్‌లో -ఖ- గా, మాల్తోలో -గ- గా, బ్రాహుయిలో -ఖ- గాను కనిపిస్తుంది.

ఉదా · 39. త. పుకై [పుగై] 'పొగ'; మ. పుగ; క. పొగె, హొగె,తో. పహ్, కొడ. పొగె; తె. పొగ, కొలా.నా.ఒ. పొగ్; గోం. పొయ, పొగొ; కొండ. పొగొ, కువి. బోయి.

*-చ- తమిళ, మలయాళ భాషల్లో -చ- గానే వుంటుంది కాని [-స-]గా ఉచ్చరించబడుతుంది. కొన్ని మాండలికాల్లో -య- గా కూడ మారుతుంది. కోటలో -చ- గా, కన్నడంలో -స- గా, తుళులో -స-, -జ-, -ద- గా, తెలుగులో -స-, -య- గా, కొలామి, నాయకిలలో -స-గా, పర్జి, ఒల్లారి, గదబలలో -య-, -ద- గా, గోండిలో -స- గా, కుయిలో -స-, -హ- గా, కువిలో -హ- గా, కొండలో -స- గా కనిపిస్తుంది.

ఉదా: 40. త. పచ 'పచ్చగా ఉండు', పయ్ 'పచ్చదనం', పయిర్ 'పచ్చగా పెరుగు', మ. పచు, పై 'లేత, పచ్చదనం'; కోట. పచ్ 'పచ్చి, పచ్చని', క. పసి, తు. పజి, తె. పసరు, పయిరు, పసిండి, పైండి; కొలా. పసుడి 'పసుపు రంగు'; కొలా. నా. పసవ్ 'పసుపు పొడి'; పర్జి. గ. పయ్ 'పచ్చని'.

*-ట- త. మ. -ట-, కో. తో. -డ-/-ఢ -, క. కొడ. తు. -డ-, తె. -డ-,ప.కొలా.గ. -డ-;నా.ఒ.కుయి. కొండ. -ఢ-,గోం. -ఢ-, -ర-;కువి -ర-; కురు. మా. -డ-, బ్రా. -ర-.

దక్షిణద్రావిడ భాషల్లోను, తెలుగులోను కూడ దీన్ని -డ- అనే రాస్తారు. కాని ఉచ్చారణలో మాత్రం -ఢ- గా తేల్చి పలుకుతారు. అప్పుడు -డ-, -ఢ- ల మధ్య అర్థభేదముండదు. మధ్య ద్రావిడ భాషల్లో మాత్రం ఈ రెంటి నడుమ అర్థ భేదముంటుంది. అవి వేర్వేరు వర్ణాలు.

ఉదా : 41. త.మ. పాడు 'పాడటం', కోట. పాఢు; తోడ. పోఢ్; గోం. పాఢ్, పార్; కురు. మా. పాఢ్.

*-త- ప్రాచీన త. మ. క. తె. -ఱ-. మళయాళం తప్ప మిగిలిన మూడు భాషల్లోను అంటే, త. క. తె. ల్లో ఈ -ఱ- తరువాత -ర- తో కలిసిపోయింది కోట. కోడ. -ర-, తు. -ద-, -జ-, -ర-, కొలా.నా. -ద-, -ర-, పర్జి, -ద, -డ- ఒ.గ.కువి. -య-, కొండ -హ-, కురు. మా. -స-, -ర-, బ్రా.- ర-.

ఉదా: 42. మ. చేఱుక 'చెరుగు'; కో. కేర్; క. కేరు, తె. చెరుగు< చెఱుగు, కొలా.నా.ప. కేద్, ఒ గ. కేయ్, కురు. కేఃస్న, మా కెసె.

ఉదా: 43. త. యారు, ఆరు 'ఏఱు'; మ. ఆఱు; తె. ఏఱు, గోం. ఏర్; కొం. ఏఱు;-కుయి. ఏసు; కువి. ఏయు.

*-త- తమిళ, మలయాళ భాషల్లో -త- గాను, మిగిలిన అన్ని భాష ల్లోను -ద- గాను కనిపిస్తుంది.

ఉదా: 44. త.మ. ముతు [దు] 'పాత'; కో. ముద్; క.కొడ.తు.తె. ముది, ప.గ. ముత్తక్ 'ముసలివాడు', బ్రా. ముక్తున్.

*-ప- ఆయా ద్రావిడ భాషల్లో -ప- గా, -ప్ప- గా, -వ- గా కని పిస్తుంది.

ఉదా: 45. త. మ. క. తు తె. ఉప్పు 'ఉప్పు'; కొడ. ఉప్పి, కో.తో. ఉప్, కొలా. సుప్, నా. సుప్స్, ప. చుప్. ఒ సుప్, గ. చుప్పు (DED. 2201). దీనికి మూలమధ్యద్రావిడరూపం *చుప్ గాను, మూల దక్షిణ ద్రావిడరూపం *ఉప్ గాను పునర్నిర్మించబడ్డాయి. పై ద్రావిడ భాషారూపాలను కిందివాటితో పోల్చి చూద్దాం.

ఉదా: 45అ. త ఉవర్ 'ఉప్పు, ఒగరు', ఉవరి 'సముద్రం, ఉప్పని నీరు', మ. ఉవర్ 'ఉప్పదనం', క. ఒగరు 'ఒగరు'; తు. ఉబరు, ఒగరి 'ఉప్ప దనం', తె. ఒగరు, గోం. సవార్, హావర్, ఒవార్ 'ఉప్పు' (DED. 2201). దీనికి మూల మధ్య ద్రావిడరూపం *చొవ్- అర్ గాను, మూల దక్షిణ ద్రావిడ రూపం *ఒవ్- అర్ గాను పునర్నిర్మించబడ్డాయి. ఈ ధాతు రూపం మూలద్రావిడ రూపమైన *చుప్ కి సంబంధించినదే. రెండచ్చుల మధ్య *-ప్->*-వ్- గా మారింది.

తాలవ్యాను నాసికం పదం మధ్యలోను, పదాంతంలోను వచ్చిన ఉదాహరణలు లేవు. కాబట్టి -మ-, -న-, -ణ- లు మాత్రమే పదం మధ్యలో వచ్చినప్పుడు అర్థ భేదాన్ని కలిగిస్తాయని చెప్పాలి.

*-ణ- దక్షిణ ద్రావిడభాషల్లో -ణ- గాను, మధ్యోత్తర ద్రావిడ భాషల్లో -న- గాను కనిపిస్తుంది. కొన్ని మధ్యద్రావిడభాషా మాండలికాల్లో -ణ- గా కూడ కనిపిస్తుంది.

ఉదా: 46 త.మ క.కో. కణ్ 'కన్ను', తె. కన్ను, కను, కొలా. నా.గ. కన్; ఒ. కణ్, గోం. కన్; కొం. కణ్; కుయి. కను; కువి. కన్ను; కు ఖన్న్; మా. ఖను; బ్రా. ఖన్.

*-న- అన్ని ద్రావిడభాషల్లో -న- గానే వుంటుంది.

ఉదా: చూడు 30. యానై.

*-మ- అన్ని ద్రావిడ భాషల్లోను -మ- గానే కనిపిస్తుంది. కొన్ని భాషల్లో -మ-, -వ- ల వినిమయం కనిపిస్తుంది ఉదా: చూడు 22. ఇమలి. ఇంకా

ఉదా : 47. త. చమై 'సిద్ధమగు', చవరణై 'సిద్ధపడు'; మ. చమయమ్ 'సిద్ధమగు'; క. సమ, సమఱు, సవఱు, సవరణె 'సిద్ధం చేయు'; తె. సమకట్టు, సవరించు, సవరణ.

*-ల- అన్ని ద్రావిడభాషల్లోను -ల- గానే వుంటుంది. తుళు, పర్జి భాషల్లో కొన్నిచోట్ల ఇది -ర- గా మారుతుంది. కుయిలో వేర్వేరు మాండలికాల్లో -ల- గా -డ- గా కనిపిస్తుంది.

ఉదా: 48. త. మ. కో. క. పల్ 'పల్లు(న్ను)'; తు. పరు; తె. పల్లు, పలు; కొలా. నా. పల్; గ.గోం.కొం. పల్; కుయి. పడు, పలు; కువి. పల్లు; కు.మా. పల్.

*-ళ- దక్షిణ ద్రావిడ భాషల్లో -ళ- గాను, మధ్య ద్రావిడ భాషల్లో -ల- గాను కనిపిస్తుంది. గోండి, కొండ భాషల కొన్ని మాండలికాల్లో- డ- గా కూడ కనిపిస్తుంది. కుయిలో కూడా మాండలిక భేదంవల్ల -డ- గా కూడ కనిపిస్తుంది. ఉత్తర ద్రావిడభాషల్లో -ల- గా మారుతుంది.

ఉదా: 49. త. వెళ్ 'తెలుపు'; మ. వెలి 'వెలుతురు'; కోవెళ్. 'తెలుపు', క. బెళ్ 'తెల్లదనం', బెళగు 'ప్రకాశించు'; తె. వెలుఁగు, వెల్ల; ప. విలి 'తెలుపు', ఒ. విలెద్; గోం. వెడ్చీ; కు. బిల్చ్; మా. బిల్‌బిల్ర్ 'ప్రకాశించు'.

*-ర- గోండిలో -ర- లేదా -ర్ర- గాను, బ్రాహుయిలో -ర్ర- గాను, మిగిలిన అన్ని ద్రావిడభాషల్లోను -ర- గాను ఉంటుంది.

ఉదా: చూడు 28 మరం.

28)

*-ఴ- వర్ణం ప్రాచీన తమిళంలో ఉంది. అర్వాచీన తమిళంలో మాండలిక భేదాలవల్ల - ఴ-, -ళ-, -య- లు గా కనిపిస్తుంది. మలయాళంలో -ఴ- గానే ఉంది. కోటలో -ళ- గా, -డ- గాను తోడలో -డ-, -ఛ-, -ళ- లు గాను కనిపిస్తుంది. ప్రాచీన కన్నడంలో -ఴ- గాను, అర్వాచీన కన్నడంలో -ళ-, ఱ-, ర- లు గాను కనిపిస్తుంది. కొడగులో -ళ- గాను, తుళులో -ర-, -ళ- లు గాను మారుతుంది. ప్రాచీన తెలుగు భాషలో -ఴ- గా ఉన్నట్లు శాసన భాషవల్ల తెలుస్తుంది. తరువాత -డ- తో కలిసిపోయింది. ఇది వర్ణవ్యత్యయంవల్ల పదాదికి వచ్చిన తరువాత -ద- గా మారింది. కొన్నిచోట్ల వర్ణవ్యత్యయంవల్ల పదాది సంయుక్తాక్షరంలో ద్వితీయ వర్ణమైనప్పుడు రేఫగా మారింది తరువాత ఆధునిక భాషలో ఆ రేఫ కూడ లోపించింది కొలామి, నాయకిలలో -ర- గా, పర్జి ఒల్లారిలలో -ḍ- గా, గదబలో -డ- గా, గోండిలో -ḍా- గా, -ర- గా కువిలో -ḍ-, -ర-, -ల- లుగా, కుయి, కొండలలో -ḍ- గా మారింది. కురుఖ్, మాల్తోలలో -చ-, -స- గాను అప్పుడప్పుడు -య-, -ర- గాను బ్రాహుయిలో -ర- గాను మారింది

ఉదా : 50 త. మ. పుఴు 'పురుగు', క. పుఴు, హుళు కొడ. పుళు, తు. పురి, తె. పురువు, ప్రువ్వు, ప్రుచ్చు > పుచ్చు, కొలా. నా. పుర్రె, ప. పుḍుత్ గ. పుడుత్, గోం. పుḍీ, కొం. పుḍి, కుయి, ప్డిఉ, కువి ప్రీయూలి, ప్లిగులి; కురు. పొచ్గో; మా. పొచ్రు, పొస్గొ. దీనికి ఇంకో ఉదాహరణ 37 వ సంఖ్య గల' ఇఱి' అనేది.

*-య- వర్ణం అన్ని భాషల్లోను -య- గానే వుంటుంది.

ఉదా : చూడు 32 వాయ్

*-వ- తోడలో -ఫ- గాను, తుళులో -బ- గాను, మిగిలిన దక్షిణ ద్రావిడ భాషల్లో -వ-గాను ఉంటుంది. మధ్య ద్రావిడ భాషల్లో -వ- గానే ఉంటుంది కురుఖ్‌లో -బ- గా, మాల్తోలో -వ- గా, బ్రాహుయిలో -ఫ-, -వ- లుగా కనిపిస్తుంది.

ఉదా · 51. త మ. తె. చెవి 'చెవి'; కోట. కెవ్, తో. కిఫి; క. కివి; తు. కెబి; కొలా, నా. కెవ్, గోం. కవీ; కురు. ఖెబ్దా; మా. ఖెధ్వు, బ్రా ఖఫ్.

మూల ద్రావిడభాషలో సంయుక్తాక్షరాలు లేవు. ఒక అచ్చు తరువాత రెండు స్పర్శవర్ణాలు కాని లేక అనునాసికం + స్పర్శం కాని వుంటుంది. దీన్నే VPP లేక VNP అనే విధంగా ఉంటుందని చెప్పవచ్చు. చాల భాషల్లో *VPP > VPPగా గాని లేక $\bar{V}P$ గా గాని మారుతుంది. కోట, తోడ భాషల్లోను, కొన్ని మధ్య ద్రావిడ భాషల్లోను అద్విరుక్త, ద్విరుక్త హల్లుల మధ్య అర్థ భేదం (contrast) కనపడదు. *-క్క-/*-క-.

ఉదా : 52. త. చుక్కై 'నక్షతం'; క. చుక్కె 'చుక్క': తె. చుక్క; కొలా. సుక్క, ప. చుక్క, గోం. సుక్కుమ్, కుయి. కొండ. సుక; కువి. హుక్క, హూక. *-చ్చ-/*-చ.

ఉదా : 53. త. క. కచ్చు 'కరచు', కొలా ప. కచ్చ్-, ఒ. కస్-, గ. కచ్చ్-, గోం. కస్క్-, కచ్చ్-, కచ్-, కుయి కస్-, కువి కచ్. *-ట్ట-/*-ట.

ఉదా : 54. త. కొట్టు 'కొట్టటం', మ. కొట్టుక, కోట. కొట్క్, క. కొట్టణ, తె. కొట్టు, ప. కొట్ట్-, ఒ కొట్-, గోం. గొట్ట్-, కురు. ఖొట్ట్, మా. ఖొట్. -త్త-/*-త

ఇది తమిళ, మలయాళ భాషల్లో -ట్ట- గాను కోట, తోడల్లో -త- గాను, కన్నడం, కొడగు, కొలామి, నాయకి, పర్జి, గోండి, కురుఖ్, మాల్తోల్లో -త్త-/-త గాను, తుళు, తెలుగు, పర్జి యొక్క కొన్ని మాండలికాల్లోను, ఒల్లారి, గదబల్లో -ట్ట-/-ట గాను, కుయిలో -స- గాను, కువిలో -చ- గాను, కొండలో -ట- గాను కనిపిస్తుంది.

ఉదా : 55. త. మ. పుట్టు 'చెదలపుట్ట', క. పుత్తు, పుత్త, హుత్త; కొడ. పుత్తి, తె. పుట్ట, కొలా నా పుట్ట, ప. పుత్క్-ల్, పుట్క్-ల్, ఒ.పుట్క్-ల్, గోం పుత్తి, కుయి పుసి, కువి. పూచి, కొం. పుటి, కురు. పుత్తా, మా. పుతె. *-త్త-/*-త.

ఉదా : 56. త. మ. విత్తు 'విత్తనం', కో. విత్; తో. పిత్, కొడ. బిత్తి, తు. బిత్తి, తె. విత్తు, కొలా.నా. వితనమ్; ప. విత్తిద్, గ. వీతి, గోం. విత్, కొం. వితు. *-ప్ప-/*-ప.

ఉదా : 57. త. కుప్పై 'కుప్ప'; మ. కుప్ప, కో. తో. కిప్, క. కుప్పె, కొడ. కుప్పి, తు. కుప్పె, తె. కుప్ప, కొలా. కుప్ప్; ప. కుప్ప, గ. కుప్పా, గోం. కుప్ప, కుయి. కుప; కువి కూప, కొం. కుప; కురు. మా. ఖొప్.

ఇక అనునాసికం + స్పర్శం (VNP)ఏ విధంగా ఉంటుందో చూద్దాం. మూలద్రావిడ భాషలో అచ్చుకి పరమైన అనునాసికంతో కూడిన స్పర్శం (*NP) తమిళంలో అదే విధంగా ఉంటుంది. మలయాళంలో చాలచోట్ల అనునాసిక ద్విత్వంగా (NN) మారుతుంది. మిగిలిన భాషలో హ్రస్వాచ్చుకి పరమైన ఆ అనునాసికంతో కూడిన శ్వాస స్పర్శం (*NP) అనునాసికంతో కూడిన నాదస్ప ర్శంగా (VNB) మారుతుంది. దీర్ఘాచ్చు పూర్వమందుంటే చాల భాషల్లో అను నాసికం లోపించి కేవలం నాదస్పర్శం మాత్రం ($\bar{V}$B) మిగులుతుంది.

*-నేక్ : త. న్క్, మ. న్న్, తో. గ్/హ్, కో. గ్/న్గ్. మిగిలిన భాషల్లో న్గ్/గ్. కొండలో సాధారణంగా న్.

ఉదా: 58. త. పొన్కు 'పొంగు', మ. పొన్నుక, కో. పొగ్, క. పొంగు; తె పొంగు, కొలా నా గోం. కుయి. కువి. పొంగ్-; కొం. పొన్-.

*-ఞ్చ :

ఉదా: 59. త నఞ్చు 'విషం', మ. నఞ్చు, నఞ్జు; క నంజు, ప. నెంజ్.

*-ణ్ట :

ఉదా: 60. త పణ్టమ్ 'పండు', క. పణ్, హణ్; తె పండు, కొలా. నా.ప గోం కొం. పండ్-.

* -న్త : త. న్ట [న్ద్ర్], మ. న్న, తో.కో. ద; కొం. న్ట [న్డ్డ], తు.కుయి. కువి. న్జ/జ్. మిగిలిన భాషల్లో న్ద్/న్డ్/ణ్డ్.

ఉదా . 61. త. మూన్టు>మూణ్ణు 'మూడు' మ. మూన్ను; కో. మూన్ద్, తో. మూద్; క. మూఱు, కొడ. మూన్ది, తు. మూజి, తె మూఁడు> మూడు, కొలా.నా. మూన్-, ప. మూఁదుక్, ఒ మూన్డ్ గోం. మూన్డ్/మూన్ద్, కుయి. మూజ్జి; కొం. మూన్ట్; కురు. మూన్ద్, బ్రా. ముసిట్.;

*-న్త :

ఉదా: 62. త. చీన్తు, మ. చీన్తుక; క. సీన్; తె. చీఁదు; ప. తీఁద్, గ. చీన్ద్-, కుయి. స్రీన్ద; కువి. సిన్ద్.

*-మ్ప : త.మ.మ్ప. తో. బ, కో. బ/మ్బ, క. కొడ. మ్బ, తు.తె. మ/మ్మ/మ్బ, కొలామి, నాయకి మొదలైన భాషల్లో మ/మ్బ/బ. గోండి, కొండల్లో మ. ఉత్తర ద్రావిడ భాషల్లో మ్బ.

ఉదా: 63. త. నమ్పు 'నమ్మ'; మ. నంపుక; కో. నమ్బ్-, తో. నొబ్-, క. నమ్బు, కొడ. నమ్బ్-, తు. నమ్బుని, నమ్మని; తె. నమ్మ; కువి. నామ్-, నమ్-; కొండ. నమ్-.

## అచ్చులు

మూలద్రావిడభాషలో పది అచ్చులున్నాయి. అవి చాల ద్రావిడ భాషల్లో ఎక్కువ మార్పును పొందకుండా అదే విధంగా కనిపిస్తాయి.

*అ అన్ని ద్రావిడ భాషల్లోను 'అ' గానే వుంటుంది. తోడలో 'ఒ' గాను, పర్జిలో కొన్నిసార్లు 'ఎ' గాను కనిపిస్తుంది. *య, *ఇ లకి పరమయి నప్పుడు మాత్రం అ,ఆ/ఎ,ఏ ల నడుమ అర్థభేదముండదు.

ఉదా: చూడు 40. పచ.

*ఆ అన్ని భాషల్లో 'ఆ' గానే వుంటుంది. తోడలో 'ఓ' గాను, పర్జిలో కొన్నిసార్లు 'ఏ' గాను కనిపిస్తుంది.

ఉదా: చూడు 18. పాల్.

*ఇ అన్ని భాషల్లోను 'ఇ' గానే వుంటుంది.

ఉదా: చూడు 2. కిళి, 5. ఇల్లై.

ఇక్కడొక విషయాన్ని గమనించాలి. తమిళ, మలయాళ భాషల్లో కొన్ని పదాల్లోని ధాతుగతమైన అచ్చు స్థానంలో ఇ, ఉ లున్నప్పుడు వాటికి సమాన పదాల్లో తెలుగు, కన్నడ భాషల్లో ఎ, ఒ లు కనిపిస్తాయి.

ఉదా: త. పిణ్- అయ్ 'పెనవేయు'; మ. పిణ్- అయుక; క. పెణ్- ఎ, తె. పెన్- అయు.

త. చుళ్-అ 'సొరచేప'; మ. చుళ్-అ; క. చొళ్-అ; తె. బొళ్-అ, సొళ్-అ.

ఈ విధంగా ఈ నాలుగు భాషల్లోను ఒక వర్గంలో ఇ, ఉ లు, ఇంకో వర్గంలో ఎ, ఒ లు కనిపించటం వల్ల ఈ సందర్భంలో మూల భాషావర్ణాలైన ఇ, ఉ లు ఎ, ఒ లతో కలిశాయా లేక ఎ, ఒ లు ఇ, ఉ లతో కలిసిపోయాయా అనే విషయం తెలియాలి. ఏవి వేటితో కలిసినా ఫలితం మాత్రం ఒకటే. అదే, ఈ వర్ణాల నడుమ అర్థభేదం పోవటం. ఈ నూతన పరిణామం మూల దక్షిణ ద్రావిడ భాషలో జరిగిందని భాషా శాస్త్రవేత్తలు నిర్ణయించారు. ప్రత్యయగతాచ్చు 'అ' ఉన్నప్పుడు ధాతుగతమైన *ఇ, *ఎ ల నడుమా *ఉ, *ఒ, ల నడుమా, అర్థభేదం పోయి కేవలం ఎ, ఒ లు మాత్రం నిలిచాయనీ అంటే, మూలద్రావిడ భాషలోని *ఇ, *ఉ వర్ణాలు మూల దక్షిణ ద్రావిడ భాషలో పైన చెప్పిన ప్రత్యేక పరిసరంలో ఎ, ఒ వర్ణాలతో కలిసిపోయాయనీ సిద్ధాంతం చేశారు. తరువాత కొంతకాలానికి మూల దక్షిణ ద్రావిడ భాషలోని *ఎ *ఒ వర్ణాలు తమిళ, మలయాళ భాషల్లో మరల ఇ, ఉ లుగా మారాయి. తెలుగు, కన్నడ భాషల్లో మాత్రం *ఎ *ఒ లు గానే నిలిచి ఉన్నాయి.

*ఈ అన్ని భాషలోను 'ఈ' గానే ఉంటుంది.

ఉదా : 64. త.మ. కీఱు 'గీరు'; క. కీఱు, గీఱు; తె. గీఱు.

*ఉ అన్ని భాషల్లోను ఇదే విధంగా ఉంటుంది.

ఉదా : చూడు 10. ఉప్పు. ఇంకా.

ఉదా : 65. త.మ. ముకిల్ 'మేఘం'; క. ముగిల్; తె. మొగిలు.

*ఊ అన్ని భాషల్లోను 'ఊ' గానే ఉంటుంది.

ఉదా : 66. త. పూ. 'పువ్వు'; మ. పూ, పూవు; క. పూ, పూవు, హూవు; తె. పూవు, పువ్వు.

*ఎ అన్ని భాషల్లోను 'ఎ' గానే ఉంటుంది.

ఉదా : చూడు 51. చెవి.

*ఏ అన్ని భాషల్లోను ఇదే విధంగా కనిపిస్తుంది.

ఉదా : 67. త.మ తేళ్ 'తేట', క. తేళ్, తేళ్, తె. తేలు.

*ఒ అన్ని భాషల్లోను 'ఒ' గానే ఉంటుంది. తోడలో *ఒ, *ఓ లు వ/వి/ఇ, వా/వీ/ఈ లుగా కనిపిస్తాయి.

ఉదా : 68. త. పొక్కు 'పొక్కటం', మ. పొక్కుళ, క. బొక్కె; తె పొక్కు.

*ఓ అన్ని భాషలలోను 'ఓ'గానే కనిపిస్తుంది

ఉదా : 69. త. కోటు 'కొమ్ము, చెట్టు కొమ్మ', క. కోడు, తె.కోడు 'మంచం కోడు'.

# 24

# పదనిర్మాణ శాస్త్రం

## నామవాచకాలు

నామమంటే వస్తువుని, పదార్థాన్ని బోధించేది. వాక్యంలో కర్తగా గాని, కర్మగా గాని ప్రయోగించదగిన పదాలను నామవాచకాలని అనవచ్చు. ఉదాహరణకి రాముడు, వృక్షము, జ్ఞానము, మగడు, అన్న, తల్లి, పాప అనేవి నామవాచకాలు. సంఖ్యావాచకాలు, సర్వనామాలు కూడ నామవాచకాలలోని విభాగాలే. క్రియల నుంచి నిష్పన్నములైనవి కాక కేవల నామాలైన రాముడు, కొడుకు వంటి రూపాలూ, క్రియాధాతు నిష్పన్నములైన కృదంత రూపాలు-అంటే, క్రియలకు -అక, -ఇమి, -త మొదలయిన ప్రత్యయాలు చేరి ఏర్పడిన అలుగు-అలుక, కలుగు-కలిమి, కోయు-కోత వంటి రూపాలు కూడ నామవాచకాలవుతాయి. ఈ నామవాచకాలకి సంబంధించిన విషయాలు లింగ వచన విభక్తి భేదాలతో పరిశీలించబడతాయి.

తెలుగులో నామవాచకాలు దేశ్యపదాలు, తత్సమ తద్భవాలు కూడ ఉన్నాయి. వీటిల్లో తత్సమ పదాల చివర చాలవరకు లింగబోధక ప్రత్యయాలు చేరుతూంటాయి. ఉదా: రాముడు. ఉత్తముడు, దేశము, పురము ఈ తత్సమ నామాల్లో లింగబోధక ప్రత్యయాలు చేరనివి అభిమాని, మహారాజు, లక్ష్మి, స్త్రీ వంటివి ఉన్నాయి. దేశీయ నామపదాల చివర సాధారణంగా ఏ ప్రత్యేక ప్రత్యయమూ చేరదు. ఉదా : అన్న, కొడుకు, మనిషి, చెట్టు, పని, ఊరు, అమ్మ, అక్క. కొన్ని నామపదాల ప్రాతిపదికలకు మాత్రం లింగభేదం తెలియజేసే ప్రత్యయాలు చేరుతూంటాయి. ఉదా: తమ్ముడు, మనుమడు, వేటకాడు, కోడలు, ఇల్లాలు, చెలియలు, పేదరాలు, మనుమరాలు.

కేవలం నామాల నుంచి ఏర్పడిన నామవాచక పదాలకు ప్రకృతి ప్రత్యయ విభాగం చెయ్యటానికి వీలుకాదు ఉదా : అమ్మ, అన్న, కొడుకు, ఊరు, గుడి, చేను. క్రియాధాతువుల నుంచి ఏర్పడిన వాటిని విడదీసి చూపవచ్చు. ఉదా : పని < *పణ్ 'చేయు'; చోటు < *చొత్తు 'ప్రవేశించు'; చేటు < *కెటు 'చెడిపోవు'.

ద్రావిడభాషల్లో కొన్ని మూల ధాతువులు ఏ విధమయిన మార్పు లేకుండానే క్రియావాచకంగా, నామంగా ఉపయోగించబడతాయి. ఉదా: కట్టు, తప్పు. పండు, బొంకు, వెలుగు.

## లింగవివక్ష

సాధారణంగా ద్రావిడభాషల్లో నామవాచకం యొక్క లింగభేదం దాని అర్థాన్ని బట్టి తెలుస్తుంది. అన్ని నామవాచక పదాల్లోను లింగభేదాన్ని తెలిపే లేదా లింగసూచకమయిన ప్రత్యయాలుండాలనే నియమం లేదు.

ప్రాచీనకాలంలో ద్రావిడభాషల్లో నామవాచక పదాలకు లింగసూచక ప్రత్యయాలు చేరేవి కాదు సందర్భాన్ని బట్టి, అర్థాన్ని బట్టి లింగభేదాన్ని తెలుసుకోవటం జరిగేది. అంతేకాని పదాల రూపాన్ని బట్టి లింగభేదాన్ని గ్రహించటానికి వీలయ్యేది కాదు. తల్లి, తండ్రి, అన్న, అక్క, చిలుక, చెట్టు వంటి చోట్ల లింగభేదాన్ని తెలిపే చిహ్నాలేమీ నేటికీ లేవు కొన్ని అనాగరక ద్రావిడభాషల్లో నేటికీ లింగబోధక ప్రత్యయాలు చేర్చకుండానే నామాలు వాడ బడుతున్నాయి. ఉదాహరణకి తోడ భాషలో అది, ఆమె, అతను అనే అర్థాల్లో 'అద్' అనే పదాన్ని వాడతారు. అవి, వారు అనే అర్థాల్లో 'అదామ్' అని వాడతారు. అట్లాగే 'ఇద్' అంటే ఇది, ఈమె, ఇతను అని 'ఇదామ్' అంటే ఇవి, వీరు అనీ అర్థాలు. బ్రాహుయి భాషలో కూడ ఇదే విధంగా ఉంది. ఈ భాషలో 'ఓద్' అంటే అతడు, ఆమె, అది అనీ, 'ఓఫ్క్' అంటే వారు, అవి అనీ అర్థాలు.

ద్రావిడ భాషల్లోని లింగవివక్ష విధానం ఇతర భాషా కుటుంబాలకంటె భిన్నంగా ఉంటుంది.ఇది చాలవరకుసహజమైన లింగభేదానికి సన్నిహితమని చెప్ప వచ్చు. ఈ లింగవివక్ష అర్థాన్ని ఆశ్రయించి ఉంటుంది. ప్రాణ్యప్రాణి భేదాన్ని, లౌకికలింగ విధానాన్ని అనుసరించి ఈ రెంటినీ కలిపిన ఒక విశిష్టవిధానం.

మొత్తం నామాలను ప్రాణివాచకాలుగాను, అప్రాణి వాచకాలుగాను విభజించవచ్చు. ప్రాణివాచకాలను మళ్ళీ మనుష్య, మనుష్యేతర వాచకాలుగ విభ జించవచ్చు. మనుష్యవాచకాలను తిరిగి పురుష, స్త్రీ వాచకాలుగ విభజించవచ్చు. ఇప్పుడు అప్రాణి వాచకాలు, అమనుష్య ప్రాణివాచకాలు ఒక వర్గం కిందికి వస్తాయి. మిగిలినవి మనుష్య ప్రాణివాచకాలు అవి పురుష, స్త్రీ భేదాలతో ప్రవర్తిస్తాయి. దీన్ని కింది విధంగా చెప్పవచ్చు.



ఇవన్నీ ఏక బహు వచనాలతో మొత్తం ఆరు విధాలుగా ఉంటాయి. 1. మహదేకవచనం 2. మహత్యైకవచనం 3 అమహదేకవచనం 4. మహద్బహువచనం 5. మహతీబహువచనం 6 అమహద్బహువచనం. ఈ ఆరు విధాలైన భేదాలూ ఒక్క పెంగో భాషలో మాత్రమే కనిపిస్తాయి. మిగిలిన ఏ ద్రావిడ భాషలోను అన్నీ లేవు.

తెలుగు వైయాకరణుల పద్ధతి ప్రకారం నామాలన్నీ మహత్తులు, అమహత్తులు అని రెండు విధాలు. తమిళ వైయాకరణులు వీటిని ఉయర్‌తిణై (ఉన్నత జాతికి చెందినవి), అఃఱిణై (అన్యజాతికి చెందినవి) అన్నారు. ఈ వర్గీకరణని బట్టి ద్రావిడభాషా నామాలన్నీ రెండు వర్గాలుగా విభజించబడినట్లు తెలుస్తుంది. ఈ రెండు వర్గాల్లో చేరే శబ్దాల విషయంలో ఆయా ద్రావిడభాషల నడుమ కొన్ని భేదాలున్నాయి.

ఆయా భాషల్లోని లింగబోధక ప్రణాళికననుసరించి ద్రావిడభాషలను నాలుగు వర్గాలుగ విభజించవచ్చు.

మొదటి వర్గం : అతి ప్రాచీన కాలంలో లింగబోధక ప్రత్యయరహితంగా గానే నామపదాలు వ్యవహరించబడేవని పరిశీలకుల అభిప్రాయం. ప్రత్యయాలు లేనప్పుడు సందర్భాన్ని బట్టి అర్థాన్ని తెలుసుకోవలసి వస్తుంది. ఈ వర్గంలో చేర్చదగినవి తోడ, బ్రాహుయి భాషలు. వీటిల్లో లింగసూచక ప్రత్యయాలు నేటికీ లేవు. ఈ భాషల్లో ఒకే పదం అన్ని లింగాల్లోను వర్తిస్తుంది. తోడ భాషలో 'అద్' అంటే వాడు, ఆమె, అది అని అర్థాలు. 'ఇద్' అంటే వీడు, ఈమె, ఇది అని అర్థాలు. బ్రాహుయిలో 'ఓద్' అనే పదానికి అతడు, ఆమె, అది అనీ 'ఓఫ్క్' అనే పదానికి వారు, అవి అనీ అర్థాలు. లింగ వివక్షను సూచించే ప్రత్యయాలు లేని ఈ భాషల్లో వచన భేదం మాత్రమే కనిపిస్తుంది.

రెండో వర్గం : ఈ వర్గానికి చెందిన భాషల్లో పురుష బోధకాలకు ఏకవచనంలో ఒక ప్రత్యయం, పురుషేతరాలకు మరో ప్రత్యయం ఉంటుంది. బహువచనంలో పురుషబోధకాలకొక ప్రత్యయం, పురుషేతరాలకొక ప్రత్యయం చేరుతుంది. అంటే

| ఏకవచనం | బహువచనం |
|---|---|
| మహత్-పురుష వాచకం | మహత్-పురుషవాచకం |
| అమహత్-పురుషేతరాలు | అమహత్-పురుషేతరాలు |
| (స్త్రీ తిర్యగ్జడాలు) | (స్త్రీ తిర్యగ్జడాలు) |

ఇది మధ్యద్రావిడ భాషలలోని పద్ధతి అనవచ్చు. కుయి, కువి, కొండ, గోండి, కోయ, కొలామి, నాయకి, పర్జి, గదబ, ఒల్లారి భాషలీవర్గానికి చెందినవి. పెంగో భాష మాత్రం ఈ పద్ధతికి కొంత భిన్నంగా ఉంటుంది. అందులో స్త్రీ లింగైక బహువచన ప్రత్యయాలు ప్రత్యేకంగా ఉంటాయి. పురుషేతరాల నుంచి స్త్రీ వాచకాలు విడిపోవటం ఈ భాషలో నూతన పరిణామం (Innovation). ఇటువంటి పరిణామం ఇంక ఏ మధ్య ద్రావిడ భాషలోను జరగలేదు.

| | తె. | కుయి | కువి | కొం | గోం. | కోయ | కొలా | నా. | ప. | గ | ఒ | పెంగో |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మహత్. ఏ. | వాడు | ఆంజు | ఆసి | వాన్టు | ఓర్ | ఓన్డ్ | అమ్/ అమ్ద్ | అవ్న్ద్ | ఓద్ | ఓన్డ్ | ఓన్డ్ | అవన్ |
| మహల్. బ. | వారు | ఆరు | ఆరి | వార్ | ఓడ్/ఓడ్క్ | ఓర్ | అవ్ర్ | అవ్ర్ | ఓర్ | ఓర్ | ఓర్ | ఆవర్ |
| మహతీ ఏ. | అది | ఆరి | ఆది | అది | అద్ | అద్దు | అద్ | అద్ | అద్ | అద్ | అద్ | అదెల్ |
| మహతీ. బ. | వారు | అవి | ఆతి | అవి | అవ్ | అవ్వు | అదవ్ | అదవ్ | అవ్ | లవ్ | అవ్ | అవెక్ |
| అమహత్ ఏ. | అది | ఆరి | ఆది | అది | అద్ | అద్దు | అద్ | లవ | అద్ | లద్ | లవ్ | లవి |
| అమహత్. బ. | అవి | ఆవి | ఆతి | అవి | అవ్ | అవ్వు | అదవ్ | అదవ్ | అవ్ | అవ్ | అవ్ | అసజ్ |

తెలుగుతోసహా మధ్యద్రావిడభాషల్లో స్త్రీలను సూచించే కొన్ని పదాల్లో *అళ్ ప్రత్యయం కనిపిస్తుంది.

తె. కోడలు; కొలా. కొరల్ 'తమ్ముడి భార్య'; నా. కొరళ్ 'కోడలు, పెళ్ళికూతురు'; ప. కొడొల్ 'పెళ్ళికూతురు'; గ. కొడల్ 'కోడలు, తమ్ముడి భార్య'; గోం. కొరిఆడ్ 'కోడలు'.

తె. చెలియలు, చెల్లెలు; ప. చాలల్, గ. నేలల్, చెల్లాల్; గోండి. నేలాడ్.

తె. మఱఁదలు; కొలా. మరందల్; కుయి. మ్రీగలి.

కొలా. పొదల్ 'అత్త'; నా. పొదళ్ 'అత్త'; ప. పొదల్ 'భార్య అక్క'; గ. పొదల్ 'అత్తి'; గోం. పోడాల్, పోరాడ్ 'అత్త'; కుయి పోర 'భార్య అక్క'.

ఈ విధంగా *అళ్ ప్రత్యయం చేరిన పదాలు ఉత్తర దక్షిణ ద్రావిడ భాషల్లో కనపడవు. వీటిల్లోని ధాతువులు మూలద్రావిడ భాషలోనివే. వాటికి స్త్రీ వాచక ప్రత్యయం చేరటం ఈ మధ్య ద్రావిడభాషల్లోని నూతన పరిణామం.

మూడోవర్గం : ఈ వర్గానికి చెందిన భాషల్లో ఏకవచనంలో స్త్రీ తిర్యగ్జడవాచకాలకు ఒక ప్రత్యయం, మహద్వాచకాలకు ఒక ప్రత్యయం ఉంటుంది. బహువచనంలో మహన్మహతీ వాచకాలకొక ప్రత్యయం, మిగిలిన వాటికి ఒక ప్రత్యయం చేరుతుంది. అంటే

| ఏకవచనం | బహువచనం |
|---|---|
| మహత్-పురుష వాచకం | స్త్రీ పురుష వాచకాలు |
| అమహత్ - పురుషేతరాలు (స్త్రీ తిర్యగ్జడాలు) | తిర్యగ్జడ వాచకాలు (మహతీతరామహద్వాచకాలు) |

ఈ వర్గంలో రెండో వర్గంలోని ఏకవచన ద్వయ విధానం, చెప్పబోయే నాలుగో వర్గంలోని బహువచనద్వయ విధానమూ ఉన్నాయి. ఇందులో మహతీవాచకం ఏకవచనంలో అమహత్తులతోను, బహువచనంలో మహత్తులతోను కలుస్తుంది. తెలుగు, కురుఖ్, మాల్తో భాషలీ వర్గానికి చెందినవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| తె. | వాడు | అది | వారు | అది | అవి |
| కురు. | అస్ | అద్ | అర్/అబ్‌డర్ | అద్ | అబ్‌డా |
| మా. | అహ్ | అథ్ | అర్ | అథ్ | అథ్ |

తెలుగులో మహతీ వాచక ఏకవచనాన్ని బోధించటానికి అనంతర కాలంలో కొన్ని ప్రత్యయాలు కత్తె, త, లు/అలు వంటివి ఏర్పడ్డాయి. చెలికత్తె, చెంచెత, సవతాలు, కోడలు, ఇల్లాలు, తొయ్యలి, పైదలి మొదలయినవి. ఇంకా అక్క, అమ్మ వంటి పదాలుకూడ చేరతాయి. ఆమె, ఆవిడ అనే స్త్రీ వాచక సర్వనామాలు కూడ అర్వాచీన కాలంలో వాడుకలోకి వచ్చాయి.

నాలుగో వర్గం : ఈ వర్గపు భాషల్లో ఏకవచనంలో స్త్రీ వాచకాలకు, పురుష వాచకాలకు,

వర్గాలకంటె ఇది నూతన పరిణామం. బహువచనంలో మూడో వర్గంలో ఉన్నట్లు స్త్రీపుం సామాన్య బహువచనం (epicene plural), అమహద్బహువచనమూ ఉన్నాయి.

| | ఏకవచనం | బహువచనం |
|---|---|---|
| | మహత్-పురుష వాచకం | పురుష / స్త్రీ } వాచకాలు |
| | మహతీ-స్త్రీ వాచకం | (స్త్రీ పుంసామాన్య బహువచనం) |
| మహతీతర | అమహత్ - తిర్యగ్జడవాచకాలు | మహతీతరఅమహత్ - తిర్యగ్జడాలు |

ఈ పద్ధతి తమిళ, మళయాళ, కన్నడ, తుళు భాషల్లోను, కోట, కొడగు భాషల్లోను ఉంది.

| త. | మ. | క. | తు. | కోట | కొడగు | |
|---|---|---|---|---|---|---|
| అవన్ | అవన్ | అవను | ఆయె | అవ్న్ | అవెన్ | 'వాడు' |
| అవళ్ | అవళ్ | అవళ్ | ఆళు | అవ్ళ్ | అవ | 'ఆమె' |
| అవర్ | అవర్ | అవరు | ఆరు | అవ్ర్ | అవు | 'వారు' |
| అదు | అదు | అదు | అవు | అద్ | అది | 'అది' |
| అవ్/అవై | అవ | అవు | అయ్కుళు | అద్ | అది | 'అవి' |

ప్రాణి వాచక శబ్దాల్లో సహజ లింగభేదాన్ని తెలియజేయవలసి వచ్చినప్పుడు కొన్ని పదాలు, ప్రత్యయాలు ఆయానామాలకు చేర్చటం కొన్ని భాషల్లో కనిపిస్తుంది.

త. పెణ్‌కుదిరై 'ఆడగుర్రం', ఆణ్‌కుదిరై 'మగగుర్రం', పెట్టైక్కోఴి 'కోడిపెట్ట'.

క. హెణ్ణుకుదిరె 'ఆడగుర్రం', గండుకుదిరె 'మగగుర్రం'.

తె ఆడగుర్రం-మగగుర్రం, కోడిపెట్ట-కోడిపుంజు, పెంటిపావురం-పోతుపావురం, ఆడబిడ్డ-మగబిడ్డ, మనుమరాలు-మనుమడు.

కువి. తళిపజ్జి 'ఆడపంది', పోతుపజ్జి 'మగపంది', తళిగొౕరె 'ఆడగొర్రె', పోతుగొౕరె 'మగగొర్రె'.

పైన చెప్పిన వర్గాల్లో ఏది మూలద్రావిడ భాషకి దగ్గరగా ఉన్నదనే విషయంలో పరిశోధకులలో భిన్నాభిప్రాయాలున్నాయి. మధ్యద్రావిడ భాషల్లోని పద్ధతి-అంటే, మన రెండో వర్గంలోనిది-లో ఏకవచనంలో రెండు రూపాలూ, బహువచనంలో రెండు రూపాలూ ఉన్నాయి. ఇక్కడున్నది రెండు వచనాల్లోనూ మహదమహద్భేదమే. ఈ భేదమే మూలద్రావిడ భాషలో ఉండేదనీ మిగిలిన భాషల్లో కాలక్రమంలో మార్పు కలిగిందనీ, స్త్రీ వాచకాలు అమహత్తులనుంచి విడిపోయాయనీ యూల్ బ్లాక్, భద్రిరాజు కృష్ణమూర్తి అభిప్రాయపడ్డారు. తెలుగు, కురుఖ్, మాల్తోలకు చెందిన మూడో వర్గంలోని లింగభేదమే మూల భాషలోని లింగభేదమై ఉంటుందనీ, ఈ మూడు భాషలూ భౌగోళికంగా సన్నిహితంగా లేకపోయినా, భిన్నమయిన ఉపకుటుంబాలకు చెందినా, వీటిల్లో లింగభేదం

సమానంగా ఉండటం వల్ల అది మూల భాషా లక్షణమై ఉంటుందని ఎమెనో, పి.యస్ సుబ్రహ్మణ్యం అభిప్రాయపడ్డారు నాలుగో వర్గంలోని దక్షిణ ద్రావిడ భాషలకు చెందిన ఏకవచనత్రయ విధానం, బహువచన ద్వయ విధానం మూల భాషలోని విధానమని బరో, భట్టాచార్య భావించారు.

మొత్తంమీద మూలద్రావిడంలో స్త్రీ వాచకం ప్రత్యేకంగా లేదనీ అది ఏకవచనంలో అమహత్తుల్లో కలిసివుండేదనీ చాలమంది అంగీకరించిన విషయం. బహువచనంలో మహత్తుల్లో కలిసివుండేదా లేక అమహత్తుల్లో కలిసి ఉండేదా అనే విషయంలో అభిప్రాయ భేదాలున్నాయి. మహత్తుల్లోనే కలిసి ఉండేదని పి.యస్. సుబ్రహ్మణ్యం (ద్రావిడ భాషలు, పుట-191,1977), అమహత్తుల్లోనే కలిసి ఉండేదని భద్రిరాజు కృష్ణమూర్తి (Gender and Number in proto-Dralidian, IJDL-4 1975) కచ్చితంగా చెప్పారు. మిగిలిన భాషల్లో ఏర్పడినవి నూతన పరిణామాలని భావించారు.

## వచనం

ద్రావిడ భాషల్లో ఏకవచనం, బహువచనం అని వచనభేదం రెండు రకాలుగా ఉంటుంది. ఏకత్వాన్ని బోధించేది ఏకవచనం. బహుత్వాన్ని (అనేకతను) బోధించేది బహువచనం. ఈ ద్రావిడ భాషా నామాలకి చేరే వచన ప్రత్యయాలలో వచన బోధకత్వమే కాక లింగభేదం కూడ అంతర్లీనమై ఉండటం వల్ల ఈ భాషల్లో వచనబోధక ప్రణాళిక లింగబోధక ప్రణాళికతో ముడిపడి ఉంటుంది. అందువల్ల లింగవచన ప్రత్యయాలని కలిపి చర్చించవలసి వస్తుంది.

ద్రావిడ భాషల్లో నామాలకు వాటి లింగభేదాన్ని బట్టి, వచనభేదాన్ని బట్టి వేర్వేరు వచన ప్రత్యయాలు చేరతాయి. లింగభేదం ఏ విధంగా ఉంటుందో ఇంతకు ముందే చూశాం ఆయా లింగభేదాన్ననుసరించి వచన ప్రత్యయాలు చేరే పద్ధతిని పరిశీలిద్దాం.

మహదేక వచనం : తమిళ మలయాళ భాషల్లో 'న్', పాత కన్నడంలో 'మ్' ప్రత్యయాలుగా కనిపిస్తాయి. త. మ. రామన్, క. రామమ్ 'రాముడు', తెలుగు శాసన భాషలో 'న్' (చామియన్, మగన్, మహేంద్రన్), 'న్డు' (వాన్డు, పుణ్యకుమారున్డు),'ణ్డు' (వాణ్డు)గా కనిపిస్తుంది. ఇది తరువాతి కాలంలో 'ండు'గా 'ఁడు'గా పరిణామం చెందింది (రాముండు>రాముఁడు). ఆధునిక భాషలో అరసున్న కూడ లోపించి పోయింది. ఈ మహదేకవచన ప్రత్యయానికి మూల రూపం *-న్త్ అనేది.

స్త్రీ వాచకైక వచనం ఇది దక్షిణ ద్రావిడ భాషలయిన తమిళ, మలయాళ, కన్నడ, తుళు భాషలకే పరిమితమయింది. 'ళ్' అనేది ప్రయ్యయంగా కనిపిస్తుంది. అవళ్ 'ఆమె', ఇవళ్ 'ఈమె', మగళ్ 'స్త్రీ', వందాళ్ 'వచ్చినట్టి స్త్రీ'. ఈ ప్రత్యయానికి మూలరూపం *-అళ్ అనేది. తెలుగులో ప్రాచీనకాలంలో ఇటువంటి రూపాలులేవు. అమహదేకవచన రూపాన్నే వాడేవారు. ఆధునిక

కాలంలో ఆకె, ఆపె, ఆమె, ఆబిడ, ఆయక, ఆవిడ, ఈకె, ఈపె, ఈమె... వంటివి ఏర్పడ్డాయి వీటికి మూలం *అళ్ ప్రత్యయం కాదని స్పష్టం. ప్రాచీన తెలుగు భాషలో ఉన్న మనుమరాలు, ఇల్లాలు, చూలాలు, కోడలు, చెలియలు వంటి పదాల్లోని -అలు *అళ్ నుంచి పరిణమించినదే.

అమహదేకవచనం : 'ద్' అనేది అమహదేకవచనంలో ప్రత్యయంగా కనిపిస్తుంది. దీనికి మూలరూపం -*త్. త.మ.క. అదు, ఇదు; తె. అది, ఇది. వీటిల్లోని అ,ఇ లు నిర్దేశ సర్వనామ ప్రాతిపదికలు.

మహన్మహతీవచనం : తమిళ, మలయాళ, కన్నడ, తెలుగు భాషల్లో స్త్రీ వాచక బహువచన రూపాలు మహద్బహువచనంలో కలిసి ఉంటాయి. ఇది స్త్రీ పుం సామాన్య బహువచనం (epicence plural) అనబడుతుంది. దీన్ని తెలిపే ప్రత్యయం *-ర్. ఇది తమిళంలో -ర్/-అర్/-ఇర్/-మార్/-మర్ గా కనిపిస్తుంది. అవర్ 'వారు', అరసర్ 'రాజులు', మగళిర్ 'స్త్రీలు', కళ్లన్ మార్ 'దొంగలు', ఎణ్మర్ 'ఎనిమిది మంది'. మలయాళంలో కూడ ఇదే విధంగా ఉంటుంది కన్నడంలో -అర్/-ఇర్ గా కనిపిస్తుంది. అరసర్ 'రాజులు', మగళ్దిర్ 'కూతుళ్లు', మగందిర్ 'కొడుకులు'.

తెలుగులో ప్రాచీన సాహిత్యంలో రు/లు అనేది స్త్రీ పుం సామాన్య బహువచన ప్రత్యయంగా కనిపిస్తుంది. అల్లురు, చెల్లెండ్రు, కోడండ్రు, విలు కాలు మొదలయినవి. ఆధునిక భాషలో ఈ 'రు' స్థానాన్ని 'లు' ఆక్రమించింది. అప్పుడు అల్లుళ్లు, చెల్లెళ్లు, కోడళ్లు వంటి రూపాలేర్పడ్డాయి. సర్వనామాలలోని బహువచన ప్రత్యయమయిన 'రు' ప్రాచీన భాషలోను, ఆధునిక భాషలోను కూడ అదేవిధంగా ఉంది. మీరు, తమరు, వారు, వీరు, అందరు (లు), ఇద్దరు, ముగ్గురు, నలుగురు.

తెలుగులో '-లు' బహువచన ప్రత్యయం. ఇది మహద్వాచక, మహతీ వాచక, అమహద్వాచక నామాలకి కూడ చేరుతుంది. అమహద్బహువచన ప్రత్యయమైన ఈ '-లు' చాల ప్రాచీన కాలం నుంచీ తెలుగులో అన్ని నామవాచకాలకి చేరటం జరిగింది. ఉదా: కొడుకులు, రాజులు, ప్రాఙ్నన్నయ కాలపు శాసనాల్లో ఇది మూర్ధన్య ళ కారంగా ఉండేది. సంవత్సరంబుళ్, రాజుళ్, పెర్దళ్.

అమహద్బహువచనం : ద్రావిడభాషల్లో అమహద్వాచకాలకు బహుత్వంలో బహువచన ప్రత్యయం చేర్చడం వైభాషికమనే చెప్పాలి. ఉత్తర దక్షిణ ద్రావిడభాషల్లో ఇప్పటికీ అంతే. మధ్య ద్రావిడభాషల్లో మాత్రం ఈ ప్రత్యయాన్ని నిత్యంగా చేరుస్తారు.

తొల్కాప్పియంలో అమహద్బహువచన ప్రత్యయం -కళ్ అనీ అది వైకల్పికమనీ చెప్పబడింది. ఈ -కళ్ ప్రత్యయం సంగంవాఙ్మయంలో అరుదుగా కనిపిస్తుంది మొత్తం దీని ప్రయోగాలు ఏడెనిమిది కంటె ఉండవు. సంగకాలపు తరువాతి సాహిత్యంలో దీని వాడుక అధికమైనట్లు తెలుస్తుంది. అమహద్వాచకా

లకి బహువచనంలో ఈ ప్రత్యయాన్ని చేర్చటం ఇప్పటికీ తమిళంలో లేదు. నాల్ మాడు 'నాలుగు పశువులు' అంటారే కాని నాల్ మాడుగళ్ అనాలనే నిబంధన లేదు. కొన్ని మాండలికాల్లో -కళ్ కూడ కలిపి వాడతారు. మలయాళంలోను, కన్నడంలోను కూడ ఇంతే. మ. నాల్ కల్లు (గళ్) 'నాలుగురాళ్లు', క. ఎరడు మర (గళు) 'రెండు చెట్లు'.

అమహద్వాచక బహువచన ప్రత్యయమైన ఈ -కళ్ క్రమంగా మహద్వాచకాలకి, మహతీవాచకాలకి కూడ చేరింది. త. పెణ్‌కళ్ 'స్త్రీలు'; మ. స్త్రీకళ్ 'స్త్రీలు', క. కవిగళ్ 'కవులు'; తె. అన్నలు. ఈ విధంగా ఇది స్త్రీ పుం సామాన్య బహువచన స్థానాన్ని ఆక్రమించింది. ఈ -కళ్ ప్రత్యయం కొన్ని సార్లు స్త్రీ పుం సామాన్య బహువచన ప్రత్యయమయిన 'ర్' తరువాత కూడ చేరుతుంది. త.మ.క. అరసర్‌గళ్ 'రాజులు', అవర్‌కళ్ 'వారలు'. ఇది బహువచన ప్రత్యయంపైన మరల బహువచన ప్రతయం చేరటం. ఈ పునరుక్త బహువచనం (double plural) గౌరవసూచకంగా కూడ వాడటం జరుగుతుంది.

అమహద్బహువచన ప్రత్యయం తమిళ మళయాళ కన్నడ భాషలలో -కళ్ గాను, తెలుగులో (-లు గాను) (అనుచిత విభాగం దృష్టిలో) -కళ్ గాను, కనిపిస్తుంది. కుయి. కువి. గోండి భాషల్లో -క్, -న్క్ గాను, కొండ భాషలో -క్ గాను, కొలామి, పర్జి, గదబ, ఒల్లారి భాషల్లో -ల్, -కుల్ గాను, బ్రాహుయిలో -క్, -న్క్ గాను కనిపిస్తుంది. కురుఖ్, మాల్తో భాషల్లో ఈ బహువచన ప్రత్యయం కనపడదు.

కాల్డ్వెల్ దృష్టిలో *కళ్ ప్రాచీనద్రావిడ అమహద్బహువచన ప్రత్యయం. దీనినుంచి ద్రావిడ భాషలోని పై బహువచన ప్రత్యయాలు ఏర్పడ్డాయని కొందరు భాషాశాస్త్రజ్ఞులు భావించారు. దీన్ని అంగీకరిస్తే- తెలుగులోని 'లు' మూల ద్రావిడంలోని *కళ్ నుంచి వచ్చింది. మూర్ధన్య ళ కారం దంత్యంగా పరిణామం చెందింది. ఎలుకలు (< ఎలికళ్), ఏనుఁగులు (<యానైగళ్), కొలఁకులు (<కుళంగళ్). చిలుకలు (కిళికళ్), మ్రాఁకులు (<మరంగళ్) మొదలైన పదాల్లో బహువచన ప్రత్యయం 'లు' గానే కనిపిస్తుంది. కాని తమిళాది భాషల్లోని సమానపదాలను బట్టి ఈ పదాలలోని క/గ లు ప్రాచీనకాలంలో బహువచన ప్రత్యయంలోని భాగమని తెలుస్తుంది ఆ బహువచన ప్రత్యయమే *-కళ్. అదే తెలుగులో -కలు గా మారింది (కాల్డ్వెల్, పుట 245). ఇక్కడ అనుచిత విభాగం వల్ల *-క నామపదంతో కలిపివేయబడింది. 'లు' ప్రత్యయంగా భావించబడింది.

తరువాతి పరిశోధకులు కొందరు మూలద్రావిడ భాషలోనే *క్, *ళ్ అనే బహువచన ప్రత్యయాలు వేరువేరుగా ఉన్నాయనీ తరువాతి కాలంలో అవి కొన్నిభాషల్లో క్‌గాను, కొన్నిభాషల్లో ళ్>ల్ గాను ఉన్నాయనీ తరువాతి కాలంలో మరికొన్నిభాషల్లో ఈ రెండు బహువచన ప్రత్యయాలు కలిసి 'కళ్' అనే పునరుక్త రూపంగా మారిందనీ అభిప్రాయపడ్డారు. వీళ్ళదృష్టిలో మూలద్రావిడభాషలో *కళ్

లేదు. దక్షిణ ద్రావిడభాషల్లో మాత్రం పునరుక్తబహువచన కళ్ వాడబడుతోంది. మిగిలిన భాషల్లో ళ్, క్, స్క్ లు బహువచన ప్రత్యయాలుగా కనిపిస్తాయి.

తెలుగులో ఎక్కువ నామపదాలకి బహువచనంలో -లు ప్రత్యయమే చేరుతుందనీ ఈగలు, ఎలుకలు, ఏనుగులు, గొడుగులు, చిలుకలు, మకుగులు, మ్రాకులువంటి కొన్నినామాలకి మాత్రమే *-కళ్ చేరిందని చెప్పవచ్చనీ భద్రిరాజు కృష్ణమూర్తి (TVB P 258) చెప్పారు

ఈ అమహద్బహువచన ప్రత్యయం మూలద్రావిడ భాషలో వైభాషికంగా ఉండి మూల మధ్య ద్రావిడ భాషలో నిత్యంగా మారి ఉంటుందని చెప్పాలి. ఇది ఉత్తర దక్షిణ ద్రావిడభాషల్లో నేటికీ నిత్యంగాదు. మధ్య ద్రావిడ భాషల్లోనే నిత్యం. తెలుగులో కూడ వంద ఎకరం, నూరుగడప, వేయి విస్తరి, లక్ష జనం మొదలయిన పదాల్లో బహువచన ప్రత్యయం లేకుండానే వాడతారు. మూల భాషా లక్షణం ఇటువంటి చోట్ల మిగిలి ఉన్నదనవచ్చు.

## విభక్తి

అర్థవంతమైన కొన్ని పదాలతో వాక్యం ఏర్పడుతుంది సంపూర్ణార్థాన్ని బోధించే వాక్యంలో పదాలకు గల పరస్పర సంబంధం ఆయా పదాలకు చేరి ఉన్న ప్రత్యయాలు లేక పరసర్గలు సూచిస్తుంటాయి. ఇటువంటి ప్రత్యయాలు ఆర్యభాషల్లో ఉన్నాయి. సంస్కృతంలో ఎనిమిది విభక్తులకు మూడు వచనాల్లోను వేరు వేరు ప్రత్యయాలు నిర్దేశించబడ్డాయి.

ద్రావిడ భాషల్లోని విభక్తి ప్రణాళిక సంస్కృతానుకరణంవల్ల ఏర్పడినదే. కాని ఈ భాషల్లోని విభక్తులు సంస్కృతం కంటె భిన్నంగా ఉంటాయి. సంస్కృతంలోని విభక్తి ప్రత్యయాలు చరిత్రకందని కాలంలో ఏర్పడి, ప్రత్యేక ప్రయోగత్వం లేక, కేవల ప్రత్యయాలుగా పరిణమించి నామాలకు, ధాతువులకు చేర్చబడి అర్థవంతములవుతున్నాయి వీటికి మూలరూపాలూ వాటి అర్థాలూ తెలీదు. ద్రావిడభాషల్లోని విభక్తులలో కొన్ని ప్రత్యేక పదాలు లేదా వాటి అవశిష్ట రూపాలు. మరికొన్ని కేవల ప్రత్యయాలు.

ఈ భాషల్లోని విభక్తి ప్రణాళికను సంస్కృత పండితులు, సంస్కృత భాషా ప్రభావితులయిన పండితులు సంస్కృతంలో ఏ అర్థంలో ఏ ప్రత్యయం ఉందో ఆ అర్థాన్ని మనసులో పెట్టుకొని తదర్థబోధకమైన ద్రావిడ పదాలను ఆ ప్రత్యయాలుగా పరిగణించారు. ఇవి కొన్ని ప్రత్యేక ప్రయోగార్హాలు కొన్ని కేవల ప్రత్యయత్వం కలవి

ద్రావిడ భాషల్లో ఏకవచనంలో ఏకవచన రూపంపైనా (చెట్టు-ను), బహువచనంలో బహువచన ప్రత్యయం చేరిన నామంపైనా (చెట్ల-ను) విభక్తులు చేరతాయి. ఈ భాషల్లో విభక్త్యర్థాన్ని సూచించటానికి ప్రత్యేక పదాలను వాడతారు గాబట్టి వీటిల్లో విభక్తులు ఎనిమిది అని పరిమితి లేదు. విభక్త్యర్థం గల పదాలు పైన, క్రింద, ప్రక్క, వెనుక, మీద వంటివి ఎన్నో ఉన్నాయి.

ఈ భాషల్లో ప్రథమావిభక్తి రూపం నామమే. త. మ. తంబి (తమ్ముడు), క. అణ్ణ. తె. అన్న మొదలగునవి. బహువచనంలో లింగభేదాన్ని బట్టి 'ర్, ళ్/కళ్'లు చేరతాయి. తెలుగు వైయాకరణులు 'డు,ము,వు' ప్రథమా విభక్తి ప్రత్యయాలని చెప్పారు. కాని అవి విభక్తి ప్రత్యయాలు కావని వాటి చరిత్రను పరిశీలిస్తే తెలుస్తుంది.

డు,ము అనేవి లింగబోధక ప్రత్యయాలు *-న్త్ ప్రత్యయం యొక్క పరిణామ రూపమే 'డు' మహదేక వచన ప్రత్యయమైన ఈ *-న్త్>-న్ట్>-న్డ్>-ణ్డు>-ండు>-ఁడు>-డు గా పరిణామం చెందింది. *అవన్త్> అవన్త్>వాన్టు>వాణ్డు>వాండు>వాఁడు>వాడు గా ఈ 'డు' ప్రత్యయం ఏర్పడింది. కాలక్రమంలో ఇది తత్సమ నామాలకుకూడ చేర్చబడింది. ఉదా: రాముఁడు, కృష్ణుఁడు. కొంతకాలానికిది ప్రథమావిభక్తి ప్రత్యయంగా కూడ భావించబడింది.

అమహద్వాచకాలయిన దేశ్యపదాలలోని -ంబు వర్ణం యొక్క పరిణామ రూపమే 'ము'. -ంబు>-మ్ము>-ము గా ఇది పరిణామం చెందింది. పాంబు>పామ్ము>పాము. సంస్కృతంలోని అమహన్నపుసంక శబ్దాల ప్రథమైన వచనరూపాలు ధనమ్, వనమ్ మొదలైనవి ఉత్వాన్ని చేర్చుకొని తెలుగులో ధనము, వనము అనే విధంగా ముగంత రూపాలయినాయి. ఇట్లా రెండువిధాలుగా ఏర్పడిన ఈ 'ము' వర్ణం ప్రథమైక వచన ప్రత్యయంగా భావించబడింది.

ఇక 'వు' అనేది కొన్ని పదాల చివర ఉచ్చారణ సౌలభ్యం కోసం చేరినది.

తమిళ మలయాళ కన్నడ భాషల్లోను నామాలే ప్రథమా విభక్తి రూపాలు. సాధారణంగా మహద్వాచక ప్రథమైక వచన రూపాలు 'న్' అంతమందు కలిగినవి (అవన్ 'వాడు'). మహతీవాచక ప్రథమైక వచనరూపాలు 'ళ్' అంతమందు కలవి (అవళ్ 'ఆమె'). అమహద్వాచక ప్రథమైక వచన రూపాలు 'త్,మ్' అంతమందు కలవి (అదు, మరమ్ 'అది, చెట్టు'). మహన్మహతీ ప్రథమా బహువచన రూపాలు రేఫాంతాలు (అవర్ 'వారు'). అమహద్బహు వచన రూపాలు 'కళ్' ప్రత్యయాంతాలు (కిళికళ్ 'చిలుకలు').

ద్వితీయావిభక్తి నుంచి ప్రాతిపదికలో మార్పు వస్తుంది. ద్వితీయాద్యంగం అన్ని విభక్తులలోను ఒకేవిధంగా ఉంటుంది. ఆ ద్వితీయాద్యంగం పైన ప్రథమేతర విభక్తి ప్రత్యయాలు చేరతాయి. ప్రాతిపదికకు ద్వితీయాది విభక్తి ప్రత్యయాలకు మధ్య కొన్ని ప్రత్యయాలు చేరతాయి. వాటిని ఔపవిభక్తికాలు అంటారు. తమిళంలో 'సారియై' అనీ, మలయాళంలో అనుసంధాయక వర్ణాలనీ, కన్నడంలో ఆగమవర్ణాలనీ అంటారు. వీటిని కాల్డ్వెల్ Inflectional Increments అన్నాడు.

ద్వితీయ : తమిళంలో -ఐ అనేది ప్రత్యయంగా కనిపిస్తుంది. అవనై 'వాణ్ని' ఎన్నై 'నన్ను', కాలై 'కాలిని', కణ్ణై 'కంటిని', పామ్పై 'పాముని', మరత్తై 'చెట్టుని'.

మలయాళంలో -ఎ. అవనె 'వాణ్ని', మగనె 'కొడుకు'.

కన్నడంలో -అమ్, -అను/-అన్ను. మరవమ్/మరవను, 'చెట్టుని', భగవను/భగవన్ను 'భగవంతుణ్ని'.

తెలుగులో -ను. వనమును, వారలను, హరిని.

ఈ విభక్తి ప్రత్యయానికి మూలరూపాలు *-అయ్, *-అన్ లు. తమిళ మలయాళ భాషల్లోని ప్రత్యయాలు మూలరూపమైన *-అయ్ నుంచి ఏర్పడ్డాయి. కన్నడం తెలుగులలోని ప్రత్యయాలు -*అన్ నుంచి ఏర్పాడ్డాయి.

తెలుగులో కూర్చి, గురించి అనే పదాలను ఈ ద్వితీయార్థంలో వాడతారు. ఇవి ప్రత్యేక పదాలే.

తృతీయ : తమిళంలో -ఆన్, -ఆల్ అనేవి కరణార్థంలోను, ఒడు, ఓడు అనేవి సహార్థంలోను వస్తాయి. మరుప్పినా 'తొండంన్తో', కైయాల్ 'చేతితో', అవనొడు/అవనోడు 'అతనితో'. మలయాళంలోను ఇదే విధంగా ఉంటుంది.

కన్నడంలో -ఇమ్, -ఇందె/-ఇంద అనేవి కరణార్థంలోను -ఒడనె అనేది సహార్థంలోను చేరతాయి. పూగళిమ్/హూవుగళింగ 'పూవులతో', నన్నొడనె 'నాతో'.

తెలుగులో చేతన్/చేన్ అనేది కరణార్థంలోను, తోడన్/తోన్ అనేది సహార్థంలోను చేరతాయి. కత్తిచే(త)న్, నాతో(డ)న్.

కరణార్థానికి, సహార్థానికి కూడ తమిళం, తెలుగు వంటి కొన్ని భాషల్లో ఒకే ప్రత్యయాన్ని వాడతారు. మొత్తానికి కరణార్థాన్ని సూచించే మూలభాషా ప్రత్యయం *-ఆన్/*-ఆల్. సహార్థాన్ని సూచించేది *-ఒడు/*-ఓడు.

తెలుగులోని -చేతన్/-చేన్ అనేది చేయి శబ్దం యొక్క సప్తమ్యంత రూపం. -తోడన్/-తోన్ అనేది తోడు (<*తోట్) శబ్దం నుంచి వచ్చింది. దీనికి ప్రాచీన రూపం తెలుగు శాసన భాషలో తోటన్‌గా కనిపిస్తుంది. తమిళంలో తోటమై అనే పదం తోడు (Companianship) అనే అర్థంలో ఉంది.

చతుర్థి తమిళంలో -క్కు అనేది ప్రత్యయం. ఎనక్కు 'నాకు', అవనుక్కు 'అతనికి'.

మలయాళంలో -క్కు, -న్ను/-ను. ఎనక్కు 'నాకు', కడలుక్కు 'సముద్రానికి', మగన్ను 'కొడుకుకి', అవను 'వాడికి'.

కన్నడంలో క్కె/గె. మరక్కె 'చెట్టుకి', కవిగె 'కవికి'.

తెలుగులో -కున్ నాకు(న్). కొఱకున్, కై అనేవి కూడ ఈ అర్థంలో వాడతారు. ఇందులో కొఱ అంటే ప్రయోజనం అని అర్థం. ఇది ప్రత్యేక

పదం 'కు' అనేది ప్రత్యయం. ఇక కు + అయి > కయి > కై. ఇందులో 'కు' ప్రత్యయం.

ఈ చతుర్థీ విభక్తి ప్రత్యయాలకి మూలరూపం -*క్కు. ఇది అన్ని ద్రావిడ భాషల్లోను ఉంది.

పంచమి . తమిళంలో -ఇన్ అనేది ప్రాచీన భాషలో ఉంది. మలైయిన్ 'కొండమీద నుంచి'. దీనికి ప్రయోగాలు తక్కువ. నిన్ఱు 'నిలిచి', ఇరుందు 'ఉండి' అనే పదాలు వాడబడేవి. వాన్‌నిఱున్ 'వర్షం నుంచి', వర్షం వలన. నాళై యిరుందు 'పొద్దుననుంచి' ఆధునిక భాషలో సప్తమి ప్రత్యయమైన -ఇల్ కి ఇరుందు 'ఉండి' అనే పదం చేర్చబడి ఈ అర్థాన్నిస్తుంది. వీట్టి విరుందు 'ఇంటినుండి'.

మలయాళంలో -ఇల్ అనే దానికి నిన్ను 'నిలిచి' అనే పదాన్ని చేర్చి వాడతారు. వానిల్ నిన్ను 'వాననుంచి'.

కన్నడంలో దెస ఇంద అనేది చేరుతుంది. అవనదెస ఇంద 'అతని వలన నుండి'.

తెలుగులో -నుండి/-నుంచి. ఇంటి నుండి/నుంచి. ఇంకా వలన, కంటె, పట్టి అనేవి ఈ విభక్త్యర్థంలో వాడటం కనిపిస్తుంది. ఇందులో వలను అనే పదానికి వైపు, దిక్కు అని అర్థం. దాని సప్తమ్యంత రూపం వలన అనేది. పట్టు శబ్దం నుంచి ఏర్పడింది పట్టి. ఇక కు + అంటెన్ > కంటెన్.

ఈ విభక్తి ప్రత్యయానికి మూలభాషారూపం *-ఇన్.

షష్ఠి : తమిళంలో -అ, -అదు, -ఇన్ అనే ప్రత్యయాలూ, ఉటైయ అనే పదమూ ఈ అర్థంలో కనిపిస్తాయి. యానైయ 'ఏనుగు యొక్క', ఎనదు 'నా యొక్క', మరత్తిన్ 'చెట్టుయొక్క', ఎన్‌ఉటైయ 'నాయొక్క'. ఉటైయ అనే పదానికి కలిగి ఉండటం, స్వామిత్వం అని అర్థం.

మలయాళంలో ప్రాచీనకాలంలో ఉటై తరువాతికాలంలో ఉటైయ కనిపిస్తుంది. అవనుటైయ 'అతని యొక్క'.

కన్నడంలో -అ, -అదు. అవన 'వాని యొక్క', ఎనదు 'నా యొక్క'.

తెలుగులో షష్ఠీ విభక్తికి ప్రత్యేక ప్రత్యయం లేదు. వ్యాకరణంలో సంబంధార్థంలో చెప్పబడిన 'యొక్క'కి సాహిత్యంలోను, వ్యవహారంలోను వాడుక తక్కువ. అసలు లేదనే చెప్పవచ్చు. నా పుస్తకం, నీ యిల్లు, ప్రాచీన భాషలో నా/నాదు, నీ/నీదు వంటి రూపాల్లో 'దు' ప్రత్యయం కనిపిస్తుంది.

ఈ షష్ఠీ ప్రత్యయం చాల భాషల్లో లేదు. ఉన్న భాషల్లో కూడ నిత్యం కాదు. కాబట్టి అతి ప్రాచీన కాలంలో షష్ఠి విభక్తికి ప్రత్యయం లేదనీ రెండు నామవాచక పదాలు ఒకదాని కొకటి చేరినప్పుడు మొదటి పదానికి షష్ఠ్యర్థం వచ్చేదనీ భావించాలి.

సప్తమి · తమిళంలో -ఇల్. ఊరిల్ 'ఊళ్లో', వీట్టిల్ 'ఇంట్లో'. ఇది గృహ వాచకం. ఉళ్ 'లోపల' అనే అర్థము కలిగిన పదం కూడ ఈ విభక్త్యర్థంలో వాడబడుతుంది. వైయత్తుళ్ 'లోకంలో'.

మలయాళంలో -ఇల్, పోరిల్ 'యుద్ధంలో'.

కన్నడంలో -అల్లి, -ఒళ్ లు కనిపిస్తాయి. రాజ్యదల్లి 'రాజ్యమునందు', రాజ్యదొళ్ 'రాజ్యంలో'.

తెలుగులో -లోన్, -నన్, -అందున్, ఇంటిలో, ఘటమునన్, ఘటమునందు, ఊరియందు. ప్రాఙ్నన్నయ కాలపు శాసనాల్లో 'లోన్'కి ప్రాచీన రూపాలయిన -ఒళన, -ళోన కనిపిస్తాయి. రాజుల్లోళన, కయ్యంబుళోన.

ఈ విభక్తిని సూచించేవన్నీ మొదట ప్రత్యేక పదాలే. 'ఇల్' అనేది గృహ వాచకం. *ఉళ్ అనే పదానికి లోపలి భాగమని అర్థం. దాని నుంచి తమిళంలోని ఉళ్, తెలుగులోని లోన్ వచ్చాయి. కన్నడంలోని 'అల్లి' అనే పదానికి అక్కడ అని అర్థం. తెలుగులోని 'అందు' స్థలవాచకం.

సంబోధన : సాధారణంగా అన్ని భాషల్లోను సంబోధనలో చివరి అచ్చు దీర్ఘంగా పలకబడుతుంది. ఇదే సంబోధనని సూచిస్తుంది.

ఈ ప్రథమేతర విభక్తి ప్రత్యయాలు, పరసర్గలు ప్రథమేతర విభక్త్యంగం పైన చేరతాయి. ఈ ప్రథమేతర విభక్త్యంగరూపం కొన్ని పదాల్లో ప్రథమారూప తుల్యంగానే ఉంటుంది. కొన్ని పదాల్లో ప్రథమారూపం కంటె భిన్నంగా ఉంటుంది. అప్పుడు కొన్ని స్వరనామాల్లోని దీర్ఘాచ్చు హ్రస్వమవుతుంది. త. యాన్ -ఎన్, క నాను -నన, తె నేను -నన్, నా.

మరికొన్ని నామాలకు ఔపవిభక్తికాలు చేరతాయి, సాధారణంగా ద్వితీయాది ప్రాతిపదిక విశేషణ రూపంతో సమానంగా ఉంటుంది. ఉదాహరణకి నూతి నీరు, ఏటి మట్టి, అతని ఇల్లు, వీటిల్లోని త్, ట్, ఇ అనేవి ఔపవిభక్తికాలు. ఆయా ద్రావిడ భాషలను పరిశీలించటం వల్ల మూలద్రావిడ భాషలో ఉన్న ఔపవిభక్తికాలను ఊహించవచ్చు.

*-త్త్- అనేది తమిళ, మలయాళ, కన్నడ, తెలుగు భాషల్లో ఉంది. త. ఉలగత్తుల్ 'లోకంలో', మ. తోట్టత్తిల్ 'తోటలో', క. మరదొళ్ 'చెట్టులో', తె. నూతిలో.

*-అన్- తమిళంలోను, తెలుగులోను కనిపిస్తుంది. ఇంకా గోండి, కొండలలో మాత్రమే ఈ ప్రత్యయముంది. త ఏటినై 'ఏడుని', అదనై 'దానిని', అదనిల్ 'అందులో', తె. అది>దాని-<* అతని- (అది+ను>దాని -ని<* అత్+అన్-ను)

*-ఇన్- తమిళ, కన్నడం, తెలుగు భాషల్లో చేరుతుంది. త. కణ్ణినాల్ 'కంటిలో', క. పూవిన 'పువ్వుయొక్క', పావింగె 'పాముకి'. తెలుగులోని 'ఇ' దీన్నుంచి 'న్' కారం లోపించి ఏర్పడింది. ఊరికి, కాలికి.

*-అ- చాల భాషల్లో చేరుతుంది. త.మ. ఎనక్కు 'నాకు', క. ననగె 'నాకు', తె. రాములకు.

ఇక *-అన్-, *-త్త్- ల సమాహారంవల్ల తమిళంలో -అట్ట్- అనే దేర్పడింది. పరవట్టిల్ 'చాలవాటల్లో'. ఇది ప్రాచీన మలయాళ శాసనాల్లో కనిపిస్తుంది. కన్నడంలోను ఉంది. ఎరడఱొళ్ 'రెండిటిలో' తెలుగులోని 'ట్' ఈ విధంగా ఏర్పడిందే. రెండిటి, వాటి, ఏటిలో, ఇంటిలో.

తెలుగు వైయాకరణులు ఇ, టి, తి లను మాత్రం ఉపవిభక్తులన్నారు, 'అ' వర్ణాన్ని గ్రహించలేదు. కాని 'అ' కూడ ఇ,టి,తి ల వంటిదే.

ఈ ఉపవిభక్తులు విశేషణద్యోతక ప్రత్యయాలు. ఇప్పుడు విభక్తి ప్రత్యయాలని మనమనుకొనే రూపాలు చాలవరకు ప్రత్యేక పదాలే. వాటికి పూర్వమందున్న ప్రాతిపదికను ఈ ఔపవిభక్తిక ప్రత్యయాలు విశేషణంగా మారుస్తాయి. ఇదే వీటి ప్రయోజనం.

ఔపవిభక్తిక ప్రత్యయాలు ద్రావిడ భాషల్లో కేవలం విభక్తి ప్రత్యయాలు చేరినప్పుడే కాక సంబంధార్థాన్ని తెలిపేటప్పుడు కూడ ప్రాతిపదికకి చేరతాయి. ఉదా: నోటిమాట, ఏటిఒడ్డు, నూతినీరు, కాలినొప్పి. త. కుళత్తు మీన్ 'చెరువు చేప, మరత్తువేర్ 'చెట్టువేరు'. క. మరదబేరు 'చెట్టువేరు'.

## సర్వనామాలు

ద్రావిడ భాషల్లోని ఉత్తమ, మధ్యమ పురుష సర్వనామాల్లో ఏక బహువచన భేదం మాత్రమే ఉంటుంది గాని లింగభేదముండదు. ప్రథమ పురుష సర్వనామాల్లో లింగభేదం కూడ ఉంటుంది. ఈ సర్వనామరూపాలు ఆయా ద్రావిడ భాషల్లో ఏ విధంగా ఉన్నాయో పరిశీలిస్తే వాటి మూల రూపాలను ఊహించవచ్చు. ఆ మూలభాషా రూపాలు సోదర ద్రావిడభాషల్లో ఏ విధంగా పరిణామం చెందాయో తెలుసుకోవచ్చు.

ఉత్తమపురుషలో వాడబడే సర్వనామాలను పరిశీలిస్తే వాటిని అయిదు వర్గాలుగా విభజింపవలసి వస్తుంది.

ఉత్తమ పురుషైక వచనం (నేను)

మొదటి వర్గం : దీని మూలరూపం *యాన్/*యన్-

| | నామారూపం | ఔపవిభక్తిక రూపం |
|---|---|---|
| త. | యాన్ | ఎన్- |
| మ. | | ఎన్- |
| క. | ఆన్ (మ్) | ఎన్- |
| తె. | ఏను | — |
| కొ.నా.ప.ఒ. | అన్ | అన్- |

రెండోవర్గం : దీని మూలరూపం *ఞాన్/ఞన్-

| | | |
|---|---|---|
| త. | నాన్ | — |
| మ. | ఞాన్, నాన్ | — |
| క. | నాన్ (మ్) | నన్- |
| తె. | నేను, నాను | నన్-, నా- |

ఉత్తమపురుష బహువచనం (మేము)

మూడోవర్గం : దీని మూలరూపం *యామ్/*యమ్-

| | | |
|---|---|---|
| త | యామ్, యాంగళ్ | ఎమ్- |
| మ. | — | ఎఙ్ఙళ్- |
| క. | ఆమ్ (న్) | ఎమ్- |
| తె. | ఏము | — |

నాలుగోవర్గం దీని మూలరూపం *ఞామ్/*ఞమ్-

| | | |
|---|---|---|
| త. | నాంగళ్ | — |
| మ. | ఞాఙ్ఙళ్ | ఞఙ్ఙ్ |
| తె. | నేము, మేము | మమ్మ్-, మా- |

ఉత్తమపురుష బహువచనం (మనము)

అయిదోవర్గం : దీని మూలరూపం *ఞామ్/*ఞమ్-

| | | |
|---|---|---|
| త. | నామ్ | నమ్ (మ్)- |
| మ. | నామ్ | నమ్ (మ్)- |
| క. | నామ్, నావు | నమ్ (మ్)- |
| తె | మనము | మన- |

పై రూపాల్లో నామవాచకంలో దీర్ఘాచ్చు, ఔపవిభక్తిక రూపంలో హ్రస్వాచ్చు కనిపిస్తుంది ఏక బహువచన భేదం -న, -మ ల వల్ల ఏర్పడినట్లు తెలుస్తుంది పదాది వర్ణం 1, 3 వర్గాల్లో య-/ఁ-గాను, రెండోవర్గంలో ఞ-/న- గాను, నాలుగోవర్గంలో ఞ-/న-/మ- గాను, అయిదోవర్గంలో న-/మ-గాను కనిపిస్తుంది.

పదాదిన అ̆, ఎ̆ ల వినిమయం జరిగినప్పుడు ఆ వర్ణాన్ని పునర్నిర్మించాలంటె అది అ̆ గాని, ఎ̆ గాని కాదనీ సామాన్యంగా అది *య, *ఞ, *చ లలో ఒక హల్లుకి పరమైన అచ్చుఅనీ అందువల్లనే అ̆, ఎ̆ ల వినిమయం జరిగిందనీ చెప్పాలి. కాబట్టి పదాదినున్న *య, *ఞ *చ వర్ణాలే వాటికి పరమైన అ/ఎ ల వినిమయానికి కారణమని భావించాలి. ఈ సర్వనామాలలోని అ/ఎ ల వినిమయానికి కూడ ఇదే కారణం.

ఒకటి, మూడు వర్గాలకి *యాన్/*యన్-, *యామ్/*యమ్-లు మూలరూపాలు. వీటిల్లోని అచ్చు దక్షిణ ద్రావిడ భాషల్లో దీర్ఘంగా ఉన్నప్పుడు 'ఆ' గాను, హ్రస్వంగా ఉన్నప్పుడు 'ఎ' గాను ఉంది. తెలుగుకాక మిగిలిన మధ్యద్రావిడ భాషల్లో ఇది ఆ/అ- గా అంటే, *యాన్/*యన్->ఆన్/అన్ -గా మారింది. ప్రాచీన తమిళంలో తప్ప అన్నిభాషల్లోను పదాది *య- వర్ణం లోపించింది. ఆ భాషల్లో కూడ ఔపవిభక్తికరూపం ఎన్- అనే ఉంది. ఈ ఎన్- [యెన్] <*యన్- నుంచి వచ్చిందే. ఎ-/యె- లు ఎప్పుడూ అర్థభేదాన్ని కలిగి ఉండవు గాబట్టి యెన్->ఎన్- గా మారింది.

దీన్నిబట్టి ఒకటి, మూడు వర్గాల్లో ఏకవచనంలో *యాన్/యన్-లూ బహువచనంలో *యామ్/*యమ్- లూ మూల రూపాలని తెలుస్తుంది. పదాది *య- లోపించిన తరువాత దానికి పరంగా ఉన్న అచ్చు *ఆ/*అ- ఒక్కొక్క భాషలో ఒక్కొక్క విధంగా ధ్వనిపరిణామ క్రమానుగుణంగా మార్పును పొందింది. ఇందులోని *-న ఏకవచనాన్ని, *-మ బహువచనాన్ని సూచిస్తున్నాయి. మరి *యా- అనేది ఉత్తమ పురుష బోధకధాతువని గ్రహించాలి.

మలయాళంలో ఏకవచనంలో ఞాన్/ఎన్- అనే రూపాలు కనిపిస్తున్నాయి. రెండు, నాలుగు వర్గాల్లో నా-/నే- ల వినిమయం కూడ ఉంది. అంటే, ఞా-/నా-/నే- లున్నాయని స్పష్టం. వీటికి మూలరూపం *ఞాన్ అనేది. ఇది మలయాళంలో మాత్రం నిలిచి ఉంది. పదాది *ఞ- వర్ణం చాల భాషల్లో న- తో కలిసిపోయింది. తరువాతి అచ్చు కొన్నిభాషల్లో ఆ గాను,కొన్నిట్లో ఏ గాను ఉంది.

ఉత్తమ పురుష బహువచనం ఉభయార్థబోధకంతోసహా రెండు విధాలుగా ఉండే పద్ధతి మూలద్రావిడంలోనే ఉందని చెప్పాలి. *ఞామ్/*ఞమ్- అనేవి నాలుగు, అయిదు వర్గాలకి మూలరూపాలుగా పునర్నిర్మించవచ్చు. తమిళ మలయాళ కన్నడ భాషల్లోని నామ్/నమ్-, తెలుగులోని మనము అనేవి కూడ *ఞామ్ నుంచి వచ్చినవే. ప్రాచీన తెలుగులోని నేము కూడ మేము అనే అర్థమున్నాగాని *ఞామ్ నుంచి వచ్చినరూపమే.

ఇక *యామ్/*యమ్- (మేము) లకు, *ఞామ్/ఞమ్- (మనము) లకు గల సంబంధం ఏమిటో పరిశీలించాలి. సంగం సాహిత్యంలో యాయ్ 'నాతల్లి', ఞాయ్ 'నీ తల్లి' < *న్-యాయ్ అని రెండు రూపాలు కనిపిస్తాయి. ఇందులో *న్- అనేది మధ్యమపురుషైక వచనరూపంయొక్క ధాతువు (root)నకు అనగా నీ- కి రూపాంతరం. ప్రాచీన ద్రావిడంలోలాగానే తమిళంలో కూడ పదాది సంయుక్తాక్షరాలుండవు. సంస్కృతంలోని న్యాయ>ఞాయగా తమిళంలో మారింది. ఇట్లాగే పైన చెప్పిన ఞ-<న్య- అని చెప్పవచ్చు. అంటే, ఞాయ్< *న్-యాయ్ అని. కాబట్టి *ఞామ్ (మనము) అనేది *న్-యామ్ 'నీవు+ మేము=మనము' అని చెప్పవచ్చు.

ఇప్పటికి *యామ్ (మేము), *ఞామ్ (మనము) అని రెండు బహు వచన రూపాలున్నాయని తేలింది. మరి ఏకవచనంలో *యాన్ అనే ఒక్క రూపమే ఉండాలి. కాని *ఞాన్ కూడ కనిపిస్తుంది. ఇది బహువచన రూప మయిన *ఞామ్ సామ్యంవల్ల ఏర్పడింది. అంతేకాని *ఞాన్‌కి *యాన్‌కి ఏ విధమయిన అర్థ భేదంలేదు.

| ఉత్తమ పురుషైకవచనం | ఉత్తమ పురుష బహువచనం |
|---|---|
| *యాన్/*యన్- (నేను) | *యామ్/*యమ్- (మేము) |
| | ↓ |
| *ఞాన్/*ఞన్- (నేను) | ← *ఞామ్/*ఞమ్- (మనము) (న్-యామ్/న్-యమ్-) |

పై విధంగా ఉత్తమ పురుషైకవచనంలో రెండోరూపమయిన *ఞాన్ ఏర్పడింది. దక్షిణ మధ్య ఉపవర్గాలలోని చాల భాషల్లో ఈ *ఞాన్ నుంచి వచ్చిన రూపాలుండటంవల్ల దీన్ని మూలద్రావిడంలో పునర్నిర్మించటం జరిగింది.

ఉత్తమ పురుష బహువచనంలో మ- తో ప్రారంభమయ్యే రూపాలు తెలుగులో ఉన్నాయి. నాలుగో వర్గంలో మేము/మమ్-/మా- అయిదోవర్గంలో మనము/మన- అనేవి. ఇవి ఎలా ఏర్పాడ్డాయో చూడాలి.

ఇంతవరకు చూసినదాన్ని బట్టి సాధారణంగా నామవాచక రూపంలో దీర్ఘాచ్చూ ఔపవిభక్తిక రూపంలో హ్రస్వాచ్చూ ఉంటాయి. అంటే, ఈ రెండు రూపాల్లోని భేదం హ్రస్వ దీర్ఘ భేదం మాత్రమే. ఈ విషయం ఒకటి, మూడు, అయిదు వర్గాల్లో స్పష్టం. కాని, తెలుగులో దీనితోపాటు అంటే, హ్రస్వ దీర్ఘ భేదం ఉన్న రూపాలతో పాటు (నేను/నన్-) రెండు రూపాలలోను నేను/నా-; నేము, మేము/మా- అనే విధంగా దీర్ఘాచ్చులు ఉన్న రూపాలు కూడ ఉన్నాయి. ఈ రూపాలలో (*ఞాన్, *ఞామ్) ఏక, బహువచన భేదాన్ని తెలిపేది చివరి హల్లులయిన -న, -మ లే. వీటి ఔపవిభక్తిక రూపాలు తెలుగులో నా-, మా- అనేవి. వీటిల్లో ఏక, బహువచన భేదక వర్ణాలు పదాదికి వచ్చాయి. దీని పరిణామ క్రమాన్ని ఇలా చెప్పవచ్చు.

| | మూలమధ్య ద్రావిడం | పురాతన (Proto) తెలుగు |
|---|---|---|
| ఏ. వ. | ఞాన్/ఞన్- | నాన్~నేన్/(నన్-), నా- |
| బ. వ. | ఞామ్/ఞమ్- | నామ్~నేమ్/(నమ్-), *నా->మా- |

ఇందులో వచనభేదాన్ని తెలియజేయటానికే నా-/మా- లలోని న, మ ల భేదమని తెలియాలి.

ఈ విధంగా ఔపవిభక్తికాలలో ఉన్న న, మ ల భేద సామ్యంవల్ల నామంలో కూడ మ- కారాది రూపాలేర్పడ్డాయి.

| | నేను | మేము |
|---|---|---|
| తె. | ఏను; నేను/-; నన్-, నా- | ఏము, నేము, మేము/-; మమ్-, మా- |

వీటిల్లో బహువచనంలోని నామరూపాల్లో ఉన్న ఏము, నేము, మేము అనే మూడు రూపాలకూ ఒకటే అర్థం. ఇందులోని మేము అనేది ఔపవిభక్తిక రూపాల సామ్యంవల్ల ఏర్పడింది.

ప్రాచీన తెలుగు భాషలో ఉన్న ఏము, నేము (మేము అని అర్థం) అనే రూపాలు *యామ్, *ఞామ్ ల నుంచి వచ్చాయని స్పష్టం. వీటికి ఔపవిభక్తిక రూపం మా- అనేది. నేను/నా- అనే దాని సామ్యంవల్ల ఈ మా- అనే ఔపవిభక్తిక రూపానికి మేము అనే నామరూపం ఏర్పడింది.

ఇక తెలుగులో మనము అనే రూపముంది. ఇది మొదట నామ్/నమ- అనే విధంగా ఉండగా అందులోని ఔపవిభక్తిక రూపం వర్ణవ్యత్యయం కారణంగా మన- గా మారింది. తరువాత దానికి -ము అనే బహువచన ప్రత్యయం చేరి మరల నామరూపం ఏర్పడి మనము గా పరిణమించింది.

మధ్యమ పురుషైకవచనం (నీవు)

మొదటివర్గం : దీని మూలరూపం *నీన్/*నిన్-

| | నామరూపం | ఔపవిభక్తిక రూపం |
|---|---|---|
| త. | నీ | నిన్- |
| మ. | నీ | నిన్- |
| క. | నీన్ | నిన్- |
| తె. | నీవు, ఈవు | నిన్-, నీ- |

మధ్యమ పురుషబహువచనం (మీరు)

రెండోవర్గం : దీని మూలరూపం *నీమ్/*నిమ్-

| | | |
|---|---|---|
| త. | నీమ్, నీంగళ్, నీర్, నీయిర్ | — |
| త. | — | నుమ్-, ఉమ్-, ఉంగళ్- |
| మ. | నిఙ్ఙళ్ | నిఙ్ఙళ్- |
| క. | నీమ్, నీంగళ్ | నిమ్- |
| తె. | ఈరు | — |
| తె. | మీరు | మిమ్మ-, మీ- |

వీటిల్లో మొదటి వర్గానికి చెందిన రూపాలన్నీ *నీన్/*నిన్- ల నుంచి వచ్చాయి. తమిళ మలయాళ భాషల్లోని నామరూపాల్లో చివరి -న వర్ణం లోపించింది. ఇది ఔపవిభక్తిక రూపాల్లో నిలిచి ఉంది. తెలుగు, కన్నడ భాషల్లో ఈ చివరి -న వర్ణం అన్ని రూపాల్లోను నిలిచి ఉంది. తెలుగులో ఔపవిభక్తిక రూపం నిన్-, నీ- గా కనిపిస్తుంది. కాబట్టి దీని నామరూపం కూడ పురాతన తెలుగుదశ (Pre-Telugu Stage) లో నీనుగా ఉండేదని భావించాలి. తరువాత చివరి -ను స్థానంలో -వు వచ్చి చేరి నీను>నీవు గా మారింది. తెలుగులో ఈవు అనే రూపం కూడ ఉంది. మూల ద్రావిడ రూపమయిన *నీన్ లోని పదాది *న్ - వర్ణం కొన్ని మధ్య ద్రావిడభాషల్లో లోపించింది. ఇటువంటి మార్పు తెలుగులో స్వతంత్రంగా

జరిగింది. తెలుగు సాహిత్యభాషలో ఈ పదాది *న్- వర్ణం లోపించిన రూపమైన ఈవు అనేది ప్రచురంగా ఉంది.

మూల ద్రావిడంలో నామ. ఔపవిభక్తిక రూపాలకు భేదం దీర్ఘాచ్చు హ్రస్వం కావటమే. అన్ని ద్రావిడభాషల్లోను అదేవిధంగా ఉంది కాని తెలుగులో నిన్-అనే రూపంతోపాటు నీ- అనేది కూడ ఔపవిభక్తిక రూపంగా ఉంది ఇందులో నీ- అనేదే అధికంగా వాడబడుతుంది ద్వితీయా విభక్తిలో మాత్రం నిన్- వాడబడుతుంది. మూలద్రావిడంలోని హల్లు + దీర్ఘాచ్చు + హల్లు/హల్లు + హ్రస్వాచ్చు + హల్లు- (CV̄C/CVC-) పద్ధతి (*nīn/*nin-) తమిళ మలయాళ కన్నడ భాషల్లో ఉండగా తెలుగులో దీనితోపాటు హల్లు + దీర్ఘాచ్చు + హల్లు/హల్లు + దీర్ఘాచ్చు- (CV̄C/CV̄-) పద్ధతి (*nīn(నీవు/nī-) కూడ వ్యాప్తి చెందింది. ఇది తెలుగులో స్వతంత్రం.

రెండోవర్గానికి చెందిన రూపాలకి *నీమ్/నిమ్- లను పునర్నిర్మించాలి. *నీమ్ అనే బహువచన బోధక రూపానికి మరల బహువచన ప్రత్యయమయిన -*కళ్ ను చేర్చి (పునరుక్తబహువచనం) వాడటం తమిళ మలయాళ కన్నడ భాషల్లో ఉంది. ఇక తెలుగులో ఈరు అనే రూపముంది. ఇది ప్రాచీన తెలుగు భాషలో ప్రయోగించబడింది మూలద్రావిడ రూపమైన నీన్ లోని పదాది *న్- వర్ణం లోపించి ఈవు రూపం ఏర్పడినట్లే ఇందులోను పదాది *న్- వర్ణం లోపించి *నిమ్>ఈమ్ గా మారింది. బహువచనద్యోతకమైన -మ్ స్థానంలో వారు, వీరు, ఎవరు మొదలైన సర్వనామాల్లో ఉన్న బహువచన ప్రత్యయమైన రేఫ (-ర్-) వచ్చిచేరింది. కాబట్టి ఈమ్>ఈర్ గా మారి ఈరు అనే రూపం సిద్ధించింది

తమిళంలోని ఔపవిభక్తిక రూపమైన నుమ్-, ఉమ్- లకు మూల ద్రావిడంలోని *నీమ్/నిమ్- లకు సంబంధం ఏమిటో పరిశీలించాలి. ప్రాచీన ద్రావిడ రూపాన్నిబట్టి తమిళంలో ఔపవిభక్తిక రూపం నిమ్- అని ఉండాలి కాని అట్లాలేదు. పురాతన తమిళదశ (Pre-Tamil Stage)లో ఉండిన *నిమ్- అనే రూపం నుమ్- గా మారింది. ఇందులో 'ని'కి పరమైన ఉభయోష్ఠ్యాను నాసికం కారణంగా ని>ను గా మారిందని చెప్పవచ్చు. అప్పుడు *నిమ్->నుమ్-.

తెలుగులో మీ- అనే ఔపవిభక్తిక రూపముంది. దీన్ని ఉత్తమపురుష బహువచనంలోని ఔపవిభక్తిక రూపమైన మా- ని వివరించిన పద్ధతిలో చెప్పాలి. మధ్యమపురుష బహువచనానికి మూలరూపాలు *నీమ్/*నిమ్ - అనేవి. కాబట్టి తెలుగులోని మధ్యమపురుష బహువచనానికి చెందిన ఔపవిభక్తికరూపం నీ (<*నీమ్) గా ఉండాలి. కాని తెలుగు మధ్యమపురుషైక వచనంలో *నీన్ నుంచి వచ్చిన నీ- అనే రూపముంది. కాబట్టి ఈ ఏకవచన రూపంనుంచి బహువచన రూపాన్ని వేరుచేసి చెప్పటానికినీ- స్థానంలో మీ- వచ్చిచేరింది. ఈ బహువచన ఔపవిభక్తిక రూపమైన మీ- సామ్యంవల్ల మరల నామరూపం(మీరు) ఏర్పడింది.

ఏ.వ. నీన్ (వ్) ఉ /నీ- ; నిన్-

↓

బ.వ. మీము← /మీ- ; నిమ్- అని ఇతర భాషల్లో ఉంది. కాని

(నీమ్ అని ఉండాలి) మిమ్- అని తెలుగులో ఉంది.

ఈ విధంగా సామ్యంవల్ల మీము రూపం ఏర్పడుతుంది. ఈ మీము కి బదులు తెలుగులో మీ-రు రూపం వాడుకలో ఉంది. *నీమ్>*నీరు>మీరు అని దీని పరిణామక్రమం. ఇందులో బహువచన -మ్ స్థానంలో వచ్చిన రేఫం వారు, వీరు, ఎవరు మొదలయిన నామాలలోని బహువచనద్యోతక 'రు' ప్రత్యయమే.

## ప్రథమ పురుషసర్వనామాలు

మహద్వాచక ఏకవచనం యొక్క మూలరూపం *అవన్త్. త.మ. అవన్, క. అవ, ఆత, తె. వాఁడు, వాడు, అతడు, ఆతడు. దక్షిణ ద్రావిడభాషా రూపాలకి మూలరూపంగా *అవన్ ని పునర్నిర్మించ వచ్చు. మధ్యద్రావిడ రూపాలకి మూలరూపం *అవన్త్. తెలుగులోని వాఁడు రూపం దీన్నుంచి వచ్చిందే ఇందులోని *-త్ అనేది తమిళ మలయాళ కన్నడ భాషల్లో లోపించింది. తెలుగులో *అవన్త్>అవన్టు>వాన్టు>వాణ్డు>వాండు>వాఁడు>వాడు గా పరిణామం చెందింది.

తెలుగు, కన్నడ భాషల్లో కనిపించే అత- అనేది *అవన్ నుంచి ఏర్పడింది కాదు.

ప్రథమా బహువచనం యొక్క మూలభాషారూపం *అవర్. తమిళ మలయాళ కన్నడ భాషల్లో అవర్ అనే రూపముంది. దీనికి మరల బహువచన ప్రత్యయమైన -కళ్ చేరి అవర్‌గళ్ అనే రూపం కూడ ఏర్పడింది. ఈ అవర్‌లో రేఫం బహువచన ద్యోతక ప్రత్యయం. వర్ణవ్యత్యయంవల్ల ఇది తెలుగులో వారు గా మారింది. వాండు అనే ఏకవచన రూపంపైన బహువచన'లు' ప్రత్యయం చేరి వాండ్లు అనే రూపం కూడ ఏర్పడింది. అదే వాళ్లుగా సమీకరణం చెందింది.

మహతీ వాచక ప్రథమైక వచనంలో అవళ్ అనే రూపం తమిళ మలయాళ్ కన్నడ భాషల్లో ఉంది ఇందులోని *అళ్ ప్రత్యయం మహతీ వాచకాన్ని బోధిస్తుంది. కన్నడం, తెలుగు భాషల్లో ఆకె, తెలుగులో ఆపె, ఆమె, ఆవిడ, ఆవిడ అనేవి ఉన్నాయి. ఇవన్నీ అర్వాచీన కాలంలో ఏర్పడ్డాయి.

అమహద్వాచక ప్రథమైక వచనం తమిళంలో అదు, అక్తు గాను మలయాళంలో అదు, కన్నడంలో అదు, అత్తు తెలుగులో అది, అద్దిగాను కనిపిస్తుంది. తమిళంలోని అక్తు రూపాన్నిబట్టి దీని మూలభాషా రూపం *అహ్త్ అని ఊహించవచ్చు. ఇందులోని 'హ్' తమిళంలో క్ గాను కన్నడం, తెలుగుల్లో 'త్' గాను కనిపిస్తుంది.

ఇక బహువచనంలో త. అవ్, అవై, మ. అవ, క. అవు. తె. అవి. వీటికి మూలరూపం *అవ్-.

## నిర్దేశ సర్వనామాలు

ఇవి దూరవర్తి (remote) సమీపవర్తి, (proximate) మధ్యవర్తి (intermediate) అని ద్రావిడభాషల్లో మూడు విధాలు. ఈ మూడిటికి మూడు నిర్దేశసర్వనామ ప్రాతిపదికలున్నాయి. అవి *అ, *ఇ, *ఉ అనేవి. వీటిలో 'అ' దూరవర్తి, 'ఇ' సమీపవర్తి, 'ఉ' మధ్యవర్తి. వీటికి సార్వనామికానుబంధాలు చేరి అది, అవి, ఇది, ఇవి మొదలయిన రూపాలేర్పడతాయి. ఈ ప్రాతిపదికలు అన్ని లింగాలలోను, అన్ని వచనాలలోను నామాలకు, సార్వనామికానుబంధాలకు పూర్వం చేరవచ్చు. తెలుగులో 'ఉ' ప్రయోగం విరళం.

'అ'— దూరవర్తి: త అవన్, అవళ్, అవర్, అదు, అవై.
మ. అవన్, అవళ్, అవర్, అదు, అవై /అవ.
క. అవమ్/అవను, అవళ్/అవళు, అవర్/అవరు, అదు,అవు.
తె. వాఁడు, ఆమె, వారు, అది. అవి.

ఇంకా అక్కడ, ఆచోటు, ఆ పుస్తకం, ఆనాడు, ఆవల మొదలయిన పదాల్లోని హ్రస్వదీర్ఘాలయిన అ, ఆ లు దూరవర్తి నిర్దేశసర్వనామ ప్రాతిపదికలే.

'ఇ'—సమీపవర్తి: త.మ. ఇవన్, ఇవళ్, ఇవర్, ఇదు, ఇవై
క. ఇవన్/ఇవను. ఇవళ్/ఇవళు, ఇవర్/ఇవరు, ఇదు,ఇవు.
తె. వీడు, ఈమె, వీరు, ఇది, ఇవి.

ఇక్కడ, ఇచ్చట, ఈనాడు, ఈ పుస్తకం మొదలయిన పదాల్లోని ఇ, ఈ లు సమీపవర్తి నిర్దేశ సర్వనామ ప్రాతిపదికలు.

'ఉ'— మధ్యవర్తి : త. ఉవన్, ఉవళ్, ఉవర్, ఉదు, ఉవై.
క. ఉవమ్, ఉవళ్, ఉవర్, ఉదు, ఉవు.

తెలుగులో 'ఉల్ల' అనే ప్రయోగం మాత్రమే ఉంది. అది కావ్యభాషలో విరళంగా కనిపిస్తుంది. వ్యవహారంలో ఈ మధ్యవర్తి నిర్దేశ సర్వనామం లేదు.

ఉల్ల కాంచన రథముపై నున్నవాఁడు (భారత).
ఉల్ల తెల్లని తురగోత్తమువాలంబు (భారత).

## ఆత్మార్థక సర్వనామాలు

ఇవి అన్ని ద్రావిడభాషలలోను ఉన్నాయి. త.మ. తాన్ 'oneself'; కోడ. తోన్, క. తాన్ 'he, she, it in the reflexive',తుళు. తాను'oneself'; తె. తాను; పర్జి. తాన్, గోండి. తనా (ఇది ప్రథమ పురుషలో మాత్రమే వాడబడే ఆత్మార్థక సర్వనామం), తన్వా 'his own', కుయి. తాను 'him self or her self', కువి. తాను 'self, oneself', కురుఖ్. తాన్ 'him self', మాల్తో. తన్ 'himself, herself, itself';బ్రా. తేన్ 'self, myself, thyself, himself, ourselves'.

ఈ రూపాలను పరిశీలిస్తే వీటి మూలద్రావిడ రూపం *తాన్ అని తెలుస్తుంది. ఆత్మార్థకంలో వాడబడిన ఈ రూపం క్రమంగా కొన్ని భాషలలో ప్రథమ పురుషలో మాత్రమే వాడబడినట్లు కనిపిస్తుంది.

విభక్తి ప్రత్యయం చేరినప్పుడు కనిపించే ద్వితీయాది విభక్త్యంగ రూపం కుయి కాక మిగిలిన భాషలలో తన్- గా కనిపిస్తుంది. కుయిలోమాత్రం దీర్ఘాచ్చుతో తాడన్ అని ఉంది. దీన్నిబట్టి *తన్- అనేది మూలరూపమని చెప్పవచ్చు.

దీనికి బహువచనరూపం కూడ అన్ని ద్రావిడ భాషల్లోను ఉంది. త. తామ్ 'they, themselves, you (hon pl.)', తమర్ 'one's own people'; మ. తామ్ 'themselves', క. తామ్ 'they, themselves, you (hon ); తె. తాము, తమరు, తారు, పర్జి. తామ్ 'they, themselves' మిగిలిన భాషల్లోకూడ ఇదే విధంగా రూపాలు, వాటి అర్థాలు కనిపిస్తాయి.

ఈ రూపాలనుబట్టి వీటి మూలద్రావిడభాషారూపం *తామ్ అని గ్రహించవచ్చు. *తాన్ లోని 'న్' ఏకవచనాన్ని *తామ్‌లోని 'మ్' బహువచనాన్ని సూచిస్తాయి. తెలుగులో తాము అనే రూపంతోపాటు తారు, తమరు లు కూడ ఉన్నాయి. వీటిల్లో బహువచన ప్రత్యయమైన 'మ్' స్థానంలో 'ర్' కనిపిస్తుంది. ఇది కూడ బహువచనద్యోతక ప్రత్యయమే. తమరులోని 'ర్' ప్రత్యయం మాత్రం ప్రాచీనరూపంలోని 'మ్' ప్రత్యయానికి తరువాత చేరింది. ఇదే విధంగా తమిళ మలయాళ భాషల్లో కూడ *మ్ ప్రత్యయానికి తరువాత *కళ్ ప్రత్యయంచేరి ఏర్పడిన తాన్కళ్ అనే రూపం మధ్యమపురుష ఏకవచనంలో మీరు అనే అర్థంలో కనిపిస్తుంది. తమిళ మలయాళ కన్నడ తెలుగుభాషల్లో ఈ పదం (తమరు) మీరు అనే అర్థంలో కంటె ఎక్కువ గౌరవ సూచకంగా వాడబడుతోంది.

దీని ద్వితీయాది విభక్త్యంగ రూపం కుయి కాక మిగిలిన భాషల్లో తమ్- గా కనిపిస్తుంది. కుయిలో మాత్రం దీర్ఘాచ్చుతో కూడి ఉంది. దీన్నిబట్టి *తమ్ అనేది మూల ద్రావిడరూపమని చెప్పవచ్చు.

## ప్రశ్నార్థక సర్వనామాలు

త. యావన్/ఎవన్ 'ఎవడు', యావళ్, యారళ్, ఎవళ్ 'ఎవతె', యార్, యావర్, ఆర్, అవర్, ఎవర్కళ్ 'ఎవరు', యావదు, యాదు, ఎదు 'ఏది', యా, యావై 'ఏవి'.

మ. యావన్/ఏవన్ 'ఎవడు', యావళ్/ఏవళ్ 'ఎవతె', యావర్/ఏవర్/యార్/ఆర్ 'ఎవరు', యా/యాదు/ఏదు/ఏన్ 'ఏది', ఏవ 'ఏవి'.

క. యావను, ఆవమ్, ఆవె 'ఎవడు', యావళు, ఆవళ్ 'ఎవతె', యార్, ఆర్, దారు 'ఎవరు'. ఆవుదు 'ఏది', ఆవువు 'ఏవి'.

తె. ఎవఁడు/ఎవ్వఁడు, ఎవతె, ఎవరితె, ఎవరు, ఏరు, ఏది/ఎది, ఏవి/ఎవ్వి.

ఈ రూపాలనుబట్టి మూలద్రావిడభాషలోని ప్రశ్నార్థక సర్వనామ ధాతువు *యా-, *ఏ-/*ఎ- లుగా ఉండి వుంటుందని గ్రహించవచ్చు.

ఈ ధాతువులను నామాలకు చేర్చటంవల్ల ఆయా భాషల్లో ప్రశ్నార్థక రూపాలు ఏర్పడతాయి.

## సంఖ్యావాచకాలు

భాషల ఏకకుటుంబితను స్థాపించటంలో ప్రాథమిక పదజాలానికి చెందిన సంఖ్యావాచకాలు కూడ తోడ్పడతాయి. ద్రావిడ భాషలలో సంఖ్యావాచకాలు పరిమితంగా ఉంటాయి. ఒకటి నుంచి పది వరకు, మరల పది పది చొప్పున నూరు వరకు మాత్రం ఉన్నాయి. మిగిలినవి సంస్కృత ప్రాకృతాల నుంచి ఎరవు తెచ్చుకొన్న రూపాలు.

దేశీయములయిన ఈ సంఖ్యావాచక పదాలకు కూడ ఎరవు తెచ్చిన పర్యాయ రూపాలు కొన్ని భాషలలో విరళంగాను, కొన్నిటిలో బహుళంగాను ప్రయుక్తమవుతున్నాయి. దక్షిణ, మధ్య ద్రావిడభాషలలో సాధారణంగా అన్నీ దేశీయ పదాలే. ఉత్తర ద్రావిడభాషలలో మూడు వరకు మాత్రమే దేశీయ పదాలు. మిగిలినవి అన్యదేశ్యాలు వాడబడుతున్నాయి. దీన్నిబట్టి నిసర్గమైన సంఖ్యావాచక రూపాలను దక్షిణ, మధ్య ద్రావిడ భాషలు నిలుపుకొన్నాయని తెలుస్తుంది.

ఒక్కొక్క సంఖ్యావాచక రూపాన్ని తీసుకొని పరిశీలిస్తే మూలభాషా రూపం సోదర ద్రావిడభాషలలో ఏ విధంగా పరిణామాన్ని పొందిందో తెలుస్తుంది. ఈ సందర్భంలో ముఖ్య ద్రావిడభాషలు నాల్గింటి నుంచి మాత్రమే రూపాలను చూపించటం జరుగుతుంది. అవసరమైనప్పుడు అనాగరక ద్రావిడభాషలలోని రూపాలు కూడ ఇవ్వబడతాయి.

1. త. ఒరు, ఓర్, ఒన఼్ఱు, ఒణ్డు
మ. ఒరు, ఓర్, ఒన్ను
క. ఒర్, ఓర్, ఒన్దు
తె. ఒక, ఒణ్డు, ఒకటి, ఒరు(డు)

ఈ సంఖ్యావాచకానికి మూలద్రావిడ భాషారూపాలుగా *ఒన్త్తు, *ఒర్/*ఓర్, *ఒక్- లు పునర్నిర్మించబడ్డాయి.

పై నాలుగు భాషలలోను ఇంచుమించు ఒకే విధమయిన రూపాలున్నాయి. ఇవన్నీ కూడ పైన ఇచ్చిన మూలరూపాల నుంచి ద్రావిడ భాషాధ్వని పరిణామానికి అనుగుణమైన మార్పులను పొంది ఏర్పడ్డవే. తమిళ, మలయాళ భాషల్లోని ఒరు, ఓర్ రూపాలూ, కన్నడంలోని ఒర్, ఓర్ రూపాలూ మూల భాషారూపమైన *ఒర్/*ఓర్ నుంచి వచ్చినవి. తమిళంలోని ఒన఼్ఱు అనేది *ఒన్త్తు నుంచి ఏర్పడింది. తమిళంలోని ఒణ్డు, మలయాళంలోని ఒన్ను,

కన్నడంలోని ఒన్దు, తెలుగులోని ఒణ్డు లకు కూడ ఇదే మూలరూపం. ఇక తెలుగులోని ఒక అనే రూపం *ఒక్ నుంచి వచ్చింది. ఈ ఒక కి ఉపవిభక్తియైన 'టి' చేరి ఒకటి రూపం ఏర్పడింది.

కొండభాషలో ఒర్ అనీ కుయిలో రొ అనీ, కువిలో రా, రో అనీ రూపాలు కనిపిస్తున్నాయి. దీన్నిబట్టి కుయి, కువి ఉపవర్గం నుంచి కొండ భాష విడిపోయిన తరువాత ఆ భాషల్లో వర్ణ వ్యత్యయం జరిగిందనీ అప్పుడు ఒర్>రొ గా మారిందనీ తెలుస్తుంది.

పర్జి, కొలామి నాయికి ఉపవర్గంలో *ఒక్ నుంచి ఏర్పడిన రూపాలు మాత్రమే ఉన్నాయి. తెలుగులో మాత్రం *ఒన్‌తు, *ఒక్ ల నుంచి ఏర్పడిన రూపాలుండటం గమనార్హం.

| | | |
|---|---|---|
| 2. | త. | ఇరణ్డు, రెణ్డు |
| | మ. | రణ్డు |
| | క. | ఎరడు, ఎర్డు |
| | తె. | రెణ్డు |

దీనికి మూల ద్రావిడరూపం *ఇరన్‌త్. దీన్నుంచే తమిళంలోని ఇరణ్డు ఏర్పడింది. వర్ణ వ్యత్యయం జరిగి ఇది రెణ్డుగా మారింది. మలయాళంలో పదాది అచ్చు లోపించింది. మూలద్రావిడ రూపంలోని 'ఇ' కన్నడం, తెలుగు భాషల్లో 'ఎ'గా మారింది. కన్నడంలో ఇర్>ఎర్ గా మారటంవల్ల ఇరండు>ఎరండు అయ్యి అను నాసికం లోపించి ఎరడు రూపమూ, మధ్యలోని అచ్చు లోపించి ఎర్డు రూపమూ ఏర్పడ్డాయి. తెలుగులోని రెణ్డు వర్ణ వ్యత్యయంవల్ల వచ్చిన రూపం. *ఇవన్‌త్>ఇరణ్డు>ఎరణ్డు>రెణ్డు గా పరిణామం చెందింది.

ఈ సంఖ్యావాచకం యొక్క విశేషణ రూపం *ఇర్/*ఈర్. చాల భాషల్లో ఇదే కనిపిస్తుంది. తమిళంలో ఇరువర్ అనీ, కన్నడంలో ఇబ్బర్ అనీ, తెలుగులో ఇరువురు, ఇద్దరు అనీ 'ఇర్' తో కూడిన రూపాలున్నాయి. తమిళంలో ఇరునూఱు కన్నడంలోను, తెలుగులోను ఇన్నూఱు అనే రూపాలు కనిపిస్తాయి. మూల రూపంలోని రేఫం కన్నడం, తెలుగుల్లో దానికి పరమయిన హల్లుతో సమీకరణం చెందిందని స్పష్టమవుతుంది. ఇంకా తెలుగులో ఇరువది, ఈరేడు అనే సమాసఘటిత రూపాలున్నాయి. వీటిల్లో ఇరు/ఈర్ అనే మూలరూపం నిలిచిఉంది.

తెలుగు, కుయి, కువి, కొండ భాషల్లో నామరూపాలు వర్ణవ్యత్యయం జరిగినవి మాత్రమే ఉన్నాయి. తె. రెండు, కుయి. రీ, కువి. రీ, కొండ. రుండి.

| | | |
|---|---|---|
| 3. | త. | మూన్ఱు, మూణు |
| | మ. | మూన్ను |
| | క. | మూఱు |
| | తె. | మూఁడు, మూడు |

ఈ సంఖ్యావాచకానికి మూలరూపం *మూన్ఱ్-. విశేషణ రూపం ము*/*మూ మలయాళంలో వర్ణసమీకరణం జరిగింది. కన్నడంలో అనునాసికం లోపించింది. తెలుగులో *మూన్ఱ్>మూన్డ్>మూణ్డ్>మూణ్డు>మూండు>మూఁడు>మూడు గా పరిణామం చెందింది.

సమాసాల్లో దీని విశేషణరూపం ము/మూ గా కనిపిస్తుంది. తమిళ, మలయాళాల్లో మూవర్ (ముగ్గురు), ముప్పదు (30), మున్నూఱు (300) అనీ, కన్నడంలో మూవర్ (ముగ్గురు), మూవత్తు (30), మున్నూఱు (300) అనీ, తెలుగులో మూగురు, మూవురు, ముగ్గురు, ముప్పది, ముప్పై, మున్నూఱు అనీ హ్రస్వ దీర్ఘాచ్చులతో కూడిన రూపాలున్నాయి.

4. త. నాల్, నాలు, నాన్కు, నాల్కు
మ. నాల్, నాలు, నాన్కు, నాన్
క. నాల్(ఉ), నాల్(ఉ)కు, నాకు, నా
తె. నాలుగు, నాలువు.

దీనికి *నాల్-క్, *నాల్-న్క్, *నాన్-క్ అనేవి మూలరూపాలు. విశేషణ రూపాలు *నాల్/*నల్ అనేవి. ఈ సంఖ్యావాచకంలో నాల్-/నాన్- అనేది మూలధాతువు. దీనికి 'క్' అనేది ప్రత్యయంగా చేరింది. త. నాఱ్పదు, నాప్పదు, మ. నాల్పదు, క. నాల్వత్తు, నల్వత్తు, తె. నలుబది, నలువది, నలభై ; త.మ. నానూఱు, క. నాల్నూఱు, నానూఱు, నన్నూఱు, తె. నన్నూఱు మొదలైన విశేషణ రూపాలు కనిపిస్తున్నాయి. తమిళంలోని నాప్పదు (నాల్+పదు), కన్నడం తెలుగులలోని నన్నూఱు (నల్+నూఱు) వంటివి సమీకరణంవల్ల ఏర్పడిన రూపాలు.

5. త. ఐద్దు, అంజు
మ. అంజు
క. అయ్దు, అయిదు
తె. అయిదు, ఏను.

ఈ సంఖ్యావాచకానికి మూలరూపాలు *చయ్-న్త్, *చయ్-న్క్ అనేవి. దక్షిణ ద్రావిడభాషల్లోని రూపాల్లో పదాది *చ- వర్ణం కనిపించదు. తెలుగులోనూ లేదు. కాని పరిశీలిస్తే కొన్ని మధ్యద్రావిడ భాషారూపాల్లో కనిపిస్తుంది. మూలద్రావిడభాషా రూపంలో ఈ సంఖ్యావాచకానికీ పదాదిన *చ- వర్ణం ఉండివుంటుందని ఊహించి దాన్ని పునర్నిర్మించటానికి కారణం ఈ మధ్యద్రావిడ భాషారూపాలే. దక్షిణ ద్రావిడభాషలన్నిటిలోను ఇది లోపించింది. కాబట్టి దక్షిణ శాఖ విడిపోయిన నాటికే ఆయా భాషల్లో ఈ పదాది *చ- వర్ణం లోపించిందని చెప్పవచ్చు. కాబట్టి దక్షిణ ద్రావిడ భాషలకు మూలరూపంగా *అయ్-న్త్‌ని పునర్నిర్మించవచ్చు.

తమిళ మలయాళ భాషల్లో *అయ్‌న్‌త్‌లోని 'య్' క్రమంగా లోపించింది. అందువల్ల *అయ్‌న్‌త్>అన్‌త్ గా మారి తరువాత త్>చ గా పరిణామం చెందటంవల్ల అన్‌చ్>అంజు గా పరిణతరూపం సిద్ధించింది. తెలుగులో *అయ్-న్>ఏనుగా మారింది. *అయ్‌న్‌త్>అయ్‌న్‌ద్<అయిన్‌ద్>అయిందు>అయిదు అనే రూపం కూడ తెలుగు, కన్నడ భాషల్లో ఉంది. ఇది మూలద్రావిడంలోని *చయ్-న్‌త్ నుంచి ఏర్పడిందే.

కొలామిలో సెగుర్ (అయిదుగురు), పర్జిలో చేవిర్ (అయిదుగురు పురుషులు), చెయల్ (అయిదుగురు స్త్రీలు), చేదుక్ (అయిదు వస్తువులు), గోండిలో సైయున్‌గ్ (అయిదు), కుయిలో సెంగి (అయిదు) అనే రూపాలు కనిపిస్తున్నాయి. వీటిల్లో పదాదిన చ/స ను గమనించగలం. మూలద్రావిడ పదంలోని *చ- వర్ణం ఈ భాషారూపాల్లో నిలిచి ఉంది. మూల భాషా రూపమయిన *చయ్-న్‌క్>సెయ్‌న్‌గ్>సిన్‌గ్>సింగి గా కుయిలో ఏర్పండిదని (అయ్>ఎయ్>ఇ) చెప్పవచ్చు

విశేషణ రూపాలు త. ఐమ్బదు, అమ్బదు (50), ఐవర్ (అయిదుగురు), మ. అంబదు (50), ఐవర్ (అయిదుగురు), క. అయ్‌వత్తు (50), అయ్‌వర్, అయ్‌బరు (అయిదుగ్గురు), తె. అయిదుగురు; ఏగురు, ఏవురు, ఏబది; యాభై అని తమిళ, మలయాళ, కన్నడ భాషల్లో అయ్- తో కూడిన రూపాలూ, తెలుగులో అయ్- తోను ఎ- తోను కూడిన రూపాలు కనిపిస్తాయి. దక్షిణద్రావిడ భాషల్లో అయ్- మాత్రమే విశేషణ రూపం. మధ్యద్రావిడ భాషల్లో అది 'ఏ' గా మారుతుంది గాబట్టి తెలుగులో రెండురకాల రూపాలు కనిపిస్తాయి.

6. త. ఆఱు
మ. ఆఱు
క. ఆఱు
తె. ఆఱు

దీనికి మూల భాషారూపం *చాత్. పదాదిన చ- వర్ణం దక్షిణద్రావిడ భాషల్లోను, తెలుగులోను, మిగిలిన మధ్యద్రావిడభాషల్లోను లేకపోయినా గోండిలో సారుంగ్ (ఆరు) అనీ, కుయిలో సజ్‌గి (ఆరు) అనీ రూపాలుండటం వల్ల మూలద్రావిడభాషలో ఇది *చ- కారాది రూపమని నిర్ణయించవలసి వస్తుంది.

దక్షిణ ద్రావిడ భాషల్లో పదాది *చ- వర్ణం లోపించి *త్>ఱ్ గా మారి *చాత్>ఆఱు రూపమేర్పడింది. తెలుగులోనూ ఇంతే. పైన చెప్పిన మధ్య ద్రావిడ భాషల్లో మూలపదంలోని *చ- వర్ణం స- గా మారి నిలిచి ఉంది. కుయిలో త్>జ్ గా మారింది.

విశేషణ రూపాలు త.మ. అఱుపదు (60), అఱునూఱు (600), ఆఱువర్ (ఆరుగురు), అఱువత్తు, ఆఱవత్తు (60), అఱునూరు ఆఱునూఱు (600), అఱువర్, ఆర్వరు (ఆరుగురు), తె. ఆఱుగురు, ఆఱువురు, అఱువది, అరవై అని తమిళ మలయాళ భాషల్లో అఱ్-, కన్నడం, తెలుగుల్లో అఱ్-, ఆఱ్- కనిపిస్తాయి.

7. త. ఏఱు
మ. ఏఱు
క. ఏఱు, ఏళు
తె. ఏడు.

దీనికి మూలరూపం *ఏఱ్. ఇందులోని *ఱ వర్ణం కొన్ని భాషల్లో మార్పుని పొందింది. తమిళ మలయాళాల్లో ఇది ఱ గానే ఉంది. కన్నడంలో ఱ గాను, ళ గాను కనిపిస్తుంది తెలుగులో ‘డ’ గా మారింది. ఈ మార్పు ద్రావిడ భాషా ధ్వని పరిణామానికి అనుగుణమైనదే.

విశేషణ రూపాలు తమిళ మలయాళాల్లో ఎఱుపదు (70), ఎఱునూఱు (700), ఎఱువర్ (ఏడుగురు) అని హ్రస్వాచ్చుతోను, కన్నడంలో ఏఱ్పత్తు, ఎప్పత్తు (70), ఏఱునూఱు, ఎళ్నూఱు (700), ఏఱ్బర్, ఏఱ్వరు (ఏడుగురు), తెలుగులో ఏడుగురు, ఏణ్నూఱు, డెబ్బది, డెబ్బై, డబ్బై అని హ్రస్వాచ్చుతోను, దీర్ఘాచ్చుతోను కూడిన రూపాలు కనిపిస్తాయి. వీటిల్లో ఎప్పత్తు, ఏణ్నూఱు రూపాల్లో వర్ణ సమీకరణం జరిగింది. ఎఱ్ + పత్తు>ఎప్పత్తు; ఏఱ్ + నూఱు> ఏణ్నూఱు. డెబ్బది అనే రూపం ఎఱ్ + పది>ఱె + పది>డెపది>డెబ్బది అనే విధంగా వర్ణవ్యత్యయం జరగటంవల్ల ఏర్పడింది. ఈ విధంగా వర్ణవ్యత్యయం జరిగినప్పుడు సాధారణంగా తెలుగులో *ఱ వర్ణం ‘డ’గా మారి తరువాత ‘ద’గా మారుతుంది. (అఱగు>ఱాగు>డాగు>దాగు), కాని ఇక్కడ మాత్రం ‘ద’ కారంగా మారలేదు. ఇది అపవాదం.

ఇంకా తెలుగులో ఈరేడు, ముయ్యేడు అనే సమాస రూపాలూ ఉన్నాయి. ప్రాచీన తెలుగు శాసనాల్లో ఏఱ్ రూపం కనిపిస్తుంది. ఏఱువేలు వంటి రూపాలున్నాయి.

8. త. ఎట్టు
మ. ఎట్టు
క. ఎణ్టు
తె. ఎనిమిది

ఈ సంఖ్యావాచకానికి మూలరూపం *ఎణ్-త్. ఇందులో ఎణ్- అనేది ధాతువు. మిగిలినది ప్రత్యయం. తమిళ మలయాళాల్లో *ఎణ్-త్>ఎణ్-టు (ణ్ మూర్ధన్యం కావటంవల్ల తరువాతి ‘త్’ కూడ మూర్ధన్యత్వాన్ని పొందింది) ఎట్టు గా వర్ణ సమీకరణం జరిగింది. కన్నడంలో *ఎణ్-త్>ఎణ్-టు గా

మారింది. తెలుగులో *ఎణ్ అనే మూలధాతువు 'ఎన్' గా మారింది. దీనికి 'మిది' చేరింది. ఎన్+మిది>ఎనిమిది అయింది. ఈ 'మిది' తొమ్మిదిలోని 'మిది' సామ్యంవల్ల ఇక్కడ వచ్చి చేరింది. ఇది అనావశ్యకభాగం.

విశేషణ రూపాల్లో కూడ ఎణ్- మాత్రమే ఉంది. తమిళ మలయాళాల్లో ఎణ్-పదు (80), ఎణ్ణూరు (800), ఎణ్మర్ (ఎనిమిది మంది), కన్నడంలో ఎమ్-బత్తు (80), తెలుగులో ఎనమండ్రు, ఎనుబది, ఎనభై, ఎనమన్నూఱు అనే రూపాలున్నాయి. కన్నడంలోని ఎమ్-బత్తు అనే చోట మూలరూపంలోని 'ణ్' కి ఓష్ఠ్యమైన 'బ' పరమైంది గాబట్టి ఓష్ఠ్యాను నాసికంగా (మ గా) మారి ఎణ్-పత్తు>ఎమ్-బత్తు అయింది.

9. త. ఒన్‌బదు, ఒమ్‌బదు, ఒమ్‌బోదు
మ. ఒమ్‌బదు
క. ఒమ్‌బత్తు, ఒమ్‌భత్తు
తె. తొమ్మిది

తొమ్మిదిలోని 'మిది' ఈ సంఖ్యావాచకంలోని భాగమే. ఇందులోని చివరి భాగమయిన పదు, పత్తు, మిది అనేది 'పది' సంఖ్యావాచకం నుంచి వచ్చింది. దాని అర్థం కూడ పది అనే. తమిళ మలయాళ కన్నడ భాషల్లో పదు, పత్తుగా ఇది కనిపిస్తుంది. తెలుగులో మాత్రం 'మిది'గా మారింది.

తమిళంలోని ఒన్‌పదు రూపంలోని 'ఒన్' అనేది పూర్వసర్గ అన వచ్చు. మలయాళంలోను, కన్నడంలోను ఇది 'ఒమ్' గా ఉంది. ఈ ఒన్, ఒమ్ లు మూలద్రావిడ రూపమైన *ఒన్‌తులోని మొదటి భాగమయిన 'ఒన్'తో సమానం. అప్పుడు ఒన్‌పదు, ఒమ్‌బదు రూపాలకు పదికి ఒకటి పూర్వము అనగా తక్కువ అని అర్థం. 'పదునొకండు' అనే తెలుగు పదానికి పదికి ఒకటి కలపాలని అర్థం వస్తుంది. అట్లాగే ఒన్‌పదు అన్నప్పుడు పదికి ఒకటి తక్కువ అని అర్థం వస్తుంది. కాబట్టి తెలుగులో కూడ ఒమ్‌బది అని కాని, తొంబది అని కాని ఈ తొమ్మిది అనే అర్థంలో ఉండాలి. కాని 'తొమ్మిది' అని కనిపిస్తుంది. ఎట్లాగంటే తొల్+పది అంటే పదికి తొలిది, పూర్వపుది అని అర్థం. తొల్ పది>తొన్‌పది (ల, న ల వ్యత్యయం)>తొన్పది>తొమ్పది (వర్గానునాసికం)> తొమ్బది (పరుషానికి సరళం)>తొమ్మది (సమీకరణం)>తొమ్మిది(స్వరసమత) అని దీని పరిణామక్రమం.

తమిళ మలయాళ భాషల్లో తొణ్ణూరు (90), తొళ్ళాయిరమ్ (900) అని సమాస రూపాలున్నాయి. నూటికి పూర్వపుదనీ, వెయ్యికి పూర్వపుదనీ వీటిలోని మొదటి పదానికి అర్థం. దీనివిలువ దీనికి పరమయ్యే పదంపైన ఆధారపడి ఉంటుంది.

కన్నడంలో తొంబత్తు (90), తెలుగులో తొమ్మండుగురు, [illegible] తొంభై, తొమ్మన్నూఱు వంటి రూపాల్లో 'తొమ్' [illegible] విశేషణంగా కనిపిస్తుంది.

10. త. పత్తు, పక్తు
మ. పత్తు, పదు
క. పత్తు
తె. పది.

దీనికి మూలభాషారూపం *పహ్త్. ఈ సంఖ్యావాచకంలో ప- కి పరంగా ఒక హల్లు మూలద్రావిడభాషలో ఉండివుంటుందని తమిళభాషారూపాన్ని బట్టి ఊహించవచ్చు. ఆ హల్లుని 'హ్' గా సూచించటం జరిగింది. అది తమిళంలో 'క్' గాను, మిగిలినచోట్ల 'త్' గాను కనిపిస్తుంది.

విశేషణ రూపాల్లో పత్- గాను, పన్- గాను ఇది కనిపిస్తుంది. తమిళంలో పదినాలు (14), పదినాయిరమ్ (14), పదినాయిరమ్ (పదివేలు), పన్నిరండు (12), ఇరుపదు, ఇరువదు (20), ముప్పదు (30), నాప్పదు (40), పదిన్మర్ (పదిమంది). మలయాళంలోను, కన్నడంలోను కూడ ఈ విధంగానే ఉంది. తెలుగులో పదకొండు, పన్నెండు, పంద్రెండు, ఇరువది, ముప్పది, ఏబది, డెబ్బది అనేచోట్ల పద్, పన్, పణ్, వది, పది, బది అనే రూపాలు కనిపిస్తాయి. ఇవన్నీకూడ పదియొక్క రూపాంతరాలే.

తమిళంలోని పదినాయిరమ్ అనేచోట పదిన్ అనే విశేషణరూపం పదు+ఇన్ అనే ప్రత్యయంచేరి ఏర్పడింది. ఈ ప్రత్యయం నామాన్ని విశేషణంగా మారుస్తోంది. ఇట్లాగే పదిన్మర్ (పదిమంది) కూడ. పన్నిరండు లోని 'పన్' కూడ పైన చెప్పిన పదిన్ యొక్క రూపాంతరమే. ఇందులోని 'న్' సముచ్చయార్థకం కూడ కావచ్చు.

తెలుగులో 'పది' చాల భేదాలను పొందుతుంది. ఎనిమిది, తొమ్మిదిల్లో 'మిది' గా మారింది. పదకొండు నుంచి పందొమ్మిది వరకు గల సమాస రూపాల్లో పంద్రెండు, పన్నెండు, పందొమ్మిదిల్లో మాత్రం పన్- గాను, మిగిలిన చోట్ల పద్-గాను కనిపిస్తుంది.

'పది' అనేది రెండోపదంగా వచ్చే సమాసాల్లో ఇది వై (ఇరవై) గాను, వ్ఫై (ముప్ఫై) గాను, భై (నలభై) గాను, బ్భై (డబ్భై) గాను కనిపిస్తుంది. పది>పయి>పయ్>పై గా పరిణామాన్ని పొందింది. ప>వ గా మారి 'వై' ప>బ గా మారి 'బై' ఏర్పడ్డాయి. ఈ రూపాల్లో మహాప్రాణధ్వని ఉంది. ఇది పద్దెనిమిదిలో కూడ వినిపిస్తుంది. ఇది శాసనకాలంలో కూడ అక్కడక్కడ కనిపిస్తుంది. ప్రామాణికోచ్చారణమని భ్రమపడటంవల్ల వ్యవహర్తలు దీన్ని ఆదరించి ఉండవచ్చు. ఇది అర్థరహితమయింది. ఇంక పదిహేను, పదహారు, పదిహేడులలో వచ్చిచేరిన 'హ' కారమూ ఇటువంటిదే.

త. నూఱు
మ. నూఱు

క. నూఱు

తె. నూఱు

దీని మూలరూపం *నూత్. మూల రూపంలోని *త్ పై అన్ని భాషల్లోను 'ఱు' గా మారింది.

తమిళ మలయాళాల్లో నూఱ్ఱువర్, కన్నడంలో నూర్వర్ (100 మంది) అని విశేషణ రూపాల్లో కూడ నూర్ అనేదే ఉంది. తెలుగులో నూఱుగురు, నూఱువురు అన్నచోట్ల నూఱు కనిపిస్తుంది గాని ప్రత్యయం చేరేటప్పుడు నూట- అని ఉంటుంది. నూటికి, నూటిలో. సమాసాల్లోను నూట ఒకటి, నూటపది అని నూట- రూపమే వుంది. వీటిల్లో మూలరూపంలోని *త్ వర్ణం మూర్ధన్యత్వం పొంది కనిపిస్తుంది. కాబట్టి *త్ వర్ణాన్ని పునర్నిర్మించటానికి వీలయింది దీని ద్వితీయాద్యంగరూపం కొడగులో నుఇట్-, తుళులో నూత-, తెలుగులో నూట-. ఈ రూపాలనుబట్టి మూలభాషలోని *త్ వర్ణమే ఇక్కడ నిలిచి ఉన్నదనీ ఇది ఔపవిభక్తిక ప్రత్యయం కాదనీ గ్రహించాలి.

తెలుగులోని 'వంద' పదానికి సమానపదం ఏ ద్రావిడ భాషలోను కనపడదు. ప్రాచీన తెలుగు సాహిత్యంలో దీనికి ప్రయోగాలు లేవు. అర్వాచీనులు దీన్ని ప్రయోగించారు.

1000. త. ఆయిరమ్

మ. ఆయిరమ్

క. సావిర, సాయిర, సాసిర్, సాసిర, సార, సాస్ర

తె. వేయి, వే-

తమిళ మలయాళ కన్నడ భాషల్లోని రూపాలు సంస్కృత సహస్ర శబ్దం నుంచి ఏర్పడ్డవి.

క. సాసిర, సాస్ర<సం. సహస్ర.

త.మ. ఆయిరమ్<*సాయిర<*సాసిర- <సం. సహస్ర.

తెలుగులోని 'వేయి' పదానికి సమానపదం మిగిలిన ద్రావిడ భాషల్లో కనపడదు. దీనికి బహువచన రూపం 'వేలు'. వేనవేలు అనే పదం కూడ తెలుగు భాషలో ఉంది. చాలవేలు అని దీనికి అర్థం. వేలు + వేలు అని ప్రసిద్ధ తెలుగు నిఘంటువు శబ్దరత్నాకరం రూపించింది. కాని దీనివల్ల వేనవేలు శబ్దంలోని అనునాసికం ఏ విధంగా వచ్చిందో చెప్పలేం. తెలుగు భాషలో చేను + లు = చేలు, పేను + లు = పేలు, మీను + లు = మీలు అనే విధంగా 'ను' వర్ణాంత పదాలు కొన్ని బహువచనంలో 'ను' వర్ణాన్ని లోపింపజేసుకోవటం జరుగుతుంది. ఇదే విధంగా వేను + లు = వేలు అయిందని ఊహించవచ్చు. అప్పుడు వేయిని కాక 'వేను' ని ఏకవచన రూపంగా అంగీకరించాలి. వేను + వేలు > వేనువేలు > వేన వేలు అవుతుంది.

తమిళంలో వేన్ అనే పదానికి అధికమనే అర్థముంది ఇది కూడ ఈ వాదానికి ఉపబలకమవుతోంది. అధికమయిన (చాల) వేలు అనే అర్థంలోనే వేన వేలు అనే రూపం ఏర్పడింది. ఈ సమాసంలోనే 'వేన్' అనే ఏకవచన రూపం నిలిచి ఉంది. ఇక వేను వేయిగా మారటానికి సామ్యం కారణమని చెప్పాలి. తాయి- తాలు, రేయి-రేలు, వ్రాయి-వ్రాలు వంటి శబ్దాల సామ్యంవలన వేలు కి ఏకవచన రూపం వేయిగా సృష్టించబడి వుంటుంది.

## విశేషణాలు

ద్రావిడ భాషల్లో విశేష్యమే మరొక విశేష్యానికి పూర్వం చేరటంవల్ల విశేషణత్వాన్ని పొందుతుంది. ఈ విశేషణాల నిర్మాణంలో ద్రావిడ భాషలకు, ఆర్య భాషలకు సంబంధం కనపడదు. విశేషణ విశేష్యాలకు లింగవచన విభక్తుల్లో ఏకరూపత ఉండాలన్న నియమం ఆర్యభాషల్లో ఉంది. ఉదా: ఉత్తమః పురుషః, ఉత్తమా స్త్రీ, ఉత్తమం ఫలం అని ఉంటుంది. ద్రావిడ భాషల్లో ఈ విధమయిన నియమం లేదు. "విశేష్యంబునకుం బోలె విశేషణములకు లింగవిభక్తి వచనంబు లగు" నని సూరి సూత్రించటం సంస్కృతానుకరణమే.

ఈ భాషల్లో విశేషణాలు కొన్ని విధాలుగా ఏర్పడతాయి. ఆ పద్ధతిని పరిశీలిద్దాం.

1. నామవాచకాలు విశేష్యానికి పూర్వం రావటంవల్ల మాత్రమే విశేషణాలవుతాయి.

త. సెందామరై 'ఎర్రతామర', పెరుమగళ్ 'పెద్దకూతురు'.
మ. సెందామరై 'ఎర్రతామర' పెరుమగన్ 'పెద్దకొడుకు'.
క. కెందావరె 'ఎర్రతామర', పెరుమగళ్ 'పెద్దకూతురు'.
తె. తెల్ల(ని) పువ్వు, ఒప్పుమాట, తప్పుపని, నిండుకుండ, వెలుగు బాట.

2 ధాతుగతమైన చివరి హల్లుని ద్విరుక్తం చెయ్యటంవల్ల తమిళ మలయాళ భాషల్లో నామం విశేషణమవుతుంది. తెలుగులో 'ము' అంతమందు గల నామాలకు 'పు' ఆదేశంగా వచ్చి విశేషణాలవుతాయి.

త.మ. నాడు 'దేశం' : నాట్టార్ 'దేశంలోని ప్రజలు';
ఇరుంబు 'ఇనుము' : ఇరుప్పుక్కోల్ 'ఇనుపకోల'
తె. వేపచెట్టు, ఇనుపకోల.

3. ధాతువుకి 'ఇయ' చేరటంవల్ల తమిళ మలయాళ భాషల్లో నామం విశేషణమవుతుంది.

త.మ. పెరు 'పెద్ద' : పెరియార్ 'పెద్దవారు, రాజులు'.
సిఱు 'చిన్న' : సిఱియవన్ 'చిన్నవాడు'.

4. అయిన అనే అర్థాన్నిచ్చే అగుధాతుజన్య భూతార్థక రూపమయిన 'ఆన' ను నామానికి చేర్చటంవల్ల తమిళంలోను, 'ఆద'ను చేర్చటంవల్ల కన్నడం

లోను, 'అయిన, అగు' లను చేర్చటంవల్ల తెలుగులోను నామం విశేషణం అవుతుంది.

త. ఉయర్ 'ఎత్తు', ఉయర్‌వాన 'ఎత్తయిన'

క. కెట్ట 'చెడ్డ'; కెట్టాద 'చెడ్డదయిన', హొసదాద 'కొత్తదైన'

తె. అందమయిన, శుభమగు, చల్లనగు.

5. ధాతుజ విశేషణం నామానికి పూర్వం రావటంవల్ల అది విశేషణం అవుతుంది.

త.మ.క. సెయ్దవళ్ 'చేసిన ఆమె'

తె. వచ్చినవాడు రాముడు.

6. పరిమాణ వాచకాలయిన కెలవు (కొన్ని), పలవు (పలు) అనేవి నామాలకు చేరి విశేషణాలవుతాయి.

త. పలవిదం 'చాలవిధాలు'

క. కెలవు మాతుగళు 'కొన్నిమాటలు'

7. సంఖ్యావాచకాలు నామాలకు పూర్వం చేర్చబడినప్పుడు విశేషణాలవుతాయి.

త.మ. ఇరండు మరం/మరంగళ్ 'రెండుచెట్లు'

క. ఎరడుమర 'రెండుచెట్లు'

తె. రెండు పుస్తకాలు.

8. నిర్దేశ సర్వనామాంగాలయిన అ, ఇ లను, నా, నీ, తన మొదలయిన వాటిని నామాలకు పూర్వం చేర్చటంవల్ల విశేషణాలవుతాయి.

త.మ.క. ఎన్‌పేర్ 'నాపేరు', నిన్‌పేర్ 'నీపేరు', తన్‌కాల్ 'తనకాలు'

తె. ఆమాట, ఈ దేశం.

9. తమిళంలో 'ఉళ్ల' అనేది, తెలుగులో గలిగిన/కల అనేది నామానికి చేరటంవల్ల ఆ నామం విశేషణం అవుతుంది.

త. బుద్ది ఉళ్ల 'బుద్ధిఉన్న, బుద్ధికలిగిన'
నీది ఉళ్ల 'నీతి కలిగి ఉన్న'

తె. బుద్ధిగల, నీతిగల, నేర్పుగల (వాడు).

10. ఔపవిభక్తిక ప్రత్యయాలయిన ఇ, త్, ట్, అ లు చేరటంవల్ల నామం విశేషణం అవుతుంది.

త. కుళమ్ + మీన్ = కుళత్తు మీన్ 'చెరువుచేప; కాదు + ఇల్ = కాట్టిల్ 'అడవిలో' మణ్ + కుడమ్ = మట్కుడమ్ 'మట్టికుండ'

మ. మరమ్ + వేర్ = మరత్తు వేర్ 'చెట్టువేరు'

క. మరమ్ + బేరు = మరదబేరు 'చెట్టువేరు'

తె. క్రింద + ఇ < క్రింది, మీద + ఇ > మీది, నూతినీరు, ఏటిమట్టి, ఆలమంద.

## క్రియ

క్రియ అంటే వ్యాపారం, పని. వ్యాపారాన్ని బోధించే పదాలు క్రియలు. ద్రావిడ భాషల్లో క్రియలు సమాపకాలు, అసమాపకాలు అని రెండు రకాలు. అసమాపక క్రియలు వాక్యంలో ఎన్నయినా ఉండవచ్చు. వీటి చివర పురుష బోధక ప్రత్యయం చేరదు. సమాపక క్రియల చివర పురుషబోధక ప్రత్యయ ముంటుంది. ఈ సమాపక క్రియతో వాక్యం సమాప్తమవుతుంది.

అసమాపక క్రియలు నామాకాంక్ష అసమాపకాలు, క్రియాకాంక్ష అస మాపకాలు అని రెండురకాలు. నామాకాంక్ష అసమాపకాలనే క్రియాజన్య విశేష ణాలు లేక ధాతుజ విశేషణాలు అంటారు. ఈ ధాతుజ విశేషణాలకి పరంగా నామం వస్తుంది. ఇవి నామాన్ని ఆకాంక్షిస్తాయన్న మాట. కాబట్టి ఇవి నామాకాంక్ష అసమాపక క్రియలు. 'చేసిన రాముడు' అన్నప్పుడు 'చేసిన' అనేది నామాకాంక్ష అసమాపక క్రియ. ఇట్లాగే చేస్తున్న, చేసే, చేయని మొదలయిన రూపాలు కూడ నామాకాంక్ష అసమాపకాలు. వీటికి పరంగా నామం రావాలి. 'వచ్చినవాడు' మొదలయిన ధాతుజ విశేషణ రూపాలే కాలక్రమంలో క్రియారూపాలుగా పరి ణామం చెందాయి. మిగిలిన ద్రావిడభాషల్లోను ఈ విధంగానే కనిపిస్తుంది.

క్రియాకాంక్ష అసమాపకాలనేక్త్వార్థక రూపాలంటారు వండి, తిని, చేసి, వెళ్లి మొదలయినవి. వీటికి పరంగా క్రియ వస్తుంది వండితిన్నాడు, చేసి వెళ్ళాడు మొదలయినవి. కాబట్టి వీటిని క్రియాకాంక్ష అసమాపకాలంటారు. చేయక, తినక వంటివి వ్యతిరేకక్త్వార్థకరూపాలు.

క్రియాధాతువుకి కాలబోధక ప్రత్యయం, పురుషబోధక ప్రత్యయంచేరి ద్రావిడభాషల్లో క్రియాపదనిర్మాణం ఏర్పడుతుంది. కొన్నిసార్లు అవసరమయిన చోట్ల ధాతువుకి సకర్మకాకర్మక ప్రత్యయాలు, ప్రేరణ ప్రత్యయం, వ్యతిరేకార్థక ప్రత్యయం చేరటం జరుగుతుంది.

## అకర్మక, సకర్మక, ప్రేరణ క్రియలు

క్రియలు సకర్మకాలు, అకర్మకాలు అని రెండు రకాలు. ఈ రెండు రకాల క్రియాధాతువుల్లో భేదమేమీ ఉండదు. ఏ ధాతువు కర్మయొక్క ప్రశ్నను కలిగిస్తుందో అది సకర్మకం. పుస్తకం కొన్నావు అనే వాక్యంలో దేన్నికొన్నావు? అనే ప్రశ్నకి అవకాశముంది కాబట్టి 'కొను' ధాతువు సకర్మకం. కొను, తిను, చూచు, కొట్టువంటివి సకర్మక ధాతువులు ఇవి సహజసిద్ధమైనవి కాబట్టి సిద్ధ ధాతువులనవచ్చు ఏ ధాతువు అర్థం కర్మయొక్క ప్రశ్నను కలిగించదో అది అకర్మకం. దీపం వెలిగింది అనే వాక్యంలో దేన్ని వెలిగింది? అనే ప్రశ్నకి అవకాశం లేదు. ఇక్కడ కర్మబోధ్యం కావటల్లేదు. కాబట్టి 'వెలుగు' ధాతువు అకర్మకం. వెలుగు, కాగు, పెరుగు, తిరుగు, నిండు మొదలయినవి అకర్మక ధాతువులు. ఇటువంటి అకర్మక ధాతువులు కొన్ని ప్రత్యయాలు చేరటంవల్ల

వెలిగించు, కాచు, పెంచు, తిప్పు, నింపు అనే విధంగా మార్పును పొందుతాయి. ఇట్లా సకర్మక ప్రత్యయాలు చేరి సకర్మక ధాతువులయిన వాటిని సాధ్యధాతువు లనవచ్చు. సకర్మక క్రియలకు ఒక కర్త ఉంటుంది. ప్రేరణ క్రియకి హేతుకర్త, ప్రయోజ్యకర్త అని రెండు కర్తలుంటాయి. సకర్మక క్రియలకి ప్రేరణ ప్రత్యయం చేరి ప్రేరణ క్రియలేర్పడతాయి ఉ: కాలు-కాల్చు-కాల్పించు, తిరుగు-తిప్పు-తిప్పించు, నిండు-నింపు-నింపించు.

తమిళం : ఈ భాషలో అకర్మక క్రియకి చివరఉన్న అనుబంధ ప్రత్యయం ద్విరుక్తం కావటం వల్ల సకర్మక క్రియగా మారుతుంది.

| | | | |
|---|---|---|---|
| పెరుగు | 'పెరుగు' | పెరుక్కు | 'పెంచు' |
| ఆడు | 'ఆడు' | ఆట్టు | 'ఆడించు' |
| అడంగు | 'అడగు' | అడక్కు | 'అడచు' |
| తిరుంబు | 'తిరుగు' | తిరుప్పు | 'తిప్పు' |

అకర్మకక్రియకి త్తు,పు అనే ప్రత్యయాలను చేర్చటం వల్ల సకర్మకంగా మారుతుంది.

| | | | |
|---|---|---|---|
| కాణ్ | 'చూచు' | కాట్టు/కాణ్పి | 'చూపించు' |
| ఉణ్ | 'తిను, తాగు' | ఊట్టు/ఉణ్పి | 'తినిపించు, తాగించు' |
| తాళ్ | 'తగ్గు' | తాళ్త్తు | 'తగ్గించు' |
| ఓడు | 'నడుచు' | ఓట్టు | 'నడుపు' |

తమిళంలో పి,వి అనేవి ప్రేరణ ప్రత్యయాలుగా కనిపిస్తాయి. ప్రాచీన కాలంలో ప్రేరణ క్రియలకు ప్రయోగాలు తక్కువ. తరువాతి కాలంలో ఇవి ఎక్కువగా వాడుకలోకి వచ్చాయి.

| | | | |
|---|---|---|---|
| వరు | 'వచ్చు' | వరువి | 'రప్పించు' |
| సేర్ | 'చేరు' | సేర్పి | 'చేర్పించు' |
| నడ | 'నడుచు' | నడప్పి | 'నడిపించు' |

మలయాళం : ఈ భాషలో కూడ తమిళంలో లాగానే సకర్మక క్రియలేర్పడతాయి.

| | | | |
|---|---|---|---|
| పెరుగు | 'పెరుగు' | పెరుక్కు | 'పెంచు' |
| అడంగు | 'అడగు' | అడక్కు | 'అడచు' |

రెండో రకానికి ఉదాహరణలు.

| | | | |
|---|---|---|---|
| నీళ్ | 'సాగు' | నీట్టు | 'సాగదీయు' |
| ఓడు | 'నడుచు' | ఓట్టు | 'నడుపు' |

ప్రేరణ ప్రత్యయాలుగా ఇ, పి లు కనిపిస్తాయి.

| | | | |
|---|---|---|---|
| సెయ్క | 'చేయు' | సెయ్యిక్క | 'చేయించు' |
| ఎడుక | 'తీయు' | ఎడుప్పిక్క | 'తీయించు' |

కన్నడం : ఇందులో త, ప అనేవి సకర్మక ప్రత్యయాలుగా కనిపిస్తాయి.

| | | | |
|---|---|---|---|
| తెరళ్ | 'చుట్టుకొను' | తెరటు | 'చుట్టు' |
| నీళ్ | 'సాగు' | నీడు | 'సాగదీయు' |
| ఎళ్ | 'లేచు' | ఎబ్బు(ఎళ్ + పు>ఎళ్పు>ఎబ్బు) | 'లేపు' |
| తిరుగు | 'తిరుగు' | తిరుపు | 'తిప్పు' |

కొన్ని క్రియలలో నాదస్పర్శం స్థానంలో శ్వాస స్పర్శం రావటం వల్ల సకర్మక క్రియగా మారుతుంది.

| | | | |
|---|---|---|---|
| అడగు | 'అడగు' | అడకు | 'అడచు' |
| ముడుగు | 'వంగు' | ముడుకు | 'వంచు' |

ఆధునిక కన్నడంలో 'ఇసు' అనే ప్రత్యయం సకర్మక, ప్రేరణ రూపాల్లో అధికంగా వ్యాప్తిలో ఉంది. ప్రాచీన కన్నడంలో ఇది 'చు'గా కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| కాయ్ | 'కాగు' | కాసు/కాయిసు | 'కాచు' |
| తీర్ | 'తీరు' | తీర్చు/తీరిసు | 'తీర్చు' |
| ఈ | 'ఇచ్చు' | ఈయిసు | 'ఇప్పించు' |
| మాడు | 'చేయు' | మాడిసు | 'చేయించు' |
| నగు | 'నవ్వు' | నగిసు | 'నవ్వించు' |

తెలుగు : తెలుగులో పు, చు, ంచు, ఇంచు లు సకర్మక ప్రత్యయాలు.

| | | |
|---|---|---|
| -పు : | జరుగు | జరుపు |
| | తిరుగు | తిప్పు |
| | నిలుచు | నిలుపు |
| | కుడుచు | కుడుపు |
| | తెలియు | తెలుపు |
| | తడియు | తడుపు |
| -చు : | అమరు | అమర్చు |
| | కాలు | కాల్చు |
| | పూడు | పూడ్చు |
| | మాను | మాన్చు |
| | కాఁగు | కాఁచు |
| | వంగు | వంచు |

| | | |
|---|---|---|
| -ంచు : | దిగు | దించు |
| | పెరుగు | పెంచు |
| | ఉండు | ఉంచు |
| -ఇంచు : | వెలుగు | వెలిగించు |
| | వచ్చు | రావించు/రప్పించు |
| | అగు | కావించు |
| | బిగియు | బిగించు |

ఇంచు, ఇపించు/పించు అనేవి ప్రేరణ ప్రత్యయాలుగా కనిపిస్తాయి.

| అకర్మకం | సకర్మకం | ప్రేరణం |
|---|---|---|
| కాలు | కాల్చు | కాల్పించు |
| జరుగు | జరుపు | జరిపించు |
| చచ్చు | చంపు | చంపించు |
| | అను | అనిపించు |
| | కొను | కొనిపించు |
| | తిను | తినిపించు |

క్రియా ధాతువుకి కాలబోధక ప్రత్యయమూ, సార్వనామికానుబంధం లేక పురుషబోధక ప్రత్యయమూ చేరి సమాపక క్రియారూపం ఏర్పడుతుంది. కాలబోధక ప్రత్యయాలు చేరటంవల్ల క్రియ ఆయా కాలాలను బోధిస్తుంది.

### భూతకాలం

తమిళం : ఈ భాషలో త్/న్ద్/త్త్, ఇన్ అనే ప్రత్యయాలు భూతకాలిక ప్రత్యయాలుగా కనిపిస్తాయి. వీటిని ధాతువుకి చేర్చటంవల్ల భూతకాలిక ప్రాతిపదిక ఏర్పడుతుంది. దానికి పురుషబోధక ప్రత్యయం చేరి భూతకాలిక సమాపక క్రియారూపం ఏర్పడుతుంది.

| | | |
|---|---|---|
| సెయ్ 'చేయు' : | సెయ్దేన్ | 'చేశాను' |
| | సెయ్దాయ్ | 'చేశావు' |
| | సెయ్దాన్ | 'చేశాడు' |
| | సెయ్దాళ్ | '(ఆమె) చేసింది' |
| వరు/వా 'వచ్చు' : | వందాన్ | 'వచ్చాడు' |
| | వందాళ్ | '(ఆమె) వచ్చింది' |
| | వందార్ | 'వచ్చారు' |
| నడ్ 'నడచు' : | నడందాన్ | 'నడిచాడు' |
| | నడందాళ్ | '(ఆమె) నడిచింది' |

| | | |
|---|---|---|
| కెడు 'చెడు' | : కెట్టాన్ | 'చెడిపోయాడు' |
| కళ్ 'దొంగిలించు' | : కట్టాన్ | 'దొంగిలించాడు' |
| పో 'పోవు' | · పోయినాన్/పోనాన్ | 'వెళ్ళాడు' |
| పాడు 'పాడు' | : పాడినాన్ | 'పాడాడు' |

సెయ్‌దు 'చేసి', నడందు 'నడిచి', కెట్ట్ 'చెడి', పాడి 'పాడి' వంటి భూత ప్రాతిపదికలే అసమాపక క్రియలు (క్త్వార్థక రూపాలు) గా ప్రవర్తిస్తాయి. భూత ప్రాతిపదికకి విశేషణ ప్రత్యయమైన 'అ' ని చేర్చటం వల్ల భూతకాలిక ధాతుజ విశేషణం ఏర్పడుతుంది.

ఉదా: వరు + న్ద్ > వంద్ + అ > వంద 'వచ్చిన', సెయ్‌ద 'చేసిన'.

మలయాళం : ఇందులో భూతకాలిక ప్రత్యయాలు తమిళంలో లాగానే ఉంటాయి. కాని తమిళంలో 'న్ద్' గా ఉన్న ప్రత్యయం ఇక్కడ 'న్న్' గా మారుతుంది. ఆధునిక మలయాళంలో సార్వనామికానుబంధాలు చేరవు.

| | | |
|---|---|---|
| నడ్ 'నడచు' | : నడన్న్- | <*నడన్త్- |
| వరు 'వచ్చు' | : వన్న్- | <*వంత్- |

భూత ప్రాతిపదికే క్త్వార్థకరూపంగా ఉంటుంది. వన్ను 'వచ్చి', సెయ్‌దు 'చేసి', విశేషణార్థాన్నిచ్చే 'అ'కారం చేరి ఇవి భూతకాలిక ధాతుజ విశేషణాలవుతాయి. సెయ్‌ద 'చేసిన'.

కన్నడం : ఇద్/ద్ అనేది భూతకాలిక ప్రత్యయంగా కనిపిస్తుంది.

| | | |
|---|---|---|
| కేళ్ 'అడుగు' | : కేళిదెను | 'అడిగాను' |
| మాడు 'చేయు' | : మాడిదెను | 'చేశాను' |
| కొయ్ 'కోయు' | : కొయ్‌దెను | 'కోశాను' |
| కేళ్ 'అడుగు' | : కేళ్దయ్ | 'అడిగావు' |
| | కేళ్దళ్ | '(ఆమె) అడిగింది' |

ఈ భూతకాలిక ప్రాతిపదిక అసమాపకక్రియ (క్త్వార్థకం) గా ప్రవర్తిస్తుంది. అప్పుడు ఉచ్చారణ సౌలభ్యం కోసం చివర 'ఉ'కారం చేరుతుంది. కేళ్దు/కేళి 'విని'. ఇక్కడ 'ఇద్' లోని 'ద'కారం లోపించి 'కేళి' రూపం ఏర్పడింది ఈ ప్రాతిపదికకి విశేషణార్థ ప్రత్యయమయిన 'అ' చేరి కేళ్ద 'అడిగిన', మాడిద 'చేసిన' వంటి భూతకాల ధాతుజ విశేషణ రూపాలు ఏర్పడతాయి.

తెలుగు : ఇతి/టి/ఇ,ఎ అనేవి తెలుగులో భూతకాలిక ప్రత్యయాలు. వీటిల్లో ఉత్తమ, మధ్యమ పురుష రూపాల్లో 'ఇతి' అనేది, ప్రథమ పురుషలో స్త్రీ పుం సామాన్య బహువచనంలో 'ఇ', మిగిలిన చోట్ల 'ఎ' చేరతాయి. ఈ ప్రత్యయాలు ప్రాచీన కావ్య భాషలో వాడబడినవి.

(నేను) పడితిని (మేము) పడితిమి
(నీవు) పడితివి (మీరు) పడితిరి
(వాడు,ఆమె, అది) పడెను (వారు) పడిరి
(అవి) పడెను

హ్రస్వాచ్చకలిగి 'ను' తో అంతమయ్యే క్రియల తరువాత చేరిన ఈ 'ఇతి' ప్రత్యయం 'టి' గా మారుతుంది. వింటిని, వింటిమి, వింటివి, వింటిరి.

ఆధునిక భాషలో ఇటువంటి క్రియారూపాల స్థానంలో ధాతుజ విశేషణ రూపాలు వచ్చాయి. పడ్డాను/పడినాను <పడినవాఁడను, పడ్డారు/పడినారు <పడిన వారు, పడింది <పడినది <పడినయది; విన్నాను <విన్నవాఁడను, విన్నారు <వినిన వారు, వింది/వినింది <వినినది <వినినయది.

పడి, విని, చేసి వంటి భూతకాలిక ప్రాతిపదిక రూపాలే భూతకాలిక అసమాపక క్రియలు. వీటికి 'ఇన' చేర్చటం వల్ల పడిన, విన్న <వినిన, చేసిన వంటి భూతకాల ధాతుజ విశేషణ రూపాలేర్పడతాయి.

*త్, *న్, *ఇ అనేవి మూలద్రావిడ భాషలోని భూతకాల ప్రత్యయాలుగా పునర్నిర్మించవచ్చు. ఇవి ఇంచుమించు దక్షిణ, మధ్య ద్రావిడ భాషలన్నిటిలోను ఉన్నాయి.

## వర్తమాన, భవిష్యత్కాలాలు

ద్రావిడ భాషల్లో ప్రాచీన కాలంలో వర్తమాన, భవిష్యత్కాలాలను తెలియజెయ్యటానికి ఒకే విధమయిన రూపముండేదని చెప్పవచ్చు. తుళు, గోండి, కొలామి, నాయికి, గదబ మొదలయిన భాషల్లో ఇప్పటికీ వర్తమాన కాలిక ప్రత్యయాలకి, భవిష్యత్కాలిక ప్రత్యయాలకి ఎక్కువ భేదం కనపడదు. భాషల్లో వర్తమాన కాలిక రూపాలు ఒక కాలబోధక ప్రత్యయంతో కూడి ఉండటం కాక అనేక శబ్దయుక్త నిర్మాణాలుగా శబ్దపల్లవ ప్రక్రియచేత ఏర్పడినట్లు కనిపిస్తాయి. ఈ క్రియారూప నిర్మాణంలో కూడ ఆయా భాషల మధ్య సమానత్వం కనపడదు. అందువల్ల భవిష్యత్కాలిక క్రియలకంటె భిన్నమయిన వర్తమానకాలిక క్రియా రూపాలు అర్వాచీన కాల పరిణామంలో ఏర్పడ్డాయని చెప్పవచ్చు.

భవిష్యత్కాలిక రూపాలు తద్ధర్మార్థాన్ని కూడ బోధిస్తాయి.

తమిళం : ఈ భాషలో కిన్ఱ్/కిఱ్ వర్తమానకాలిక ప్రత్యయంగా కనిపిస్తుంది.

సెయ్ 'చేయు' : సెయ్గి(న్)ఱేన్ 'చేస్తున్నాను'
సెయ్గి(న్)ఱోమ్ 'చేస్తున్నాము'

సెయ్‌గి(న్) ఱాయ్ 'చేస్తున్నావు'
సెయ్‌గి(న్) ఱోర్ (మీరు) 'చేస్తున్నారు'
సెయ్‌గి(న్) ఱాన్ 'చేస్తున్నాడు'
సెయ్‌గి(న్) ఱాళ్ (ఆమె) 'చేస్తున్నది'
సెయ్‌గి(న్) ఱార్ (వారు) 'చేస్తున్నారు'
సెయ్‌గి(న్) అదు (అది) 'చేస్తున్నది'

ఈ వర్తమానకాలిక ధాతుజ విశేషణం సెయ్‌కి(న్) ఱ్ + అ> సెయ్‌కి(న్) ఱ 'చేస్తున్న' అనే విధంగా ఉంటుంది.

భవిష్యత్కాలిక రూపాల్లో వ్/ప్/ప్ప్, ఉమ్/కుమ్ లు ప్రత్యయాలుగా కనిపిస్తాయి.

సెయ్‌వేన్ 'చేస్తాను'
సెయ్‌వోమ్ 'చేస్తాము'
సెయ్‌వాయ్ 'చేస్తావు'
సెయ్‌వోర్ 'చేస్తారు'
సెయ్‌వాన్ 'చేస్తాడు'
సెయ్‌వాళ్ 'చేస్తుంది' (ఆమె)
సెయ్‌వార్ 'చేస్తారు'
సెయ్యుమ్ 'చేస్తుంది' (అది)
నడప్పేన్ 'నడుస్తాను'
నడప్పాన్ 'నడుస్తాడు'
ఇరుప్పేన్ 'ఉంటాను'
ఇరుక్కుమ్ 'ఉంటుంది'
పోగుమ్ 'పోతుంది'
వరుమ్ 'వస్తుంది'

దీని ధాతుజ విశేషణం సెయ్+ఉమ్> సెయ్యుమ్ 'చేసే' అని ఉంటుంది.

తమిళంలో భవిష్యదర్థం, తద్ధర్మార్థకం ఒకేవిధమయిన ప్రత్యయాలతో సూచించబడుతుంది. ఈ రెంటికీ భేదం లేదు.

మలయాళం : ఇందులో 'ఉన్' వర్తమానార్థక ప్రత్యయం.

సెయ్యున్ను 'చేస్తున్నాను, చేస్తున్నావు, చేస్తున్నాడు, చేస్తున్నది' మొదలయిన అర్థాలు.
పోగున్ను 'పోతున్నాను' మొదలయినవి.

వర్తమానకాలిక ధాతుజ విశేషణం నెయ్యున్ + అ > నెయ్యున్న 'చేస్తున్న', పోగున్న 'పోతున్న' అని ఉంటుంది.

భవిష్యత్కాలిక రూపాల్లో 'ఉమ్' అనేది ప్రత్యయంగా కనిపిస్తుంది:

వరుమ్ 'వస్తాను' మొదలయినవి.

నెయ్యుమ్ 'చేస్తాను' మొదలయినవి.

తద్ధర్మ, భవిష్యదర్థాల రూపాలు ఒకే విధంగా ఉంటాయి. కాబట్టి దీని ధాతుజ విశేషణం కూడ రెంటిలోను ఒకే విధంగా ఉంటుంది.

ఉదా: వరుమ్ 'వచ్చే.'

కన్నడం : ఈ భాషలో 'తప్, ఉత్' అనేవి వర్తమానార్థంలో చేరి వర్తమాన కాలిక రూపాలేర్పడతాయి.

| | | | |
|---|---|---|---|
| మాడు 'చేయు' | : | మాడిదపెమ్ | 'చేస్తున్నాను' |
| | | మాడిదపయ్ | 'చేస్తున్నావు' |
| | | మాడిదపమ్ | 'చేస్తున్నాము' |
| | | మాడుత్తానె | 'చేస్తున్నాడు' |
| | | మాడుత్తాళె | 'చేస్తున్నది' |
| | | మాడుత్తదె | 'చేస్తున్నది' |

ఈ వర్తమాన కాలిక ధాతుజ విశేషణ రూపం ఉత్తుమ్/ఉత్తా అనేది చేరి ఏర్పడుతుంది. బరుత్తుమ్/బరుత్తా 'వస్తున్న'

భవిష్యత్కాలిక రూపాలు 'వ్' చేరటం వల్ల ఏర్పడతాయి.

| | | | |
|---|---|---|---|
| ఇరు 'ఉండు' | : | ఇరువెమ్ | 'ఉంటాను' |
| | | ఇరువయ్ | 'ఉంటావు' |
| | | ఇరువమ్ | ఉంటాము' |
| | | ఇరువళ్ | 'ఉంటుంది' |
| | | ఇరువదు | 'ఉంటుంది' |

దీని ధాతుజ విశేషణ రూపం భవిష్యత్కాల ప్రాతిపదికకి 'అ' చేరి ఇరువ 'ఉండే', బరువ 'వచ్చే' అని ఉంటుంది.

కన్నడంలో కూడ తద్ధర్మ భవిష్యద్రూపాలు ఒకే విధంగా ఉంటాయి.

తెలుగు : 'ఉండు' ధాతువు నుంచి వచ్చిన సమాపక రూపమయిన 'ఉన్న' అనే దాన్ని వర్తమానార్థక ప్రత్యయమైన 'చ్' కి చేర్చటం వల్ల తెలుగులో వర్తమాన క్రియ లేర్పడతాయి. అంటే, ధాతువు + చ్ + ఉన్న + సార్వనామికానుబంధం. ఈ విధంగా చదువుచున్నాను, చదువుచున్నాము, చదువుచున్నావు. చదువుచున్నారు, చదువుచున్నాడు, చదువుచున్నది వంటి రూపాలేర్పడతాయి.

ప్రాచీన కావ్య భాషలో వండుచున్నవాడు, వండుచున్నవారు వంటి రూపాలేకాని తచ్ఛబ్ద 'వ' కారం లోపించిన సంగ్రహ రూపాలు లేవు. దీన్ని బట్టి వర్తమాన కాలిక సమాపక క్రియారూపాలు వర్తమాన కాలిక ధాతుజ విశేషణాల నుంచి ఏర్పడినవని చెప్పవచ్చు. 'వండుచున్నవాడు' అనేది మొదట విశేషణ రూపం. ఇది క్రమంగా క్రియార్థబోధకమైంది. తిక్కన కాలానికి వండుచున్నాడు, వండుచున్నారు వంటి రూపా లేర్పడ్డాయి. మొదట ప్రథమ పురుష రూపాల్లోని 'వ' కారానికి లోపం కలిగి పై రూపాలు ఏర్పడగా తరువాత వాటి సామ్యం వల్ల వండుచున్నావు (<వండు చున్నవాడవు), వండుచున్నాను (<వండు చున్నవాడను) వంటి మధ్యమ, ఉత్తమ పురుష రూపా లేర్పడ్డాయని గ్రహించవచ్చు.

వ్యవహార భాషలో 'తు' ప్రత్యయంగా ఉంది. వండుతున్నాడు, వండుతున్నారు, వండుతున్నాము మొదలయినవి. 'చు' > 'తు' గా మార్పును పొందింది.

వర్తమాన కాలిక ధాతుజ విశేషణ రూపంలోని 'చున్' వ్యవహార భాషలో 'తున్' గా మారి క్రమంగా 'తూ' గా మార్పును పొందింది. వండుచున్> వండుతున్> వండుతూ.

భవిష్యదర్థంలో 'కల' అనేది అనుబంధంగా ఉంది. ఇది 'కలుగు' ధాతువు యొక్క పరిశిష్ట రూపం. సామర్థ్యార్థాన్ని తెలుపుతుంది. ప్రాచీన కావ్య భాషలోనే ఈ 'కల' అనుబంధం కనిపిస్తుంది. వండఁగలను, వండఁగలము, వండఁగలవు, వండఁగలరు, వండఁగలఁడు, వండఁగలదు వంటి రూపాలలోని ధాతువుకి పరంగా ఉన్న 'అన్/న్' ప్రత్యయం భవిష్యదర్థకమని భావించవచ్చు. దానికి 'కల' అనుబంధంగా ఉంది. ఆ రెండూ కలిసి భవిష్యదర్థాన్నిస్తాయి. అందులో సామర్థ్యార్థమూ ఇమిడి ఉంది.

కలడు, కలవు వంటి రూపాలు 'కలుగు' ధాతువు నుంచి ఏర్పడ్డాయి. ఇవి స్వతంత్ర క్రియలు. కాల క్రమంలో అనుబంధాలైనాయి. 'కల' అనుబంధం భవిష్యదర్థంలోనే కాక సమర్థత, అర్హత మొదలయిన అర్థాల్లో ప్రయోగించబడింది. దీనికి తెలుగులో స్వతంత్ర ప్రయోగాలున్నాయి. 'ఒపలు గలరే కర్ణునోర్వన్' (భార. ఆది. 3-23), "ధర్మజుండుకలడు తగవు నడప" (భార. ఉద్యో. 1-271).

భూత, వర్తమానార్థాలలో లాగానే ఈ భవిష్యత్కాలంలో కూడ ధాతుజ విశేషణమే సమాపక క్రియగా పరిణతమైంది. వండఁగలవాఁడు> వండగలాడు> వండగలడు.

సాధారణంగా తద్ధర్మార్థక రూపాలే తెలుగులో భవిష్యదర్థాన్నిస్తాయి. వండును, వండెడును, వండెడిని; వండుదురు, వండెదరు వంటి రూపాలు తద్ధర్మార్థాన్ని, భవిష్యదర్థాన్ని కూడ ఇస్తాయి. ф, ఎడు/ఎడి, దు/ఎద అనేవి ఇందులోని ప్రత్యయాలు. ఇవి కూడ కావ్యభాషకే పరిమితం.

ఆధునిక భాషలో భవిష్యత్కాల ప్రత్యయం 'తా/ తున్' అనేది. వండుతాను, చేస్తాను, చేస్తుంది.

ఈ తద్ధర్మ, భవిష్యదర్థ ధాతుజ విశేషణ రూపం ఎడు/ ఎడి/ ఏ, ф చేరటం వల్ల ఏర్పడుతుంది. వండెడు, వండెడి, వండే, వండు.

పై పరిశీలనను బట్టి *క్క్/*క్, *త్త్/*త్, *న్/*చున్ అనే వర్తమానార్థక ప్రత్యయాలను, *ప్ప్/*వ్, *ఉమ్/*కుమ్, *అన్/*న్, *త్ అనే భవిష్యత్కాల ప్రత్యయాలను పునర్నిర్మించవచ్చు.

## వ్యతిరేకార్థకం

ద్రావిడ భాషల్లో వ్యతిరేకార్థక రూపాలు అనేక రకాలుగా ఏర్పడతాయి.

తమిళం : ఇందులో 'అ' ప్రత్యయాన్ని ధాతువుకి సార్వనామికానుబంధానికి మధ్య చేర్చటంవల్ల వ్యతిరేకార్థక సమాపక క్రియారూపమేర్పడుతుంది. ఉదా: సెయ్+అ+అదు> సెయ్యాదు 'చెయ్యదు', వర్+అ+అదు> వరాదు 'రాదు'

అల్, ఇల్, మాట్టు అనే పదాలు చేరటం వల్ల కూడ వ్యతిరేక రూపాలేర్పడతాయి. ఉదా: నిల్లలన్ 'నిలబడడు', ఉణ్ణిలాన్ '(అతను) పిలవలేదు', సెయ్ మాట్టేన్ 'చెయ్యను', వరుమాట్టేన్ 'రాను'.

'ఇల్లై' అనే పదాన్ని చేర్చటం వల్ల వ్యతిరేకార్థక మేర్పడుతుంది. ఉదా: సెయ్విల్లై 'చెయ్యలేదు', వరవిల్లై 'రాలేదు', వరుగిఅదిల్లై 'రావటల్లేదు (వర్తమానం)', వరువదిల్లై 'రావటల్లేదు (భవిష్యత్తు)'.

మూలధాతువుకి సార్వనామికానుబంధానికి మధ్య ఏమీ చేరకపోవటం వల్ల కూడ వ్యతిరేకార్థకాలేర్పడతాయి. ఉదా: కాణ్ 'చూచు': కాణేన్ 'చూడను' కాణోమ్ 'చూడము' కాణాయ్ 'చూడవు', కాణాన్ 'చూడడు'.

'ఆ, ఆదు, ఆమల్' అనేవి చేరటం వల్ల వ్యతిరేక క్త్వార్థక రూపాలేర్పడతాయి. సెయ్యా, సెయ్యాదు, సెయ్యామల్ చెయ్యకుండా'.

'అ, అత' చేరటం వల్ల వ్యతిరేక ధాతుజ విశేషణం ఏర్పడుతుంది. సెయ్యా, సెయాత 'చెయ్యని'.

మలయాళం 'అ' ప్రత్యయాన్ని ధాతువుకి, సార్వనామికానుబంధానికి మధ్య చేర్చటం వల్ల 'సెయ్యా' వంటి వ్యతిరేకార్థక రూపాలు ఏర్పడతాయి. ఇది అన్ని పురుష, వచనాలకి సరిపోతుంది. 'అయ్' అనేది కూడ వ్యతిరేకార్థంలో కనిపిస్తుంది. ఉదా. పోగాయిన్ను 'పోవటల్లేదు (వర్తమానం)', వరాఞ్ఞు 'రాలేదు (భూత కాలం)', వరాయుమ్ 'రాము' మొదలయిన అర్థాలు.

'ఇల్ల' అనే పదాన్ని చేర్చటం వల్ల కూడ వ్యతిరేకార్థక రూపాలేర్పడతాయి. సెయ్‌దిల్ల 'చెయ్యలేదు', సెయ్యిల్ల 'చెయ్యను'.

తమిళంలో లాగ ఏ ప్రత్యయం చేరకపోవటం వల్ల కూడ వ్యతిరేక రూపాలేర్పడతాయి. ఉదా. అరియాన్ 'ఎరగడు'

'అతె' అనే దాన్ని చేర్చటం వల్ల వ్యతిరేక క్త్వార్థక రూపం ఏర్పడుతుంది. ఉణ్ణాతె 'తినకుండా'.

'అఞ్ఞ, అత్త' చేరటం వల్ల వ్యతిరేక ధాతుజ విశేషణం ఏర్పడుతుంది. కాణాఞ్ఞ/కాణాత్త 'చూడని'.

కన్నడం ధాతువుకి. సార్వనామికానుబంధానికి మధ్య 'అ' చేరటం వల్ల వ్యతిరేకార్థక రూపాలేర్పడతాయి. బాళదు 'వర్ధిల్లదు' నోడదు 'చూడదు'.

'ఇల్ల' చేరటం వల్ల నోడదిల్ల 'చూడలేదు', బరువదిల్ల 'రాను' వంటి రూపాలేర్పడతాయి

ధాతువుకి, సార్వనామికానుబంధానికి మధ్య ఏ ప్రత్యయం చేరక పోవటం వల్ల కూడ వ్యతిరేక రూపాలేర్పడతాయి. నోడను 'చూడడు' నోడరు 'చూడరు' మాడరు 'చెయ్యరు'.

'అదె' చేరటం వల్ల వ్యతిరేక క్త్వార్థక రూపం ఏర్పడుతుంది. మాడదె 'చెయ్యకుండా'

'అద' చేరటం వల్ల వ్యతిరేక ధాతుజ విశేషణం ఏర్పడుతుంది. మాడద 'చెయ్యని', కరెయద 'పిలవని'.

తెలుగు 'అ' వ్యతిరేకార్థక ప్రత్యయంగా కనిపిస్తుంది. ఇది ధాతువుకి సార్వనామికానుబంధానికి మధ్య చేరుతుంది. వండను, వండము, వండవు, వండరు వండదు, వండడు. దీర్ఘాచ్చుతో అంతమయ్యే క్రియల తరువాత ఈ 'అ' లోపిస్తుంది. ఉదా : పో + అ + ను > పోను, తే + అ + డు > తేడు. ఇంకా రాను, రాడు, కాదు మొదలయినవి.

'లేదు' అనే పదాన్ని చేర్చటం వల్ల వ్యతిరేకార్థక రూపాలేర్పడతాయి. పోలేదు, పోవటల్లేదు, రాలేదు, చెయ్యటల్లేదు. తినలేదు, కొట్టలేదు మొదలయినవి.

'అక' చేర్చటం వల్ల వ్యతిరేక క్త్వార్థక రూపాలేర్పడతాయి. చెయ్యక, వినక, తినక మొదలయినవి. రాక, పోక, లేక మొదలయిన చోట్ల దీర్ఘం తరువాత 'అ'కారలోపం జరిగింది

'అని' చేరటం వల్ల వ్యతిరేక ధాతుజ విశేషణం ఏర్పడుతుంది. చెయ్యని వినని, తినని, రాని, పోని.

ఈ భాషలన్నిటినిబట్టి వ్యతిరేకార్థక ప్రత్యయంగా *అ ని పునర్నిర్మించవచ్చు. ఇది కొన్ని చోట్ల లోపించింది.

తమిళ మలయాళ కన్నడ తెలుగు భాషల్లో కనిపిస్తున్న ఇల్లై/ఇల్ల/లేదు అనే దానికి మూలరూపం *చిల్. ఇది అస్తిత్వ వ్యతికార్థాన్నిస్తుంది. దక్షిణ ద్రావిడ భాషల్లో *చిల్ > ఇల్ గా మారింది, పర్జి. చిల, గోం. సిలె, కొండ. సిల్, కుయి. సిడ, కువి. హిల్ల్-, మాల్తో. చిలె. ఇది తెలుగులో పదాది *చ- కారం లోపించి వర్ణ వ్యత్యయం జరగటం వల్ల లే- గా మారింది.

25

# వాక్యరచన

ప్రపంచ భాషలని వాక్యంలోని పదక్రమాన్ని బట్టి విభజించే పద్ధతి ఉంది. అందులో క్రియయొక్క స్థానానికి ప్రాధాన్యాన్నిచ్చి క్రియాది (Eskimo), క్రియా మధ్యమ (English), క్రియాంత (తెలుగు) భాషలు అని మూడు వర్గాలుగా విభజించవచ్చునని పరిశీలకుల అభిప్రాయం. ద్రావిడ భాషలు క్రియాంత భాషలు.

ద్రావిడ భాషలలో వాక్యాలను సామాన్య, సంశ్లిష్ట, సంయుక్త వాక్యాలుగా విభజింపవచ్చు.

## సామాన్య వాక్యాలు

ఇందులో కొన్ని వాక్యాలు క్రియారహితాలు. మరికొన్ని వాక్యాలు క్రియా సహితాలు.

క్రియారహిత వాక్యాలు ఈ విధంగా ఉంటాయి.

తె. ఆయన టీచరు
త. అవర్ టీచర్
తె. మీరు మంచి విద్యార్థులు
త. నీంగళ్ నల్ల మాణవర్
తె మనం తెలుగు వాళ్లం
త. నాంగళ్ తెలుంగు కారర్‌గళ్
తె. ఈమె నాకు స్నేహితురాలు
త. ఇవళ్ ఎనక్కుతోటి

ఈ వాక్యాలలో క్రియ లేకపోవటమేకాక కాలబోధకత కూడ లేదు.

క్రియా సహిత వాక్యాలలో క్రియ వాక్యాంతంలో వస్తుంది. కర్తృపదం వాక్యాదిలోను, కర్మపదం క్రియకు పూర్వమూ ఉంటాయి.

తె. అతను పుస్తకం కొన్నాడు
త. అవన్ పుత్తహం వాంగినాన్

అముఖ్య కర్మపదం ముఖ్యకర్మకంటె ముందు వస్తుంది. దానికి పూర్వం స్థలబోధకపదం, దానికంటె ముందు కాలబోధకపదం వస్తాయి.

క్రియా విశేషణం క్రియకంటె పూర్వమూ కర్మపదానికి పరంగాను వస్తుంది. ఇది ద్రావిడ భాషా వాక్యంలో సాధారణంగా ఉండే పదక్రమం.

తె. నేను రేపు విజయవాడలో తెలుగు పుస్తకం కొంటాను

త. నాన్ నాళై విజయవాడ విల్ తెలుంగ్ పుత్తహం వాంగ్‌వేన్

ఈ వాక్యంలో ఏ పదానికీ ప్రత్యేకమైన ప్రాధాన్యముండదు. ఈ పద క్రమానికి వ్యతిక్రమం జరిగినప్పుడు క్రియా పదానికి సన్నిహితంగా ఉన్న పదం కొంత ఎక్కువ ప్రాధాన్యం వహిస్తుంది. అంటే, ప్రత్యేక ప్రాధాన్యాన్ని ఇవ్వవలసి వచ్చినప్పుడు ఆ పదాన్ని క్రియా పదాన్నికి సన్నిహితంగా జరుపుతారు. ఉదాహరణకి పై వాక్యాన్ని

తె. నేను విజయవాడలో తెలుగు పుస్తకం రేపు కొంటాను

త. నాన్ విజయవాడవిల్ తెలుంగు పుత్తహం నాళై వాంగ్‌వేన్

తె. నేను రేపు తెలుగు పుస్తకం విజయవాడలో కొంటాను

త. నాన్ నాళై తెలుంగ్ పుత్తహం విజయవాడవిల్ వాంగ్‌వేన్

అని కూడ చెప్పవచ్చు. దీన్నిబట్టి ఈ ప్రాధాన్యం తెలుస్తుంది. పైన చెప్పిన అతను పుస్తకం కొన్నాడు అనే వాక్యంలో అతను చేసిన ఒక పని మాత్రం సూచించబడింది. ఈ వాక్యాన్ని "పుస్తకం అతను కొన్నాడు" అని చెప్పవచ్చు. ఈ వాక్యానికి పుస్తకం కొన్నది అతను. ఇంకొకరు కాదు అనే అర్థముంది. మొదటి వాక్యంలో అటువంటి అర్థం రాదు. పుస్తకం ఇంకొకరు కూడ కొని ఉండ వచ్చు అనే భావముంది.

వాక్యంలో క్రియాపదం ద్వారా కాలబోధకత వ్యక్తమవుతుంది. ఆయా కాలాలలో కాలబోధను సూచించే ప్రత్యయాలు చేరతాయి.

తె. అతను రొట్టె తిన్నాడు/తింటున్నాడు/తింటాడు.

త. అవన్ రొట్టి సాప్పిట్టాన్/సాపిట్టుకొండుఇరిక్కిరాన్/ సాప్పిడువాన్.

పై వాక్యాలు భూత, వర్తమాన, భవిష్యత్కాలాలను సూచిస్తు న్నాయి. ఆధునిక భాషలో భవిష్యత్కాలబోధ, తద్ధర్మబోధ ఒకే క్రియ ద్వారా జరగటం గమనించవచ్చు. అతను రొట్టె తింటాడు అనే వాక్యంలో తింటాడు అనే క్రియ భవిష్యత్కాలాన్ని, తద్ధర్మార్థకాన్ని కూడ సూచిస్తుంది. అతను ఇక ముందు రొట్టె తింటాడు అనిగాని, అతను ఎప్పుడూ రొట్టె తింటాడు అనిగాని అర్థాలు చెప్పవచ్చు.

ప్రశ్నార్థక వాక్యాలు వాక్యాంతంలో 'ఆ' అనే రూపాన్ని చేర్చటం వల్ల ఏర్పడతాయి.

తె. అతను ఊరికి వెళ్ళాడా?

త. అవన్ ఊరుక్కు చెన్రానా?

ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు, ఎవరు, ఏమిటి, ఎట్లా వంటి ప్రశ్న పదాలు క్రియకు పూర్వం సన్నిహితంగా చేరటం వల్ల కూడ ప్రశ్నార్థక వాక్యాలేర్పడతాయి.

తె. అతను ఊరికి ఎప్పుడు వెళ్ళాడు?

త. అవన్ ఊరుక్కు ఎప్పొద్దు చెన్రాన్ం

విధ్యర్థ బోధక క్రియలలో కర్త ఎప్పుడూ మధ్యమ పురుష సర్వనామమే. ఈ సర్వనామం ఏకవచనమైనప్పుడు క్రియ ధాతురూపంలోనే ఉంటుంది.

తె. నువ్వు చదువు

త. నీ పడి

విధ్యర్థక క్రియకు బహువచనంలో 'అ డి' అనే ప్రత్యయం చేరుతుంది. తమిళంలో 'కళ్' చేరుతుంది

తె. మీరు చదవండి

త. నీంగళ్ పడియుంగళ్

వ్యతిరేక విధిలో ధాతువుకు అదంతరూపం మీద 'వద్దు' అనే వ్యతిరేకార్థక రూపం సాధారణంగా చేరుతుంది. తమిళంలో 'వేండామ్' చేరుతుంది.

తె. చెయ్యవద్దు

త. సెయ్యవేండామ్

## సంశ్లిష్ట వాక్యాలు

ఒక ప్రధాన వాక్యానికి కొన్ని ఉపవాక్యాలు చేరటం వలన సంశ్లిష్ట వాక్యాలేర్పడతాయి. ఉపవాక్యాల్లో క్రియ సాధారణంగా అసమాపక క్రియ అయి ఉంటుంది అసమాపక క్రియలన్నీ ప్రధాన క్రియకు పూర్వమే ఉంటాయి. ఇవి ప్రధాన క్రియ కంటె ముందు జరిగే వ్యాపారాన్ని సూచిస్తాయి. కాలబోధ ప్రధాన క్రియ ననుసరించి ఉంటుంది.

తె. కమల పాలు తాగి నిద్రపోయింది

త. కమల పాల్ కుడిత్తు విట్టు తూంగినాళ్

ఇందులో కమల పాలు తాగటం, నిద్రపోవటం అనే రెండు వ్యాపారాలను నిర్వహించిందని తెలుస్తుంది ఇటువంటి వాక్యాల్లో అసమాపక సమాపక క్రియలన్నిటికీ ఒకే కర్త ఉంటుంది.

తె. కమల తిరస్కరించి అవమానించబడింది

త. కమల తిట్టి అవమానపడుత్త పట్టాళ్

ఇటువంటి వాక్యాలకు రెండు అర్థాలు వస్తాయి. కమల ఇంకొకరి చేత తిరస్కరించబడి అవమానించబడిందని ఒక అర్థం. ఈ అర్థంలో కమల కర్మ అవుతుంది. ఇంకో అర్థంలో కమల ఎవరినో తిరస్కరించిందనీ ఆ 'ఎవరో' కమలని అవమానించారనీ భావం. ఈ అర్థంలో కమల అసమాపక క్రియకి కర్త, ప్రధాన క్రియకు కర్మ అని తెలుస్తుంది.

అసమాపక క్రియ ప్రధాన క్రియ కంటె ముందు జరిగే వ్యాపారాన్ని సూచిస్తుంది.

తె. కమల పాలు తాగి నిద్రపోయింది

త. కమల పాల్ కుడిత్తు విట్టు తూంగినాళ్

ఈ వాక్యంలో కమల రెండు వ్యాపారాలను నిర్వహించిందనీ అందులో మొదటిది పాలు తాగటం, రెండోది నిద్రపోవటం అనీ అర్థం.

ఏక కర్తకంగా ఏకకాలంలో జరిగే వ్యాపారాలను శత్రర్థక క్రియలు బోధిస్తాయి.

తె. కమల నవ్వుతూ మాట్లాడుతుంది

త. కమల సిరిత్తుకుండె పేసుగిరాళ్

ఇందులో నవ్వటానికి మాట్లాడటానికి కూడ కర్త కమల. ఈ రెండు వ్యాపారాలు ఏక కాలంలో జరుగుతాయి.

శత్రర్థక ప్రధాన క్రియలు ఏక కాలంలో జరుగుతున్నట్లు చెప్పటం స్థూల దృష్టితోనే. కొన్ని సార్లు అట్లా జరగదు.

తె. విమల హైదరాబాద్ వెళ్తూ ఇంటికి వచ్చింది

త. విమల హైదరాబాద్ పోకుం పోదు ఎన్ వీట్టుక్కు వందాళ్

ఇక్కడ 'వెళ్లబోతూ' అని అర్థం

ప్రశ్నార్థక పదయుక్తమైన ప్రశ్నలను ఇంకో వాక్యంలో ఇమిడ్చి చెప్పాలంటే వాక్యాంతంలో 'ఓ' శబ్దాన్ని అనుసంధించాలి.

తె. అతను ఊరికి ఎప్పుడు వెళ్ళాడో నీకు తెలుసా?

త. అవన్ ఊరుక్కు ఎప్పోదు సెన్రానో ఉనక్కు తెరియుమా?

'ఆ' శబ్దంతో వచ్చే ప్రశ్నల్ని ఇమడ్చాలంటే 'ఏమో' శబ్దాన్ని అనుసంధించాలి. తమిళంలో 'అన్రు' చేరుతుంది.

తె. అతను ఊరికి వెళ్ళాడేమో నీకు తెలుసా?

త. అవన్ ఊరుక్కు సెన్రా నాన్రు ఉనక్కు తెరియుమా?

## సంయుక్త వాక్యాలు

కొన్ని సమాన ప్రతిపత్తిగల వాక్యాలు కలిసి ఒక వాక్యంగా ఏర్పడితే సంయుక్త వాక్యమవుతుంది.

తె. కమల అందమైనది తెలివైనది

త. కమల అటగానవళ్ గట్టికాక్కారి

ఇక్కడ కమల అందమైనది. కమల తెలివైనది. అనే రెండు వాక్యాలను కలిపి ఒకే వాక్యంగా చెప్పటం జరిగింది. ఈ రెండు వాక్యాలకూ కర్త ఒక్కటే. అందువలన ఈ రెండు వాక్యాలను కలిపినప్పుడు రెండో వాక్యంలో కర్త మళ్లీ రాదు.

తె. విమల ఇంటికి వచ్చింది, చీరమార్చుకుంది, కాఫీ తాగింది

త. విమల వీట్టుక్కు వందాళ్, సేలై మాట్రికొండాళ్, కాఫీ కుడిత్తాళ్

ఇక్కడ మూడు వాక్యాలను కలిపి ఒకే వాక్యంగా చెప్పటం జరిగింది. ఈ మూడు వాక్యాలకూ కర్త ఒక్కటే. అందువల్ల వీటిని కలిపినప్పుడు కర్త మళ్లీ మళ్లీరాదు.

రెండు వాక్యాల మధ్య వైరుధ్య సూచనకు 'కాని' శబ్దం ఉపయోగిస్తారు. తమిళంలో 'ఆనాల్' ఉపయోగిస్తారు.

తె. సుశీల బాగా పాడుతుంది కాని అందంగా ఉండదు

త. సుశీల నన్రాగ పాడువాళ్ ఆనాల్ అటగాగ ఇరుక్కుమాట్టాళ్

ఈ వాక్యంలో బాగా పాడే సుశీల అందంగా ఉండాలని వక్త ఆశించి ఉండవచ్చు. దానికి విరుద్ధమైన ప్రతిపాదన రెండో వాక్యంలో జరిగింది.

వక్త అభిప్రాయానికి భిన్నమైన విషయ ప్రతిపాదన జరిగినప్పుడు 'కాని' శబ్దం ఆ వైరుధ్యాన్ని వ్యక్తం చేస్తుంది.



# ఉపయుక్త గ్రంథాలు

## తెలుగు


కృష్ణమూర్తి, భద్రిరాజు, సం., 1962. మాండలిక వృత్తి పదకోశము. సం. 1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు.

————————, సం. 1974 తెలుగు భాషా చరిత్ర. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు.

చినసీతారామస్వామిశాస్త్రి, వజ్ఝల, 1955. ద్రావిడ భాషా పరిశీలనము. ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు.

నారాయణరావు, చిలుకూరి, 1937. ఆంధ్ర భాషా చరిత్రము. ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు.

రామకృష్ణయ్య, కోరాడ, 1954. దక్షిణ దేశ భాషా సారస్వతములు - దేశి. కోరాడ ప్రచురణాలయం, మద్రాసు.

————————, 1954. భాషా చారిత్రక వ్యాసములు. కోరాడ ప్రచురణాలయము, మద్రాసు.

రామారావు, చేకూరి, 1975. తెలుగు వాక్యం. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు.

సుబ్రహ్మణ్యం, పి. ఎస్., 1977. ద్రావిడ భాషలు. సత్యవతీ పబ్లికేషన్స్, అణ్ణామలై నగర్.

సోమయాజి, జి.జె., 1931. ద్రవిడ భాషలు. మద్రాసు.

————————, 1971. ఆంధ్ర భాషా వికాసము. త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్టణము & మద్రాసు.

## ఇంగ్లీష్


Andronov, M., 1970. Dravidian Languages, Nauka Publishing House, Moscow.

Bloch, J., 1956. The Grammatical Structure of Dravidian Languages, Poona

Bloomfield, Leonard, 1933 Language. New York.

Burrow, T , 1955 The Sanskrit Language London.

————————, 1968. Collected Papers on Dravidian Linguistics. Annamalai University Annamalainagar.

Burrow, T., and Emeneau, M.B , 1961. A Dravidian Etymological Dictionary (D.E D ) Oxford

Caldwell, R , 1956. A Comparative Grammar of the Dravidian or South Indian Family of Languages. Madras

Campbell, A D., 1849 A Grammar of the Teloogoo Language. Printed at the Hindu Press, Madras. Third edition.

Chatterjee, S. K., 1965. Dravidian Annamalai University, Annamalainagar.

Emeneau, M B , 1967 Collected Papers. Annamalai University, Annamalainagar.

Grierson, G A , 1906. Linguistic Survey of India, Vol. IV. Calcutta.

Gleason, H A., 1968. An Introduction to Descriptive Linguistics. Oxford & IBH Publishing co , Calcutta.

Hockett, C.F., 1958. A Course in Modern Linguistics New York.

Jesperson, J O.H , 1922 Language: Its Nature, [illegible]opment, and Origin London: Allen and [illegible]

Kittel, F , 1903. A Kannada - English Dictior[illegible] Mangalore.

Krishnamurti, Bh 1961. Telugu Verbal Bases A comparativ[illegible] and Descriptive Study B[illegible]ley and Los Angeles

————————, ed , 1968 Dravidian F[illegible] Pro[illegible]ouns, Stndies in Indian Linguistics [illegible] M. B. Emeneau sastipūrti Volume). Poona and A[illegible]namalainagar.

————————, 1975. Gender and Number in Proto-Dravidian. International Jonrnal of Dravidian Linguistics, Trivendram, (IJDL-4, 1975).

Sapir, E , 1921. Language. New York.

Taraporewala, I.J S. Science of Language. Calcutta.

# ముఖ్య సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 7 | 9 | Friend | Fiend |
| 11 | 5 | ఎస్పెరాన్‌చో | ఎస్పెరాన్‌టో |
| 11 | 21 | సెమెటీహెమెటిక్ | సెమెటోహెమెటిక్ |
| 11 | 31 | ఇటాలి | ఇటాలియన్ |
| 12 | 13 | మెడగాల్కర్ | మెడగాస్కర్ |
| 12 | 30 | టిబెట్‌బర్మన్ | టిబెటోబర్మన్ |
| 14 | 4 | పరియుక్తాత్మక | సంయుక్తాత్మక |
| 19 | 23 | మూతిచా | మూతిబా |
| 20 | 21 | కాలావరత్రీ | కారావరత్రీ |
| 28 | 16 | నాటికీ | నాటికే |
| 30 | 21 | చింప్పిన | చంప్పిన |
| 32 | 12 | న్నసయ | నన్నయ |
| 36 | 12 | చూలర్ | బూలర్ |
| 40 | 13 | వళకు | వరకు |
| 40 | 14 | స్పర్శమైనగా | స్పర్శమైన ।ధ। గా |
| 42 | 19 | కోలుగా | కోలగా |
| 46 | 4 | స్థానకణాలు | స్థానకరణాలు |
| 47 | 1 | వ, వలు | య, వ లు |
| 47 | 27 | వలయిచ్చులు | వలయితాచ్చులు |
| 48 | 8 | లేఖల | లేఖన |
| 49 | 12 | ఙ ఐ | ఙ ౧ |
| 51 | 5,7 | వివృతాచ్చు | సంవృతాచ్చు |
| 51 | 9,11 | సంవృతాచ్చు | వివృతాచ్చు |
| 54 | 1 | హలుల్లు | హల్లులు |
| 57 | 14 | అవర్ణం | ట వర్ణం |
| 60 | 1 | ఇక్కడే | ఇక్కడ |
| 60 | 11 | ఉచ్చారణాంగాలలో | ఉచ్చారణాంగాలలో లోపం |
| 60 | 21 | అంతర | అంతర |
| 62 | 9 | Yet it is | Yes it is sot |
| 63 | 29 | పద్య స్వరూపం | పద స్వరూపం |
| 65 | 15 | అపద్ధం> అబద్ధం | అబద్ధం> అపద్ధం |
| 67 | 20 | అన్వహితంగా | అవ్యవహితంగా |
| 83 | 12 | విశేషాలనడం | విశేషణాలనడం |
| 84 | 3 | అవి | అవ |
| 85 | 3 | విశేషంగా | విశేషణంగా |
| 87 | 2 | తనుప్ | తమస్ |
| 89 | 13 | ఛలివాయి | చలి, వాయి |
| 92 | 5 | ఇవన్నంతాలయిన | ఇనన్నంతాలయిన |
| 99 | 18 | సామగ్రితోనే | సామగ్రిలోనే |
| 01 | 26 | హంగుహాయలు | హంగు హాయలు |

